శ్రీ

# ఆంధ్ర కవి తరంగిణి

## రెండవ సంపుటము



20
166.2

శ్రీ చాగంటి శేషయ్య
విరచితము

హిందూ ధర్మ శాస్త్ర గ్రంథ నిలయము
కపిలేశ్వరపురము (తూర్పు గోదావరి జిల్లా)

## ఈ గ్రంథముద్రణమునకు ధనసాహాయ్య మొనర్చిన భాషాభిమానుల నామములు :

### పోషకులు :

౧. శ్రీ బలుసు బుచ్చిపట్టాభిరామయ్యగారి కుమారులు అచ్యుతరామయ్యగారు భూస్వామి, కపిలేశ్వరపురం.

౨. శ్రీ మద్దూరి సూరన్నగారు, వర్తకులు, గోపాలపురం.

### సహాయులు :

౧. శ్రీ దేశరాజు వేంకటసుబ్బారావుగారు, భూస్వామి, కపిలేశ్వరపురం.

౨. శ్రీ పోతాప్రెగడ సూర్యనారాయణగారు, భూస్వామి, రాజమహేంద్రవరము.

౩. శ్రీ వట్టికూటి పట్టాభిరామయ్యగారు, వుసకరమిల్లి యస్టేటు జమీందార్లు, వెల్ల.

౪. శ్రీ బండారు చినవెఱ్ఱెయ్య అనే రామకృష్ణయ్యగారు, భూస్వామి, వాడపాలెం.

౫. శ్రీ బలుసు వెంకటరామారావుగారి భార్య మాణిక్యంగారు, భూస్వామిని, కపిలేశ్వరపురం.

౬. శ్రీ కొరసాటి వెంకట్రాయుడుగారి భార్య శ్రీమతి సత్యవతమ్మగారు, భూస్వామిని, కపిలేశ్వరపురం.

౭. శ్రీ వుండవిల్లి సూర్యప్రకాశరావుగారు, రాజమండ్రి.

౮. శ్రీ జూపూడి జగన్నాథరావుగారు, వర్తకులు, రాజమండ్రి.

ఈగ్రంథమునుగూర్చిన కొన్ని అభిప్రాయములు :

Sir C. Ramalingareddy Kt.
M. A. (Cantab), Hon. D. Litt.,
Vice-Chancellor.

Waltair,
21-2-47.

I have read with much pleasure and appreciation Chaganty Seshayya's "Andhra Kavi Tarangini". It is a remarkably fine contribution to the History of our literature and our country. He has taken trouble to study the latest archaeological material available and make his treatment of the different Poets as scientifically accurate as possible.

.........Sri Seshayya seems to be fitted both by his knowledge of the subject and his scientific spirit to present the Andhra world with an authoritative "Lives of Andhra Poets."

He does not mix up Puranas with history and legend with truth and that is a rare and refreshing feature.

Dr. M. H. Krishna, M. A., D. Litt. (Lond.) Director of Archaeology, Government of Mysore.

".........I find that it gives us a vast amount of information. I am sure that a copy of your entire work should be in our library......".

The Hindu :

Research into the records of the past brings forth continually new facts on the history of literature and the present book is the first of many volumes which the author proposes to bring out in an attempt to write a new history of telugu poets. According to earlier historians of Telugu literature, the maximum number of Telugu poets worth the name did not exceed three hundred and fifty. But the author includes many more whose names have hitherto lain hidden in the unfathomed caves of time. The author has unearthed considerable interesting material by an intensive study of inscriptions................

శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు (ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రధాన పండితులు):

"మీ గ్రంథము, మీరు చేసిన కూలంకషపరిశ్రమకు ఫలము. కవి జీవిత కవి చరిత్రకారులు అడుగుపెట్టలేని గహనములలో మీరు రాచ బాటలు వైచితిరి."

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు (ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రధాన పండితులు):

"......మీ కవితరంగిణి కల్హణుని రాజతరంగిణివలె సారస్వతములో ముఖతిలకంగా ప్రకాశింప కలదు......ఆధారవస్తు వివేచనలో మీ సమగ్ర విజ్ఞానము ప్రమాణీకరణదృష్టియు ద్యోతమగుచున్నది..."

ఆంధ్రపత్రిక "......శేషయ్యగారు నిష్పక్షపాత బుద్ధితో యదార్థ మెంతయో గ్రహించడానికి అత్యధికంగా శ్రమపడ్డారు. అనుమాన ప్రమాణంతో కూడుకొన్న చరిత్రకు యిదమిద్ధమన్న నిర్ణయాలు మొండిగా చేసి చరిత్రకు అపకారం చేయకుండా చారిత్రక వస్తువులనందించి సూచనమాత్రం తన ఊహను చెప్పి పాఠకులకు నిర్ణయాలకు సదవకాశమిచ్చారు. వీరి ప్రయత్నం ప్రశంశనీయమే."

ఆంధ్రప్రభ: "ఆంధ్రులకు సమగ్రమైన కవులచరిత్ర గ్రంథము లేని లోటు దీనితో తీరినట్లయింది. తక్కిన సంపుటములను కూడ త్వరలో వెలువరించడానికి తగిన ప్రోత్సాహం యివ్వవలసిన భారం ఆంధ్రులపై నున్నది."

శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు (ఆంధ్ర విశ్వవిద్యాలయము రిసెర్చి పండితులు):

"......తమ గ్రంథమువలన పూర్వవిమర్శకుల రచనలకు వెదకి చూడవలసిన యావశ్యకత లేకపోయినది. ఆంధ్రకవితరంగిణి యందు తామవలంబించిన పద్ధతి యమునాతన చరిత్ర రచనాపద్ధతి వంటిది. మీ యత్నము కడు ప్రశంసనీయము.

శ్రీ గంటి జోగిసోమయాజులుగారు, ఆంధ్రవిశ్వవిద్యాలయపండితులు:

"..... చాల మనోహరముగా ననేక విషయముల గూర్చి వ్రాసితిరి. ఇంత గొప్పపని చేయుటకు పూనుకొని వ్యయమును ప్రయాసమును లెక్కింప సాధించుట మిక్కిలి కొనియాడ తగినది......"

Etc.

# విజ్ఞాపనము

కాగితము లభింపకపోవుటచే నీరెండవసంపుటమును ప్రకటించుటలోఁ గాలవిలంబనమైనది. మూఁడవసంపుటము ముద్రితమగుచున్నది. ఇఁకముందు కాగితముకఱవుండదని యాశించుచున్నాఁడను. మన దేశపుకాగితముకంటె విదేశకాగితము ధర రెట్టింపుగానున్నది. మన దేశపుకాగితము లభింపనందున, రెండవ మూఁడవసంపుటములకు ధనవ్యయము రెండింతలైనది. అయినను సరియేయని, భాషాభిమానుల యాదరాభిమానములచే విదేశపుకాగితమునే కొని యీసంపుటమును బ్రకటింపఁగలిగితిని. కేవలభాషాభిమానముచే నాయుద్యమమునకుఁ దోడుపడఁదలంచి ద్రవ్యసాహాయ్యమొనర్చిన యుదారాశయులకుఁ గృతజ్ఞుడనై యున్నాఁడను.

సర్వవిధముల నాయుద్యమమునకుఁ జేయూతనొసంగుచున్న మదరాసు హైకోర్టు అడ్వకేటులగు శ్రీ పప్పు సోమసుందరముగారికిని, శ్రీ పప్పు సూర్యనారాయణగారికిని, శ్రీ బలుసు ప్రభాకరపట్టాభి రామారావుగారికిని నాధన్యవాదములు.

నేనడిగినవెంటనే కొన్నిశాసనముల ప్రతులను వ్రాయించి పంపించిన యుదకమండలమునందలి గవర్నమెంటు ఎపి గ్రాఫిస్టుగారికిఁ గృతజ్ఞుఁడను.

నా ప్రయత్నమందలి వ్యయపరిమాణముల నెఱింగి, తమ యాదరాభిమానములను విశేషముగాఁజూప భాషాభిమానులఁ బ్రార్థించుచున్నాఁడను.

పండితులలో భిన్నాభిప్రాయములున్నట్టియు, విశేషచరిత్రాంశములు గలిగినట్టియు కొందఱు మహాకవులచరిత్రముల నొక్కింత

విపులముగా వ్రాయవలసివచ్చుచున్నది. అట్టివారిసంఖ్య స్వల్పము. తక్కినవారి చరిత్రములంతగా విపులముగా నుండవు. ఎట్లయినను, మొదటి సంపుటమునందలి విజ్ఞాపనములోఁ దెలిపినపుటలకంటె గ్రంథ మెక్కువకాదని మనవిచేయుచున్నాఁడను.

చాగంటి శేషయ్య

కపిలేశ్వరపురము,
సర్వజిన్నామసంవత్సర
పుష్యపూర్ణిమ.

## వి ష య సూ చి క

శ్రీరామచంద్ర

# ఆంధ్ర కవి తరంగిణి


SRI VENKATESWARA COLLEGE LIBRARY
No. 6064
Date
TIRUPATI
20/1682

## రెండవ భాగము

### 9. జయదేవకవి

ఈ కవినిగూర్చినచారిత్రాంశము లేమియుఁ దెలియవు. లక్షణ వేత్తలు కొందఱు జయదేవఛందస మను ఛందో గ్రంథమునుండి తమ లక్షణగ్రంథములలోఁ గొన్ని యాంధ్రపద్యముల నుదాహరించి యుండుటచే నీతని పేరు తెలియవచ్చినది. కవిజనాశ్రయమునం దీతని పే రుదాహరింపఁబడియుండుటచే నీతఁడు పదునూఁడవశతాబ్దికి పూర్వుఁ డని యూహింప నగుచున్నది. ఈ క్రిందిపద్యము జయదేవఛందము లోనిదని యానందరంగరాట్ఛందమునందు కస్తూరిరంగకవి యుదాహ రించి యున్నాఁడు:

గీ. రహిఁగ లఘులకు లఘులకు బ్రాసయుతము లో
నరుప నవి యుభేదప్రాసవిరతు లగును
గళల విలసిల్లు నీసింధునెల యఁగంగ
జాడ నేసె రాముఁడు సప్తతాళములన.

అప్పకవి యీ జయదేవఛందమును బేర్కొన లేదు.

కవిజనాశ్రయమున

క. జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ న
ల్లియ రేచన సుకవిజనా
శ్రయుఁ డీ ఛందంబుఁ జెప్పె జనులకుఁ దెలియన్.

అని చెప్పియుండుటచే నీతఁడు కవిజనాశ్రయకర్తకుఁ బూర్వుఁడనుటకు సంశయము లేదు. ఈ జయదేవుఁ డెవ్వరో, యెచ్చటివాఁడో తెలియలేదు. సంస్కృతభాషలోఁ గృతులను రచించిన జయదేవులు ముగ్గు రున్నారు.

౧. ప్రసన్నరాఘవ మను నాటకమును చంద్రాలోక మను నలంకార శాస్త్రమును సంస్కృతభాషలో రచించిన యాతఁడొక జయదేవుఁడు. ఇతఁడు వంగదేశీయుఁడగు బ్రాహ్మణుఁడు; కౌండిన్య గోత్రుఁడు. సుమిత్రామహాదేవుల తనయుఁడు. ఇతఁడు పదునాలవ శతాబ్దివాఁ డని శివరామమహాదేవపరంగిపాయి బి. ఏ. గారును, అక్కిరాజు ఉమాకాన్తముగారును వ్రాసియున్నారు. క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమువాఁ డని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగా రభిప్రాయపడియుండిరి.

౨. సంస్కృతమున గీతగోవిందమును రచించినదింకొక జయదేవుడు. ఇతఁ డుత్కలదేశీయుఁడు; భోజదేవునకును రాధాదేవికిని జనియించినవాఁడు. క్రీ శ. ౧౦౮౦-౧౧౪౦ సంవత్సరములనాఁటి వాఁడు.

3. రాధామాధవ మనుసంస్కృతకావ్యమును రచించిన జయదేవుఁడు మఱియొకఁడు. ఇతనిని, చింతలపూడియెల్లయకవి తన యాంధ్రరాధామాధవమున నిట్లు నుతించియున్నాఁడు.

క. నుతియింతు వాగ్విశేష
స్థితి రాధామాధవంబు చెప్పినవిద్యా
చతురాననుఁ లీలాచల
పతిహితు జయదేవు సుకవి పంచపదగున్.

రాధామాధవకర్తయు గీతగోవిందకర్తయు నొక్కఁడే యని కోరాడ రామకృష్ణయ్యగారును, వీరిరువురును భిన్నులని, నడకుదుటి వీరరాజుపంతులుగారును, అక్కిరాజు ఉమాకాన్తముగారును వ్రాసియున్నారు.

ఛందోగ్రంథమును వ్రాసిన జయదేవుఁ డీముగ్గురిలో నొక్కఁడో, వేఱొక్కఁడో చెప్పఁజాలము. ఉత్కలవంగదేశీయు

లాంధ్రమున ఛందస్సును వ్రాసిరని తగినయాధారము లుండినఁగాని విశ్వసింపఁజాలము. రాధామాధవకర్త యైనజయదేవుఁ డెప్పటి వాఁడో ఎచ్చటివాఁడో తెలియ రేదు. ఈతఁడే ఛందోగ్రంథమును రచించినవాఁడని తోఁచుచున్నది. శృంగారమాధవీయమను సంస్కృత కావ్యమును రచించిన జయదేవుఁ డింకొకఁ డుండెనని కొంద అను చున్నారు. శృంగారమాధవీయమే, రాధామాధవ మని కొందఱి యభిప్రాయము.

గంగేశపండితునితత్త్వచింతామణి యను తర్కశాస్త్రమున కాలోకమును రచించినజయదేవుఁడు పైనఁ బేర్కొనబడినవారిలో నొకఁడో, భిన్నుఁడో తెలియదు.

ఎట్లయినను, నాంధ్రమునఁ జ్ఛందస్సును రచియించిన జయదేవుని గూర్చి యింకను దెలిసికొనవలసియున్నది.

# 10. వాదీంద్రచూడామణి

ఇతఁడు జైనసమయాచార్యుఁడు. కవిజనాశ్రయకర్త యని యనుకొనుచున్న రేచనకు గురువు. ఇతనినామము వాగీంద్రచూడామణి యని కొంద ఱనుచున్నారు. ఇతఁ డాంధ్రమున నొకలక్షణ గ్రంథమును రచించె నని చెప్పుదురు. ఆ గ్రంథనామమును కవి నామము నొక్కటియే. అప్పకవి యీపేరును దనగ్రంథాదిని ఆంధ్రలక్షణగ్రంథములలోఁ జేర్చియున్నాఁడు. కాని యందలిపద్యముల నుదాహరించి యుండ లేదు. కస్తూరిరంగకవి తన యానందరంగ రాట్ఛందమున "మల్లనపాదాంగచూడామణి" యని యొకలక్షణ గ్రంథమును బేర్కొని యందలిపద్యములను లక్ష్యములుగాఁ జూపి యున్నాఁడు. అదియు నీ వాదీంద్రచూడామణియు నొక్కటిగా దను కొనియెదను. ఈతనినిగూర్చి యింక నేమియుఁ దెలియదు. ఇతనిని, రేచనకాలమువారిలో జేర్చుట సమంజస మని యట్లు చేయు చున్నాఁడను.

కవికర్పటిక యనునొకచిత్రకావ్యమును సంస్కృతభాషలో రచియించిన వాదీంద్రచూడామణి యొకఁడు కలఁడు. ఆతఁడే యీతఁడేమో! అతనినిగూర్చి సంస్కృతవాఙ్మయచరిత్రమునం దిట్లు వ్రాసియున్నారు.

"కవికర్పటిక—అనునొక చిత్రకావ్యము కలదు. దీనికర్త వాదీంద్రకవి. దీని దేశకాలములు తెలియవు కాని, ఇది యర్వాచీనమే. దీని ప్రయోజనము కవి యిట్లు తెలిపియున్నాఁడు.

శ్లో. యత్నాదిమాం కంఠగతాం విధాయ
శ్రుతోపదేశా ద్విదితోపదేశః।
అజ్ఞాతశబ్దార్థవినిశ్చయోఽపి
శ్లోకం కరో త్యేవ సభాసు శీఘ్రమ్.

ఈ గ్రంథములోఁ జూపినపదవాక్యములను వల్లించియున్నచో ఆయా ఛందస్సులలో శ్లోకము చెప్పవచ్చును. ఆ పదవాక్యముల

క్రమము జ్ఞప్తియందుంచుకొనఁజాలును. ఇందుకేఁ జంద్రోదయ వర్ణనకు వల్లించవలసినవి - ఐదక్షరముల పదములు. కర్పూరపూర - డిండీరపిండ - రజతకర - ఇత్యాదులు. వీనికరువాతఁ జేర్పదగినట్లు వల్లించవలసిన మూఁడక్షరముల పదములు - నీకాశమ్ - సంకాశమ్ - ఇత్యాదులు. ఇపుడు, కర్పూరపూరనీకాశమ్ - అని యనుష్టుప్ఛంద స్సులో నొకపాదము వచ్చినది. ఇట్లే నాలుగుపాదములకుఁ దగిన పదములపట్టిక లింకఁ గలవు ఈ విధముగా శార్దూల విక్రీడితాది వృత్తములకును గలవు. "శిఖ్యాలో గుణశాలినాం విద్యావసుం రాజతే" ఇత్యాదులు.

వాగీంద్రచూడామణికవి, ఛందోగ్రంథమునే కాకుండ ఆది పురాణమును గూడ నాంధ్రమున రచియించెనని, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసియున్నారు. అప్పకవి విశేల్యయతి కుదా హరణముగా నాదిపురాణములోనిదని "ఒకనాఁడింద్రసుధసుండు" అనుపద్యము నిచ్చియున్నాఁడు. ఆపద్యము నాచనసోముని యుత్తర హరివంశములోనిది. ఈ పద్యము నాదిపురాణములోనిది కాకపోయి నను అప్పకవి యాదిపురాణమునెఱింగియున్నాఁ డనుట నిశ్చయము. కాని యాతఁ డెఱిగినయాదిపురాణము వాగీంద్రచూడామణి దగునో కాదో చెప్పుట కవకాశము లేదు. తెనాలిరామకృష్ణకవి ఆదిపురా ణమును రచించె ననియొకప్రతీతి కలదు. ఏ యాదిపురాణమును నిప్పుడు కన్పించుట లేదు. వాగీంద్రచూడామణి యనుఛందో గ్రంథమును నిపుడు కన్పడకపోవుటచే నీకవినిగూర్చి వ్రాయుట కేక సేమియులేదు. ఈ కవినిగూర్చి తెలిసికొనుట కింకను ప్రయత్నము జరుగవలసియున్నది. ఇతనికాలము వేఱువిధమున స్థిరపడువఱకును పంద్రెండవశతాబ్ది ప్రథమార్థమని యనుకొందము.

కస్తూరిరంగకవి యుదాహరించిన పాదాంగచూడామణియు నీ వాదీంద్రచూడామణియు నొకటి కాదనితోఁచినను భావిపరిశోధ కులకొఱకు రంగకవియుదాహరించిన యెనిమిదిపద్యముల నీ క్రింద నిచ్చుచున్నాఁడను.

చ. పరగ ధరాధిదైవతము పచ్చనికాంతియు శూద్రజాతియా
నరయ బుధుండు తద్గ్రహము హాటకవర్ణమతండు తత్ఫలం
బురుశుభ మెన్నఁగా హరిణయోనియు వృశ్చికరాశి నిర్జరే
శ్వరవరతార దైత్యగణసంగత(మున్) మామగణంబు శంకరా!

చ. జల మధిదైవమున్ రజితసన్నిభ కాంతి కులంబు విప్రుఁడుఁ
ఫలము ధనంబు తద్గ్రహము భార్గవుఁ డాతనివర్ణ మెన్నఁగాఁ
దెలుపు జలంబు తారకము తెల్లమిగా ధనురాశి యోనియున్
(తారయును దెల్లమిగా ధనురాశి రాశియున్)
బలిముఖ మాగణంబు నృగణంబునున్ యగణాన కీశ్వరా
(బలిముఖయోనియున్ నరగణం బగు నయ్యగణంబు శంకరా)

చ. జ్వలనుఁ డధీశుఁడున్ గులము క్షత్రియమున్ బవడంపుగాంతి పెం
పలరు గ్రహంబు భూతనయుఁ డాతఁడు రక్తపువన్నె పావకా
ఖ్యలలితతార దైత్యగణ మయ్యజయోనియు మేషరాశియున్
ఫలము భయప్రదంబు రగణంబునకున్ ద్రిదశేంద్రవందితా!

చ. అనిలుఁ డధీశుఁడున్ గులయుంబులకాంతి కులంబు హీనమున్
జనుగ్రహ మాశనైశ్చరుఁడు చాలఁగ నల్పగువన్నె తౌలయాఁ
దనరఁగ రాశి స్వాతి యగుఁ దారఫలంబు క్షయంబు దానవం
బౌనర గణంబు నామహిష యోనియగున్ సగణాన కీశ్వరా!

చ. నెఱయ నభంబు దైవతము నీలపుఁగాంతియు విప్రజాతి గీ
ర్వరుఁడు గ్రహంబుఁ గాంచనపువర్ణ మతండు ఫలంబు చెప్పనై
శ్వరమును వారపుష్యమియు వాలినకర్కటరాశి మేషమా
నిరవగుయోని దేవగణ మోతగణంబున కిందుశేఖరా!

చ. రవి యధిదైవమున్ బరఁగ రాట్కులమున్ గురువిందకాంతియున్
రవిగ్రహ మెన్నఁగా నతఁడు రక్తపువర్ణము సింహరాశియు
ద్భవ మగు రోగమా ఫలము తారకయుత్తరధేనుయోని మా
నవగణమున్ దలంప జగణంబునకున్ ద్రిదశేంద్రవందితా!

ఉ. చంద్రుఁ డధీశ్వరుం డమృతసారము కాంతియు విట్కులంబు తే
చ్చంద్రముఁడే గ్రహంబతనిచాయయుఁ దెల్పు వృషంబురాశి భో
గీంద్రసుయోని దేవగణ మిాప్సితసౌఖ్యము తత్ఫలం బిలన్
జంద్రునితార యెన్నఁగను జంద్రధరా భగణాన కెన్నఁగన్ !

చ. గుణముల కెల్ల నాకరము కోరి కృతీంద్రునిఁడాసి యున్నదు
ర్గుణగణదోషముల్ చెఱచుఁ గోరినవస్తువినూత్నరత్నభూ
షణముల నిచ్చుఁ గావున లసత్కవిశేఖరు లెంచు సర్వల
క్షణములు గల్గియొప్పు బుధసన్నుతమై నగణంబు శంకరా !

## 11. రేచన

కవిజనాశ్రయ మనియు, భీమచ్ఛందస్సు, అనియు పిలువఁబడి యెడి లక్షణగ్రంథమును రేచన యనియెడుకవి రచియించె నని గ్రంథాంతపద్యగద్యాదులవలనఁ దెలియవచ్చుచున్నది. కాని యిది వేములవాడభీమకవి కృతమని ప్రతీతి యుండుటచే నావిషయమును గుఱించి భీమకవిచారిత్రమున విపులముగాఁ జర్చించి యీ గ్రంథము వేములవాడభీమకవికృతము కా దని నిర్ణయించియుంటిని. వేముల వాడ భీమకవి గాక మఱియొకభీమన దీనిని రచియించియుండవచ్చు నని యూహ కలుగుచున్నది. కాని యాభీమన యెవ్వరో తెలియక పోవుటచేఁ బ్రణీతకవియైనను, రేచనను గూర్చి వ్రాసినచో భావి పరిశోధకుల కనుకూలముగ నుండునని యీ చరిత్ర వ్రాసితిని. భీమకవిచారిత్రమున నుదాహరించిన పద్యగద్యములనుబట్టి యితఁడు జైనవైశ్యుఁ డనియు, వాదీంద్రచూడామణిశిష్యుఁ డనియు, కవిజ నాశ్రయ శ్రావకాభరణాంకబిరుదములను వహించినవాఁ డనియుఁ దెలియుచున్నది. ఇతని నివాసము, నిజామురాష్ట్రము.

శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు కాకతీయాంధ్ర రాజులయుగచరిత్రములో "భీమనసోదరుఁ డైనగోకర్ణుఁడు వాగీంద్ర చూడామణి యనుజైనసమయాచార్యుని శిష్యుఁడు. వర్ధమానపురాధీశ్వరుఁడు. ఇతఁడు భీమకవిచేఁ గర్తృత్వ మారోపింపఁబడినకవిజనాశ్రయ మను ఛందోగ్రంథమును రచించి, కళ్యాణపురాధీశ్వరుం డైన చాళుక్యజగదేకమల్లునకు సేనాపతి యగురేచభూపాలున కంకితము చేసెను. ఈ రేచనికిఁ గవిజనాశ్రయుఁ డనియు, గోకర్ణునకు శ్రావకాభరణాంకుఁ డనియు బిరుదనామములు కలవు. కవిజనాశ్రయము లో నాలుగాశ్వాసములును జైనకావ్యధర్మముల ననుసరించి వాగ్దేవతాస్తుతితోఁ బ్రారంభింపఁబడినవి. వేములవాడభీమకవి రచించినది నృసింహపురాణము గానికవిజనాశ్రయము కాదు" అని వ్రాసియున్నారు. వీరభద్రరావుగారి యభిప్రాయము ననుసరించి కవిజనాశ్రయకర్త గోకర్ణుఁ డనియు, రేచన కృతిపతి యనియుఁ దేలుచున్నది. దీనినిబట్టి రేచన, కృతిపతియేగాని ప్రణేతకవి కాఁ డనియు, రేచనరచించినట్లు కన్పట్టుచున్న గద్యపద్యము లన్నియుఁ బ్రక్షిప్తము లని వీరభద్రరావుగా రూహించినట్లు తోఁచుచున్నది. గద్యయందలి శ్రావకాభరణాంకబిరుదము గోకర్ణునిదని వారియూహ. కాని యది సత్యము కాదు. కవిజనాశ్రయశ్రావకాభరణాంకబిరుదము లొక్కవ్యక్తికే సంబంధించినట్లు గన్పడుపద్యము లనేకము లున్నవి. అందుచే వీరభద్రరావుగారియూహలు సరియైనవి కావు. ఈ రేచన జగదేకమల్లుని సేనాపతి యనుట కాయన కెట్టియాధారము లభించెనో తెలియదు. కవిజనాశ్రయమున రేచనను సంబోధించిన విశేషణము లలో సేనాధిపతి యనియర్థమిచ్చు పద మొక్కటియును లేదు. కావున నీతనిని సేనాధిపతియని చెప్పరాదు. సేనాధిపతి రేచన, యీ రేచనకంటె భిన్నుఁడై యుండును. కవిజనాశ్రయకర్త గోకర్ణుఁ డనుటయు వాస్తవము కాదు. కస్తూరి రంగకవి గోకర్ణునిచందస్సనియు, భీమనచందస్సనియు, వేఱువేఱుగా వ్రాసి, వేఱువేఱు పద్యముల నుదాహరించియున్నాఁడు. అప్పకవికూడ గోకర్ణఛందంబును, కవిజనాశ్రయంబున్నని వేఱువేఱుగా నుదాహరించి

యున్నాఁడు. గోకర్ణుఁడు రెండు ఛందోగ్రంథములను వ్రాయుట యసంభవము. కావున కవిజనాశ్రయకర్త గోకర్ణుఁడు గాఁడనుట నిశ్చయము.

కవిజనాశ్రయరచనాకాలమును నిర్ణయించుట కాధారములు లేవు. కవిజనాశ్రయకర్త వేములవాడ భీమకవి కాఁడనియు, రేచన జగదేకమల్లుని సేనాపతి కాఁడనియు నిర్ణయించినప్పు డీ కవి రేచన కాలమును జెప్పుట దుస్సాధ్యమైనది. అయినను సాధనాంతరము లభించువఱకును, రేచనను భీమకవి కాలమువాఁడని ప్రస్తుత మూహించుట మంచి దని యట్లు చేయుచున్నాఁడను.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పట్టాభిషేక సంచికయందు "నన్నయకుఁ బూర్వముఛందస్సు" అను వ్యాసమున నిట్లు వ్రాసియున్నారు.

"ద్రావిడభాషలో "యాప్పిరంగలమ్" అను ఛందోగ్రంథము పదునొకొండవ శతాబ్దిది కలదు. అందు సంస్కృత కర్ణాటాంధ్ర చ్ఛందస్సుల ప్రస్తావన మున్నది. "వాంచియార్ శెయిదవడఘుచం దవుం" అని యందు మున్నది. అనఁగా వాంచియ రచించిన తెలుఁగు ఛందమును జూచి తా నాగ్రంథమును రచించినట్లు గ్రంథకర్త చెప్పు కొనుటలోఁ గలదు. ద్రావిడనిఘంటు కార్యాలయమున విద్వాంసు లుగా నున్న శ్రీ మూ. రాఘవయ్యంగా రిది గుర్తించిరి. శ్రీరంగసామి సరస్వతిగారివలన నిది విని శ్రీ రాఘవయ్యంగారిని గలిసికొని సరిగా విచారించితిని. వాంచియ యను నాంధ్రచ్ఛందఃప్రణేత మనకుఁ దెలియరాకున్నాఁడు. ప్రాచీనప్రతుల లిపిరీతిని బరిశీలించినవారు "వాంచియార్"అను పదము "రేచియార్"గా నుండఁ దగు ననిరి. కొన్ని సంస్కృతశబ్దములు,కూడ నం దిట్లే వికృతిని బొరసియున్నవి. రేచియార్ అని యగునేని యాగ్రంథము రేచియ (రేచన) రచి యించిన కవిజనాశ్రయ మగును. ఆ ద్రవిడ గ్రంథకర్త జైనుఁడు. ఈ రేచియయును జైనుఁడే. ఇది యొకపొందిక యగును. ఇట్లగు నేని కవిజనాశ్రయము పదునొకండవ శతాబ్దికిఁ దర్వాతది కాకపోవును..."

శ్రీ శాస్త్రిగారు వ్రాసిన పై విషయము ధృవపడునేని (రేచనకృతమగు) కవిజనాశ్రయము నన్నయకు మున్నే పుట్టినదే యగును."

(భారతి సం ౧౧. భా౧. పుట ౩౫౬-౩౫౭)

ఈ విషయమున నింకను బరిశోధన మావశ్యకమై యున్నది. "యాప్పిరుంగలమ్"అను ద్రావిడ గ్రంథమును, ఆనాటి కర్ణాట గ్రంథమును గవిజనాశ్రయమును బరిశీలించి చూచినఁగాని యిదమిత్థ మని నిర్ణయింప లేము.

కవిజనాశ్రయమున "మల్లియరేచా" యను సంబోధనము పలుతావుల నుండుటచే రేచనకవి మల్లియ యనుట నిశ్చయము. కాని యీమల్లియ యుదంతమును దెలియలేదు. కవిజనాశ్రయము, విన్నకోట పెద్దనకృత కావ్యాలంకారచూడామణికిఁ దరువాతిది యనియు, దీనికర్త వేములవాడభీమకవియే యైయుండుననియు నిది పదునాల్గవ శతాబ్దమునందు జన్మించియుండుననియు, బ్ర. వ. చినసీతారామశాస్త్రులుగారు భారతిపత్రికలో వ్రాసియున్నారు. కాని వారితో నే నేకీభవింపఁజాలకున్నాఁడను.

కవిజనాశ్రయము పుట్టినదిపుట్టినట్లుగా లేదనియు, నందు తరువాతివారి పద్యములు కొన్ని కలిసినవనియు, నప్పకవి చెప్పియున్నాఁడు. కొంతవఱ కీవిషయమున బ్ర. జయంతి రామయ్యపంతులుగారు పరిశోధించియున్నారు. వారి పరిశోధనాఫలిత మిప్పు డాంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించిన కవిజనాశ్రయము ఈ గ్రంథమునుగూర్చియు నీకవి రేచననుగూర్చియు నింకను బరిశోధన మావశ్యకమై యున్నది. ప్రస్తుతమున నీకవినిగూర్చి యింతకంటె నేమియు వ్రాయఁజాలను.

## 12. ఉదయాదిత్యుఁడు

ఇతఁ డుదయాదిత్యాలంకార మను గ్రంథమును రచియించె నఁట. ఇది కన్నడగ్రంథమో, ఆంధ్రగ్రంథమో తెలియదని గోలకొండకవుల సంచికలో వ్రాసియున్నారు. గ్రంథము లభింపక పోవుటచే నితని యాద్యంత మేమియుఁ దెలియుట లేదు. ఇతఁడు నిజామురాష్ట్రమందలి వర్ధమానపురమును బరిపాలించిన రాజనియు, ఇతనికి భీమచోడుఁడు, గోకర్ణచోడుఁడు ననువారిరువురు తనయులు గలరనియు నీ గోకర్ణుఁడే గోకర్ణఛందస్సు అను లక్షణగ్రంథమును రచియించెననియుఁ జరిత్రకారులు చెప్పుచున్నారు. గోకర్ణునిగూర్చి వేఱొకచో వ్రాసియుంటిని. ఉదయాదిత్యుఁ డను పేరుగలవా రిరువురో ముగ్గురో యున్నారు. అందీతఁ డెవ్వఁడో తెలిసికొనవలసి యున్నది. ఈతఁడు రచించిన దాంధ్రగ్రంథమో, కన్నడగ్రంథమో తెలియనపు డీతనిగూర్చి పెంచి వ్రాయుటవల నుపయోగ ముండ దని యింతటితో విడచివైచితిని. ఉదయాదిత్యుఁడు భీమ, గోకర్ణుల కగ్రజుఁడనియు, మైలాంబకుమారుఁ డనియు నొక శాసనమునం దున్నది. (హై. శా. సం. సంఖ్య ౩౬)

---

## 13. గోకర్ణుఁడు

"గోకర్ణఛందస్సు" అని పిలువఁబడియెడి లక్షణగ్రంథమున కీతఁడు కర్త. ఆ గ్రంథ మిప్పు డెచ్చటను గన్పట్టుట లేదు. అప్పకవి తనయప్పకవీయమున, గోకర్ణఛందస్సును స్మరించియున్నాఁడు. కాని యందుండి పద్యములను లక్ష్యములుగా నీయలేదు. కస్తూరిరంగకవి తన యానందరంగరాట్ఛందమున గోకర్ణఛందస్సులోనివని కొన్ని పద్యములను లక్ష్యములుగాఁ జూపినాఁడు. గ్రంథము లభింపక పోవుటచే నీతఁ డెప్పటివాఁడో, ఏకులమువాఁడో, ఎచ్చటివాఁడో, తెలుపుట కవకాశము లేదు. ఇతఁడు జైనుఁ డని కొందఱనుచున్నారు. కొందఱీతఁడు సూర్యవంశపుక్షత్రియుఁ డనుచున్నారు,

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారును చిలుకూరి వీరభద్రరావు గారును, వేములవాడ భీమకవి రచించి రేచనపేరు పెట్టె నని చెప్పఁ బడియెడి కవిజనాశ్రయ మనులక్షణగ్రంథమే గోకర్ణఛంద స్సని యు, దాని నీ గోకర్ణుఁడే రచియించె ననియు వ్రాసియున్నారు. కాని యది సత్యమైనట్లు కన్పట్టదు. ఈ విషయమును భీమకవిచారిత్రమునను, రేచనచారిత్రమునను విపులముగాఁ జర్చించియున్నాఁడను.

ఈ గోకర్ణుఁడు, నిజామురాష్ట్రమందలి వర్ధమానపురమును బరిపాలించినసూర్యవంశక్షత్రియుఁ డనియు, నితనికిఁ దండ్రి యుదయాదిత్యుఁ డనియు, భీమచోడుఁ డగ్రజుఁ డనియు, నీతఁడు కాకతి రుద్రదేవునికాలములో నున్నవాఁ డనియు, చిలుకూరి వీరభద్ర రావుగారు కాకతీయాంధ్రరాజయుగచరిత్రమున వ్రాసియున్నారు. శ్రీ రామకృష్ణకవిగారును అట్టే యభిప్రాయపడిరి. ఆ కాలమున గోకర్ణచోడుఁ డున్నమాటవాస్తవమే కాని, యాతఁడు ఛందో గ్రంథమును రచించె ననుట కాధారములను వారు చూపలేదు. అట్టియాధారములు లభించువఱకును గోకర్ణఛందస్సును రచించిన వాఁడు, వర్ధమానపురపాలకుఁ డగుగోకర్ణుఁ డని తలంపవీలులేదు. ఈ క్షత్రియగోకర్ణుఁడు వాగీంద్రచూడామణి యను జైనసమయా చార్యునిశిష్యుఁ డని వీరభద్రరావుగారు వ్రాసియున్నారు. కాని యందులకును నాధారము లేదు. ఆధారరహితములైన యిట్టి సిద్ధాంతములనుబట్టి ఛందస్సును రచించినగోకర్ణుని కులగోత్రకాలములు నిర్ణయింప వలనుకాదు. కాలము తెలియకపోయినను, రేచనతోను, వాగీంద్రచూడామణితోను సంబంధించినకథ యొకటి చెప్పఁబడియుండుటవలనను, గోకర్ణచోడుఁడు పంచాండవశతాబ్ది వాఁ డగుటను నీతనిని పంచాండవశతాబ్దియందుఁ జేర్చితిని. ఆనందరంగ రాట్ఛందమున నుదాహరింపఁబడిన గోకర్ణఛందస్సునందలిపద్యముల నీ క్రింద నుదాహరించుచున్నాఁడను.

రుద్రదేవుని హనుమకొండశాసనమున గోకర్ణచోడునిపే రుదాహరింపబడినది. కాని యాతఁడు పండితుఁడనిగాని కవియనిగాని

యందుఁ జెప్పఁబడలేదు. గోకర్ణచోడునితల్లి యైనమైలాంబవ్రాయించిన పానగల్లుశాసనము (హై. శా. సం. నెం 32 రు) లో గోకర్ణ చోడుని పేరు కలదు. ఇతఁడు కవియని యూహించుటకుఁదగినయాధారము లందును లేవు. గోకర్ణచోడుఁ డిరువురుబ్రాహ్మణులకు దానమొసంగి వ్రాయించినశాసనము (హై. శా. సం. నెం 31 రు) లో గూడఁ దానుపండితుఁడనని చెప్పుకొనలేదు. ఇతనికోడూరిశాసనమునందును నీ ప్రశంస లేదు. ఈ కారణములచే గోకర్ణఛందస్సును రచించినకవి గోకర్ణచోడుఁ డనినిశ్చయింపలేకున్నాము. సుప్రసిద్ధ చరిత్రకారు లగు శ్రీ రామకృష్ణకవిగారును, వీరభద్రరావుగారును, ఛందస్సునురచియించిన దీగోకర్ణచోడుఁడే యని చెప్పియుండుటచే, వారి మాటలను కాదనరాదని తోఁచుచున్నను, దగినయాధారము లభింపకుండుటచే, నాతఁడే యాతఁ డని నిర్ణయించుట కవకాశము లేకపోయినది. ఈ యిరువురు నొకవ్యక్తియే యని నిర్ణయ మగునెడల, సీతవిచారిత్రోముఖన వ్రాయవలసినయంశము లింకను జాలగలవు. వీరిరువురును భిన్నవ్యక్తు లనునూహచే నా విషయముల నిటఁ బ్రస్తావింపలేదు.

క. [1]నయులంజెప్పిన శుభ మగు
జయులం జెప్పినను బతికి జయకీర్తులగున్
రయులం జెప్పిన నెంకయుఁ
బ్రియ మగు మఱి మయులఁ జెప్పఁ బెంపొనరించున్.

క. పతితారకుఁ బద్యాను ఖ
స్థితతారకమునకుఁ జెలిమి తెలియక జనుఁడై
కృతియొండెఁ బద్య మొండెను
విదితంబుగఁ జెప్పుగతఁడు వీఁడి కాఁడే.

1. కవిజనాశ్రయమునందు 'నయులం జెప్పిన శుభమగు జయులం జెప్పినను బతికి జయకీర్తులగున్ మయులం జెప్పిన సౌఖ్యము రయులం జెప్పినను జెట్ట రయమున వచ్చున్' అని యున్నది.

గీ. తగ ఋకారాన్వితంబు ద్విత్వంబు గాఁగ
బరఁగు సప్తపుజడ్డతోఁ బ్రాసమైత్రి
యుక్తకృపాసిద్ధి వారిఁ గని ప్రముక్తి నసఁగ
సంభృతాశ్రితుఁ డతియశోజ్జృంభి యనఁగ.

గీ. [2]యరలవశషసహావర్ణము లాదిబిందు
యుతము లై మువర్ణవిరామయుక్తి నలరు
మారుతాత్మజుఁ డరిది సంయమి యనంగ
మదనజనకుఁడు దితిజసంహారుఁ డనఁగ

క. తెలియఁగ వర్గద్వ్య సమసంబు
గలసిన సరసవశి యంద్రు కవివరు లెల్లన్
కలికావర్గవు తోటోఁ
గలపం దగు పళ్ళ కట్ల కందర్పనిభా!

క. [3]మొదల నడుమంట లఘువ్వులు
వదలవు యరతలను వానివరుసని భజనల్
వినుతంబులు గురువులు తుద
మొదల నడుమ పనల కెనఁగు మొగి గురులఘువుల్

వావిళ్ళవారు ప్రకటించినసులక్షణసారమున నీక్రిందిపద్యము గోకర్ణఛందసులోని దని చెప్పఁబడినది.

క. క్రూరగ్రహము క్తము లగు
తారలు దగ్ధములు ధూమితంబులు వానిన్
జేరి మొదు రెదుర నున్నన్
క్రూరగతంబు లని యెఱిఁగికొను జ్వలితంబుల్

---

2. ఈ పద్యము అనంతునిఛందమున అనంతుని దనియున్నది. అప్పకవియు ననంతునిదే యనినాడు. పెద్దిరాజు దని సులక్షణసారకర్తయనినాఁడు.

3. ఇది రంగయసర్వలక్షణసారములో నుదాహరింపఁబడినదని తంజాపూరు నందలి భాండాగారపట్టికలో నున్నది.

# 14 శ్రీపతిపండితుఁడు

శైవమతవ్యాప్తికొఱకు పాటుపడినపండితత్రయములో నీతఁడు మొదటివాఁడు. శైవమతమును బోధించుచు నీతఁడు సంస్కృతాంధ్రములయందుఁ గొన్నిగ్రంథములను రచించె నని ప్రతీతి కలదు. ఈతనియాంధ్రగ్రంథము లేవియు నిపుడు గాన్పించుట లేదు. కాని ముందెప్పుడైన నీతనిగ్రంథములు బయలుపడునేమో యనియు, భాషాభిమానులీతనిగ్రంథములకై ప్రయత్నింతు రనియుఁ దలంచి యాతనిచరిత్రము నిందుఁ జేర్చితిని. ఇతఁ డారాధ్యనియోగి బ్రాహ్మణుఁడు. ఈతనినివాసము కృష్ణామండల మందలి బెజవాడ. ఇతఁడు వేదవేదాంగములను జదివి పండితుఁడై, తపశ్శాలియై, శైవ మతాభిమానియై యుండెడివాఁడు. ఒకనాఁ డాయన కృష్ణానది కేగి స్నానము చేసివచ్చుచుండఁగా నొకయేనుఁ గెదు రయ్యెను. ఏనుఁగు వెడలిపోయినపిదపఁ బోవచ్చునని యాయన యాప్రక్క నున్న యింటియరుగుపై కెక్కెను. ఆ యిల్లొకగొడగరిది (గొడగరి— గొడారి; మాదిగవాఁడు.) ఇంతలో నాగొడగరి లోపలనుండివచ్చి "అయ్యా! నేను ప్రతిదినము నాగృహ శివభక్తులకు భోజనమిడు వాఁడను, నేఁ డయిదుగురుమాత్రమే వచ్చియున్నారు. కావున మీరా రీనాఁడు నాయింట భుజించి, నావ్రతభంగము కాకుండఁ గాపాడ వలయును." అని ప్రార్థింప వల్లెయని యాపండితుఁడు వానియింట భుజించెను. అది చూచి బ్రాహ్మణులు శ్రీపతిపండితునిశిష్యుఁడైన యనంతపాలునియొద్ద కేగి యావృత్తాంతమును జెప్పి, బ్రాహ్మణు లాదఱును పండితుని వెలివైచి యాతనికి నగ్నినియుక్తైరి. పండితుఁ డూరివెలుపల నున్నకలియావృక్షమున నొకబట్టను ముడివైచి బెజ వాడ యందున్నయగ్ని యంతయు నందుండు నట్లు శాసించెను. బెజవాడయం దగ్గి కఱవయ్యెను. ఆతనిమాహాత్మ్యమున కచ్చెరు వంది ప్రజలనంతపాలసహితముగ వచ్చి యాతనిఁ బ్రార్థించినమీఁదటనై క్షమాపణలు చెప్పుకొని యాపవిత్రవస్త్రమునుండి యగ్నినిఁ గైకొని చనిరి. ఈకథను పాలకురికిసోమనాథుఁడును వస్త్రికొన్నన పండితా రాధ్యులు స్వకీయపద్యగద్యములలోఁ గీర్తించియున్నారు.

"భక్తుండు శ్రీపతిపండితుం డీశు
భక్తుని కిలఁ గోటిబ్రాహ్మణు లైన
నెనయన్న నాలుక నేఁ గోసివైతు
ననుచు ననంతపాలునిసభాస్థలి ని
నెక్కునఁగాఁ జంద్రునిప్పులు గాదె
చక్కన పాత్రిపచ్చడమున ముడిచె" బసవపురాణము.

క. ఒక్కఁడె దైవము శివుఁ డని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు నీరన్
గ్రుక్కక శ్రీపతిపండితుఁ
డక్కజముగ విజయవాడ నల జమ్మి శివా!

క. అతులిత శివభక్తునితోఁ
బ్రతి సేయఁగ రాదు కోటిబ్రాహ్మణులని శ్రీ
పతిపండితయ్య నిప్పులఁ
గుతుకమ్మతి మూటగట్టెఁ గొంగునను శివా!

శివతత్త్వసారము

ఈ శ్రీపతిపండితవంశమున, కాశీనాథుఁ డనునొకమహాపురుషుఁడు జన్మించి ఖ్యాతిఁగాంచుటచే నప్పటినుండియు నీవంశము వారు కాశీనాథునివా రైరి. ధర్మాభ్యుదయభద్రాయుశ్చరిత్రములను రచించినకాశీనాథునివీరారాధ్యుఁ డీశ్రీపతివంశము లోనివాఁడే. ఈ శ్రీపతిపండితునికథను వీరారాధ్యుఁడు తనధర్మగుప్తాభ్యుదయమున నీ క్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

గీ. అరయఁ బత్పండితేంద్రనిజాంశభూతి
భవులు శ్రీపతి మంచెన పండితులును
మల్లికార్జునపండితుఁ డెల్లజనులు
వినుతు లొనరింప వెలసి యుర్వీతలమున!

గీ. వారు భువి వీరశైవప్రవర్తనంబు
బ్రాహ్మణాచార మగునంచుఁ బత్యమూన
వేదవేదాంత సిద్ధాంతవిశ్రుతముగఁ
దెలియఁ జేయుచు విలసిల్లి రలఘుమహిమ!

క. ధీరుఁడు శ్రీపతిపండితుఁ
డారయఁ బ్రాచీనదేశికాహ్వయుఁడు మహో
దారశివాద్వయమార్గ
స్ఫారధురంధరుఁడు లోకపావనుఁ డెన్నన్.

క. ఆగురుఁడు విజయవాటిని
భోగోజ్జ్వలమందిరమున బుధయుతుఁడై శై
వాగమనైగమబోధా
యోగమునఁ జరింపుచుండి యొకనాఁ డనియెన్.

క. శివుఁడే దైవము ధరలో
శివభక్తులె సత్కులీనసిద్ధాంతపరుల్
శివమంత్రమె మనురాజము
శివునిప్రసాదంబె భోగశేఖర మరయన్.

వ. అని శపథంబుగాఁ బలుకుచు ననంతపాలదండనాయకమహీంధ్ర వాది శిష్యతతిసేవాయత్తచిత్తంబులం బ్రవర్తింపుచుండఁ బర వాది కోలాహలుండై జయవాటీపురంబున విజయధ్వజం బెత్తి మహోత్తరశైవాచార్యుం డనఁ జెలంగుచుండి యొక్కనాఁడు.

సీ. సరవిఁ గృష్ణానదీస్నానంబు గావించి
నిత్యకృత్యంబులు నెఱయఁ దీర్చి
వచ్చుచోఁ బురవీథి వసుధేశుమదగజం
బరుదేరఁ దొలఁగుచు నచట నొక్క
గొడగరివాకిలిఁ గడుఁ జొచ్చి నిలిచిన
నంతఁ దద్గృహమేధి యరుగుదెంచి
శరణార్థి గురురాయ! సతతంబు నావ్రతం
బార్య రయ్యలకు శివార్చనంబుఁ
దగ సలుపుచుంట నొకయయ్య తక్కవయ్యె
నేఁడు లింగైక్య మిఁక నాకు నిక్క మనిన
మంచి దని వానివ్రత మొనరించి వేడ్క
వచ్చుదేశికుఁ గని పరవాదులుదరి.

క. ఓహో, బ్రాహ్మణుఁ డఁట యితఁ
డోహో యగ్గొడగరింట నారోగిణ మి
ట్టీహీ యొనరిచి వచ్చెను
ద్రోహం బని చుట్టుకొనిరి దుర్మతు లగుచున్.

గీ. పరగ నీరీతిఁ బరవాదు లురవడించు
గతికిఁ దా మున్ను జేసినకడుఁబ్రతిజ్ఞ
నిగమసమ్మతి యాథిగా నెఱపఁ దలఁచి
వారు గొనిపోవ నృపసభఁ జేరె గురుఁడు.

వ. ఇట్లు పరవాదు లప్పుండితేంద్రు ననంతపాలదండనాయకభూవరా
స్థానంబునకుఁ గొనిపోయి యిట్లనిరి.

క. గొడగరి మల్లయ యింటను
గడుపారఁగఁ గుడిచి రాఁగఁ గాంచితి మితఁడే
ర్పడ మీగురు వెట్లగు నని
కడుఁ దోఁచక యుంటి మిపుడు కలఁగుచు నధిపా!

సీ. అని యిట్లువిప్రులాడిన నలంకుచు సభ్యు
లా పండితునిఁ జూచి యనఘచరిత
యిది యెట్టి దగునని మొదలింపఁ జిఱునవ్వు
సెలవుల దైవాటి చెలువు దనర
నింతయు నిజము మే మొనయ ము న్నొనరించు
ప్రతిన యిట్టిది యసత్ప్రాజ్ఞులార
మొనసి యాత్మాద్వైతమునఁ శివాద్వైతము
ననుఁ జెందువారలఁ గినిసి జాతి
భేద మెంచఁగరా దని పృథులశాస్త్ర
రీతులును వానివర్గంబు నీతి దెలియఁ
డరసి జాబాలశతపద్రియాదులందుఁ
బలుకుపలుకులు వినుఁడు విభ్రమము మాని.

సీ. వేదవేదాంతార్థవిధులచే సాధింపఁ
గా లేక మూర్ఖులై కదిసి మీర
లగ్ని మీఁ కిడ మని యార్చుట లదిమీకుఁ
గలిగియుండినఁ గదా కడమమాట
అని కోపశిఖిపీతుఁ డుగ్రప్రచారియై
గరిగొని విస్ఫులింగములఁ దనప
బొమలు గంటిడ ధరాభ్రమణంబుచే దిశల్
కుమ్మరిసారె చందమ్ము నెఱప
గగనభాగంబు నం దిరుల్ గ్రమ్ముకొనఁగ
సర్వజీవౌఘమును సభాసదులు మూర్ఛ
నొంద నప్పండితేంద్రుఁ డత్యుగ్రవేగ
సరణి లంఘించెఁ దన్మహాస్థానవీధి.

వ. అప్పండితేంద్రుడు జయవాటికాపురమల్లికార్జునాగ్నేయభాగంబున నున్నశమీశాఖాసమీపంబునకు నరిగి యుద్దేవుని కభివందనంబును ప్రమథగణస్తోత్రంబును గావించి వీతిహోత్రు నాకర్షింపుచుఁ దనమీఁదిపట్టుపచ్చడంబునం గట్టి యిట్లనియె.

మ. వినుమీ పావక! శైవగేహములలో విశ్రాంతిదక్కన్ బురం
బున నెందున్ వసియింప కీ కుజనవిస్ఫూర్జన్మదంబున్ హరిం
పు నగేంద్రాలయునాజ్ఞ దప్పి యనయంబున్ మీఱితేనన్ వీరభ
ద్రునిచే నీ కగుబన్నమున్ దెలియుఁగా దొడ్డాడ నింకేటికిన్.

ఏడుదినములు గడచినపిదప అనంతపాలాదిదండనాథులతోఁ గూడవచ్చి ప్రజలు శరణని వేఁడఁగా పండితుఁ డాయగ్నిని విడిచిపుచ్చెనఁట!

ఇతఁడు బ్రహ్మసూత్రములకు శివపరముగా నొకవ్యాఖ్యను వ్రాసి దానికి శ్రీకరభాష్యమని పేరిడియెను. ఈతఁ డింకను గొన్ని సంస్కృతగ్రంథములను రచించె నని చెప్పుదురు. శ్రీకరభాష్యమునకు శివదీపికయని పేరు పెట్టెననికొందఱందురు. శివదీపిక యనుగ్రంథము నాంధ్రమున వ్రాసె ననికొందఱనుచున్నారు. యుద్ధమల్లుని బెజవాడ

శాసనము నందున్న మధ్యాక్కరల నీతఁడే రచించె నని కొందఱు చెప్పుచున్నారు. ఆయక్కరలలోఁ గొన్నిటి నిట నుదాహరించుచున్నాఁడను.

౧. స్వస్తి నృపాంకుశాత్యంతవత్సల సత్యత్రిణేత్ర
విస్తర శ్రీయుద్ధమల్లు డనవద్యవిఖ్యాతకీర్తి
ప్రస్తుతరాజాశ్రయుండు త్రిభువనభరణుండు సకల
వస్తుసమేతుండు రాజసల్కిభూవల్లభుం డర్థి.

౨. పరగంగ బెజవాడ గొమరుస్వామికి భక్తుఁడై గుడియు
నిరుపమమతి నృపధాము డెత్తిచ్చె నెగి దీర్చె మఠము
గొరగ ల్గా గొరు లిందువిడిసి బ్బందంబు గొని యుండువారు
పరిగాక యబ్బారనాసి వచ్చిన పాపంబు గొండ్రు.

౩. వెలయంగ నియ్యొట్టు డస్సి మలినురై విడిసిన బ్రోల
గలతానపతులును రాజు పట్టముం గట్టినపతియు
నలయం బయ్యారల వెల్వరించిన నశ్వమేధంబు
ఫల ముపేక్షించి నాలింగబడసిన పాపంబు దమకు.

౪. జననుత చేబ్రోలునుండి బెజవాడ జాత్రకు వచ్చి
త్రిణయనుతుఁ డొందుచోట మెచ్చక తివిరి యున్నెలవ
యునఘుండు చేకొని యిందు ప్రత్యక్ష మైయున్న నచ్చ
గని మల్ల డెత్తించె గుడియు మఠమును గార్తికేయునకు.

౫. రమణతో బెజవాడ కెల్ల చెడగుడు రక్షయు గాను
దనతాత మల్లపరాజు వేర్వేఱు దాను గట్టించె
గ్రమమున దా నికకలశమిడ్డట్టుగా మొగమాడు
సమరంగ శ్రీయుద్ధమల్లుఁ డెత్తించె నమితతేజుండు.

ఈయక్కరలు శ్రీపతిపండితకృతము లైనచో, నీశాసనము పదియవశతాబ్దిలో వ్రాయఁబడినది. కావున నీపండితుఁడు నన్నయకుఁ బూర్వుఁ డని చెప్పవలసివచ్చును. కాని యిందు సత్యము లే దని తోఁచుచున్నది. పైనచెప్పిన యగ్నిహోత్రమును బట్టయందు కట్టిన




కథ సత్య మయ్యెనేని యాతఁ డనంతపాలుని కాలమువాఁ డగును. అనంతపాలుఁడు పశ్చిమచాళుక్య వంశములోనివాఁ డైనయాఱవవిక్రమాదిత్యునిదండాధిపతి యై కొండపల్లి రాజ్యమును పాలించినయుత్తమ బ్రాహ్మణుఁడు. ఆఱవవిక్రమాదిత్యుఁడు క్రీ. శ. ౧౦౭౬—౧౧౨౬ నడుమ రాజ్యముచేసినవాఁడు. అనంతపాలునిశాసనము చేబ్రోలులో నున్నది. అనంతపాలునియల్లుఁడు చక్రరాజదండనాయకుని శాసన మొకటిద్రాక్షారామయాలయమునందున్నది. (ద. హిం. శా. సం. ౪ సంఖ్య ౧౨౯౬—౧౩౧౧) ఇది చాళుక్య విక్రమసంవత్సరములు ౪౭— క్రీ. శ. ౧౧౨౨ నాటిది. అనంతపాలుని కాలమును నిర్ణయించు శాసనము లింకను చాలఁ గలవు. (ద. హిం. రా. సం. ౯ భా౧.) వీనినిబట్టి శ్రీపతిపండితుఁడు క్రీస్తుశకమున పదునొకండవశతాబ్ది తుది పాదమునను పండ్రెండవశతాబ్ది నాదిపాదమునను నున్నవాఁ డని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. కావునఁ బైనఁజెప్పినయక్కరలీతనివి కావు.

పోచిరాజువీరనకవి తనవిభూతిరుద్రాక్షమాహాత్మ్యమును ఈ శ్రీపతిపండితున కంకితము చేసెను. కాని యంతమాత్రమున వీరిరువురును సమకాలికు లని తలంపరాదు. పండితునియందుఁ గలభక్తిచే వీరనకవి తనగ్రంథము నీతనికర్పించియుండె నని తలంపవలసియున్నది.

ఈ శ్రీపతిపండితునివంశము తామరతంపరయై బహుముఖములవ్యాపించియున్నది. గ్రంథవిస్తరభీతిచే నావంశవృక్ష మిట నీయలేదు.

# 15. దేసటిపండఁడు

ఇతనితండ్రి భీమనృపాలుఁడు. తల్లి ఎరియాంబ; తాతపండఁడు; బూరమ పితామహి; గండఁడు ప్రపితామహుఁడు; మేడమ ప్రపితామహి;

ఈ కవి గుంటూరుమండలములోని చేబ్రోలునం దున్న కుమారస్వామికి, అఖండదీపదానముచేసి యాంధ్రపద్యాత్మకమైన యొక శిలాశాసనమును వ్రాయించెను. దానినిబట్టి యీతఁడు కవిత్వము చెప్పఁగలవాఁ డని తెలియుచున్నది. ఈతఁడు రచియించిన గ్రంథము లేవియో తెలియుట లేదు. ఆ శాసనము నీక్రింద వ్రాయుచున్నాఁడను. ఇప్పటి పాఠకుల సౌకర్యముకొఱకు శాసనము నందలి యుచ్చారణను గొంత సవరించితిని.

శా. శ్రీనారీపతినాభిపంకజభవ శ్రీపాదజాతోత్తమ
క్ష్మానాథాంబుజభాస్కరుండు నిజవంశం బెల్ల దీపింపఁగా
దీనానాథకవీంద్రగాయకులు గీర్తింపంగఁ గీర్తిశుఁడై
భూనాథాగ్రణి బుద్ధవర్మ ప్రభతోఁ బుట్టె న్మహాశౌర్యుఁడై ౧.

స్రగ్ధర. శ్రీరమ్యక్ష్మావధూకాం
చికి నెన యగుకాంచీపురీనాథు నుగ్రా
కారున్ లాలాటనేత్రున్
గవిజనహితు ముక్కంటికాడ్వెట్టిఁ బుణ్యా
చారున్ దద్బుద్ధవర్మే
శ్వరుఁడు గొలిచి మును శాసనం బొందఁ గర్ణో
దారుం డొంగేరుమార్గ
త్రయము వడసె నాతారచంద్రార్కలీలన్. ౨

ఉ. ఆవిభునన్వయంబున గుణౌఘ్యుఁడు గండఁడు పుట్టె వానికిన్
దేవమహీజదాని యగు దేసటిపండఁడు పుట్టె వట్సహా
ప్రావని నేవెఁ దత్సుతుఁ డుదగ్రుఁడు విల్లమభీముఁ డంధ్రల
క్ష్మీవని తేజుచేఁ బడసెఁ జెల్వగుపంచినికుట్టు వృత్తిగాన్. ౩

ఉ. ఆతని కుద్భవించె నధిపాగ్రణి గండఁడు వానికిన్ గుల
స్త్రీతిలకంబు మేడమకు ధీరుఁడు పండఁడు పుట్టెవానికిన్
శీతకరాస్య బూరమకు సింధురవైరిబలుండు రాజమాం
ధాతుఁడు పుట్టె భీముఁడు వదాన్యుఁడు ధన్యుఁడు పుణ్యమూర్తియై.

చ. ........................................................................
..........................................దీధితి రేఖ వరేణ్యపుణ్యదో
హాలయనఁ బెంపుఁ గన్నయెఱియాంబకు నుద్భవ మయ్యె భారతీ
నిలయుఁ డనంగఁ బండధరణీపతి సర్వకలాప్రవీణుఁడై. ౫

చ. తలపు నదర్థభావమునఁ దగ్గతిసూక్తులఁ గూడ వర్ణనల్
గొలుసుగొనంగఁ బ్రావడులు గోరినభంగిన వచ్చి ముట్టఁ గో
మలగతి దేసిమార్గములు మట్టుపడం గటనంబులొప్ప నా
ద్యులక్రియఁ జెప్పనేర్చె నృపధూర్జటి భీమయపండఁ డిమ్మహిన్. ౬

మ. స్వరతర్కాంబరచంద్రసంఖ్యఁ జనుతచ్ఛాకాబ్దచైత్రామలే
తరపంచాదశిసౌరివాసరసముద్యన్మేషసంక్రాంతి సు
స్థిరతం బొల్చుమయూరవాహనునకుం జేబ్రోలఁ బెట్టించె భా
స్వరదీపం బతిభక్తిఁ బండనృపుఁ డాచంద్రార్కతారంబుగాన్. ౭

స్వస్తిశకవర్షంబులు ౧౦౬౭గు నేటిచైత్రబహుళపంచాదశియు శనైశ్చరవారమున శ్రీ కుమారస్వామిదేవరకు మహామండలేశ్వర పండయ దమతండ్రి భీమరాజునకు ధర్మార్థముగా నఖండదీపమున కిచ్చినఎడ్లు౫౦. వీనిం జేకొని నల్లంగాటయబోయనికొడుకు కొండ బోయుండు దనపుత్రానుపౌత్రిక మాచంద్రార్కము మహాసేనమున నిత్యం మానెడునేయి పోయుంగలవాఁడు. శ్రీ శ్రీ శ్రీ

ఈశాసనము ద. హి. శా. సం. ౬ సంఖ్య ౧౦౩గా ప్రకటింపఁబడినది. పైపద్యములలోని ౬వ పద్యమునుబట్టి యీకవి దేసి మార్గములు రెండింటియందును జక్కనికవిత్వము చెప్పఁగలవాఁ డని తెలియుచున్నది. ఇతఁ డాంధ్రమున నేమేని గ్రంథములు వ్రాసి యుండు ననియూహింపనగును. పైపద్యము లీతనివే యైయుండును.

రెండవపద్యములోని "దేసటి" యాతనియింటిపే రైనట్లూహించి యాతనిని దేసటిపండఁ డని పేర్కొన్నాఁడను. మొదటిపద్యము ను బట్టి యితఁడు శూద్రుఁ డనుట నిశ్చయము. కొండవీటిరెడ్డిప్రభువుల యింటిపేరుకూడ దేసటివారే. కాని యంతమాత్రముచే నీతనిని రెడ్డికులజుఁడని నిశ్చయింపలేము. "దేసటి" యను గ్రామమును బట్టి యీ యుభయులకునుగూడ "దేసటి" యను గృహనామ మేర్పడిన నేర్పడియుండును. పైశాసనమునుబట్టి యీ కవి క్రీ. శ. పండ్రెండవ శతాబ్దమధ్యభాగమువాఁ డని తెలియుచున్నది. ఈ కాలముననే వెలనాటిగొంకమహీపతికి మేనమామయగు పండఁడొకఁ డున్నాఁడు. అతఁ డీతఁడేమోయని సంశయించితినిగాని విమర్శించినమీఁదట నీయిరువురు నొక్కరుగా రని తేలినది. ఆపండనినామ ముదాహరింపఁ బడినశాసనములు పెక్కు లున్నవి. వానియం దాతనిని కవియని చెప్పలేదు. అతనితల్లి మల్లాంబ. మనకవిపండనితల్లి యెరియాంబ.

ఈకవి పండనివంశమునకు మూలపురుషుఁడు బుద్ధవర్మయై నట్లును, అతఁడు ముక్కంటికాడ్వెట్టిని సేవించి, ఒంగేరుమార్గ త్రయము నాతనివలనఁ బడసినట్లును పైపద్యములలోని మొదటిరెండు పద్యములవలనఁ దెలియుచున్నది. ఈముక్కంటికాడ్వెట్టి కాంచీపుర నాథుడనియు లలాటమందు నేత్రము గలవాఁడనియు 3వ పద్యము లోనున్నది. కొందరుచరిత్రకారు లీముక్కంటికాడ్వెట్టియే త్రిలోచన పల్లవుఁ డని నిశ్చయించియున్నారు. త్రిలోచనపల్లవుఁ డాఱవ శతాబ్దివాఁ డనిచెప్పవచ్చును. కొండపడమటిరాజులమూలపురుషుఁ డయినబుద్ధవర్మయొకఁ డున్నట్లును నతఁడు తూర్పుచాళుక్యులవంశ కర్తయైనకుబ్జవిష్ణువర్ధనునికడ సేవకుఁడైనట్లును కొన్నిశాసనముల వలనఁ దెలియుచున్నది. (ద. హిం. శా. సం. ౧సం ౯౨౩) ఈ బుద్ధవర్మకూడ శూద్రుఁడే. కవిపండనివంశకర్తయైనబుద్ధవర్మయు, కొండపడమటిరాజుల మూలపురుషుఁడైనబుద్ధవర్మయు నొక్కరు గాకపోయినను, నీవంశములో బుద్ధవర్మలు పెక్కు రుండుటచే, నీయిరువురివంశములు నొకబుద్ధవర్మనుండి యుత్పన్నములైనశాఖ లేమో యని తోఁచుచున్నది.

మనకవిపండనికిఁ బితామహుఁ డైనపండని ప్రపితామహుఁడు "ఆఱువేలనాఁ" డను దేశమును బరిపాలించినట్లు ౩వ పద్యమువలనఁ దెలియుచున్నది. చరిత్రకారు లీతనినిగుర్తించిన ట్లగపడదు. ఇతని కాలము, క్రీ. శ. ౯౫౦—౯౬౦ ప్రాంతమగును. ఈవిషయమున నింకను బరిశోధనము కావలసియున్నది.

ఈపండనికి మారుఁడైన విల్లమభీముఁడు "పంచినికుఱ్ఱు" అను గ్రామము నాంధ్రదేశాధీశ్వరునిచేఁ బడసినట్లు పై పద్యములోనే యున్నది. ఈగ్రామ మెచ్చటిదో, ఈయాంధ్రేశ్వరుఁ డెవ్వఁడో తెలియలేదు. ఈవిల్లమభీముని కాలము క్రీ. శ. ౧౦౦౦ ప్రాంతమగును. ఆకాలమున నాంధ్రదేశాధీశ్వరు లనిచెప్పఁదగినవారు చాళుక్యులును గాకతీయులు నై యున్నారు. క్రీ. శ. ౧౦౦౦నాఁటికిఁ గాకతీయులు స్వతంత్రప్రభువులుగా లేరు. కావునఁ బశ్చిమచాళుక్యులుగాని తూర్పు చాళుక్యులుగాని పంచినకుఱ్ఱు నిచ్చి యుందురు. పంచినికుఱ్ఱును గుర్తింపఁగలిగినయెడల దాత యెవ్వరో తెలిసికొన వీలుగలుగును. ఈభీమునితండ్రి యైనపండఁడు, ఆఱువేలనాఁడునకుఁ బరిపాలకుఁడై యుండఁగా నీభీముఁ డాపాలకత్వమును బోఁగొట్టుకుని యొకగ్రామమును వృత్తిగాఁ బడయవలసినస్థితి లోనికేల వచ్చెనో తెలియకున్నది.

కవిపండనివంశమునకు మూలకర్త యైనబుద్ధవర్మ ముక్కంటి కాడ్వెట్టిచే ఒంగేరుమార్గత్రియమును బడసెనని పైసిద్ధరావృత్తము నందున్నది. "ఒంగేరుమార్గ" శబ్దము మరికొన్ని శాసనములయందును గలదు. ఇది యొకదేశముయొక్క నామము.

పై శాసనమునుబట్టి యీకవిపండఁడు క్రీ. శ. ౧౧౮౫వ సంవత్సరమున నున్నాఁడనుట స్పష్టము.

---

# 16. మల్లికార్జున పండితారాధ్యులు

శైవమతవ్యాప్తికై తమజీవితములను ధారవోసినపండిత త్రయములో నీతఁ డొకఁడు. తక్కినవారు శ్రీపతిపండితుఁడును మంచన పండితుఁడును. ఈ శైవమత మనునది వీరితోఁ గ్రొత్తగా వచ్చినది కాదు. ఆర్యు లీదక్షిణదేశమునకువచ్చినప్పు డనార్యులు శైవమతావిష్టులై యుండి రనియు, నెన్నివిధములఁ బ్రయత్నించినను వారామతమును విడనాడలే దనియు, నప్పు డార్యులు శైవమతము నొకమతముగా నంగీకరించి యనార్యులను దములోఁ గలుపుకొని రనియు నొకప్రతీతి కలదు. బసవనారాధ్యుఁడు శైవమతకర్త యని కొందఱందురు కాని యది వాస్తవము కాదు. శివుఁడు త్రిమూర్తులలో నొకఁడు. ఈశివునిఁగూర్చినవాక్యములు వేదము లందును గలవు. శైవవైష్ణవకథలు నష్టాదశపురాణములలో ననేకము లున్నవి. వేదవిహితధర్మములను విడనాడకుండ శివుఁడే దైవ మని, శివుఁడే యైశ్వర్యప్రదుఁ డనినమ్మి ప్రత్యేకముగ శివు నారాధించినవారు శైవులు. అట్లే విష్ణు నారాధించినవారు వైష్ణవులు. ఈమతవిశ్వాసము హెచ్చినకొలఁదిని బరమతద్వేషమును బెరుగఁ జొచ్చినది. ఈశైవులును వైష్ణవులును గొలఁదిగనే యుందురు. ప్రజాసామాన్యము శివకేశవులయందు సమానభక్తిగలవారై యున్నారు.

బహుదేవత్వమును విడచి బ్రహ్మమొక్కటియే సత్య మనియు జగత్తు మిథ్యయనియు, నా బ్రహ్మమే దా నని యనుకొనుట, ప్రతి మానవునకును విధ్యుక్త మనియు, బోధించు నుపనిషన్మతమును గౌరవించువా రనేకులున్నారు. యజ్ఞయాగాదివిహితకర్మల నాచరించుచు జన్మసాఫల్యము గావించుకొనుట ధర్మ మని వాదించు కర్మవాదులును గలరు. కాలక్రమమున నీమతము లన్నిటిలోను నంతర్భేదము లేర్పడినవి. శైవులలో, పాశుపతులు, కాలాముఖులు, కాపాలికులు, భైరవులు శాక్తేయులు ననుభేదము లేర్పడినవి. ఇట్లే వైష్ణవులలోను గొన్నియంతర్భేదములు వచ్చినవి. వీరు తమలోఁ దాము గలహించుచుండిరి. ఈమతవివాదము లిట్లుండఁగా నాకాలము

ననీ దేశమున జైనబౌద్ధమతములు బయలువెడలినవి. ఇవి వేదమతము నకు విరుద్ధములైనవి. జైనులును బౌద్ధులును నాస్తికులు: భగవంతునియునికి నంగీకరింపరు. వర్ణాశ్రమాచారధర్మముల నొప్పు కొనరు. సర్వజనసమానమును బోధించుచుండుటచే నీమతము లతిసులభ ముగాఁ బ్రజాసామాన్యమున నలముకొనసాగినవి. పరస్పరవైమనస్య ములతో నున్నశైవవైష్ణవాదిమతము లీకాలమునఁ దమ ప్రాబల్యమును గోల్పోయినవి. జైనబౌద్ధమతముల దాడినుండి సంరక్షించుకొనవలసిన భారము శైవవైష్ణవమతావలంబుల కావశ్యకమయ్యెను. అందులకుఁ గావలసినమహాపురుషు లప్పు డుద్భవించిరి. శైవమతోద్ధారమునకై బసవనారాధ్యుఁడును, పండితత్రయము నుద్భవించిరి. ఇందులోఁ బసవన మతసంస్కర్త. పండితులు ముగ్వురును మతవ్యాపకులు.

బసవన యాంధ్రభాషయందుఁ గావ్యరచనము చేయలేదు. అందుచే నాతనిచారిత్రమును వేఱుగా వ్రాయుటకు నాకావశ్యకము లేకపోయినది. కాని యాతని చారిత్రముతో సంబంధించినగ్రంథములను రచియించినవారిలో నాంధ్రకవులు కొందఱుండుటచే నీ బసవఁ డెవ్వరో తెలిసినఁ గాని, యాకవులచరిత్రములలో నీతనిని గూర్చి వ్రాసినవాక్య ములు సులభముగా బోధపడవు. అందుచే బసవనిచారిత్రమును క్లుప్త ముగా నిట వ్రాయుచున్నాఁడను. ఇతనినిగూర్చి విశేషముగాఁ దెలిసి కొనఁ దలఁచినవారు, పాలకురికిసోమనారాధ్యకృత బసవపురాణమును, శ్రీనాగేశ్వరరావుగారును శ్రీప్రభాకరశాస్త్రిగారును రచించినపీఠికలతో నున్న దానిని జూడవలయును.

బసవన మండగిమాదిరాజను బ్రాహ్మణుని కుమారుఁడు. ఇతనితల్లి మాదమ్మ. వీరి నివాసము కర్ణాటదేశ మండలి హింగుళేశ్వర భాగవాటి యనునగ్రహారము. ఇది శ్రీశైలమునకుఁ బశ్చిమభాగమున నున్నది. నందీశ్వరునియంశచే నీబసవన జనించె ననియప్పటివారివిశ్వా సము. కూడలిసంగమేశ్వరుఁ డీతనిజననకాలమునఁ దపసిరూపమున నాగ్రామము వచ్చి యాశ్వరనివేదనము గానిపదార్థ మేమియు నాశిశు వున కీయరా దని తల్లితోఁ జెప్పెనఁట! తలిదండ్రు లాతనికి బసవేశ్వరుఁ

డని నామకరణము చేసిరి. గర్భాష్టమవత్సరమున నాతని కుపనయనము గావింపఁ దలిదండ్రులు ప్రయత్నించిరి. బసవన యందులకంగీకరింప లేదు. శివునిపై భక్తి గలవానికిఁ గర్మలతోఁ బని లేదనియు, శివ భక్తియే మోక్షదాయక మనియుఁ జెప్పి యుపనయనము చేసికొన లేదు. సరికదా! వర్ణాశ్రమధర్మములను ద్యజించి, వర్ణేతరులయిన శివ భక్తులతో సహభోజనాదులను జేయనారంభించి, తలిదండ్రులను విడి నాగాంబ యనుసహోదరీసహితుఁడై తన మేనమామ యున్న కల్యాణ కటకమునకు వచ్చెను. ఈ కల్యాణకటక మంతకుపూర్వము పశ్చిమ చాళుక్యుల రాజధాని. వారిని జయించి కాలచుర్యులు కల్యాణకటకము నాక్రమించుకొనిరి. బసవన యక్కడకు వచ్చునప్పటి కాపట్టణమును బరిపాలించుచున్నది కాలచుర్యవంశజుఁడగు బిజ్జలుఁడు. బసవన మేనమామ యగుబలదేవదండనాయకుఁడాబిజ్జలునికడ దండనాయ కుఁడుగ నుండెను. ఈబలదేవుఁడు కూడ శివభక్తుఁడు. ఆతనికి గంగాంబ యనునొకతనయ కలదు. ఆమెను భవునకీయ సనియాతఁడు ప్రతిన పూనియుండెను. భవుఁ డనఁగా వీరశైవుఁడు కావలెను. ఇంతలోఁ దన మేనల్లుఁడే తనయొద్దకు రాఁగా వీరశైవుఁ డయిన యాతనికిఁ దన కుమార్తె నిచ్చి వివాహము చేసెను. తరువాతఁ గొన్నాళ్లకు బలదేవ దండనాయకుఁడు చనిపోయెను. బిజ్జలుఁడు బలదేవునిస్థానమును బసవన కొసంగెను. బసవన అధికారములోనికి వచ్చినపిదప శైవమతవ్యాప్తికై విశేషప్రయత్నములు చేయఁ జొచ్చెను. ఆరాజ్యమున నదివఱకు జైన మతవ్యాప్తి యధికముగ నుండెను. బసవన జైనులనందఱిని బాధ పెట్టుచుండెను. ఆబాధలకు భయపడి జైనమతమున నెవ్వరును జేర లేదు సరికదా! అదివఱకు జైనమతమును స్వీకరించినవారుకూడ లింగ ధారణ మొనర్చి వీరశైవమతమును గైకొన నారంభించిరి. రాజభాండా రము నందలిద్రవ్యమును యథేచ్ఛముగా జంగములకొసంగుచు నీతఁడు వీరశైవమతము నభివృద్ధి చేయుచుండెను. వీరశైవమతమునకు లింగ ధారణము ముఖ్యము. అదివఱ కున్నశైవమతమునకు లింగధారణ మావశ్యకము కాదు. బ్రాహ్మణధర్మమును విడువకుండగనే శైవులుగా నుండుట కర్హతను కలిగియుండెడిది. బసవన శైవమతమును సంస్కరించి

నూతన నియమముల నేర్పరచినాఁడు. ఆ నియమములలోఁ బ్రధానమయినవి రెండు. మొదటిది లింగధారణము. వీరశైవమతమును గైకొనినప్రతివ్యక్తియు లింగధారణ మొనర్చితీరవలయును. రెండవది వర్ణాశ్రమాచారపరిత్యాగము. లింగధారణ మొనర్చి వీరశైవమతమును గైకొన్నవాఁడు చండాలుఁడైనను బ్రాహ్మణునితో సహవాస సహపంక్తుల కర్హుఁడు. కర్ణాటదేశమున నతికాలములోనే యీమతము విశేషముగా వ్యాప్తమయ్యెను. బసవనసాహాయ్య ముండుటచే మతము పేరిట నత్యాచారములు జరిగినను వినువారు లేకపోవుచుండిరి. బిజ్జలుఁడు శైవజైనమతములయందు సమానాదరము చూపువాఁడు. అతఁడు జైనుఁడనికొంద అనుచున్నారుగాని, యతఁడు శివాలయముల కొసంగిన ధర్మములనుబట్టి చూచినచో శివమతద్వేషి కాఁడనియు, వీరశైవుఁడై జైనులను హింసించుస్వభావము కలవాఁడు కాఁడనియుఁ దేలుచున్నది. శైవమతనింద యొనర్చువారిని వీరశైవులకు ద్రోహ మొనర్చువారిని జంపివేయుటకుఁ గూడబసవన యంగీకార మొసంగియుండెను. వీరశైవమతధర్మములలో నది యొకటిగా నాకాలమున బరిగణింపఁబడుచుండెను. ఇట్లుండఁగాఁ బిజ్జలుఁ డొకనాఁడు వీరశైవులును బసవనమతములోఁ జేరినవారు నగుయల్లయ్య మధుపయ్య యనువారల కండ్లు కారణము తెలుపకుండగనే పెకికించెనఁట! అందుపై బసవనకుఁ జాలఁగోపము వచ్చెను. శివద్రోహము పెరిగిపోవుచున్నయీకళ్యాణపురమునం దుండనిష్టము లేనివాఁడై యనుచరులతోఁ గూడ నాగ్రామమును విడచి వెడలిపోవుచు బిజ్జలుని శిక్షించుటకుఁ దగిన యేర్పాటులను గావించి మఱిపోయెను. జగదేవుఁ డనుబిజ్జలునిదండనాయకుఁడు బసవనచేఁ బ్రేరితుఁ డయిబసవన యనుచరుల నిరువుర సాహాయ్యముగాఁ గొనియర్ధరాత్రమునఁ గోటలోని కేఁగి బిజ్జలుని పొడిచిచంపెను. బిజ్జలునికుమారులు పగఁ బూని బసవనారాధ్యుని నొకసంవత్సరము దాఁటకుండ వధించి రని కొంద అందురు. బిజ్జలుని కుమారులు వచ్చుచున్నా రనివిని యొకతటాకములోఁ బడి యాత్మహత్య గావించుకొనెనని కొందఅందురు. కొంద ఱాతఁడు స్వాభావికముగానే లింగైక్యముఁ జెందె నని చెప్పుచున్నారు. ఇంకఁ గొంద ఱు

క్రీ. శ. ౧౨౧౭ వఱకు జీవించియుండె నందురు. కాని యది విశ్వసింపఁ దగినది కాదు. బసవనజన్మస్థానము బొంబాయిరాష్ట్రమున బీజపూరు మండలమందలి మనగోలి గ్రామమైయుండుననియునా గ్రామమందలి క్రీ. శ. ౧౧౬౧ నాఁటిమొకశాసనములో బసవనయనునాతఁ డొక యాలయమును నిర్మించెననియు, హారితగోత్రుఁడై నమాదిరాజను నాతఁ డా గ్రామమునకుఁ బ్రభువనియు వ్రాసియున్నదనియు, ప్రభునామమును దరువాతివారు తండ్రినామముగా భావించి యుందురనియు డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్యచరిత్రపీఠికలో వ్రాసి యున్నారు.

"దానిలో (ఆశాసనములో) ఆలయనిర్మాత అయినబసవని గురించి ఉన్నవృత్తాంత మిది :—మనిగవల్లివనూరిలో కశ్యపగోత్రాబ్ధి చంద్రుఁడయినగోవర్ధనుఁ డుండేవాఁడు. అతనికొడుకు రేవదాను రేవ దానుకు నలుగురు కొడుకులు. వారిలో కడపటివాఁడు మహాప్రఖ్యాతి వహించినచంద్రమనుఁడు. అతనికొడుకు బసవఁడు. అతడుసాటిలేని మహేశ్వరభక్తుడు. ఈబసవభాస్కరునివల్ల మనిగవల్లిలోని వనూరు బ్రాహ్మణులహృదయాబ్జములునువికసించినవి. ప్రపంచ మంతా అతనికి తండ్రీ అని ఫాలములమీాద దోసిలొగ్గి నమస్కరించడముచేత అతడు లోకపితయైనాడు. మూడు వేదములపారమితడే. ఆద్యంతరహితుడితడే. జ్యోతిర్లింగస్వరూపుడితడే" అని అందరున్ను జయపెట్టుతూ ఉండగా మనిగవల్లికి కీర్తిప్రతిష్ఠలను తెచ్చినాడు"

పండితారాధ్య చరిత్రపీఠి కపులు ౬౪.

చరిత్రకారులు వ్రాసిన యంశములనుబట్టి బసవనారాధ్యుని క్లుప్తచరిత్రమిది. "బండారుబసవన్న" యనిబసవపురాణాది గ్రంథముల యందీతని వాడియున్నారు. "బండారు" అనునది బసవన యింటిపేరు కాదు. బిజ్జలరాజునొద్ద కోశాధ్యక్షుఁడుగా నుండుటచే నీతని నిట్లుపిలువఁ జొచ్చిరి. భాండాగారాధిపతిని 'బండారువు' అనిపిలచెడివారు. బండారువే క్రమముగా 'బండారు' అయినది. ఏదియెట్లున్నను బసవఁడు వీరశైవమత వ్యాప్తికై జీవితము నంతను ధారపోసినప్రతిభాశాలి. ఇతఁడు గొప్ప

సంస్కర్త. ఈతని మూలమున, నిజాము రాష్ట్రము నందును, కర్ణాటకము నందును లింగాయతమత మేర్పడి యా కాలమునఁ గొంతయభివృద్ధి చెందినది. కాని తరువాత నది యంతగా వ్యాప్తము కాలేదు.

బసవన కాలములోనే మన మల్లికార్జున పండితారాధ్యుఁడును శైవమత వ్యాప్తికై తన జీవితమును ధారవోసినవాఁడు. కాని, బసవనారాధ్యునకును, మల్లికార్జునారాధ్యునకును, ఒక్క విషయమున భిన్నాభిప్రాయము కలదు. బసవనారాధ్యుఁ డుపనయనము చేసికొనక బ్రాహ్మణత్వమును విడనాడి వర్ణాశ్రమాచారధర్మములను ద్యజించి వీరశైవమతమును గైకొనియుండెను. మల్లికార్జునారాధ్యుఁడు శైవమతమునం దెక్కువ నమ్మకము కలవాఁడై లోకమున శైవమతము దప్ప వేఱు మతముండరాదను నాస కలవాఁడే కాని వర్ణాశ్రమాచారధర్మములను ద్యజించుట కిష్టపడని వాఁడు. "భక్తి మీఁది వలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తు, బాయలేను నేను బసవలింగ" యని యాతఁడు చెప్పెనని యందురు.

ఈతని జన్మదేశకాలాదులను దెలుపు నాధారములు లేవు కాని యొక చిన్న పుస్తకమున సీతేఁను గోదావరిమండల మందలి దక్షారామ వాసుఁ డనియు నందలి భీమేశ్వరస్వామి పూజారి యగు భీమన యీతని తండ్రియనియు, కోటిపల్లి యారాధ్యునికి తేఁడు శిష్యుఁడనియు వ్రాయఁబడి యున్నదఁట. పండితారాధ్యచరిత్రమునఁ గూడ నట్లే యున్నది.

"నొసఁగెడ వేంగీమహోర్వీస్థలమున
నసమానలీల దక్షారామ మొప్పు
నప్పురంబున సముద్యన్మహామహిమ
నొప్పు శ్రీభీమేశ్వరోరులింగంబు
రూఢిఁ దద్దేవుపురోహితశ్రేష్ఠుఁ
డీడితవిద్వన్మహిష్ఠుండు వీర
భక్తిసత్తముఁడు సద్బ్రాహ్మణోత్తముఁడు
వ్యక్తవాసనవంశవర్ధనకరుఁడు
వాత్రుండు భీమన పండితేంద్రుండు

పుత్రార్థియై మమ్ము భువి భజింపుచును
సన్నిధి నొకపురశ్చరణ గావింపు
చున్నవాఁ డతనికి నుదయింపు మనుఁడు
ననురక్తి సాష్టాంగుఁడై యేగుదెంచి
జనియించె భీమాఖ్య సాధ్వి గౌరాంబ
మల్లికార్జున దేవు మహనీయునామ
మగుటఁ బండితమల్లికార్జునుం డనఁగ
యనఘుఁడు గోటిపల్ల్యారాధ్య దేవ
దేవుని సత్కృపాదృగ్విలోచనను
ధావార్ధి మధ్యగతక్రీడవలన"

ఈగ్రంథము పండితునితరువాతఁ గొలఁదికాలములోనే సోమనాథుఁడు వ్రాసియుండుటచే నిందలివిషయములు సత్యములని తలంపవచ్చును. పూజారిని పురోహితుఁడుగా నిందుఁ జెప్పియుండవచ్చును. ఈదేశమున శివాలయములలో సామాన్యముగా "శివార్చకు" లనుతెగవారు పూజారులుగా నుందురు. ద్రాక్షారామభీమేశ్వరస్వామికిఁ బూర్వమునుండియు వెలనాఁటిబ్రాహ్మణులు పూజారులుగా నున్నారు. కావున నీమల్లికార్జునారాధ్యులు వెలనాఁటిబ్రాహ్మణుఁడై యుండు ననియూహ కలుగుచున్నది. ఆంధ్రదేశమున వెలనాఁటిబ్రాహ్మణులలో శివభక్తికలవారు పెక్కురున్నారు కాని యారాధ్యుల ననిపించుకొని పరమద్వేషమును గలిగియున్నవారు గన్పడరు. అందుచే నీతఁ డేశాఖా బ్రాహ్మణుఁడో నిశ్చయింపలేము. ఈపండితారాధ్యునివంశములోనివార మని చెప్పుకొనెడివారిప్పు డారాధ్యనియోగిబ్రాహ్మణులలో నున్నారు.

ఈ మల్లికార్జునారాధ్యు లాంధ్రమున "శివతత్త్వసార" మను నొకగ్రంథమును రచియించెను. గ్రంథమంతయుఁ గందపద్యములు. ఎన్నిపద్యముల నీతఁడు రచించెనో తెలియదు. ఆంధ్రసాహిత్యపరిషత్తు వారు ప్రకటించినప్రతిలో ౪౯౦ పద్యము లున్నవి. ఈపుస్తకమునకు బ్ర. శ్రీ. కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులుగారు విపుల మగుపీఠికన్ను

వ్రాసియున్నారు. ఈగ్రంథము నీతఁడు రచించె ననుట క్రిందిపద్య మాధారము.

క. ఒండేమి? మల్లికార్జున
పండితుఁ డన నుండు కంటెఁ బ్రమథులలో నె
క్కొండొ కఁడో నియోజ్ఞో న్నతి
నుండఁగఁ గాంతు నని కోరుచుండుడు రుద్రా!

ఈ కవిచారిత్రమునే, పాలకురికిసోమనాథుఁడు "పండితారాధ్య చరిత్ర" మను పేర ద్విపద కావ్యముగా రచియించెను. అం దీతఁడు శివ తత్త్వసారమును రచియించె నని యీక్రింది ద్విపదలలోఁ జెప్పి యున్నాఁడు.

ఈక్షితిఁ జనుపూర్వపక్షసిద్ధాంత
పక్షముల్ తత్కర్మభాగైకపూర్వ
పక్షే తరజ్ఞానపక్షసిద్ధాంత
పక్ష వేదార్థోపపాదితపరమ
శైవాత్మకాచారసంసిద్ధిశుద్ధ
కేవలభక్తిసద్భావనోపేత
వీరమాహేశ్వరాచారమార్గాను
సారియైన "శివతత్త్వసారసత్కృతిని
గాదె కేవలభక్తిగతిఁ బ్రతిష్ఠించి
యాదటఁ దానును నట్ల వర్తించు
చున్నవాఁ డని వెంకియుఁ బ్రశంసింప
మన్నన పేర్మిన మల్లికార్జునుఁడు

ఈ మల్లికార్జునపండితారాధ్యుని సామర్థ్యాదులను పాల్కురికి సోమనాథుఁడు క్రిందిపద్యములలో ననుభవసారమునఁ జెప్పియున్నాఁడు.

సీ. శ్రుతి ఏక ఏవ రుద్రో నద్వితీయాయ
తస్థే యనుట యథార్థంబు దలఁప
నవల న ణోరణీయా న్మహతో మహీ
యానన నదియె యనూనపదము
రహి నయే వాగ్గోచరం బను అవ్యాప్త
మనసాసహ యనుమాట నిజము
యేదియుఁ గా దని యెడిపర మేశుఁడే
యెంతయు నని యెర్గి యెఱుఁగ నసక
యెట్లు లనుచు సంశయింపక శివతత్త్వ
సారగద్యపద్యసమితి శివుని
మహిమఁ దెలిసినట్టిమల్లికార్జునపండి
తయ్యగారి దలంతు ననుదినంబు.

పండితయ్య రచించిన శివతత్త్వ సారము గద్య పద్యాత్మకమని యీ పద్యమునఁ జెప్పఁబడినది. కాని యాగ్రంథమున పద్యము లేకాని గద్యలు లేవు.

సీ. వేదముల్ ధరసర్వ వ దేష్వధీతో భవ
యనఁగఁ బరగు లింగ మతిశయిల్లు
నెఱి శ్వపచోపి మునిశ్రేష్ఠ నమోస్తు లిం
గార్చనేరత యన నట్లు నమ్మి
ప్రీతి నరుద్రై గ్నిభూత లే యని తత్ర
సన్నిహి తస్మిన యన్న యదియు
తగ నచపూజ్యో యథావ్యహంబనె నని
నేత్రాంగవిక్రయాపాత్ర మగుచు
జంగమంబు గాంచి చని లింగపరవశ
భాతి నుభయలింగభక్తి యుక్తి
మహిమఁ దనరి నట్టిమల్లికార్జునపండి
తయ్యగారి దలఁతు ననుదినంబు.

సీ. ఆది రుద్రేశా త్తమశ్నంతి రుద్రేణ
పీతం పిబతి ప్రఖ్యాతిశ్రుతులు
తన్నిగమాంతార్థమతికిల్బిషంశ్యాద
నర్పితం బనియు సిద్ధాంతములను
అవికల సిద్ధాంత నివహోక్తిలోభాన్న
ధారయే త్తనుశివధర్మములను
శివధర్మశాస్త్రదృష్టిప్రసాద మేవభో
క్తవ్య మనుపురాణకాండములను
సిద్ధ మనుచు వేదసిద్ధాంతశాస్త్రపు
రాణతతుల మలహరప్రసాద
మహిమఁ దెలిపి నట్టిమల్లికార్జునపండి
తయ్యగారిఁ దలఁతు ననుదినంబు.

ఒకప్పుడు బ్రాహ్మ్యధర్మమును విడిచి వీరశైవమతమును గైకొను మని మల్లికార్జునపండితునకు బసవన వర్తమాన మంపెనఁట! అందుపైని పండితుఁడు పైన వ్రాసినట్లు "భక్తిమీఁదివలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తు బాయలేను నేను బసవలింగ" యని ప్రత్యుత్తర మంపి, బసవనతోఁ జర్చించి యాతని నెట్లయినను దనమార్గమునకుఁ ద్రిప్ప వలయు నను నుద్దేశముతో బసవనను దర్శించుటకై పయనమై వెళ్లె నఁట. పండితారాధ్యుఁ డమరావతిలో నుండఁగా బసవేశ్వరుఁ డతనికి భస్మము నంపెను. అచ్చటనే యాతఁడు కర్ణాటమునఁ గవిత్వము చెప్ప మొదలిడెనఁట. పండితారాధ్యులవారిమాహాత్మ్యమును దెలుపు పెక్కుకథలను శైవులు చెప్పుచుందురు. వాని నిట చెప్పుటకు దొరకొంటినేని యది యెంతయో గ్రంథ మగును. అందులకు పండితారాధ్యచరిత్రము మొదలగుగ్రంథము లున్నవి. అందుచే నాకథలను విడిచి, శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు శివతత్త్వసార పీఠికలో వ్రాసిన యొకటిరెండుకథలను వారిమాటలలో నిట నుదాహరించెదను.

"సనదవ్రోలు (చందవోలు) అను గ్రామమునందు వెలనాటి చోడుఁ డనురాజు రాజ్యము చేయుచుండెను. చందవో లిప్పుడు గుంటూరుజిల్లా తెనాలితాలూకాలో నున్నది. పూర్వము వెలనాటి రాజులరాజధాని. ధనదపుర మని దానికి నామాంతరము. పండితారాధ్యుఁ డాగ్రామమునకుఁ బోయి తనమతమును బోధింపసాగెను. అచ్చటిరాజు గురువు బౌద్ధుఁడు. అతనిపేరు బౌద్ధపదవదాచార్యుఁడు. ఈతఁడు బ్రహ్మవంశజుఁడట! తాను రాజునకు గురువుగా నుండఁగా నన్యమతస్థుఁ డారాజధానిలో మతబోధ చేయుట చూచి సహింప నోపక యాబౌద్ధుఁడు రాజుతోఁ జెప్పి యొకగొప్పసభ చేయించి మల్లికార్జునపండితారాధ్యు నాసభకు రప్పించెను. ఆసభకు నద్వైతులు జైనులు సాంఖ్యులు చార్వాకాది నానామతములవారు వచ్చియుండిరి. పండితుఁడు బౌద్ధమతము నితరమతములను దనపాండిత్యమహిమచే ఖండించి తనమతమును స్థాపించెను. ఇంతియకాక శివుఁడు శ్రేష్ఠుఁ డనుటకుఁ దనతల యిచ్చెద ననియు, మంటలో దుమికెద ననియుఁ జెప్పి శివునికంటె నెక్కుడు దైవముకలఁ డని యెవ రైనను జెప్పిన యెడల, వారితల తనకాలితోఁ దన్నెద నని ప్రతిజ్ఞచేసి తనసిద్ధాంతమును నిలుపుకొనుటకై "రుద్రమహిమ" యనుకృతిని రచించెను. అంత బౌద్ధుఁ డేమియుఁ బ్రత్యుత్తర మీయఁజాలక పండితుని నిందించెను అందఱును వెడలిపోయిరి.

కాని బౌద్ధుఁడు పండితుని నిందించినందున నాతనిశిష్యులకు మిక్కిలి కోపము వచ్చెను. 'అట్టినిందకుని జంప కున్నయెడల నతఁడు ద్రోహికాఁడు; తామే ద్రోహుల మగుదుమని వారు తలంచిరి. పండితునిశిష్యులలో రేమయ్య దేవయ్య లనువా రీపనికిఁ బూనుకొనిరి. సముద్రములోని యొకలంకలో (సముద్రము చందవోలునకుఁ దొమ్మిది మైళ్ల మీఁద నున్నది.) నొకబౌద్ధాలయ ముండెను. అచ్చటి కాబౌద్ధుఁడు ప్రతిదిన మొక్కఁడు వెళ్లివచ్చుచుండును. ఆసంగతి తెలిసినవారు గావున నొకనాఁ డుదయముననే రేమయ్య దేవయ్యలా లంకకు నెవరికిఁ దెలియకుండఁ బోయి దేవునిమఱుఁగున డాగియుండి

బౌద్ధుడు వచ్చి బుద్ధవిగ్రహమునకు జాఁగిలి మ్రొక్కునప్పుడు వానిని జంపి వికృతరూపునిఁ జేసి వెడలిపోయిరి. ఈ సంగతి తెలిసి రాజు మిక్కిలి కోపించి పండితయ్యను బిలిపించి యడుగఁగా నతఁడు. 'నేనే చేయించితిని; నేనేచంపించితి' నని దోషమంతయుఁ దనమీఁద మోపు కొనియెను. అంత రాజు పండితునికనులు తీయింపఁగా నతఁడు రాజు నకు శాపము పెట్టి యచ్చటనుండి శిష్యయుక్తముగా నమరావతికి వెడలిపోయెను.

చందవోలులో నున్నప్పుడే యాతఁడు "లింగోద్భవగద్య" యచ్చటిదేవునిపైఁ జెప్పెను. లింగోద్భవుని దేవాలయ మిప్పటికిని జందవోలులో నున్నది. 'చందవోలు కైఫీయతు' అనుపుస్తకము నందు నీకథయే యిట్లున్నది. పండితారాధ్యుఁడు శ్రీశైలమునకుఁ బోవుచు చందవోలునకు వెళ్లి పాండీశ్వరస్వామి గుడిలో దిగెను. కొండపడమటి బుద్ధరాజునకు గురువైనబౌద్ధుఁడు బుద్ధాం అనుగ్రామమం దుండెను. వాఁడు పండితునిమహిమను జూచి యోర్వలేకపోయెను. పండితుని ప్రతిదినశివపూజలోఁ గావలసినయొకపూజాపాత్రను బౌద్ధుని శిష్యుఁ డైన చెజుఁడనువాఁ డెత్తుకొనిపోయెను. పండితునిశిష్యులు వానిని బట్టుకొని చంపిరి. ఈసమాచారము వారు తమగురువునకుఁ జెప్పలేదు. అంత బుద్ధరాజు పండితునివద్దకు మనుష్యులను బంపి నర హంతకున కేమిశిక్ష శాస్త్రీయ మనియడుగఁగాఁ గనులుతీయుటయే తగినశిక్ష యని పండితుఁడు చెప్పె నట. దానిపై బుద్ధరాజు పండితుని కనులు తీయించెను. పండితుఁ డాతనికి శాప మిచ్చి యిఁకమీఁద శైవు లెవరును చందవోలులోఁ దీర్ఘము పుచ్చుకొనఁ గూడ దని నియమించి వెడలిపోయెను.

అమరావతి చేరగనే పండితుఁడు చోడునితో భాషించినపాపము పోవుటకును శివనింద విన్నపాపము పోవుటకును శివభక్తులసహస్రన నామగణమాలిక పఠించెను అమరేశ్వరాష్టకముఁ జెప్పెను.

కన్నడభాష తనకు రావలయు నన్నకోర్కెతో నీతఁడు కల్యాణమునకు బసవేశ్వరునియొద్దకు వర్తమాన మంపెను. అంత నాతఁడు భస్మ మంపెను దానిని ధరింపఁగనే పండితునకుఁ గన్నడభాష వచ్చెను. అతఁ డాభాషలోఁ గొన్నిగీతములను చెప్పెను. తరువాతఁ బండితుఁడు బసవేశ్వరుని జూడవలయునని కల్యాణపురమునకు బయలు దేరెను. త్రోవలో సారంగేశ్వరుఁడు దేవుఁడు గాఁగల నిడుగుము లను చోట (1) తనముఖ్యశిష్యుఁ డగుదోనయ్యాగారికి నన్న యైనవీరచాకి రాజయ్యాగారిచే గౌరవింపఁబడి పానుగంటికిఁ (2) బోయెను. అచ్చట నుదయుఁ డనురాజు నొద్దనున్న పింగలి గోవిందప్రధాని పండితుని భక్తుఁడు. కావున నాతనిని మిక్కిలి మర్యాదతో నెదుర్కొని తన యింటికిఁ దోడ్కొనిపోయెను. అచ్చట ధవళేశునామయ్య యను భక్తుఁడు కలఁడు. ఇతఁడు రాజునొద్ద స్వంతసేవకుఁడు (ఖాసా) పండితుఁ డాగ్రామమునకు వచ్చినప్పటినుండియు నాతనిభజనలోనుండి రాజుసేవ సరిగఁ జేయకుండెను. అంత రాజునకుఁ గోపము వచ్చి యాతనిని బిలిపించి కోపపడఁగా దేహము మాత్రము మీది గాని ఆత్మ మీది కాదు. మీ దేహమును మీరు తీసికొండని గుడిశిఖరము మీఁదికెక్కి యురిపెట్టుకొని చచ్చెను. అంతఁ బండితుఁ డారాజునకు శాపము పెట్టి వెడలిపోయెను.

---

(1) "నిడుగుడుములు అనునది యిప్పుడు కృష్ణాజిల్లా నందిగామతాలూకా మునగాల జమీందారీ లోని ముఖ్యగ్రామ మగు 'నడిగూడెము' అని నాతాత్పర్యము. ముదమున నిడుగుడుములకు నేతెంచి సదమలాత్ముఁడు వీరచాకిరాజయ్య ప్రవ్యక్తభక్తిసాంరంగేశునందు (మహిమ. పుట-౫౨) అని చెప్పఁబడి యున్నది. ఇప్పుడు నడిగూడెము అనఁబడుగ్రామమునకు 'నడిగుడుములు' అని పూర్వము లెక్కలలోఁ జేరుఁగలదు. ఇచ్చటిదేవుఁడు సారంగేశ్వరుఁడు: ఇది యమరావతినుండి పానుగంటికిఁ బోవుత్రోవలో నున్నది.

(2) నైజాము రాజ్యమునందు రెండుపానుగల్లు లున్నవి ఒకటి నల్లగొండ జిల్లాలోనను వేఱొకటి మహబూబ్‌నగరుజిల్లా నాగర్‌కర్నూలుతాలూకాలోను కలదు. ఉదయుచోడుని స్థలమునుబట్టి నాగర్‌కర్నూలుతాలూకాలోనిదే పండితుఁడు వెళ్లినపానుగల్లని నిశ్చయింపవచ్చును. ఇం కొకపానుగల్లు (హానుగల్లు) బొంబాయిరాజధానియందు ధార్వాడజిల్లాలో గలదు.

వసిపురములో శంకరయ్య యనుభక్తుని సపర్యలఁ గొనికల్యాణమునకుబయలు దేఱఁగా నంతకుఁ బూర్వ మెనిమిది దినములక్రింద బసవేశ్వరుఁడు లింగైక్యముఁ జెందె నన్నసమాచారము త్రోవలోఁ దెలిసి పండితున కమితఖేదము కలిగి యాతఁడు బసవనిఁ బొగడుచుఁ బ్రలాపించెను.

అంతఁ బండితుఁడు శ్రీశైలపర్వతమునకుఁ బోయెను. వెల్లటూరు (1) నొద్దకు వచ్చి తా నచటనే యుండి తనప్రియశిష్యుఁ డైన దోనయ్యను గిరిప్రదక్షిణముచేసి శివరాత్రివఱకు శ్రీశైలముపైకిఁ బోయి తనవ్రతమును బూర్తిచేయు మని చెప్పి యతనికి పర్వతవర్ణనము నుడివెను. అతఁడు గిరిప్రదక్షిణము చేసి వచ్చినతరువాతఁ బండితుఁడు తాను వచ్చినపని యైన దనియు; బసవేశ్వరుఁడును బోయెను గనుకఁ దా నుండనక్కఱ లే దనియు, నీశ్వరుని బ్రార్థన చేసి భార్యాపుత్రులతో వెల్లటూరులోనే లింగైక్యముఁ జెందెను.

పండితేంద్రుఁడు మరణసమయమునకు వృద్ధుఁ డైనట్లు మనము తలంపవచ్చును.......పండితునిమరణము బసవేశ్వరునితరువాతఁ ద్వరలోనే తటస్థించె నని మన మెంచినయెడల, క్రి. శ. ౧౧౯౦ ప్రాంత మతనిమరణకాల మని నిర్ణయించుకొనవచ్చును. అప్పటి కాతఁడు ౭౦ ఏండ్లవాఁ డని యెంచినయెడల క్రి. శ. ౧౧౨౦ ప్రాంత మాతనిజన్మకాల మగును. ఇట్లీతఁడు మొదటివెలనాటిచోడునికాలమునను, రెండవవెలనాటిచోడునికాలమున నుండిన నుండవచ్చును.”

ఈమల్లికార్జునపండితు లాజన్మాంతము బ్రాహ్మణుఁడుగనే యుండెను. కాని జంగముఁడు కాలేదు. శిఖాయజ్ఞోపవీతములను విసర్జింప లేదు. వానిని విసర్జించుట యాతని కిష్టము లే దట్లాతఁడు రచియించినశివతత్త్వసారమునందే యున్నది. పండితారాధ్యచరిత్రమును

---

(1) గుంటూరుజిల్లాలో రెండు వెల్లటూళ్ళు కలవు. ఒకటి రేపల్లెతాలూకాలోను, ఇంకొకటి వినుకొండ తాలూకాలోను, నైజాము రాజ్యమునందు నల్లగొండ జిల్లాలోఁగూడ నొకవెల్లటూరు కలదు కాని శ్రీశైలమునకు సంబంధించినది వినుకొండతాలూకాలోనిదియే ఇది వినుకొండనుండి శ్రీశైలమునకుఁబోవు త్రోవకు నాలుమైళ్ళ ప్రక్కగ నుండును.

గన్నడమున నీలకంఠకవియు, సంస్కృతమున గురురాజకవియురచి యించియున్నవారఁట. శ్రీనాథమహాకవి పాల్కురికిసోమనాథునిద్విపద కావ్యమునుబట్టి యాంధ్రమునఁ బద్యకావ్యముగాఁ బండితారాధ్యచరి త్రమును రచియించెను. కాని యది యిప్పుడు లభ్య మగుటలేదు. మల్లికార్జునపండితుల వంశము లోనివా ర మనిచెప్పుకొనువా రాంధ్ర దేశమునఁ గొంద ఱున్నారు. వా రిప్పుడారాధ్యనియోగిబ్రాహ్మణు లని పిలువఁబడియెదరు. వారు లింగధారణ మొనర్చెదరు. పండితారా ధ్యులు లింగధారణ మొనర్చి నట్లు కన్పట్టదు. ఈవంశీయులు శిఖా యజ్ఞోపవీతముల నుంచికొని వేదబాహ్యులుకాక బ్రాహ్మణులుగనే యుండి, శైవాచారముల ననుష్ఠింపుచు, లింగధారణ మొనర్చుచు న్నవారు.

మల్లికార్జునపండితులు 'వానస' గృహనామము వారనియు ఋగ్వేదు లనియు చందవోలు కైఫియ్యతునందున్నది. వీరిది గౌతమ గోత్రమందురు. కాని నిశ్చయముగాఁ జెప్పలేము. ఈతనియింటిపేరు వానస యనిపండితారాధ్యచరిత్రమునఁగలదు. మడికిసింగనకవికృత పద్మ పురాణమును గృతినందిన కందనమంత్రి యింటిపేరుకూడ వానస వారే. కాని వారిది కాశ్యపగోత్రము. రాజరాజుచేత నందంపూడి యగ్రహార మును బడసిన నారాయణభట్టుగృహనామముకూడ "వానస" యే. ఆత నిది హారితసగోత్రము. వానసవారిలో వసిష్ఠగోత్రులుకూడఁ గలరు.

ఈమహాపండితుఁ డాంధ్రమునను, సంస్కృతమునను కన్నడము ననుగూడఁ గొన్నిగ్రంథములను రచియించెను. శ్రీముఖగద్యము, హార లీల, లింగోద్భవుదేవుగద్యము, అమరేశ్వరాష్టకము, పర్వతవర్ణనము, గణసహస్రనమాల, రుద్రమహిమ, బసవమహిమ ప్రభులింగస్తోత్రము నను కృతులను రచియించినట్లు పండితారాధ్యచరిత్రమువలనఁ దెలియు చున్నది. ఇవి చిన్నచిన్నగ్రంథము లని తోఁచుచున్నది. ఈతనిరచనము లింకను గల వని కొంద ఱనుచున్నారు. కాని నా కవి లభింపలేదు. ఇందు బసవగీత ప్రభులింగస్తోత్రము కన్నడగ్రంథములు. శివతత్త్వసార శైలిచూపుటకై కొన్నిపద్యముల నిటవ్రాయుచున్నాఁడను.

క. వేదోక్తమార్గమున న
త్యాదరమున నిన్నుఁ గొలిచి యప్పశువులు నీ
చే దేహపాశబంధ
చ్ఛేదంబున ముక్తు లగుట సిద్ధము రుద్రా!

క. జీవునకు బంధమోక్ష ద
శావస్థలు గలవు నీకు నవి లే వగుటన్
జీవునకు నీకు నైక్యము
భావించుట ముఖ్యవృత్తిబాధకము శివా.

క. అనయము రుద్రాక్షవిభూ
తినియుక్తులయిండ్లదిక్కు దెసఁ బోవకుఁ డో
యని చాటించును గాలుఁడు
తనపురి శివశాసనుండు ధన్యుం డగుటన్.

మల్లికార్జునపండితారాధ్యు లవలంబించిన శైవమతపద్ధతినిగూర్చి క్లుప్తముగాఁ బైన వ్రాసియుంటిని. ఆతని యభిప్రాయములను, ఆ కాలము నాఁటి యితరమతధర్మములను నందుపండితారాధ్యులు గావింపయత్నించిన సంస్కరణములను విపులముగాఁ దెలిసికొనఁ గోరువారు శివతత్త్వ సారమును పరిశీలనాబుద్ధితోఁ జదువవలసియున్నది. పండితుని కాలమున జైనచార్వాకబౌద్ధమతములు ప్రబలియున్నట్లును వానిని ద్వేషించి యాతఁడు శైవమతమును జేపట్టెననియు స్క్రిందిపద్యము వలనఁ దెలియు చున్నది.

క. శ్రుతిబాహ్యంబులు కావున
సతతంబును జైనబౌద్ధచార్వాకులమ
ర్మతములు పట్టక పట్టితి
శ్రుతిసారభవన్మతంబు సుమతి మహేశా!

క. ప్రాజ్ఞులు దేవజ్ఞులు లో
కజ్ఞులు చేకొంద్రె గతశిఖాగాయత్రీ
యజ్ఞోపవీతనాస్తిక
లజ్ఞులు చేకొంద్రు గాక యద్వైతమజా!

పండితారాధ్యునకు జ్ఞానమార్గ మంగీకారమే కాని యద్వైత మంగీకరింపఁడు. జ్ఞానమార్గమునకంటె భక్తిమార్గమే శ్రేయస్కరమని యాతనియభిప్రాయము.

బసవనారాధ్యుఁడు క్రీ. శ. ౧౧౭౯ ప్రాంతమున లింగైక్యము నందెనని చరిత్రకారు లేకగ్రీవముగా నుడివియున్నారు. ఆతనియనంతరమున నీపండితారాధ్యులు ౨౨ సంవత్సరములు జీవించియుండి ౧౧౯౦ ప్రాంతమున మరణించియుండునని శ్రీ లక్ష్మణరావుపంతులు గారును ౧౧౮౦ ప్రాంతముననే లింగైక్యము నొందియుండునని మఱి కొందఱును వ్రాసియున్నారు. కాని యీతఁడు క్రీ.శ. ౧౧౮౦ వఱకును జీవించియుండునని నాయభిప్రాయము. అప్పటి కీతనికి ౭౦ సంవత్సరములవయ సుండునని చరిత్రకారులందఱు నంగీకరించుచున్నారు.

వెలనాటిచోడులలో మొదటియాతఁడు క్రీ. శ. ౧౧౧౧ మొదలు ౧౧౩౫ వఱకును రెండవయాతఁడు ౧౧౬౩ నుండి ౧౧౮౦ దనుకను రాజ్యము చేసియుండుటచే పండితారాధ్యులు వాదమున నోడించినది రెండవవెలనాటిచోడునియాస్థానమున నున్నబౌద్ధులనే యని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఈతఁడు రచించినశివతత్త్వసారమును శతక మనియనియెదరు. కాని సామాన్యశతకలక్షణములిందు లేవు. శతకములయందు సామాన్యముగాఁ బ్రతిపద్యమునను నంత్యమున నొకపదమో కొన్నిపదములో నియమముగా వచ్చుచుండును. దానినా శతకమునకు మకుట మందురు. ఈశతకమున నట్టినియమము లేదు. అజా "శివా" ఇత్యాదిపదములలో శివునిసంబోధన ముండును. కొన్నిపద్యములలో నట్టిసంబోధనమును లేదు. అయినను దీనిని శతకమనియే పాల్కురికి సోమనారాధ్యుఁడు—

"శతకంబు శివతత్త్వసారంబు దీప
కళికమహానాటకము నుదాహరణ"

అని పండితారాధ్యచరిత్రమున వ్రాసియున్నాఁడు అనికొందఱను చున్నారు. కాని "శతకంబు" అనుపదమును శివతత్త్వసారమునకు విశేషణముగాఁ జేయరాదనియు మల్లికార్జునపండితారాధ్యులు శ్రీగిరి

మల్లికార్జునశతకము నొకదానిని వ్రాసియున్నారనియు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు భారతిలో వ్రాసియున్నారు. అదిసత్యమే. ఆశతక మిప్పుడెచ్చటను గానరాదు.

పండితారాధ్యులతనయులనుగూర్చియు మనుమలనుగూర్చియు పాలకురికిసోమనారాధ్యునిచరిత్రమునవ్రాసెదను. పండితారాధ్యులకు విభూతి గౌరయ్యయనుశిష్యుఁడొకఁడుండెనఁట. అతనిశాసనములుకొన్నియున్నవి.

(A. R. 315 of 1930–31:–A. R. P. 116-117 (1925-26).

ఇతఁడువరంగల్లునకుసమీపమున నున్న మాచిరాజుపల్లెవాస్తవ్యుఁడు. పండితారాధ్యులవారియొద్ద శ్రీగిరిపర్వతముమీఁద వారియింటిసేవకుఁడుగానున్నట్లు, ఆశాసనమువలన దెలియుచున్నది. ఆశాసనములలోఁగాల మీయలేదు. దీనినిబట్టి యారాధ్యులవారు శ్రీశైలమునందేఁ గాపుర ముండినట్లు గన్పట్టుచున్నది.

## 17. రుద్రదేవ మహారాజు

ఆంధ్రదేశమును బరిపాలించినకాకతీయరాజులలో నీతఁడొకఁడు. ఈ కాకతీయులు సూర్యవంశక్షత్రియులమని చెప్పుకొనుచు వచ్చిరి. కొంతకాల మట్లు శాసనములలోఁ గూడ వ్రాసికొనియున్నారు. కాని చరిత్రకారులు పరిశోధనచేసి వీరు శూద్రు లని యిప్పుడు నిశ్చ యించిరి. కాకతియనుదేవతాప్రసాదముచే నీవంశమున మూలపురుషుఁ డొక గుమ్మడితీగెకు బుట్టినవాఁ డగుట వీరు కాకతీయు లై రని యొకకథయు, శత్రురాజులభీతిచే నొకశిశువును గుమ్మడిపండులోఁ బెట్టి కోటదాటించి యావలకుఁ బంపుటమూలమున రక్షింపఁబడినవాఁడు మూలపురుషుఁ డగుటచే నీవంశమువారు కాకతీయు లై రని యొకకథయు నిట్లే వేఱువేఱు కథలు వీరిపూర్వచారిత్రమును గూర్చి ప్రచారములో నున్నవి. వీరు మొట్టమొదట పశ్చిమచాళుక్యులకు సామంతు లై నను, క్రమ క్రమమున స్వతంత్రు లై యించుమించుగ మూఁడువందలసంవత్స రములు క్రి. శ. ౧౦౦౦వ సంవత్సరము మొదలు ౧౩౩౦వ సంవత్సర ప్రాంతమువఱకును ఆంధ్రదేశమును బరిపాలించియున్నారు. అవక్రపరాక్రమముచే నాంధ్రదేశమునే కాకుండ కర్ణాట, కళింగ,

ద్రావిడాదిదేశములలోఁ గూడఁ గొంతకాలము కాకతీయులు తమరాజ్య మును విస్తరింపఁజేసి యుండిరి. వారిచరిత్రలను వ్రాయుటకిట తావు లేదు. శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు కాకతీయాంధ్రరాజ యుగచరిత్రమును దాదాపు ౬౦౦ పేజీలగ్రంథముగా వ్రాసియున్నారు. ఈకాకతీయులనుగూర్చి యింక ననేక గ్రంథములున్నవి. వీరు మొదటి నుండియుఁ దా మాంధ్రుల మని చెప్పుకొనుచు వారిశాసనములలో నాంధ్రులమని యుదాహరించుకొని యున్నారు.

ఈ రుద్రదేవమహారాజు తండ్రి ప్రోలరాజు. తల్లి ముప్పమదేవి. ఇతఁడు నిజాంరాష్ట్రమునందలి యోరుగల్లు రాజధానిగా నాంధ్రరాష్ట్ర మును హూణశకము ౧౧౬౦ మొదలు ౧౧౯౭ వఱకును పరిపాలించుచు బలాక్రమవంతుఁడై రాజుల ననేకులను జయించి, కీర్తివడసినవాఁడు. ఇతనిని ప్రతాపరుద్రమహారాజునికూడ వాడుచుందురు. కాకతీయ ప్రభువులలో క్రీ. శ ౧౨౯౭ మొదలు ౧౩౨౬ వఱకు రాజ్యమును జేసిన యిఁకనొక ప్రతాపరుద్రుఁ డుండుటచే నీరుద్రదేవమహారాజును మొదటిప్రతాపరుద్రుఁ డనియు నాప్రతాపరుద్రుని ద్వితీయప్రతాప రుద్రుఁ డనియుఁ జరిత్రకారులు వ్రాయుచున్నారు. ఈ మొదటిప్రతాప రుద్రమహారాజు కవిపండితపోషకుఁ డయి యశస్సు నార్జించుటయే గాక స్వయముగాఁ గావ్యరచనము చేసినవాఁ డని చెప్పుదురు. ఇతఁడు సంస్కృతమున నీతిసార మనుగ్రంథమును చేసినట్లీ క్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది.

చ. పరువడి నాంధ్రభాషఁ గలబద్దెననీతియు సంస్కృతంబులోఁ
  బరఁగఁ బ్రతాపరుద్రనరపాలునిచే రచియింపఁబడ్డయా
  నరవరునీతిసారము వినం జదువం గడుమంచి దంచుఁజె
  ప్పెరఁ గవి నీతివద్ధతులు చేసె వినోదము బాలబోధకున్.

ఈ రుద్రదేవమహారాజు సంస్కృతముననే కాకుండ నాంధ్ర మునఁగూడ నీతిసారమును రచించె నని మానవల్లి రామకృష్ణకవిగారు బద్దెనకృతమైన నీతిశాస్త్రముక్తావళిపీఠికలో వ్రాసియున్నాఁగ. మడికి సింగనకవి తనసకలనీతిసమ్మతమున నీతిసారములోని వని కొన్నిపద్య

ముల నుదాహరించియున్నాఁడు. కాని నీతిసారకృతికర్త యెవ్వరో యతఁడు చెప్పలేదు. ఆంధ్రకావ్యకర్త లెవరును నీరుద్రదేవుని దమ గ్రంథములలో స్మరించియుండలేదు. అయిన నాంధ్రనీతిసారకృతికర్త లెవరైన నేర్పడువఱకు నాకర్తృత్వ మీతనిపైన నుంచవచ్చును. ఈరుద్రదేవమహారాజు సంస్కృతమున మఱికొన్ని గ్రంథములను రచియించి యుండెనని చెప్పుదురు. అవి గన్పడుట లేదు. నీతిసారమునందలి కొన్ని పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

గీ. ఆజ్ఞ లేనినృపుఁడు నరయఁ జిత్తరువులో
నున్నరాజుఁ జూడ నొక్కరూప
యాసఁ ద్రోయు సుతుని నైనను దండింప
కున్న రాజ్య మేలనుండుఁ జెడక.

క. దండము లేకున్నను బ్రజ
లొండొరువుల నాక్రమింతు రుచితస్థితిమై
నుండవు వర్ణాశ్రమములు
దండింపని భూమిపతికి ధర యేర్పడునే.

క. జనపతి పర్జన్యునిగతిఁ
దనభూప్రజఁ బోవవలయుఁ దగఁ బ్రోవఁడయేఁ
దనుఁ బాసిపోవు నాప్రజ
ఘననీరసనరసిఁ బాయుఖగములభంగిన్.

క. ఆపదలఁ జెందు ప్రజలను
భూపతి మొదలిచ్చి మగుడఁ బ్రోవఁగఁ జనుఁ దాఁ
జేపట్టి విడువవలవదు
భూపతికిఁ గుటుంబ మనఁగ భూమియ కాదే.

గీ. కీడు సేయువానికిని మేలు సేయుట
మునులగుణము గాక జనుల నెల్లఁ
బ్రోచువాఁడు కల్లరుల నాజ్ఞ వెట్టుట
యాగపశువిధంబు నట్ల కాదె.

గీ. ఎంత వాఁడలియున్న నేరండములు జీలు
గులును దారుకృత్యములకు నగునె

యితరు లెంద ఱైన నేలిక కధికులై
చేయుపనులు పూని చేయఁగలరె.

క. జూదమును బన్నిదంబును
వాదును బతితోడఁ దేడవలవదు కడుఁ బో
రా దయ్యోనేని భృత్యులు
భేదముగాకుండు గెలుపు పెనుపఁగవలయున్.

క. ధనమును బ్రాతశ్చాయయు
వనితాజనయౌవనంబు వండినయన్నం
బును గడుమూర్ఖస్నేహం
బును నిల నివి యల్పకాలభోగ్యము లరయన్.

క. దూరము వ్యవసాయకులకు
భారంబు సమర్థులకును భాసురవిద్యా
పారగులకును విదేశము
వైరము ప్రియవాదులకును వసుమతిఁ గలదే.

గీ. విమతు లాఁ వెఱింగి వైర పేఁది తోడగుట
మిడుత లగ్గిమీఁదఁ బడినయట్లు
తోడు లేక యధికుఁ దొడరుట యంబుధిఁ
గలము లేక యీఁదఁ గడఁగినట్లు

ఉ. కొందఱ మేలమాడుటలుఁ గొందఱ వావులు దేర్చి పిల్చుటల్
కొందఱ ముద్దుసేయుటయుఁ గొందఱ నెయ్యఁపుఁజూపు సూచుటల్
కొందఱ నాత్మభావమునఁ గొందఱ మన్నన భృత్యులందు ని
ట్లందఱ నన్నిభంగుల నృపాగ్రణి వశ్యులఁ జేయుఁగాఁ దగున్.

ఈ రుద్రదేవమహారాజునకుఁ బూర్వమందును బరమందును గూడ నీవంశీయులకు గాకతీయు లని పిలుచుచున్నారు. కాకతి యను పట్టణమునుబట్టి వీరి కీపేరు వచ్చెనని కొందఱును కాకతి యనుపర దేవతాప్రసాదమున నీవంశకర్త యుద్భవించుటచే వీరు కాకతీయులయిరని కొందఱును కాకతీయను దేవత నారాధించుటచేఁ గాకతీయు లైరని మఱికొందఱునిట్లు పలువురు పలువిధములుగాఁ దలంచుచున్నారు. ఆ వివాదములతో మన కిపుడు పని లేదు. వంశనామ మైనను, గృహనామ

మైనను, వీరిపేరులకు ముందు కాకతి శబ్దము చేర్పఁబడుచున్నది. వీరు దుర్జయునిసంతతివార మని కొన్ని శాసనములలోఁ జెప్పుకొని యున్నారు. కొన్నిటిలోఁ గరికాలచోళునికూడ వంశకర్తగాఁ జెప్పుకొనిరి. కాని యది గమనింపఁదగినది కాదు. ఈ వంశీయులలోఁ జరిత్రకెక్కిన మొదటిపురుషుఁడు బేతరాజు. ఆతఁడు మొదలుగా వీరి వంశవృక్షము నీక్రిందనిచ్చుచున్నాఁడను.

బేతరాజు
|
(మొదటి) ప్రోలరాజు ౧౦౫౦—౧౦౭౫
|
(రెండవ) బేతరాజు ౧౦౭౫—౧౧౦౦
|
దుర్గరాజు త్రిభువనమల్లబిరుదాంకితుఁడు ౧౧౦౦—౧౧౧౦
|
(రెండవ) ప్రోలరాజు ౧౧౧౦—౧౧౫౮
|
రుద్రదేవమహారాజు ఇతఁడే నీతిసారకృతికర్త ౧౧౫౮—౧౧౯౫
మహాదేవరాజు ౧౧౯౫—౧౧౯౬ బయ్యాలదేవి
|
గణపతిదేవుఁడు ౧౧౯౯—౧౨౬౦ సోమమ్మ, నారమ్మ, పేరమ్మ,
|
కోటగణపాంబ (కుమార్తె) భర్త గణపతి
రుద్రాంబ, (కుమార్తె) ౧౨౬౦—౧౨౯౫ భర్త చాళుక్యవీరభద్రుఁడు
|
పెంపుడుకుమార్తె ముమ్మడాంబ భర్తమహాదేవరాజు
|
ప్రతాపరుద్రమహారాజు ౧౨౯౫—౧౩౨౬

కుమార్తె రుయ్యాంబ ఈమెను ఇందులూరి అన్నయామాత్యుఁడు పరిణయ మయ్యెను.

కాకతీయులశాసనములలో సామాన్యముగా మొదటిప్రోలరాజు నుండియే వంశవర్ణనము చేయఁబడుచుండును. కాని ఖాజీపేటలో నున్న యొకశాసనమునందు, (కాకతీయసంచికాసంబంధము ౨౬వపేజీ). బేత రాజకుమారుఁడు ప్రోలరాజనియు, నాతనితనయుఁడు బేతరాజనియుఁ జెప్పియుండుటచే నీవంశమునకు మూలపురుషుఁడు బేతరాజనినిశ్చయించి యిందాతనిని వంశకర్తగాఁ జూపితిని. ఈవంశవృక్షములోఁ జూపిన యంకెలాయారాజులపరిపాలనాకాలమును హూణశకములోఁ దెలుపును. మొదటిప్రోలరాజు ౧౦౫౦వ సంవత్సరమున రాజ్యపాలనము ప్రారంభించినాఁడనినచో నాతనిజననము ౧౦౧౦ ప్రాంతమగును. అట్లయినచో, మొదటిబేతరాజు జననము క్రి. శ. ౯౭౫ ప్రాంతమయి యుండును.

౧. బేతరాజు:—ఇతనిమనుమఁడుకూడ బేతరాజగుటచేనితనిని మొదటిబేతరాజని యనుచున్నారు. ఇతఁడు క్రి. శ. ౯౭౫–౧౦౨౫ నడుమనున్నవాఁడని చరిత్రకారులయభిప్రాయము. ఈకాలము సరి యైనదని నిర్ధారణముగాఁజెప్పుటకుఁ దగినయాధారములు లభింప లేదు. శా. శ. ౧౦౦౧–౧౦౧౨ సంవత్సరములలో బేతరాజుపేరుననున్నవి రెండుశాసనములు గనపడుచున్నవి. కాని యవి రెండవబేతరాజువి. కావున వానినిబట్టి యీతనికాలనిర్ణయమును జేయ నను వు కాదు. ఆశాసనములు రెండవబేతరాజు వని నిశ్చయ మైనచో నవి క్రి. శ. ౧౦౭౯–౧౦౯౦ సంవత్సరములవి కావునను మొదటిబేతరాజుజననము నకును, రెండవబేతరాజుజననమునకును దాదాపుడెబ్బదిసంవత్సరములు భేదముండును గావునను పైనఁజెప్పినమొదటిబేతరాజుకాలము సరియైన దనియే తోఁచుచున్నది. పైనఁ గనపఱచిన వంశవృక్షములోని యంకె లుకూడ నీయంశమును ధృవపఱచుచున్నవి.

విరియాలమొల్ల భూపతిపేరున గూడూరుశాసన మొకటి యున్నది. ఈశాసనమున నెవరికిని దాన మొసంగినట్లు లేదు. బేతరా జునునాతనిని కొరవిదేశమునఁ బ్రతిష్ఠించినట్లునునాతనినే కాకతవిభునిగాఁ జేసినట్లును నందు వ్రాయఁబడియున్నది. ఇది యందుకొఱకే పుట్టినట్లు

గన్పట్టుచున్నది. ఈశాసనమునఁ గాలము లేదు. ఇది యాంధ్రభాషలోఁ జంపకోత్పలమాలలలో నున్నది. ఆపద్యముల నీక్రింద వ్రాయుచున్నాఁడను. (కాకతీయాంధ్రరాజయుగము ౫౦ పుట)

చ. అనుపమదుర్జయాన్వయసుధాబ్ధి ననేకులు రాజనందనుల్
ననినఁ బిఱుంద వెన్నఁడను సంభవుఁ డయ్యె నతిప్రసిద్ధుఁడై
వినుతవిరోధిమండలిక వెన్నుఁడు వెన్నఁడపోలె వానికిన్
ఘనుఁ డగు నెఱ్ఱభూపతి జగద్వినుతుం డుదయించెఁ గీర్తితోన్. ౧

ఉ. భావితకీర్తి నాతనికిఁ బాండవమధ్యమభీముఁడో యనం
గా పిరియాలభీము నృపఘస్మరుఁడై యుదయించె వానికిన్
భూవినుతుండు మండలికభూషణుఁ డెఱ్ఱనరేంద్రుఁ డుత్తమ
శ్రీవినుతుండు బంధుజనసేవ్యుఁడు దా నుదయించె నున్నతిన్. ౨

చ. అతఁడని బొట్టబేతవసుధాధిపుఁ జేకొని వానివైరి ను
ద్ధ్రితమునఁ జంపి యాకొఅవి దేశమునందు ప్రతిష్ఠ చేసి త
త్తనయు సమేతుఁ డోడ గని...యము బిట్టర గద్యానంబు న
ప్రతిముఁడు వాని దా మొగుడుపర్సియు పంద్రడదు నెఱ్ఱఁ డాప్రుడై. 3

చ. అరుదగు నట్టి యెఱ్ఱనృపునంగన గామమసాని యాఁకమే
ల్గరదని బేతభూవిభుసి గాకతివల్లభు సేసి వాని తా
బరగగఁ జేతఁబట్టి ఘను బల్లవరాయని యాఁగి జొచ్చె భా
స్కరవిభు చక్రవర్తిగని కాకతి నిల్పుట గోటిసేయుదే. ౪

ఉ. కారక కాలుఁడై పడుసె గాడయనాయకుఁ జంపి సూరడ
వ్వేలుపుకొండ రవ్వనృపు వేలుపుగొండన నిల్పి వానిచే
మేలుగ మూడముప్పయిని మేలుగ నేరెడు బోదిపాడునుం
మేలుగ లేకుమావిడులు మేలుగ రెండెయరాజుసంగడై. ౫

సూత్రధారి కొమ్మోజనబరహా॥ శ్రీ శ్రీ శ్రీ

ఆడపగట్ట దేవరకు జేను

పీనిలో మొదటి రెండుపద్యములును, మూఁడవపద్యములో రెండుపాదములును అర్థవంతములై యున్నవి. మిగిలినభాగమునఁ గొన్ని

యర్థములుకానిపదము లున్నవి. మూఁడవపద్యమునందలి మూఁడవ పాదమున ప్రాస తప్పినది. ఆపాదముననే పదునొకండవ యక్షరము లోపించినది. రెండవపద్యమందలి విరియాలభీమశబ్దమున కాంధ్రప్రత్యయము చేర్చకుండ భీమ యనియే యుపయోగింపఁబడినది. "భీమనృపఘస్మరుఁడై" యనిసమాసపదముగాఁ జెప్పినచో నన్వయము కుదురదు. ఐదవపద్యమున మొదటిపాదమునందు ప్రాస తప్పినది. లేదా రలలకు ప్రాసమైత్రిచేసియుండవచ్చును.

దుర్జయవంశమున ననేకులు రాజకుమారులు గతించినపిమ్మట ప్రసిద్ధుఁడైన వెన్నఁడనునాతఁడు జన్మించెననియు నతనికి యెఱ్ఱభూపతి పుట్టెననియు, నాతనికిఁ బాండవభీముఁడువంటి విరియాలభీముఁడు కలిగెననియు, నతని కెఱ్ఱభూపతి జనించెననియు నతఁడు బొట్టుబేతనిని చేపట్టి వానిశత్రువుల జంపి కొఱవిదేశమునఁ బ్రతిష్ఠ చేసెననియుఁ బై మొదటిమూఁడుపద్యములవలన స్పష్టముగాఁ దెలియుచున్నది. ఆ యెఱ్ఱభూపతిభార్యయైనకామసాని బేతరాజును కాకతికిఁ బ్రభువునుగాఁ జేసినట్లు నాల్గవపద్యమందున్నది. దీనినిబట్టి కాకతి యనుపట్టణ మొకటియుండెనని యూహింపవచ్చును. తనభర్త, కొఱవిదేశమునందు బేతనిఁ బ్రతిష్ఠింపఁగాఁ దాను కాకతియను పట్టణమురాజధానిగాఁగల దేశము నాతని కిచ్చినట్లు కన్పట్టుచున్నది. ఇప్పటియనుమకొండయే కాకతి యని కొందఱును ఓరుగల్లు పట్టణమే కాకతి యని కొందఱును దలంచుచున్నారు.

ఈపద్యార్థములనుగూర్చి విమర్శించుటకు ముం దీశాసన మీవంశీయులలోని బేతరాజునుగూర్చి చెప్పఁబడినదేనా? అయినచో, నిందు మొదటిబేతరాజు చెప్పఁబడియెనా? రెండవబేతరాజు చెప్పఁబడియెనా? యనువిషయములను దేల్చవలసియున్నది. ఈశాసన మీవంశీయులతో సంబంధించినదే యని చరిత్రకారు లందఱు నంగీకరించినారు. కాని కొందఱిందలిబేతరాజు మొదటిబేతరాజనియుఁ గొందఱతఁడు రెండవబేతరాజనియు నభిప్రాయపడిరి.

ఈశాసనము మొదటిబేతరాజుతో సంబంధించినదియే యని నాయభిప్రాయము. ఈశాసనములో, బేతరాజును కాకతివల్లభునిగాఁ గామసానమ్మ చేసినట్లు చెప్పఁబడియున్నది. పైఁజెప్పినఖాజీపేటశాసనములో (ఇదిరెండవబేతరాజు వ్రాయించినది.) "శ్రీమాన్ కాకతీపురాధినాథో బేతః చోడక్ష్మాపాళచయూవార్ధి ప్రమథన మూర్జి తోర్జిత లక్ష్మీః" అని తనపితామహుని కాకతిపురాధినాథుఁ డని వర్ణించి యున్నాఁడు. మఱియుఁ దనతండ్రి యైన ప్రోలరాజు, త్రైలోక్యమల్లుని వలన అనుమకొండను బడసినట్లును, తాను, అనుమకొండలో శివాలయమును దన పేరుతో నిర్మించినట్లును జెప్పియున్నాఁడు. కాకతినగరమును గూర్చి తానేమియును జెప్పకొనకయుండలేదు. మొదటిప్రోలరాజు త్రైలోక్యమల్లునివలన ననుమకొండవిషయమును గ్రహించినపిమ్మట రాజధానీనగరమును 'కాకతి' నుండి యనుమకొండకు మార్చుకొని యుండును. అందువలనఁ బైనఁజెప్పిన గూడూరిశాసనములోని బేతరాజు మొదటిబేతరాజనియే నిశ్చయింపవలసియున్నది. కాకతీయాంధ్రరాజయుగచరిత్రమును రచియించిన శ్రీ చిలుకూరివీరభద్రరావుగారును నిట్లే తలఁచియున్నారు. ఇఁకఁ గొఱవినిగూర్చి యాలోచింతము.

నిజామురాష్ట్రమున వరంగలుజిల్లాలో "కొఱవి" యను గ్రామమొకటి యున్నదని తెలియుచున్నది. ఆ'కొఱవి'రాజధానిగాఁ గల్గు ప్రదేశమే కొఱవిదేశ మని యాకాలమునఁ బిలువఁబడుచుండెడి దని యూహింపవచ్చును. ఈబేతరాజు నీతిసారకృతికర్తయైన రుద్రదేవ మహారాజునకుఁ బూర్వుఁడగుటయేగాక, యాంధ్రదేశమును మూఁడు వందలసంవత్సరములు పరిపాలించినయాంధ్రచక్రవర్తులవంశమునకు మూలపురుషుఁ డగుటచేనప్రస్తుతవిషయములను జర్చించుచున్నాఁడ ననుభీతి యున్నను, ఈబేతరాజునుగూర్చియు నీతని పేరుగల గూడూరు శాసనమునుగూర్చియు నింతదూరము చర్చింపవలసివచ్చినది. ఈశాసనము ఆంధ్రమహాభారతమునకుఁ బూర్వము పుట్టినది. ఆకాలమునాఁటిభాషాస్థితి, పద్యరచనము మొదలగుభాషావిషయములు గూడఁ గొంచెముగనైనను దెలియుచుండుటచే నీశాసనమునుగూర్చిన చర్చ నిట సాగించుచున్నాఁడను.

ఆకాలమున పిరియాలవారు పరాక్రమవంతులైన ప్రభువులు గనో, లేక తాము చేసిన వాని ప్రభువులుగఁ జేయఁదగిన సమర్థులు గనో యుండియున్నట్లీ పద్యములవలనఁ దెలియుచున్నది. ఈపిరియాలవారు కమ్మవారనికొందఱును క్షత్రియులని కొందఱును వెలమలని కొందఱును వ్రాయుచున్నారు. వారికులముతో మనకిటఁ బ్రసక్తి లేదు. ఈపద్యములలోఁ గొఱవిదేశ మొకటియుఁ గాకతియొకటియు గన్పట్టుచున్నవి.

కొఱవిదేశము మొదట బేతరాజునకో ఆతనిపూర్వులకో చెందియుండును. దానిని నెవ్వఁడో ఆక్రమించుకొనియుండును. పిరియాలయెఱ్ఱ భూపతి, యుద్ధమున నాతనిని జంపి బేతరాజును గొఱవిదేశమునందుఁ బ్రతిష్ఠ చేసెను. ఈయూహకు మూఁడవపద్యము నందలి మొదటి రెండు పాదము లపై నాధారపడియున్నవి. మూఁడవ పాదము నందలి భావమును సరిగా గ్రహింపఁగలిగితి మేని తక్కినవిషయమంతయు బోధపడఁగలదు. కాని యాపాదమందలి ప్రాసాక్షరము తప్పుటవలనను యతిస్థానమందక్షరము లేకపోవుటవలనను నాపాద మర్థ మగుట లేదు. నాల్గవ పాదమందలి వంద్రుఁ డెవ్వఁడో తెలియదు. వంద్రుఁడను, ఒకవ్యక్తియో! లేకయిది యెఱ్ఱఁడు చేసిన చేతను దెలుపు "చంపెను" వంటి క్రియాపదమో తెలియదు. 'మొగుడు' పదమునకు ముకుళింపజేయు నను నర్థమున్నది. రెండుమూఁడుపాదములను సమన్వయము చేసి చూడఁగా బేతరాజు యొక్క వైరి కోకతనయుఁ డున్నట్లును వాఁడప్రతిముఁ డైనట్లును వాఁడు యుద్ధమునకు రాగా వానిని మొగుడు వఱచియు ననఁగా జయించి ముకుళీకృతుని గాఁ జేసియు ఎఱ్ఱఁడు దయదలఁచి వానిని జంపనట్లును నా పాదముల కర్థము స్ఫురించుచున్నవి. అప్రతిముఁడను విశేషణము ఎఱ్ఱని కన్వయింపఁజేయవచ్చును. ఇందెంతవఱకు సత్యమున్నదో నిది యెంత వఱకు పండితాంగీకారమును బొందునో చెప్పజాలను. మూఁడవపద్యమందలి రెండవపాదాంత్యాక్షరము 'యా' అనియు మూఁడవపాదమందలి మొదటినాల్గక్షరములును "తతన" అనియు, నుండవలయు ననినా తలంపు. ఆతతనయు ననగా ఆకనితనయుఁడని కన్నడప్రయోగము. (తె.శా. సం.పుట ౧౬౨౭). ఈపక్షములోఁ బ్రాసభంగ ముండదు.

మొదటిమూఁడుపద్యములకును, నాల్గవపద్యమునకును సంబంధము లేదు. నాల్గవపద్యమందలికథ యెఱ్ఱభూపతియనంతరమున జరిగినది. ఈతని భార్య కామమ్మ తనభర్తయనంతరము కాకతిదేశమునకు పరిపాలకురాలుగానున్నట్లు కాన్పించుచున్నది. కనుకనే యామె కాకతియందు బేతరాజును నిలుపఁగలిగినది. కాకతి కొఱవిదేశము లొకటియే యనియు కొఱవిదేశమునకుఁ గాకతిప్రధానపట్టణమనియు నొకరనినారు. కాని యందుల కాధారములు లేవు.

పల్లవరాయఁ డొకఁడు కాకతిపైకి దండెత్తిరాఁగాఁ గామమ్మ వానిని నిరోధించుట (ఆఁక=నిరోధించుట) మంచిబుద్ధియని (మేల్కరదనికఱద—బుద్ధి) తలంచి, తాను స్త్రీ కావున తనభర్తచేఁ గొఱవిదేశమునఁ బ్రతిష్ఠింపఁబడిన బేతరాజును గాకతికిఁ బ్రభువునుగాఁ జేసి, యాతనిసాహాయ్యమున నాపల్లవరాయునిని గాకతిపైఁ రాకుండ నడ్డగించి (ఆఁగి=అడ్డగించి) పిమ్మటఁ జక్రవర్తియైన భాస్కరవిభుని దర్శించి యాతని నాశ్రయించెను. (చొచ్చె=ఆశ్రయించె) ఈవిధముగాఁ జేసి కాకతిరాజ్యమును నిలుపుట వలన నామె చేసిన కృత్యము కోటిగుణితమైనది కదా! ఇది నాల్గవపద్యార్థ మని నాయభిప్రాయము. అయినచో నిందలి పల్లవరాయఁ డెవఁడు? భాస్కరవిభుఁ డెవ్వఁడు? అని యాలోచింపవలసి యున్నది.

ఈశాసనము క్రీ. శ. ౧౦౦౦ సంవత్సరప్రాంతము నాఁటి దని వ్రాసియుంటిని. ఆకాలమునఁ బశ్చిమచాళుక్యుఁ డగు మొదటి త్రిభువనమల్లుఁడు చక్రవర్తిగానున్నాఁడు. అతనిపేరు విక్రమాదిత్యుఁడు. అతనికి విభువిక్రముఁడను బిరుదముకలదు. ఇందలి ఆదిత్య, విభుశబ్దములను దీసికొని, భాస్కరవిభుఁడని పైపద్యములో నుపయోగించినాఁడని నాయభిప్రాయము. ఈ మొదటిత్రిభువనమల్లునిరాజ్యకాలము క్రీ. శ. ౧౦౦౭ మొదలు ౧౦౧౮ వఱకునై యున్నది. పశ్చిమచాళుక్యులకుఁ బల్లవరాజులు సామంతులుగా నుండిరనుట సుప్రసిద్ధచారిత్రకవిషయము. పల్లవసామంతుఁ డొకఁ డప్పుడు కాకతిపై దండెత్తివచ్చెననియు, కామమ్మ, బేతరాజుసాహాయ్యమున నాతనిని నిరోధించి,

విక్రమాదిత్యుని శరణుఁ జొచ్చి కాకతిరాజ్యమునకు వారివలన బాధ లేకుండఁ జేసిరని యనియు, కలంపవ్రాసియున్నది. అప్పటినుండియు బేతరాజు విక్రమాదిత్యునితో మైత్రిఁ గలిగియుండును.

ఈగూడూరు పద్యశాసనము కాకతీయులకు, ఆపత్కాలమున విరియాలవారు సాహాయ్యము చేయుచుఁ గాకతీయులను నిలువబెట్టినారని చూపుటకై విరియాలవారెవరో కల్పించి వ్రాయించిరని డాక్టరు శ్రీనివాసరావుగారు వ్రాసియున్నారు. (హై. శా. సం. ౧౩. ౧౫.) కాని యందులకు సరియైనయాధారములను వారుచూపలేదు. శ్రీ కొత్త భావయ్యచౌదరిగారు భారతిపత్రికలో (వ్యయ సం॥ శ్రావణము ౧౫౯వ పుట) పూడూరుశాసనము (తెలింగానా శాసనములుపుట ౧౨౮) నుదాహరించుచుఁ ద్రిభువనమల్లునికాలమున నాతనికి సామంతుఁడుగా నొకపల్లవుఁడున్నాఁడని (ఆశాసనకర్తపల్లవుఁడే) యు గూడూరుశాసనమున నుదాహరింపఁబడినపల్లవుఁ డాతఁడుగాని యట్టివాఁడే మఱియొకఁడు గానియై యుండుననియు నందుచే గూడూరుశాసనము సత్యమైనదిగా దలంపఁగూడ దనియు, వ్రాసియున్నారు. శ్రీ చౌదరిగారు చూపిన శాసనము క్రీ. శ. ౧౧౦౬ వసంవత్సరమునాఁటిది. అందలి త్రిభువనమల్లుఁడు రెండవత్రిభువనమల్లుఁడు. అందుచే నాశాసన మీసందర్భమున నుపయోగింపదు. కాని బేతరాజుకాలమున గూడూరుశాసనమున కన్వయించెడి మొదటిత్రిభువనమల్లునిసామంతుఁ డగుపల్లవరాయఁ డింకొకఁడు లేఁ డనిచెప్పఁజాలము. కావున నాల్గవపద్యమందలికథ సత్యమనియే నమ్మవచ్చును.

నాల్గవపద్యమందలికథకును నైదవపద్యమందలికథకును సంబంధము లేదు. సూరఁ డనునాతఁడు కాడయనునాయకుని జంపి, వేలుపుకొండరాజును వేలుపుకొండయందే నిలిపి యిట్లుచేసినందులకు ప్రత్యుపకారముగఁ గొన్నిగ్రామములను బడసెనని యైదవపద్యార్థము. ఇందలి కాడయనృపుఁ డనఁగా నాల్గవపద్యమందలిపల్లవరాయఁడే యని నాయుద్దేశము. పల్లవులకు కాడవులనినామాంతరమున్నది. (ఈగ్రంథ

మండలికథక(—కసోమయాజిచరిత్రము జూచు.)  వేలుపుగొండ యనఁగా దేవరకొండ. ఇది నైజాము రాష్ట్రమున నున్నది. రత్నపుృ= నృపరత్నము అయియుండును. నేరెడు, బోదిపాడు, ఉటమానిడి, యివి గ్రామములు. ఈపద్యమందలి గాడనాయకవర్ణనకును, నాల్గవపద్య మండలికథకును గాలవ్యవధి విశేషముండదని నా యుద్దేశము. కాకతికథా నంతరమున నీపల్లవుఁడు మరల బేతరాజపరిపాలనములో నున్న దేవర కొండరాజ్యము పైకిదాడివెడలఁగా విరియాలసూరఁడు వానిని వధించెనని తోఁచుచున్నది. వేలుపుకొండప్రభువు పేరింకు లేదు. ఇతఁడు బేతరాజే యై యుండునా? యని సంశయము కలుగుచున్నది. ఈసూరఁడు విరి యాలసూరఁడే యైయుండును. విరియాలసూరభూపతి యొకఁడున్నట్లును, ఆతనికి కుమారుఁడు బేతరాజయినట్లును, ఆబేతరాజునకును నాతనిభార్య బిజ్జమకును, మల్లఁ డనుకుమారుఁడు జన్మించి యొకతటాకమును నొక శివాలయమును నిర్మించి నట్లును నాతఁడు వ్రాయించిన శాసనమువలనఁ దెలియుచున్నది (తె. శా. సం. పుట ౧౬౬.) ఈశాసనమునందుఁ గాలము లేదు. విరియాలసూరఁడు బేతరాజుకడ సామంతుఁడుగనో సైన్యాధిపతిగనో యుండి, కాడవనాయకునిఁ జంపెననియుఁ దనయేలిక యైనబేతరాజునామమును దనకుమారునకుంచినాఁడనియుఁ దలంచితి మేని యీసూరఁడును, బైయుదవపద్యమండలిసూరఁడు నొక్కఁడే యనినిశ్చయింపవచ్చును. మొత్తముమీఁద నీశాసనము విరియాల వారికీర్తిని బ్రకటించుటకును బేతరాజురాజ్యసంపాదనమును దెలుపు టకును నుద్దేశింపఁబడినదని చెప్పవచ్చును. విరియాలయెఱ్ఱయకామమల కును సూరనికిని నేమయిన సంబంధము ముండెనో లేదో చెప్పఁజాలము. విరియాలవారికిని బేతరాజునకును బ్రభుసామంతసంబంధము మాత్రమే యుండెనో, లేక యితరబాంధవ్య మేమయినఁ గలదో చెప్పఁజాలము.

మొదటిబేతరాజు క్రి. శ. ౯౭౫ సంవత్సరప్రాంతమున జన్మించి ౧౦౧౦ సంవత్సరప్రాంతమునఁ గొలనిదేశమునఁ బ్రతిష్ఠింపఁబడి ౧౦౧౫ సంవత్సరప్రాంతమునఁ గాకతివల్లభుఁడై ౧౦౩౦ వఱకును రాజ్యము చేసెనని నిశ్చయింపవచ్చును.

బేతరాజునకుఁ బూర్వ మీకోఱవిదేశ మెవరిపరిపాలనముక్రింద నుండెనో యనువిషయము స్పష్టముగాఁ దెలియుటలేదు. కాని కోఱవి శాసన మను పేరఁ బ్రకటింపఁబడుచున్న యొకశాసనముకలదు. (తె. శా. సం. పుట ౧౬౬) దానివలన నీకోఱవినిగూర్చిన విషయము లేమైనఁ దెలియునేమో యని చూచియున్నది. అందుఁ గాల మీయలేదు. కాని విక్రమాదిత్యునికుమారుఁడగు చాళుక్యభీముని పే రందుండుటచేఁ గాలమును మనము సులభముగాఁ దెలిసికొనవచ్చును. ఇతఁడు తూర్పు చాళుక్యుఁడు. ఆకాలమునఁ దూర్పుచాళుక్యులయధికారము కోఱవి వఱకును వ్యాపించె నని చెప్పవచ్చును. ఇతనిని మొదటిభీముఁ డందురు. ఇతఁడు క్రి. శ. ౮౯౨ మొదలు ౯౨౨వఱకును వేఁగిసింహాసన మధిష్ఠించినవాఁడు, ఈశాసనమాతనికిఁ బిమ్మటఁ బుట్టినది. కావున శాసనకాలము క్రి. శ. ౯౦౦ ప్రాంత మనవచ్చును. ఇందలి భాషయుఁ బైగూడూరుశాసనమువలెనే యిప్పుడు వాడుకలో లేనిపదములను గలిగి యర్థముగాకుండ నున్నది. ఇది యానాఁటిగద్యరచనమును దెలుపును. భావిపరిశోధకుల కనుకూలముగ నుండునని యాశాసనము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

"శ్రీవిక్రమాదిత్యనృపాగ్రతనయుం డైనచాళుక్యభీమునకు శౌచకందర్పునకు వేఁగీశ్వరునకు రనమద్వాన్వయకులతిలకుం డయిన కుసుమాయుధుండు గన్నరబల్లహునికి స్త్రప్రాప్తంబయ్న (సంప్రాప్తంబయిన) రనమర్ద శ్రీమదనభుజవీర్యబలపరాక్రమంబున స్వచ్ఛిక్ష్మీయుం గట్టి పట్టంబెత్తి ఖడ్గసహాయుండై నేలయెల్లం గావంబూని మడికొణ్డ నాణ్డాదిగ (మణికొండవాడు) వేగిదేనము విష్ణువర్ధనుతో నడ్డి రాజ్యంబు సేయుచున్న కుసుమాయుధు పెద్దకొడు కనేకరిపునృపతి మణిమకుటమకరికారేపణమశ్రుశితగలరలావర్తంబు రాజ్యంబు సేయుచు నిష్టవిషయకామ భోగంబుల ననుభవించుచు సుఖంబుండి యొకనాడు కొరవి నల్లజెఱెయ కొడుకు పెద్దన రావించి నీవు నాప్రాణసమానుండ నైన చెలివి నీచేసిన యుపకారంబునకు బ్రత్యుపకారంబు సేయువలయుం దాని....శ్లిక్రమ్న స్వృగి శ్రీనాకొల్లంగల దేమి లేకున్న వెణ్డికొణ్డ మయ్యాను (వేడికొండు

మయినను) బరోపకారంబుహొన్ది గాని కొరవియన్నభీముడు నల్కాల కులసన పశివి గెల్చి శ్రీనిరవద్యు ణ్డానేకసమరసంఘట్టణభుజాసిభాను రుండై (భానుకుండయ్యె?) తమయన్న రాజ్యశ్రీ కొల్ల న్నానయు ఈపుండై చేకొని నిల్చి భీమసలుకిచు (చాళుక్యభీముడు) న్డనేకవస్తువాహానోత్స వంబు ల్బడయుచు తమయన్న గొణగయ్య చేసినధర్మ్మవులు ననంబును నేగట్టను గావను రక్షింపను వఃయునేని చేకొని కొరవి కిచ్చినస్థితి నిల్పశిలాస్తంబంబు ప్రతిష్ఠించి విష్టరంబును నాతనికొట్టించిన చెఱువులు మఱియు యెవ్వియేని నాతనిచేయంబడి వుఖనఱిగినను చెఱిచినను చఱియవెఱికినను ముట్టితిగనుఱకాడినను, ణరవాత్యది ఏనుం ద్రమ్మలు (బంగారునాణెపువిశేషము) మణిసి (మనుష్యుడు?) చేసినద్రోహంబునకు వానిజీవితంబు దణ్డువు.వరియారంబుపసువరంబు వెల్లారబంబు ఎరగద్యా ణంబు పేశామణి వున్నమన్నాడు ఏనూఱు ద్రమ్మలం వట్టేసుఖంబుమను ము,నాయకుణ్డై యా కాపులయిన్న వేఱ రాజులంకొచ్చి ......మస్థితిమణిసి కొన్నరాజు ల్గలరేనియు యిాస్థితి మడిసిన...నాపకణ న్ననున్నకాంపు"

కుండలీకరింపబడినభాగములు నాయవి: సందేహాము లున్న తావుల వర్ణక్రమము మాతృకయందున్నవిధముననే యుంచితిని. నిస్సంశ యమైనతావులలో ప్రస్తుతపువర్ణక్రమము ననుసరించి వ్రాసితిని. ఇందు గొన్నికన్నడపదములుండుటవలనను, గొన్ని శాసనలేఖకునితప్పులుండుట మూలముననను శాసనకావ్యకర్త పండితుడు గాకుండుటచేతను శాసన కాలమునాటి కాంధ్రభాష యిప్పటివలె పరిపక్వస్థితి నందకయుండుటం బట్టియు నీశాసనము సరిగా బోధపడుట లేదు.

ఈ శాసనములో నున్నవిషయములను బరిశీలింతము.

౧. ఇది చాళుక్యభీముడు వేగిసింహాసనమునం దుండగా గన్నరవల్ల హునికి సంప్రాప్త మయినరాజ్య మాతనిపెద్దకుమారుడు పరిపా లించుచున్న కాలములో వ్రాయబడినది.

౨. శాసనములో చెప్పబడినకుసుమాయుధునకు కన్నరబల్లాణుడనునది నామాంతరమైయుండును.

౩. కుసుమాయుధునిపెద్దకొడుకు పేరిందు గన్పట్ట టలేదు. "విష్ణువర్ధను నితోనడ్డి" అని శాసనమునందుండుటచే విష్ణువర్ధనునకుపృథ్వీరేకయుగా

8

స్వతంత్రుఁడై [విష్ణువర్ధనునకు లోఁబడి" యనికూడ నర్థము చెప్పవచ్చును.] రాజ్యము చేయుచున్నట్లు కన్పట్టుచున్నది. ఇతఁడేలుచున్న రాజ్యము పేరు మణికొండనాడు. ఇది నిజామురాష్ట్రములోనిదై యుండును.

౪. పైనచెప్పినకుసుమాయుధునిపెద్దకొడుకునకు రాజ్యపరిపాలనమున సాహాయ్యము చేయుచున్నవాఁడు కొరవి నల్లజెత్తెయకొడుకు పెద్దన. ఈతఁడుచేసినమేలునకుఁ బ్రత్యుపకారముగా నేమేని గోరుకొమ్మని పెద్దకొడు కడుగఁగా నాకేమియు నక్కఱలేదనిచెప్పుచు నేదియో యడిగెను. అడిగిన దేదియో తెలియుట లేదు. కాని యీపెద్దన కిరువురన్నలున్నట్లును, అందు పెద్దవాఁడగు భీముఁడుఁ యుద్ధము నందెవరినో గెలిచినట్లును, నాతనికిఁ బిమ్మట నాతని తమ్ముఁడు 'గాణగయ్య' తనయన్నగారి యైశ్వర్యమునకెల్లనధికారియై భీమనల్కచే బహుమతులందినట్లును అతఁ డనేకధర్మముల నాచరించినట్లును వానినిరక్షించికొఱవిని నిలిపి, శిలాస్తంభమును బ్రతిష్ఠించున ట్లనుగ్రహింపు మనికోరినట్లును గన్పట్టుచున్నది. ఈసందర్భమున "పడివెగెల్చి" యని యొకశబ్ద ముపయోగించినాఁడు. ఈ "పడివె" శబ్దముపైనవ్రాసినగూడూరుపద్యశాసనమునందునుగలదు. అందు "పడుసె గాడయనాయకుఁజంపి," అని యున్నది. ఈ రెండుశబ్దములు నొకేయర్థమునం దుపయోగించినట్లు గన్పడుచున్నది. ఈశబ్దమునకు "యుద్ధమునందు" అనియర్థము. శబ్దరత్నాకరమున 'పడవ' అనఁగా యుద్ధ మని యర్థము నిచ్చియున్నారు. ఇది కన్నడశబ్దమైయుండును.

ఈశాసనమునందుఁ గొఱవిశబ్దమును మూఁడుమారు లుదాహరించియున్నారు. పరిశీలించిచూడఁగా గొఱవియనునది గ్రామనామమనియు నది ప్రధానపట్టణ మగుటచే నాదేశమునకుఁ గొఱవిదేశమని పేరువచ్చెననియు, శాసనమునఁ గొఱవియన్నభీముఁ డని ప్రయోగించుట చూడఁగా నీగ్రామనామమే వారిగృహనామముకూడ నైయున్నట్లును గన్పట్టుచున్నది. ద్వాత్రింశత్సాలభంజికను రచించిన కొఱవి గోపనామాత్యుని యింటిపే రీగ్రామమునుబట్టి వచ్చినదేమో!

ఈశాసనమునుబట్టి గన్నరబల్లాణుఁడో లేకయాతనికుమారుఁడో

కొలని దేశమును చేతరాజుపూర్వులవశమునుండి లాగికొని కొలని భీమునకో ఆతనిసోదరులకో యిచ్చియుండును. బహుశః కొలనిపెద్దనకుఁ గుణగ్రామాయుధునికుమారుఁడేయిచ్చియుండును. పిమ్మట నీపెద్దన వంశీయులు దాని ననుభవించుచుండియుందురు. చేతరాజు తనపూర్వుల రాజ్యమును దిరిగి వశముచేసికొనఁ బ్రయత్నించుటలో విరియాల యెఱ్ఱఁడు సాహాయ్యమొనర్చియుండును. గన్నరబల్లాణుఁడు అనుపేరు గల రాష్ట్రకూటపురాజొకఁడుకలఁడు. ఇతనికి అకాలవర్షబిరుదాంకితుఁడగు రెండవకృష్ణరాజనినామాంతరము. రాష్ట్రకూటులకును దూర్పుచాళుక్యులకును దఱచుయుద్ధములు జరుగుచుండెడివి. చాళుక్యభీముని పెదతండ్రి యైనగుణగవిజయాదిత్యుఁ డీకృష్ణరాజును జయించియాతని పురమును దగులఁబెట్టి కృష్ణపురదహనవిఖ్యాతిని గాంచియుండెను. చాళుక్యభీముఁడుకూడ వేఁగిదేశముపై దండెత్తివచ్చినయీకృష్ణరాజును జయించెను. తరువాత నీకృష్ణరాజు చాళుక్యభీమునకుసామంతుఁడుగా నుండియుండును. చాళుక్యభీమునకు విష్ణువర్ధనుఁడనినామాంతరమున్నది. పైశాసనములో నొకచోట చాళుక్యభీముఁడనియు నొకతావున విష్ణువర్ధనుఁడనియు వ్రాసియున్నారు. ఖాజీపేటశాసనమునం దీచేతరాజు చోడసేనాసముద్రమును మథించి లక్ష్మిని గైకొనినమని యున్నది. ఈచోడుఁడు బస్తరుపట్టణము రాజధానిగాఁ బరిపాలనము చేయుచున్న రేనాఁటిచోడుఁ డేమో యనియుఁ గాకున్న పశ్చిమచాళుక్యసామంతుఁడుగా నుండి ద్రావిడచోడులతోఁ జేసినయుద్ధములలోఁ బాల్గొనియుండవచ్చునని యు శ్రీవీరభద్రరావుగా రాంధ్రులచరిత్రమున వ్రాసియున్నారు. ఈచేతరాజు పశ్చిమచాళుక్యరాజగు మొదటిత్రిభువనమల్లునకు సామంతుఁడు. ఆకాలమున దక్షిణదేశమున మొదటిరాజేంద్రచోడుఁడు (భారతకృతిపతి యైనరాజరాజునకుమామ) రాజ్యము సేయుచుండెను. అతనికిని బశ్చిమచాళుక్యులకును సదా యుద్ధములు జరుగుచునే యుండెను. చేతరాజా రణములలోఁ బాల్గొనియుండు ననితలంచుటయే సమంజసము.

ఇంతవఱకు వ్రాసినపిమ్మట భావసంవత్సరాదిసంచికలో శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రకటించినయపరిష్కృతశాసన మొకటి నాకుఁ

గనపడినది. ఇది నిజాము ప్రభుత్వము వారి కోశాగారమునం దున్నదఁట. ఇది కుసుమాయుధుఁ డను రాజు (పుర) కుత్సితగోత్రుఁ డైన దోనమయ్య మొదలుగా ముప్పదియిద్దరు బ్రాహ్మణులకు, మంచికొండవిషయము లోని మొగలుచెఱువు లను గ్రామమును దానమిచ్చి వ్రాయించినది. ఇందు కాలములేదు. చాళుక్యుల ప్రశస్తి యుండుటంబట్టియు "ముదుగొండ చలుక్యానాంకులమలంకరిష్ణుర్ముదుగొండురు వాస్తవ్యః" అనియుం డుటంబట్టియు నీశాసనకర్త చాళుక్యులలోని యొకశాఖకుఁ జెందిన వాఁడనియు, నీశాఖకు ముదుగొండచాళుక్య శాఖయని పేరనియు దీని వలనఁ దెలియుచున్నది. ఈశాఖ, యిదివఱకు చరిత్రలకెక్క లేదు. ఈశాసనము ననుసరించిన వంశవృక్షమిది.



ఈశాసనమపరిష్కృతమైనదగుటను, గ్రంథవిస్తరభయమునను నిటనీయలేదు. ఇందలికుసుమాయుధుఁడును కొఱవిశాసనమునందలి కుసుమాయుధుఁడు నొక్కరేయని చెప్పవచ్చును. ఇందలి ముదిగొండ నాఁడును కొఱవిశాసనమందలి మణిగొండనాఁడు నొకటియేకావచ్చును. దానమిచ్చిన మొగలిచెఱువునకు దక్షిణమున "కొరవిపొలము కార కుణ్డసీమసిల" అనియున్నది. ఈకొరవియే యాకొఱవియైయుండును. 'రణమర్దక' శబ్దమీరెండిటియందును గూడఁగలదు. కొఱవినల్ల జెఱయ కొడుకు పెద్దనతో సంబంధించినవాఁడు పైనవ్రాసినట్లు రాష్ట్రకూటవు రాజుగాక ముదిగొండచాళుక్యశాఖలోని కసుమాయుధుని పెద్దకొడుకై ననిజ్జియరాజై యుండుననియీశాసనమును బట్టియూహింపనగుచున్నది. ఎట్లయిననీవిషయమున నింకను బరిశోధన మావశ్యకమైయున్నది.

౨. ప్రోలరాజు:—ఇతఁడు పైవంశవృక్షములోని మొదటిబేతరాజు కుమారుఁడు. ఇతనివంశములో నింకనొకప్రోలరాజుండుటచే నీతనిని మొదటిప్రోలరా జందురు. ఖాజీపేటశాసనమునందీతఁడు "జగత్పవిత్ర చరిత్రుఁ డైనప్రోలరాజు. చక్రకూటవిషయమును జయించి భద్రంగపురా ధీశ్వరునిఁ బరువెత్తించెను. కొంకణమండలమును జయించి యనుపమాన మగుకీర్తిని సంపాదించెను. ఇతఁ డనేకరాజవంశములను జయించి యుద్ధములో కొడవర్తిదుర్గరాజుకొడుకును సంహరించెను. గొన్నయ యనువానిని నిర్జించి పురకూటదేశమును స్వాధీనము చేసికొనియెను. అనుమకొండవిషయమును త్రైలోక్యమల్లునివలన శాసనపూర్వకముగాఁ బడసెను" అనియున్నది. ఇతనియొద్ద రేచర్లబమ్మిరెడ్డియను సేనాధిపతి యుండి యనేకయుద్ధములలోఁ బాల్గొని కీర్తిం గాంచియుండెను. ఇతనినామ మనేకశాసనములలో నున్నది. ఇతఁడు పశ్చిమచాళుక్యులకు సామంతుడుగనుండక స్వతంత్రుఁ డుగనే యుండెను. కాని వారితో మిత్రుఁడుగానుండి చోడులతో జరిగినయనేకయుద్ధములలోఁ దండ్రివలెనే వారికిసాహాయ్యముచేయుచుఁ దండ్రిసంపాదించిన రాజ్యము నభివృద్ధి లోనికిఁ దెచ్చెను. ఇతఁడు దాదాపుముప్పదిసంవత్సరములు రాజ్యము చేసినట్లు కన్పట్టుచున్నది. నిశ్చయముగాఁ జెప్పలేకపోయినను, ఈతని

రాజ్యకాలము క్రీ. శ. ౧౦౫౦—౧౦౭౦ అని చెప్పవచ్చును. ఇతఁడు చోడసింహాసన సంపాదనమునందు కులోత్తుంగచోడు (రాజరాజుకుమారుఁడు) నకు సాహాయ్యమొనర్చె ననికొందఱుచరిత్రకారు లూహించుచున్నారు.

3. బేతరాజు:—ఇతఁడు ప్రోలరాజునకు కుమారుఁడు; మొదటి బేతరాజునకుఁ బౌత్త్రుఁడు; ఇతనిని రెండవ బేతరాజందురు. ఇతఁడు పశ్చిమచాళుక్యరాజయినయాఱవ విక్రమాదిత్యునకు సామంతుఁడై యుండెను. అతనికి త్రిభువనమల్లుఁ డనిబిరుదమున్నది. ఆబిరుదమునే యీ బేతరాజుకూడ వహించియుండెననియు నందుచే నీతనిని త్రిభువనమల్లబేతరాజని పిలచెదరనియుఁ గొందఱందురు. కాని యది సత్యము కాదు. ఖాజీపేటశాసనమువలన నీతనికి విక్రమచక్రి యనబిరుదము గలదనియు, నితఁడు గండ్రగొడ్డలి చేఁబూనినవాఁ డనియు మాళవచోళరాజమదగజపంచాననుఁడనియు వర్ణితుఁ డయ్యెనని దెలియుచున్నది. అనుమకొండపట్టణమున, నొకయారామమును, దనపేరిట బేతేశ్వరుఁడని యొకశివలింగమును శివపురమనుతీర్థమును బ్రతిష్ఠించెననియాశాసనమున వ్రాసియున్నది. ఇతనికి వైజననాథుఁ డనునొక మంత్రి యుండెనఁట. ఈతనిశాసనములో (ఎపిగ్రాఫియాఇండికా సం ౯. పుట ౨౫౬) "కాకతిబేతభూపాలక్రమాగత తదీయరాజ్యభరనిరూపిత మహామాత్యపదవీవిరాజమానోన్నత ప్రభుమంత్రోత్సాహశక్తిత్రయ సంపన్నుఁడనియు, మహత్తరయశస్సుగలవాఁడై అగణితశౌర్యసంపత్తు చేఁ బ్రసిద్ధిఁ గాంచినబేతరాజును చాళుక్యచక్రవర్తిపాదపద్మములను సందర్శించునట్లుచేసి, యాచక్రవర్తిదయతో నిప్పించిన "సబ్బిసాయిర" మండలమును సర్వజనసంతోషకరముగాఁ బరిపాలింపఁజేసినవాఁడు" అని యామంత్రిసత్తముఁడుకొనియాడఁబడియుండెను. ఈ బేతరాజుకాలము గొంచెమెచ్చుతక్కువగా క్రీ. శ. ౧౦౭౦—౧౧౦౦ అనియనుకొనవచ్చును. ఇతనికి కాలాముఖసాంప్రదాయమునకుఁ జెందినరామేశ్వరదీక్షితుఁ డనుపండితుఁడు గురువుగా నుండి యితనిచే మల్లికార్జునమతము కొఱకు దానములను పరిగ్రహించెను. ఖాజీపేటశాసనమువలన నీవిషయము తెలియుచున్నది.

౪. త్రిభువనమల్ల దుర్గరాజు:—ఇతఁడు రెండవ బేతరాజుకుమారుఁడు. ఇతనికి దారిద్ర్యవిద్రావణుఁ డనుబిరుద ముండెను. పశ్చిమచాళుక్య వంశములోనివాఁడైన త్రిభువనమల్లదేవునకును నీబిరుద మున్నట్లు కన్పట్టుచున్నది. ఈమహానృపతి యునికిని గొందరుచరిత్రకారు లంగీకరించుట లేదు. శ్రీ ముట్లూరు వెంకటరామయ్యగారు మొట్టమొదట నీత్రిభువనమల్లదుర్గరాజును గనిపెట్టి వ్రాసిన వ్యాసముతోఁగూడఁ బ్రకటించిన (భారతి—వృష—శ్రావణము) ఖాజీపేట శాసనమును బట్టియు, మాదిరెడ్డికుంట శాసనమునుబట్టియు, రుద్రదేవుని మఱికొన్ని శాసనములనుబట్టియు నీతఁ డున్నట్లుస్పష్ట మగుచున్నది. రుద్రదేవుని శాసనములలో నాతనితండ్రి ప్రోలరాజనియు, తాతత్రిభువనమల్లుఁడనియు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. అయితే, త్రిభువనమల్లుఁడనునది రెండవ బేతరాజునకు బిరుదనామ మనియనుకొనుటచేఁ జరిత్రకారులు దుర్గనృపతియునికిని గుర్తింప లేదు.

రామేశ్వరపండితునకు శివపుర మనుగ్రామమును మొట్టమొదట దానమిచ్చినవాఁడు రెండవ బేతరాజు. ఆదానకాలము శా. శ. ౧౦౧౨ ప్రమోదూతసం॥ కార్తికబ౧౪ఆదిత్యవారము. నిమిత్తము సూర్యగ్రహణము. ఈదానము నుద్ధరించినవాఁడు. "బెటరసనసుపుత్ర కులతిలకం సకళజగతికళాసౌజన్యసార్వభౌమనె నిప్పగళికేన్ గె శ్రీమన్మహామండలేశ్వరం దుర్గనృపతిం త్రిభువనమల్లం॥

దానము నుద్ధరించిన కాలము "శ్రీమచ్చాళుక్య విక్రమకాలద ౨౩నేయ బహుధాన్యసంవత్సరద శ్రహియ్యుత్తరాయణసంక్రాంతి యొళిజరు తీర్థసంబన్ధర్వ్యాపనూగినేడి సిదశాసనగంబ మిదచంద్రార్క—తారం నిల్కె మంగళంమహా శ్రీ॥"

దానకాలమునకుఁ దరువాత దాదా పెనిమిదిసంవత్సరముల యనంతరమున నీశాసనస్తంభమును వేయించియున్నారు. దీనిని బట్టి రెండవ బేతరాజునకు దుర్గనృపతి యనినామాంతరముగల త్రిభువనమల్లుఁ డనుకుమారుఁ డున్నట్లుస్పష్టమగుచున్నది. ఈశాసన మోరుగల్లులో

చితాబుఖాను నింట నాంజనేయదేవళంపద్ద పడియున్నశిలపైఁ జెక్కఁబడియున్నది. ఈ స్తంభమును వేయించినవాఁడు దుర్గనృపతి.

ఈశివపుర మను గ్రామమునందు రామేశ్వరదీక్షితులు త్రిపురుష తీర్థము వేయించి యొకశాసన స్తంభమును వేయించినాఁడు. ఇదియే మాదిరెడ్డికుంటశాసనము. ఇందీగ్రామము "త్రిభువనమల్లునితండ్రి యిచ్చినట్లు "స్వదత్తం యస్యభక్త్యా త్రిభువనమల్లావనీశజనకేన" అనిస్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. ఈత్రిపురుషతీర్థ శాసనస్తంభమును జెక్కించి వేయించినది రామేశ్వరదీక్షితులశిష్యుఁ డైనప్రోలరాజు. దీనినిబట్టికూడ దానమిచ్చినబేతరాజు త్రిభువనమల్లునితండ్రి యనియు, త్రిభువనమల్లునికుమారుఁడు ప్రోలరాజనియు, స్పష్ట మగుచున్నది. కావున నీపరంపర సంగీకరింపకతప్పదు. ఈదుర్గనృపతి విశేషకాలము రాజ్యముచేసినట్లు గాన్పింపదు. బహుధాన్యసంవత్సరపుఖాజీపేటశాసనమును తండ్రిజీవించియుండగనే వ్రాయించినట్లు గన్పట్టుచున్నది. ఈదుర్గనృపతి గావించినఘనకార్యములును లేవు. రుద్రదేవునిహనుమకొండశాసనము (శా. శ. ౧౦౮౪) లో నీత్రిభువనమల్లుఁడు

"శ్రీమత్త్రిభువనమల్లో రాజా కాకత్యవంశసంభూతః
ప్రబలరిపువర్గనారీవైధవ్యవిధాయకాచార్యః"

అనివర్ణింపఁబడినాఁడు. ఈశాసనమును వ్రాసినకవి రామేశ్వరదీక్షితుని కుమారుఁ డగునచింతేంద్రయతి."

రుద్రదేవుఁడు మొదలుగాఁ దరువాతివారు వ్రాయించినకొన్ని శాసనములలో త్రిభువనమల్లునితోఁ బ్రారంభించి వారివంశవర్ణనముఁ జేయమొదలిడిరి. త్రిభువనమల్లబిరుదము రెండవబేతరాజునకు లేదు. ఈబేతరాజు పాశ్చాత్యచాళుక్యుఁ డైన త్రిభువనమల్లుని సామంతుఁడు. తనప్రభువుబిరుదమును తాను వహించినాఁ డనుటకంటెఁ దన యేలికనామమును దనపుత్త్రునకుఁ బెట్టినాఁడనుట సమంజసము. కావున శాసనముల యందలి త్రిభువనమల్లుఁడు రెండవబేతరాజు కుమారుఁ డైనదుర్గనృపతి యనియే గ్రహింపవలసియున్నది.

పైనవ్రాసినకన్నడశాసనము మెకంజీ వ్రాయించినస్థానికచరిత్రలో నున్నది. అది విశ్వాసార్హమైనది కాదనికొందఱనియెదరు. స్థానికచరిత్ర లలో వ్రాసినదంతయు నసత్యమని చెప్పరాదు. స్థానికచరిత్రకారు లీశాసన మును సృష్టించిరనితలంపఁగూడదు. అదియునుగాక యితరశాసనములను బట్టికూడ నీదుర్గరాజున్నట్లుస్పష్ట మగుచున్నందున నిదియొప్పుకొనక తీరదు.

౪. ప్రోలరాజు:—ఇతఁడు పైనజెప్పినదుర్గరాజుకుమారుఁడు. ఇతనిని రెండవ ప్రోలరాజని యందురు. తాతకంటెఁ బరాక్రమవంతుఁడై, యాతనివలెనే యాఱవవిక్రమాదిత్యునకు సామంతుఁడై,పిమ్మటస్వతంత్రుఁడై త్రిలింగరాజ్యమునకుఁ బునాదులు వైచినయాతనిరాజనీతి కొనియాడఁదగినది.ఇతఁడు మంత్రకూటపట్టణాధిపతి యైనగుండరాజును జయించెనని రుద్రదేవుని వేయిస్తంభాలగుడిశాసనమునందున్నది. ఈ గుండరాజును వధియించినది ప్రోలరాజుసేనాని యగుకామసేనాని యనిపాలంపేటశాసనము చెప్పుచున్నది. మంత్రకూట మనఁగా నిజాము రాష్ట్రమందలి మంథెనయనుగ్రామము. ఈవేయిస్తంభాలశాసనమునందే యీప్రోలరాజు అనంతపాలుని మేనల్లుఁడైనగోవిందదండనాయకుని జయించినట్లు చెప్పఁబడినది.ఈయనంతపాలుఁడే శ్రీపతిపండితారాధ్యుల శిష్యుఁడయినబ్రాహ్మణదండనాయకుఁడు.

ఈప్రోలరాజుతాత యైనబేతరాజుకడ మంత్రిగనున్నవైజదండాధినాథునకు యాకమాంబిక యందుజనించినబేతనప్రెగ్గడ, యీప్రోలరాజువద్ద మంత్రిగానుండెనఁట! బేతనప్రెగ్గడయు నీతనిభార్యయు జైనమతావలంబకులఁట. ఈప్రోలరాజురాజ్యపరిపాలనాకాలముక్రీ. శ. ౧౧౧౭ మొదలు ౧౧౫౮ వఱకునై యుండు నని చరిత్రకారులయభిప్రాయము. ఏకశిలానగర మనిచెప్పఁబడు వరంగల్లు నిర్మాణము నీతఁడే యారంభించెనందురు తానుజయించిన దేశములయందలిప్రజలనివాసము కొఱకీతఁడీపట్టణమును నిర్మించెనఁట. ఒకానొకదినమున నాగ్రామ వాసుల కమ్ముకొనుటకై యాహారపదార్థములను దెచ్చినయొకబండి యొకరాతికిఁ దగిలి తలక్రిందు లయ్యెనఁట. ఆబండికున్నయినుపపట్టా స్వర్ణ మయ్యెనఁట. రాజావార్తవిని యచ్చటకు వచ్చియాశిల స్పర్శవేది

యగునొకశివలింగ మనిగ్రహించి స్వయంభూలింగ మని దానినచ్చటనే ప్రతిష్ఠించి యాలయముగట్టించి యాగ్రామమును గ్రమక్రమముగా నభివృద్ధిచేసి నని చెప్పుదురు. ఈతనితరువాతి వారచ్చట బలవత్తమ మయినకోటగట్టించిరి. గణపతిదేవునికాలమున, రాజధాని హనుమకొండనుండి యోరుగల్లునకుమార్పఁబడియెను.

రుద్రదేవమహారాజు:—ఇతఁడు రెండవప్రోలరాజుకుమారుఁడు. ఇతఁడే నీతిసారమునురచించిన కవిరాజు. ఇతఁడు కొన్నిశాసనములలోఁ బ్రతాపరుద్రమహారాజని పేర్కొనఁబడియెను ఈతనితరువాతఁ గొంతకాలములో నింకనొకప్రతాపరుద్రమహారాజుండుటచే, నిటీవలి చరిత్రకారు లితనిని మొదటిప్రతాపరుద్రుఁ డనిపిలువఁజొచ్చిరి. ఇతఁడు క్రీ. శ. ౧౧౬౮ మొదలు ౧౧౯౬ వఱకు రాజ్యముచేసెను. ఇతనికిఁ బితృహంతకుఁ డనియొకయపకీర్తి వాటిల్లినది. ఒకనాఁ డీతఁడు దేవాలయమునఁ బండుకొని నిద్రపోవుచు శత్రువులతోఁ బోరుచున్నట్లు కలఁ గనుచుండెనఁట! ఇంతలోఁ దండ్రి యైనప్రోలరాజామార్గమునఁ బోవుచుఁ నాతని స్పృశించెనఁట! శత్రువెవ్వఁడో తనను దాఁకెననియనుకొని తటాలున లేచి యొఱనుండి కత్తిపెఱికితండ్రిని బొడిచెనఁట! అదిప్రమాదవశ మని గ్రహించి తండ్రి యాతనికి రాజముద్రిక నిచ్చి ప్రాణములను విడచెనఁట. ఈకథయాంధ్రులచరిత్రమునవ్రాయఁ బడినది. తరువాతఁ దత్కర్తయగు శ్రీ వీరభద్రరావుగారే, యీకథ విశ్వాసార్హమైనదికాదనియు ద్రాక్షారామమం దున్నయొకశాసనములో (వెలనాటిరెండవచోడుఁడు వ్రాయించినశాసనము) "కాకతిప్రోల రాజునిర్దహన" అనియున్నదనియు, నందుచేఁ బ్రోలరాజునుజంపినవాఁడు వెలనాటిరెండవచోడుఁడు కాని రుద్రదేవుఁడు కాఁడని వ్రాసి యున్నారు. దీనితో రుద్రదేవమహారాజుపై నారోపితమయినపితృహత్యాదోషము తొలఁగిపోయినది.

పైకథనించుకభేదముతోఁ గొందఱీవిధముగాఁ జెప్పుచున్నారు. రుద్రదేవమహారాజుజన్మించినకాలమందలి గ్రహస్థితినిబట్టి యాతఁడు పితృహంతకుఁ డగునని దైవజ్ఞులు చెప్పిరఁట. అందుపైఁ బ్రోలరాజీతని నొకశివార్చకున కిచ్చివేసెను. ఒకనాఁటి రాత్రిప్రొద్దు

పోయినపిమ్మట ప్రోలరాజాలయమునకుఁ బోఁగా దస్కరుఁడను భ్రాంతిచే, రుద్రరా జాతనినిగత్తితోఁ బొడిచెనఁట. దైవజ్ఞులమాట తప్పలే దనితలంచి ప్రోలరాజు కుమారుసిమన్నించి, రాజ్య మాతని కిచ్చివేసె నఁట. ఈకథ విశ్వాసార్హము కాదని, కథయే చెప్పు చున్నది.

రుద్రదేవమహారాజు మిగులపరాక్రమవంతుఁడును రాజనీతి నిపుణుఁడు నగుటచే, పూర్వార్జితమగు రాజ్యమునభివృద్ధిచేసియాంధ్ర రాజ్యమునకంతకుఁ బ్రభువై దాదాపు నలువదిసంవత్సరములు నిష్కం టకముగ రాజ్యముచేసెను.

# 18 మంత్రి భాస్కరుఁడు

ఆంధ్రు లతిపవిత్రములుగా ననుదినము తలంచుచుండెడిభారత భాగవతరామాయణములు మూఁడును, ఏకైకకవికృతములు గాక బహుకవికృతములగుటయు, విశేషించి యాగ్రంథకర్తలచారిత్రము లును, రచనావిషయములును వివాదాస్పదము లగుటయు నొకవిచిత్ర సంఘటనమై యున్నది. భారతము కవిత్రయముచేతను, భాగవతముకవి చతుష్టయమువలనను, రామాయణము కవిపంచకముచేతను నాంధ్రీక రింపఁబడియెను. (ఆరణ్యకాండయుద్ధకాండరచయితలు భాస్కరనామధారు లగువేఱువేఱుపురుషు లనువాద ముండుటచే రామాయణాంధ్రీకరణకర్త లైదుగురైరి.) ఈరామాయణమునకు భాస్కరరామాయణ మనిపేరు. దీనికర్తృత్వము వివాదాస్పదమైనది. అందుఁ బండితులును జరిత్ర కారులు నిదమిత్థమని నిర్ణయింపఁజాలనిమహాగహనరహస్యము లిమిడి యున్నవి.

ఈవిషయమున నిదివఱకు జరిత్రకారులును బండితులును చేసిన చర్చలనుబట్టి:—

౧. ఈగ్రంథమునకు భాస్కరరామాయణ మనుపే రెట్లువచ్చినది?

౨. ఈపేరు వచ్చుటకుఁ గారకుఁడైనభాస్కరుఁ డెవరు?

౩. అరణ్యకాండమును యుద్ధకాండమును రచియించినభాస్కరులు భిన్నులా? అయినచో వారెవరు?

౪. ఈరామాయణమున మంత్రిభాస్కరునికవిత్వ మున్నదా? ఉన్నచో నెంతవఱకు? ఆతఁ డెప్పటివాఁడు?

అనుప్రశ్నలుదయించుచున్నవి.

మంత్రిభాస్కరుఁడు, భాస్కరరామాయణమును గొంతవఱకు రచియించెనని వాద ముంటచే, నాతనిచారిత్రము నిందు వ్రాసి పైప్రశ్నలకు సమాధానముల నీయఁబ్రయత్నించెదను. భాస్కరరామాయణరచనావిషయమున పట్టికొంతవివాద మున్నది. అందునుగురించి వాల్మీకి భాస్కరాదులచరిత్రములలో వ్రాయుదును.

మంత్రిభాస్కరుఁడు, నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; గౌతమగోత్రుఁడు; కేతననాచమాంబలపుత్త్రుఁడు; గుండ శౌరికిఁ బౌత్త్రుఁడు; మారెన యితనిప్రపితామహుఁడు. మహాభారత కృతికర్త యగుతిక్కనసోమయాజి యీమంత్రిభాస్కరునకు మనమఁడు.

ఇ తఁ డు క వి యా?

ఇతనినిగూర్చి తిక్కనసోమయాజి తననిర్వచనోత్తరరామాయణమునం దీక్రిందిపద్యమును జెప్పియున్నాఁడు.

గీ. సారకవితాభిరాము గుంటూరివిభుని
మంత్రిభాస్కరు మత్పితామహుని దలఁచి
యైన మన్నన మెయి లోక మాదరించు
వేఱ నాకృతిగుణములు వేయు నేల.

తనకావ్యము, స్వగుణముచేతఁ గాకపోయినను, తనపితామహుఁడైనమంత్రిభాస్కరుని సారకవిత్వమహిమచే నైనను లోకాదరణమును బొందఁగలుగు నని యీపద్య మందలిభావము. దీనినిబట్టి మంత్రిభాస్కరుఁడు తిక్కనవంటిమహాకవి కొనియాడుటకుఁ దగినకవిత్వముఁ

జెప్పఁగలసమర్థుఁ డని నిశ్చయించుటకు సంశయింపనక్కఱ లేదు. దశకుమారచరిత్రమును రచించిన కేతనకవి యితనిని

శా. శాపానుగ్రహశక్తియుక్తుఁ డమలాచారుండు సాహిత్యవి
ద్యాపారీణుఁడు ధర్మమార్గపథికుం డర్థార్థిలోకావన
వ్యాపారవ్రతుఁ డంచుఁ జెప్ప సుజనవ్రాతంబు గౌరీపతి
శ్రీపాదప్రవణాంతరంగు విబుధశ్రేయస్కరున్ భాస్కరున్.

అని నుతించియున్నాఁడు. ఈపద్యమందలి "శాపానుగ్రహశక్తియుక్తుఁడు" "సాహిత్యవిద్యాపారీణుఁడు" అనువాక్యములవలన నీ భాస్కరుఁడు కవిత్వము చెప్పఁగలసమర్థుఁ డని యూహింపవచ్చును. తనకవిత్వముకంటె రసవత్తర మగుకవిత్వము చెప్పగలవాఁ డని తిక్కన సోమయాజియే చెప్పినప్పుడు, మంత్రిభాస్కరునికవితాసామర్థ్యమును గూర్చి మనము శంకింపనక్కఱ లేదు. ఇతఁ డేవియోనాల్గుపద్యము లల్లఁగలిగినసామాన్యకవిమాత్రుఁడు గాక రసవత్తర మైనకవిత్వము చెప్పఁగలిగినయొకగ్రంథకర్త యై యుండునని కూడఁ దిక్కనచెప్పిన పద్యమునుబట్టి యూహింపఁదగియున్నది.

## ఇతఁడు భాస్కరరామాయణకర్తయా?

మంత్రిభాస్కరుఁడు రామాయణమున నరణ్యకాండాంతము వఱకును రచియించె ననియు, నీతనినిబట్టియే రామాయణమునకు భాస్కరరామాయణ మనుపేరు వచ్చినదనియు, నది యేకారణము చేతనో యుత్సన్నమై పోఁగాఁ దరువాతికవులు దానిని మరల రచించి రనియు లోకమున నొకప్రతీతి యున్నది. రామాయణము నాతఁడు పూర్తిగనే రచియించె ననువాదముకూడఁ గలదు. ఈవిషయమునఁ బండితులు భిన్నాభిప్రాయమును గలిగియున్నారు. రామాయణములోఁ గొంతభాగమును భాస్కరుఁ డనుకవి రచియించె నని యందఱు నంగీకరించుచున్నారు. ఆవిషయమునుగూర్చి గ్రంథనామమును, ఆరణ్యకాండాంతగద్యయును ప్రబలమైనసాక్ష్య మిచ్చుచున్నవి. కాని

ఆభాస్కరుఁ డీమంత్రిభాస్కరుఁడు కాఁడనియు, హుళక్కిభాస్కరుఁడను పేరుగల మఱియొక భాస్కరుఁ డనియుఁ గొందఱి వాదము. ప్రస్తుతము మనము చదువుచున్న భాస్కరరామాయణములో యుద్ధకాండమున గొంతవఱకు హుళక్కిభాస్కరుఁడు రచియించె ననియుభయపక్షములు వారును నంగీకరించుచున్నారు. అందువిషయమున భిన్నాభిప్రాయము లేదు. ఇఁక మొదటియైదు కాండములలోను మంత్రిభాస్కరునికవిత్వ ముండెనా? లేదా? యనునదియే వివాదాంశము. ఈయిరువురకును నామసామ్యము గలిగియుండుటమూలమున నీవివాదమును బరిష్కరించుట యంతసులభకార్యము కాదు. భాస్కరరామాయణమునుగూర్చి యింకను బరిశోధనము విశేషముగాఁ గావలసియున్నది. భావిపరిశోధకుల కుపకరించుననునూహతో నీవిషయమున నాకుఁ బొడఁగట్టిన విషయముల నిట వ్రాయుచున్నాఁడను.

మంత్రిభాస్కరుడు రామాయణమును రచించెనని పూర్వకవు లెవ్వరైనఁ జెప్పియుండిరా?

పూర్వకవులు పెక్కురును లక్షణగ్రంథకర్తలుకొందఱును దమ గ్రంథములలో భాస్కరునిఁ బూర్వకవినిగాఁ బేర్కొనియాతఁడు రామాయణకర్తయని చెప్పియున్నారు. కొందఱు "హుళక్కి" శబ్దమును జేర్చి హుళక్కిభాస్కరుఁ డని నుతించియున్నారు.

దీనినిబట్టి "హుళక్కిభాస్కరుఁ" డనఁగాక కేవలభాస్కరుఁ డని చెప్పినయాతనిని మంత్రిభాస్కరుఁ డని నిశ్చయింపవలయునని కొంద అందురు. కానియీవాదమునందంతగా బలము లేదు. మంత్రిభాస్కరుని కాలము క్రీ. శ. ౧౨౦౦ ప్రాంతము. హుళక్కిభాస్కరునికాలము ౧౩౨౦ ప్రాంతము. భాస్కరుని పూర్వకవినిగా నుతించినవా రందఱును ౧౩౨౦ వసంవత్సరమునకుఁదరువాతివారు గాని యంతకుపూర్వులు కారు. వీరు తమకావ్యములలో నేభాస్కరుని మనసునందుంచుకొని స్మరించిరో నిర్ణయింపఁజాలము. 'హుళక్కి' పదము లేనంతమాత్రమున నాతఁడు మంత్రిభాస్కరుఁడని నిర్ణయింపరాదు. క్రీ. శ. ౧౨౦౦—౧౩౨౦నడుమ నెవ్వరైనభాస్కరునిఁ గొనియాడియుండినచో, నాతఁడు మంత్రి

భాస్కరుఁడని చెప్పవచ్చును. కాని యట్టివారు కన్పడుట లేదు. ఆ కాలమున సుప్రసిద్ధకవులు విశేషముగా లేరు. సోమన, కేతన, తిక్కన, మారన, మంచెన, మొదలగు కొలఁదిసంఖ్యాకులు మాత్రమే కలరు. వీరిలో మంత్రిభాస్కరునిగూర్చి చెప్పవలసినవారు ముఖ్యముగా కేతన, తిక్కనలు. వీరాతనినిగూర్చి యేమిచెప్పినదియుఁ బైన వ్రాసియుంటిని. వీరిరు వురునుగూడ భాస్కరుఁడు రామాయణమును రచించె నని చెప్పలేదు. కావున నాతనికి రామాయణకర్తృత్వ మారోపింపరా దని కొంద అనుచున్నారు. కాని యీ వాదమునందును సారము లేదు. ఆ కాలమునాఁటిమానవహృదయముల నీకాలమునాఁటికొలఁతబద్దతో కొలుచుటకు వీలు లేదు. పదియవశతాబ్ది మొదలు పదునైదవశతాబ్ది వఱకును గలకవులు స్వోత్కర్షఁ బ్రకటించుకొనుటకుఁ గాని, స్వీయ చరిత్రమును జెప్పుకొనుటకుఁ గాని, యంతగా నిష్టపడియెడివారు కారు. తరువాతికవులు క్రమక్రమముగాఁ దమనుగూర్చియుఁ దమపూర్వులను గూర్చియుఁ గొంతకొంత వ్రాయుచువచ్చిరి. గ్రంథవిషయముకంటె తమ్మువిషయమే ప్రధానముగ నెంచుకొనుకాల మిది. తిక్కనసోమయాజి తాను నిర్వచనోత్తరరామాయణమును రచించినట్లు భారతమునఁ జెప్పలేదు. మన్మసిద్ధియాస్థానమున నుండి తిక్కనామాత్యుఁ డుభయ భాషలయందును గవిత్వముచెప్పె నని మాత్రమే కేతనచెప్పెను కాని యాతఁడు రచించినగ్రంథములపేరులనైనఁ జెప్పలేదు. కేతనతనగ్రంథ ములు రెండింటిలోను, ఒకదానిసంగతి రెండవగ్రంథమునఁ జెప్పెనా? అదియును లేదు. ఇట్టియుదాహరణముల నేకముగఁ జూపవచ్చును. కావున నితరకవు లెవ్వరును జెప్పలే దనుకారణము నాధారము చేసి కొని భాస్కరునిరామాయణకర్తృత్వమును తోసివేయక యితరా ధారము లేవయిన నున్నవేమో చూడవలసియున్నది.

## తిక్కన పూర్వరామాయణమును రచింపక యుత్తరరామాయణము నేల వ్రాసెను?

తిక్కనసోమయాజి పూర్వరామాయణమును విడచి యుత్తర రామాయణమును రచించుటవలనను మంత్రిభాస్కరుఁడు రామాయణ

మును రచించె ననుజనశ్రుతియుండుటను బట్టియు నాతఁడురామాయణ మును రచించె నని నిశ్చయింపవచ్చు నని కొందఱియభిప్రాయము. ఇందెంతవఱకు సత్యమున్నదో చూతము. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున

"క. ఎత్తఱినైనను ధీరో
దాత్తనృపోత్తముఁడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్య మగుట
నుత్తరరామాయణోక్తియుక్తుఁడ నైతిన్"

అనిచెప్పియున్నాఁడు.

గంభీరహృదయుఁడును, ఉచితానుచితజ్ఞను బాటించుకవిసత్తముఁడునగుతిక్కనసోమయాజి యీపద్యమును వ్రాయుట కేమికారణము? అని యాలోచింపవలసియున్నది. పూర్వరామాయణ ముండఁగా దానిని రచింపక యుత్తరరామాయణ మేల రచింపవలయు నని లోకము ప్రశ్నించునేమో యని యందులకు సమాధానముగా ధీరోదాత్తనాయకుఁడైనశ్రీరామచంద్రునిసద్వృత్త మెచ్చటనుండి రచించినను పూజనీయమే యగును గావున నుత్తరరామాయణమును రచించితి నని యీపద్యమును జెప్పిన ట్లూకయూహ కలుగును. దీనినిబట్టి యది వఱకు పూర్వరామాయణము రచింపఁ బడలేదని తెలుచున్నది. పూర్వరామాయణ మదివఱకు రచింపఁబడియున్నయెడల లోకము ప్రశ్నించుట కవకాశమును లేదు. తిక్కన యీపద్యమును వ్రాయ వలసినపనియు నుండదు.

కాని యంతకుపూర్వము రామాయణము సంపూర్ణముగాఁ గాకకొంతభాగము మాత్రమే రచియింపఁబడియుండెనేని, యాతరువాయి నందుకొని శేషమ్మును బూర్తిచేయక యాభాగమును వదలి యుత్తర రామాయణము నేల రచించుచున్నా వని లోకము తనను బ్రశ్నించు నేమోయని తిక్కన యీపద్యము మూలమున నాప్రశ్న కుత్తరమొసంగు చున్నాఁ డని తలఁచుట కవకాశము కలుగుచున్నది. ఆ పక్షములో ఆప్రశ్నకును, ఆసమాధానమునకును గూడ నవసర మేర్పడుచున్నది.

కావునఁ దిక్కనకాలమునాటికి రామాయణము కొంతభాగముఁ రచింయింపఁబడియుండె నని యూహించుట కవకాశమున్నదనుట నిశ్చయము. ఎంతవఱకు రచియింపఁబడియుండె ననుటనుగూర్చి తరువాత నాలోచింతము.

పై పద్యముక్రిందనే తిక్కన తనపితామహునిఁగూర్చి యీ క్రిందిపద్యమును వ్రాసియుండెను.

తే. సారకవితాభిరాము గుంటూరివిభుని
మంత్రిభాస్కరు నుత్పితామహునిఁ దలఁచి
యైన మన్ననమెయి లోక మాదరించు
వేఱ నాకృతిగుణములు వేయు నేల?

ఈ పద్యములో మంత్రిభాస్కరుఁడు రామాయణమును రచించె ననుసూచన కూడ లేనిమాట నిశ్చయము. అయినను పైపద్యమును వ్రాసిన వెనువెంటనే తిక్కన యీపద్యమును వ్రాసియుండుటచేతఁ దనపితామహుఁడైన భాస్కరుఁడు రామాయణభాగమును రచించినాఁడనువిషయము మనసునం దుంచుకొనియే యీపద్యమును వ్రాసియుండెనా యని సంశయము కలుగుచున్నది. ఈ పద్యము చెప్పినవిమ్మటఁగాని తనకులగోత్రాదిప్రశంస యాతనిహృదయమునకు రాలేదు. ఈరెండుపద్యములను కలిపిచదివి యోచించితి మేని మంత్రి భాస్కరుఁడు రామాయణమున గొంతభాగము రచియించియుండె నని దృఢమైనయనుమానము గలుగకమానదు. అనుమానమేల? ఆయూహ యందు సత్యమున్నదనియేనాతలంపు. అట్లయినచో, భారతమున నన్నయమూఁడుపర్వములు రచించె నని చెప్పినట్లే తనపితామహుఁ డింతవఱకు రచించెనని తిక్కన యేలచెప్పలే దనుప్రశ్న రావచ్చును. భారతమునందు తిక్కనపదియేనుపర్వములనుఁ దాను పూర్తిచేయఁ దలపెట్టెను గావున నన్నయభట్టు మూఁడుపర్వములను రచియించెను. తక్కినభాగమును రచించి నేనుభారతమునుఁ బూర్తిచేయుదు నని చెప్పుటలో సరస మున్నది. లోక మందులకు హర్షించును. ఇచ్చట నట్టి

యదృష్టము పట్టలేదు. తనపితామహుఁడు మూఁడుకాండములను రచించినాఁడు అని చెప్పి యంతటితో వదలివేసి తాను, ఉత్తరరామాయణమును రచించెద నని చెప్పినచో నది సరసముగ నుండునా? లోకము సంతసించునా? తిక్కన, యాతరువాయిభాగము నందుకొని రామాయణము నేల పూర్తిచేయలేదు? అని శంకింతు రేమో! మహాత్ములహృదయములు దురవగాహములు. ఆయనమనసులోఁ నప్పు డేమికలదో యెవరు చెప్పఁగలరు? ఎంతటిధైర్యవంతునకైనను ఒక్కమారు చదివినంతనే హృదయవిదారకం బొనరించుస్త్రీపర్వాదులను రచించినతిక్కనసోమయాజి, భారతరచనానంతరమునఁ గూడ నారణ్యపర్వశేషమును బూరింపలేదు. దీనికిఁ గారణ మేమందుము? కొంత భాగమును రచించిమరణించిన తనపితామహునికావ్యము బూర్తిచేయుట కాతనికి మనసు గొలుపకయుండును.

పైనఁజెప్పిన "ఎత్తఱినైనను" అనుపద్యములో నింతయర్థమిమిడియుండలే దనియు, "ఎప్పుడైనను ధీరోదాత్తనాయకుఁడైనరామచంద్రునివృత్తము పూజనీయమే కావున నుత్తరరామాయణమును రచించితి" ననుసామాన్యార్థము మాత్రమే యందుఁ గలదనియు, లోకము శంకించు ననునూహగాని యందుల కుత్తర మీయవలయు ననుభావము గాని తిక్కనకు లే దనియు, నట్లే దానితరువాయిపద్యములో నెట్టిసూచనయు లే దనియుఁ నీయూహాలన్నియు మంత్రి భాస్కరుఁడు రామాయణము రచించె ననుభావమును గలిగియుండుటచే నుద్భవించెడిభ్రాంతిమూలకము లగునూహాలనియుఁ గొంద ఱన వచ్చును.

ఆ పద్యమునం దెంతయర్థ ముండెనో, లోకమున కేమి తెలుపఁగోరి యాతఁ డాపద్యములను రచియించెనో, యనువిషయములను గూర్చి తిక్కనకవితాస్వారస్యమును గ్రహింపఁగలిగినరసజ్ఞులు తమకుఁ దోఁచినరీతిని నిర్ణయించెదరు గాత! తనపితామహుఁడు రామాయణభాగమును రచించియుండెనని తెలుపుటకే తిక్కన యాపద్యములను రచించెనని నాతలంపు

ఉ. భూరివివేకచిత్తులకుఁ బోలఁ గనం దలఁపన్ దళంబులన్
సౌరభ మిచ్చుగంధవహుచందమునం బ్రకటంబు చేసి యిం
పారెడుపల్కు లం బడయ నప్పలుకు ల్సరి గ్రుచ్చునట్లుగాఁ
జేరుపనేరఁగా వలయుఁ జేసెద నే గృతి యన్నవారికిన్.

నిర్వచనోత్తరరామాయణము.

భాస్కరరామాయణ మనుపే రెట్లు వచ్చినది?

భాస్కరరామాయణ మనుపేరు కవి యుంచెనని చెప్పఁజాలము. కవి తనపేరును జేర్చి నామమిడినగ్రంథములు కొన్నికలవు. కాని యిట్టి వివాదవిషయములలోఁ గవియే తనపేరుతో గ్రంథనామము నుంచె నని తలంచుట న్యాయము కాఁజాలదు. రామాయణమను పేరు గ్రంథమో, గ్రంథములో యుంటుటచేఁ గొంతకాలమునకుఁ బిమ్మట లోక మీగ్రంథము నీపేరునఁ బిలువఁజొచ్చిన దని తలంపవలసి యున్నది. ఎప్పటినుండి యీపేరు లోకమున వాడుకలోనికి వచ్చినదో చెప్పఁజాలము. క్రీ శ. ౧౨౦౦-౧౩౨౦నడుమ నీపే రున్నదని ధృవ పడినచేతప్ప, నీనామము మంత్రిభాస్కరున కన్వయించునని నిర్ణయించుట కవకాశము లేదు. ఆమధ్యకాలములో నీపేరు వాడుకలోనుండె నను సాక్ష్యము లేదు. కావున గ్రంథనామమునుబట్టి మంత్రిభాస్కరుని కర్తృత్వము స్థిరపడఁజాలదు. కాని యాతనిపేరుతోనే యీరామా యణమును బిలుచుచున్నారని తలంచుట కొకయవకాశము గన్పడు చున్నది.

ఇప్పుడు మనకు లభించుచున్న భాస్కరరామాయణమందలి గద్య పద్యములను బట్టి రామాయణకవు లైదుగురని తెలియుచున్నది. బాల, కిష్కింధసుందరకాండములను రచించినవాఁడు మల్లికార్జునభట్టు. అయోధ్యాకాండమును రచించినది కుమారరుద్రదేవుఁడు. అరణ్య కాండమునురచించినవాఁడు భాస్కరుఁడు. యుద్ధకాండమునఁ గొంత భాగమును రచించినవాఁడు హుళక్కిభాస్కరుఁడు. మిగిలినభాగ మును రచించినది అయ్యలార్యుఁడు. గ్రంథమును ప్రారంభించినవాని

పేరునఁబట్టి గ్రంథనామ మేర్పడుట న్యాయము. అట్లుగాక గ్రంథాంత కాండములోఁ గొంతభాగమును రచించిన హుళక్కి భాస్కరుని పేరుతో గ్రంథనామ మేర్పడిన దనుట సమంజసము కాదు.

ఈ సూత్రము నన్వయింపఁ జేసి చూచినచో, నీగ్రంథమునకు మల్లికార్జునరామాయణ మను పేరు రావలసియున్నది. అట్లు రాలేదు. భాస్కర రామాయణ మని పేరువచ్చుటకు, అరణ్యకాండగద్యలే కారణమై యుండవలయును. అరణ్యకాండ భాస్కరవిరచిత మని యీ గద్యల వలన స్పష్టముగాఁ దెలియుచున్నది. యుద్ధకాండాంతమున నయ్యలార్యునిగద్యయే కాని భాస్కరునిగద్య లేదు. కావున నీరామాయణమునకు భాస్కరరామాయణ మని పేరుపెట్టినవారు, అరణ్యకాండాంత గద్యనే యందుల కాధారముగాఁ గొనియున్నా రనితలంపవలసియున్నది. యుద్ధకాండములోఁ గొంతభాగమును హుళక్కి భాస్కరుఁడు రచియించియుండుటచే నాతనినిబట్టియే యీ వాడుక వచ్చిన దని కొందఱన వచ్చును. యుద్ధకాండభాగమును హుళక్కి భాస్కరుఁడు రచియించె నని, యయ్యలార్యుఁడు చెప్పిన :-

"చ. అమర హుళక్కి భాస్కరమహాకవి చెప్పఁగనున్న యుద్ధకాం
డము తరువాయి చెప్పిఁ బ్రకటప్రతిభాషణుఁ డప్పలార్యపు
త్త్రమనుతుఁ డయ్యలార్యుఁడు కృతస్థితి నార్యులు మెచ్చునట్లుగా
హిమకర తార కారవిమహీవలయస్థిరలక్ష్మిఁ జేకుఱన్."

అనుపద్యమువలన మాత్రమే మనకుఁ దెలియవచ్చుచున్నది. ఈపద్యము లేకపోయినచో మనకు హుళక్కి భాస్కరుఁడు తెనే లేఁడు. స్పష్టముగా రెండుగద్యలమూలమునఁ దెలియుచున్న భాస్కరునివిడచి, హుళక్కి భాస్కరునకుఁ దరువాతఁ జాలకాలమునకు అయ్యలార్యుఁడు రచియించినపద్యముచే నెఱుంగవచ్చిన హుళక్కి భాస్కరునిఁబట్టి గ్రంథనామ మేర్పడినదనుట సమంజసము కాదు. ఇందుల కారణ్యకాండకర్త్తయు, యుద్ధకాండాది భాగకర్త్తయు నొక్కఁడే యనియు, నాతఁడే హుళక్కి భాస్కరుఁడనియు ప్రతివాదము రావచ్చును. ఆవాదమున కవకాశమున్నమాట నిశ్చయమే. కాని కారణాంతరములచే నారణ్య

కాండకర్తృభిన్నుఁ డనిధృవపడియె నేని, యాతనినిబట్టియే యీగ్రంథము నకు భాస్కరరామాయణ మను పేరువచ్చిన దని నిశ్చయింపవలసి యున్నది. ఇంతే కాదు. అట్టిభిన్నకర్తృత్వము స్థిరపడిన పక్షములో మొట్టమొదట మంత్రిభాస్కరుఁ డరణ్యకాండమువఱకునో, కాక యింకను మఱికొంత భాగమునో కాక పూర్తిగనో రచియించి యుండెననియు, నాతని పేరుతోడనే భాస్కరరామాయణ మను పేరు వచ్చెనసియుఁ గాక తాళీయముగ హుళక్కిభాస్కరుఁడుకూడఁ గొంతభాగము నిందు రచియించియుండుటచేనాతనిబట్టి పేరువచ్చినట్లు లోకము భ్రమించుచున్నదనియుఁ దలంచుట కూడ సమంజస మగును.

బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారు మున్నుగ కొందఱు హుళక్కిభాస్కరునిబట్టియే భాస్కరరామాయణమను పేరు వచ్చె నని వ్రాసియున్నారు. ఆవిషయమును గూర్చి హుళక్కిభాస్కరునిచారిత్ర మునఁ జర్చించెదను. ఒకవేళ యుద్ధకాండమును రచించిన హుళక్కిభాస్కరుని పేరుతోడనే గ్రంథనామమేర్పడినదని యంగీకరించినను నంతమాత్రమున రామాయణరచనమునందు మంత్రిభాస్కరునకు స్థానము లేదని ధృవపరుపక యీవిచారణను గొనసాగింపవలసియే యున్నది.

## మంత్రి భాస్కరుని కర్తృత్వమును స్థిరపర్చెడి యాధారములు గ్రంథమునం దేమైనఁ గలవా?

ఈ పైపై యూహల నటుంచి, మంత్రిభాస్కరునికర్తృత్వమును స్థిరపరచెడియాధారములు గ్రంథమునం దేమయిన కల వేమో చూడ వలసియున్నది. భాస్కరరామాయణమునఁ దక్కినవానికంటె నారణ్య కాండము మంత్రిభాస్కరవిరచిత మనితలంచుట కాధారములున్న వని కొంద ఱనుచున్నారు. కావున ముందుగ నాకాండమునే పరిశీ లింతము.

## ఆరణ్యకాండగద్యలు

ఆరణ్యకాండము రెండాశ్వాసములుగ విభజింపఁబడియున్నది. ఆ రెండాశ్వాసములతుదలను గద్యము లొకేవిధమున నీరీతిగనున్నవి. గద్యము "ఇది సకలసుకవిజనవినుతయశస్కరభాస్కరప్రణీతం బైన శ్రీరామాయణమహాకావ్యంబునం దారణ్యకాండంబు" కొన్నితాళపత్ర ప్రతులలో "యశస్కర" శబ్దము లేదు. ఆశబ్దమును దీసివేసినచో నిది సర్వవిధముల నన్నయభట్టు భారతమున వ్రాసికొనినగద్యను బోలి యున్నది. శ్రీమహాభారతమున నన్నయభట్టు "ఇది సకలసుకవిజన వినుత నన్నయభట్టప్రణీతం బైన" అని వ్రాసికొనియున్నాడు.

ఈగద్యమునుబట్టి, దీనికర్త మంత్రిభాస్కరుఁడో హుళక్కి-భాస్కరుఁడో నిర్ణయించుటకు సాధ్యము కాదు. హుళక్కి-భాస్కరుని కంటె మంత్రిభాస్కరుఁడు నన్నయభట్టునకు సమీపకాలములోని వాఁడు కావున, నన్నయభట్టు ననుకరించినవాఁడు మంత్రిభాస్కరుఁడే యని నిర్ణయింపవలయు నని కొందఱందురు. కాని యావాదము నందు బలము లేదు. హుళక్కి-భాస్కరుఁ డట్టిగద్యను వేసికొని యుండఁ డని తలంచుట కవకాశము లేదు. యుద్ధకాండమును హుళక్కి భాస్కరుఁడు పూర్తిగ రచింపకపోవుటచే నాతఁడు గద్యమును వేసి కొని యుండలేదు. అది పూర్తియై గద్యమును వేసికొనునవసరము గలిగినచో నెట్లు వ్రాసికొనియుండునో యెవరు చెప్పఁగలరు?

## ఆరణ్యకాండాశ్వాస విభజనము?

ఆరణ్యకాండము మొత్తము 238 పద్యములు. ఇందు మొదటి యాశ్వాసమున ౨౯౮ పద్యములును రెండవయాశ్వాసమున ౮౪౦ పద్యములును గలవు. హుళక్కి-భాస్కరుఁడు యుద్ధకాండమున ౧౧౩౯ పద్యములను రచించియుండియు నాశ్వాసవిభాగము చేయ లేదు. ఆరణ్యకాండము 238 పద్యములే యయ్యును రెండాశ్వాసములుగా నున్నది. ఇందువలన, ఆరణ్యకాండయుద్ధకాండకర్త లొక్కరు కారనితలంచుట కవకాశము కల్గుచున్నది. యుద్ధకాండ మంతయు

రచింపబడినపిమ్మట నాశ్వాసవిభజనము చేయవచ్చు నని హుళక్కి-భాస్కరుఁడు తలంచియుండవచ్చు ననియు, నది పూర్తికాకపూర్వమే యాతనిరచనమాగిపోవుటచే నాశ్వాసవిభజనకార్యముకూడ నాగిపోయె ననియుఁగొందఱు సమాధానము చెప్పుచున్నారు. హుళక్కి-భాస్కరుఁడు రచియించుచున్నది స్వతంత్రగ్రంథము కాదు. వాల్మీకిరామాయణమున కాంధ్రీకరణము. సంస్కృతరామాయణమున నధ్యాయవిభజన ముండియున్నది. తనకుచితమనితోఁచినని యధ్యాయముల నాంధ్రీకరించినపిమ్మట నక్కడి కొకయాశ్వాస మని వ్రాసికొనుట సులభము కాని గ్రంథమంతయు రచించినపిమ్మట నాశ్వాసవిభజన మొకపనిగాఁ బెట్టుకొనుట సులభముకాజాలదు. ఆశ్వాసమున కైదు పద్యము లధికముగా గ్రంథరచనామధ్యమున వ్రాయవలసివచ్చు నని యాకార్యమును దుదవఱకు నిలిపియుంచె ననుటలో స్వారస్యము లేదు. అరణ్యకాండమును హుళక్కి-భాస్కరుఁడు రచియింపలేదని నిర్ణయించుట కీయాశ్వాసవిభజనావిషయ మొకగొప్పయాధారము కాకపోయినను, అరణ్యకాండయుద్ధకాండరచయిత లిరువురా? ఏకవ్యక్తియా? యని నిర్ధారణము చేయుటలో నీయంశము తోడుపడగలదు. ఇట్టి విషయములలో నొకవ్యక్తి యొకగ్రంథమున రెండుపద్ధతుల నవలంబించి యుండఁడు. కావున దీనినిబట్టి యారణ్యయుద్ధకాండకర్తలు భిన్నులని మనము నిర్ణయింపవచ్చును.

## అరణ్యకాండకృతిపతి యెవ్వరు?

అరణ్యకాండమునందుఁగృతిపతిని సంభోధించినపద్యము లేవయిన కృతికర్తను నిశ్చయించుటకుఁ దోడుపడునేమో చూడవలసియున్నది. అరణ్యకాండప్రథమాశ్వాసమునఁ గృతిపతిని సంబోధించినపద్య మిది:

క. శ్రీహిత నయవిలసిత వా
ణీహిత మృదువచన ధారుణీహితగుణసం
దోహా త్రివిక్రమవిక్రమ
సాహస నగధైర్యసార సాహిణిమారా!

ఈ పద్యమునకుఁ బాఠాంతరముగా వ్రాతప్రతియం దీక్రింది పద్యమున్నది.

క. శ్రీరమ్యస్థితి వదనప
యోరుహ శుండాలగండయుగళితవిగళ
ద్ధారాళదానదారా
సారాప్లుత భవనహార సాహిణిమారా!

పాఠాంతర మనిన ప్పు డేవయిన కొన్నిశబ్దము లటునిటు నుండుట ధర్మము. ఇచ్చట పద్య మంతయు వేఱు రీతిగా నున్నది. రెండు పద్యములయందలిభావములును వేఱు వేఱుగా నున్నవి.

రెండవ యాశ్వాసమునఁ గృతిపతిని సంబోధించినపద్య మిది:

క. శ్రీరామాకుచయుగళీ
హారిద్రోల్లసితవత్సహరిచరణసరో
జారాధ్యుఁడు మారయధర
ణీరమణోత్తముఁడు సాహిణీతిలక మిలన్.

ఈపద్యమే యించుకమార్పుతో నీక్రిందివిధమున బాలకాండ యందు అఱవ పద్యముగా నున్నది.

క. శ్రీరామాకుచయుగళీ
హారిద్రోల్లసితవత్సహరిచరణసరో
జారాధ్య! బుద్ధవిభుసుత!
సారసహిత తేజ! ధీర! సాహిణిమారా!

రెండవయాశ్వాసాదినిసంబోధనముండుటకు బదులుగా ప్రథమావిభక్తియుండుటయు, పాఠాంతరము లుండుటయుఁజూడఁగా, నీపద్యములు కవివిరచితములు గాక, విలేఖకులో మఱియెవ్వరో సాహిణిమారునిసంబంధించుపద్యములను రచించి, యిందుఁ జేర్చి రని యూహింపఁదగియున్నది. బాలకిష్కింధకాండములలోఁగూడ నిట్టిభేదములు గన్పట్టుచున్నవి. (ఇందునుగూర్చి మల్లికార్జునభట్టుచారిత్రమున విపులముగాఁ జర్చింపఁదలఁచితిని.)

బాలకిష్కింధకాండాదిపద్యములు సాహిణిమారయ పేరనను, కాండాంతపద్యములు శివుని పేరను గలవు. సుందరకాండాదిపద్యము ముద్రితప్రతిలో సాహిణిపేరను, తాళపత్త్రప్రతిలో నీశ్వరుని పరముగను గలదు. రెండుప్రతులలోనుగూడ నాకాండాంతపద్యములు శివపరముగనే యున్నవి. దీనిఁబట్టి విలేఖకుఁడో మఱియెవ్వరో, అన్నికాండములకును సరిపడు నన్నికందపద్యము లొక్కసారిగా సాహిణిమారుని సంబోధించుచు వ్రాసి, యదివఱ కున్నపద్యములను దీసివేసి వానికి బదులుగా వీని నందుఁ జేర్చియుండు నని తోఁచుచున్నది. హుళక్కి భాస్కరుఁడు రచించినయుద్ధకాండమున మొదటిపద్యము సాహిణిపరముగా నున్నది. అతఁడు సాహిణిమారనికాలమున నున్నవాఁ డనుటయు నిజమే. కాని యీపద్యముదక్క యుద్ధకాండమును హుళక్కిభాస్కరుఁడు సాహిణిమారని కంకితము చేసెనని నిర్ణయించుటకుఁ దగినయాధారములు లేవు. యుద్ధకాండాదిపద్యముకూడ బాలకిష్కింధకాండాదిపద్యములవలెనే ప్రక్షిప్తమని నాయభిప్రాయము. (హుళక్కిభాస్కరకవిచారిత్రమున నీవిషయమునుగూర్చి వ్రాసెదను.)

బాలకాండాదులయందలి ప్రథమపద్యములవలెనే ఆరణ్యకాండాదిపద్యములుకూడ ప్రక్షిప్తము లని నిర్ణయించితిమేని, యాకాండముతో సాహిణిమారనిసంబంధమును, దానితోపాటు హుళక్కిభాస్కరుని సంబంధమునుగూడ లేకుండఁబోవును. అవి ప్రక్షిప్తములు కాక వాస్తవముగా భాస్కరకవియే రచియించెనని తలంచినచో నాభాస్కరుఁడు హుళక్కిభాస్కరుఁడే యని నిశ్చయింపవలసియున్నది. ఈవిషయమును నిర్ణయించుట కాశ్వాసాంతపద్యము లేమయిన సాహాయ్య మొనర్చునేమో చూడవలసియున్నది వాని నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ప్రథమాశ్వాసాంతపద్యములు :

శా. పుణ్యుం డూర్జితశౌర్యధైర్యమహిమస్ఫూర్తిస్ఫురద్వైభవా
గణ్యుం డార్యజనానురంజితమహాకారుణ్యుఁ డుద్యచ్ఛ్లాఘ్యసౌ
గుణ్యుం డన్వయవార్ధిచంద్రుఁడు రిపుక్షోణీశ్వరస్థాపితా
రణ్యుం డార్తశరణ్యుఁ డుజ్జ్వలయశోరమ్యుండు సౌమ్యుం డిలన్.

క. మతివిజితసురాచార్యుఁడు
చతురత్వచతుర్ముఖుండు సదమలవృత్తా
యతపంకజలోచనుఁడును
శ్రితవినుతగుణప్రధానధురీణుఁడు పేర్మిన్.

మాలిని. వితరణఖని యుద్యద్వీర్యప్రభావో
న్నతుఁడు భుజబలాత్యున్మాదవిద్విడ్ధరిత్రీ
పతిహరణసమిద్భాభాగధుర్యుండు సంభా
వితపరిణతచిత్తోర్వీసుకాంతుర్వి నెంకన్.

ఈ మాలినీవృత్తము మాయూరనున్న తాళపత్రప్రతిలో నిట్లున్నది :

"వితరణఖని యుద్యద్వీరశృంగారలక్ష్మీ
యుతుఁ డురుభుజశౌర్యాఢ్యుండు విద్విడ్ధరిత్రీ
పతిహరణసమిద్భాభాగధుర్యుండు సంభా
వితపరిణతచిత్తోర్వీజనాధీశుం డెంకన్."

ద్వితీయాశ్వాసాంతపద్యములు :

శా. వైరిక్ష్మాతలనాథపర్వతసహస్రవజ్రాయుధున్ ఘోరసం
గ్రామారంభాహవప్రథితారిదుస్సహాతమిస్రప్రస్ఫురద్భానుగం
భీరాంభోనిధి ధీరతానిమిషభూభృన్నాథు నత్యంతవి
స్తారోదారగుణప్రసిద్ధినవరాధాపుత్రు సన్మిత్రునిన్.

క. లలనాజనవరభద్రుని
బలవిలసితవినుతరామభద్రుని సుద్య
త్సులభతరగుణోన్నద్ధుని
బలవిలసితవినుతరామభద్రుని ప్రీతిన్.

మాలిని. విభవజితసురేంద్రున్ విస్ఫురత్కాంతిచంద్రున్
శుభతరవరగాత్రున్ సూరిసంస్తోత్రపాత్రున్
ప్రభుజనవిదాద్యున్ ప్రాజ్ఞవిద్యానవద్యున్
సభయురిపుశరణ్యున్ సంభృతాగణ్యపుణ్యున్.

ఈపద్యము లాఱింటిలోను సాహిణిమారుని పేరు గాని యాతనిని సూచించుమఱియొకపదముగాని లేదు. అయోధ్యాకాండము సాహిణి కంకితము జేసిన ట్లాకాండాంతపద్యమునందలి "కాచమారాం బౌకుమారా" యనువాక్యమువలనఁ దెలియుచున్నది. అట్టి దారణ్యకాండమున నేమియును లేదు. కాని యాపద్యములలోఁ గృతిపతిపేరు గన్పడనంతమాత్రమున నాగ్రంథము సాహిణిమారని కంకితము కాలేదని నిర్ణయింపవీలు లేదు. ఆశ్వాసాంతపద్యములలోఁ గృతిపతిపేరు లేని గ్రంథములు పెక్కు లున్నవి. పైపద్యము లలో నెవరిపేరును లేకుండుటయే యిందులకు నిదర్శనము.

ఈయాశ్వాసాంతపద్యములు దైవమును సంబోధించునవి కావు. ఒకప్రభువునుగూర్చి చెప్పిన వనుమాట సత్యము. అందలివర్ణనమును బట్టి ప్రభునిర్ణయమునుఁ జేయఁజాలము. సాహిణిమారయ కేవల మశ్వదళాధిపఁమాత్రమే యనియెంచినచో నాపద్యము లాతని కన్వయింపక పోవచ్చును. కాని యాతఁడుకూడ నొకచిన్నప్రభు వనియంగీకరించినచో నావర్ణన మాతనికినిఁ నన్వయించును. కుమారరుద్రదేవునియొక శాసనమునుఁబట్టి సాహిణిమారయ యఱువదిగ్రామములు గలయొక దేశమునకుఁ బ్రభు వని తెలియుచున్నది.

దీనినిబట్టి యాశ్వాసాదిపద్యములు ప్రక్షిప్తములు కావనియు, నీకాండము సాహిణిమారయ కంకిత మనియు, హుళక్కిభాస్కరకృత మనియు నిశ్చయింపవలసియున్నది. కాని యీనిర్ణయమునకువచ్చుటకుఁ బూర్వము మన మింక నొకవిషయముగూర్చి యాలోచింపవలసి యున్నది. పైనఁజూపిన యారణ్యకాండప్రథమాశ్వాసాంతపద్యములును, తిక్కనామాత్యుఁడు రచించిన నిర్వచనోత్తర రామాయణాష్టమాశ్వాసాంతపద్యములు నొక్కపోలికగా నున్నవి. పదములయందును భావములలోనుగూడ రెండిటికిని సామ్య మున్నది. ఈరెండిటిని పోల్చి చూచుటకై, నిర్వచనోత్తరరామాయణములోని పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ఉ. పుణ్యుఁడు భారతీవిభవపూతవికాసముఖారవిందలా
వణ్యుఁడు దీవ్రకోపదవవహ్నినిరర్గళదగ్ధశాత్రవా
రణ్యుఁడు మానినీహృదయరంజనుఁడై పుణమూధమూపతా
రుణ్యుఁడు భీతివిహ్వలపరోధిశరణ్యవరేణ్యుఁ డున్నతిన్.

క. దుర్జయుఁడై రిధరాధిప
తర్జననిస్సాణగర్జితస్ఫురణుం డ
త్యూర్జితబాహాసంపదు
పార్జితవిఖ్యాతకలియుగార్జునుఁ డెలమిన్,

మాలిని. వితరణఖని యుద్యద్వీరశృంగారలక్ష్మీ
పతిరతివరలీలాషంగకృత్సంగతాంగుం
డతులితమతివిస్తారాప్తదేవేజ్యుఁ డిజ్యా
ప్రతిదినపరితృప్తిప్రాప్తసప్తార్చిభాత్రిన్.

ఇందు మాలినీవృత్తముయొక్క ప్రథమపాదము రెండుగ్రంథములలోను నొక్కటియే. తనపితామహుఁడు రచించిన భాస్కరరామాయణములోని పద్యములను దిక్కన తెలుచుగాఁ జదివియున్నవాఁడగుటచే నందలిభావములును పదములును నాతనియుత్తరరామాయణమునఁ బడియుండు ననితలంచుట సహజము. ఈయూహ సత్యమయ్యెనేని భాస్కరరామాయణారణ్యకాండకర్త మంత్రిభాస్కరుఁ డని నిస్సంశయముగా నిశ్చయింపవచ్చును. కాని దీనికపవాదము లేకపోలేదు. తిక్కనామాత్యునికంటె హుళక్కిభాస్కరుఁ డేబదిసంవత్సరములు తరువాతివాఁడు. నిర్వచనోత్తర రామాయణమునందలిపద్యములను జదివి హుళక్కిభాస్కరుఁడు భాస్కరరామాయణారణ్యకాండమున నీపద్యములను వ్రాసియున్నాఁ డనిచెప్పుట కవకాశము కలదు. కాని యీయూహలు రెండిటియందు నేది యుచితముగనుండునో పాఠకులు నిర్ణయింపుదురు గాత! తిక్కనామాత్యుని, హుళక్కిభాస్కరుఁ డనుసరించె ననిచెప్పుటకంటెఁ, దిక్కన తనతాత ననుసరించినాఁ డనుటయే యుచిత మని నాయభిప్రాయము. నిర్వచనోత్తర రామాయణమునందువలెనే,ఆరణ్యకాండప్రథమాశ్వాసాంతపద్యములు

ప్రథమావిభక్తిలోను ద్వితీయాశ్వాసాంతపద్యములు ద్వితీయావిభక్తి యందునుండుటయు, భాస్కరరామాయణారణ్య కాండాశ్వాసాంత పద్యములలోని "సభయరిపుశరణ్యున్" "ఆర్యజనానురంజితమహోకారు ణ్యుఁడు" అను వాక్యము లుత్తరరామాయణమున "చకితనృపు శర ణ్యున్" "ఆర్యజనతామతమంత్రుఁడు" అను మార్పునొందిపడియుండు టయు నిట్లే యుభయగ్రంథములలోను శబ్ద, వాక్య, భావసామ్యము లుండుటయు, నారణ్యకాండకర్త తిక్కనామాత్యునిపితామహుఁ డగు మంత్రిభాస్కరుఁడే యనునూహకు బల మొసంగుచున్నవి.

వాల్మీకిరామాయణమందలియారణ్యకాండమును బూర్ణముగా నాంధ్రీకరింపక భాస్కరుఁడు సంక్షేపీకరించెను. హుళక్కిభాస్కరుఁడు యుద్ధకాండమును సంక్షిప్తముచేయలేక సరిహోకదా మాఘకావ్యమందలి కొంతభాగము నాంధ్రీకరించి యుద్ధకాండమునఁ జేర్చెనని చెప్పు చున్నారు. నిజముగా హుళక్కిభాస్కరుఁడే యారణ్యకాండమును రచియించియున్నయెడల నాతఁడు దానినంత సంక్షిప్తము చేసియుండఁడు. కావున నేవిధమునఁ జూచినను నారణ్యకాండకర్త మంత్రిభాస్కరుఁడే యనితలంచుట సమంజసము. మంత్రిభాస్కరుఁ డారణ్యకాండకర్త యైనచో నాయాశ్వాసాంతపద్యము లేప్రభువున కన్వయించును? ఆతఁ డాగ్రంథము నెవరికిఁ గృతియిచ్చెను? అనుప్రశ్నలు రావచ్చును. మంత్రిభాస్కరుఁడు మనుమసిద్ధితండ్రియైన చోళతిక్కనృపాలున కా గ్రంథము నంకితము చేసియుండు ననితలంపవచ్చును. మంత్రిభాస్క రునికుమారుఁ డైనసిద్ధయ, చోళతిక్కనృపాలునియొద్ద మంత్రిగా నున్నట్లు మనకు దృష్టాంతములు కనఁబడుచున్నవి. తిక్కరాజుబాల్య మున సీభాస్కరుఁడును, నాతనినడిమివయసు మొదలు తుదవఱకును సిద్ధ నయు మంత్రులై యుందు రని తలంచుట కవకాశము లున్నవి. ఇది సత్యమయినచో చోళతిక్కనృపాలుని జననము శా. శ. ౧౧౧౦ ప్రాంతము. (వివరముకు తిక్కనసోమయాజిచారిత్రము ను చూడుఁడు) కావున నీ రామాయణరచనాకాలము క్రీ. శ. ౧౨౩౦ ప్రాంతమని నిశ్చయింపవచ్చును. అప్పటికి మంత్రిభాస్కరునకు ముప్పదినలువది సంవత్సరముల వయ సుండియుండును. చోళతిక్కనృపాలుఁడు పండితుఁ

డనియుఁ గవిసార్వభౌముఁడనియుఁ దిక్కన తననిర్వచనోత్తరరామాయణమున జెప్పియున్నాఁడు. ఇంతేకాదు. ఈ మనుజవిభుని యాస్థానమున జక్కయకవి తాత యగుపెద్దయామాత్యుఁ డను గొప్ప సుకవియుండి యనేక గ్రంథములను రచించెనని విక్రమార్కచరిత్రమున జక్కయ చెప్పియున్నాఁడు. అట్టివాఁ డీగ్రంథమును గృతి నందె ననుట యుచితమే యగును. పైనఁ జూపిన యాశ్వాసాంతపద్యములలోఁ "మతివిజితసురాచార్యుఁడు" "ప్రాజ్ఞవిద్యానవద్యుఁడు" అను పదము లీయంశమును ధ్రువపరచుచున్నవి. ఈవిశేషణములు మారయసాహిణి కన్వయించుననుటకంటెఁ దిక్కరాజునకన్వయించుననుటయే సమంజసము. మూలఘటిక కేతనకవి తిక్కనను వర్ణించుటలో మంత్రిపదవి వంశానుగతముగా వచ్చుచున్నట్లు చెప్పియుండుటచే నాతనిపితామహుఁ డగు భాస్కరుఁడు చోళతిక్కనృపాలునియొద్ద మంత్రిగా నున్నట్లు తలంచుటలోఁ దప్పులేదు. తిక్కన మనుమసిద్ధికి నిర్వచనోత్తరరామాయణము నిచ్చినట్లే, భాస్కరుఁడు తిక్కనృపాలునకు భాస్కరరామాయణమునుఁ గృతియిచ్చియుండును. ఇంతేగాక మంత్రి భాస్కరుఁడు, తిక్కరాజు తండ్రియైన మనుమసిద్ధి పేరును తనకుమారునకు (సిద్ధయకు), తిక్కరాజు పేరును తనమనుమలకునుఁ బెట్టియుండును. అందుచే మంత్రిభాస్కరారణ్యకాండకృతిభర్త చోడతిక్కరాజనితలంచుటలోఁ దప్పుండదు. అట్లయినచో నీవిషయమును దిక్కనగాని కేతనగాని యేల చెప్పియుండలే దనుప్రశ్నకుఁ గర్తృత్వమును గూర్చి వ్రాయకపోవుటకుఁ బైనఁ జెప్పినసమాధానమే సమాధానము. భాస్కరరామాయణమునఁ గృత్యాది మనకు లభించియున్నచో, నీవిషయము స్పష్టముగాఁ దేలియుండును గాని మనకట్టియదృష్టము లభింపలేదు.

### భాస్కరరామాయణములోనిపాఠభేదములు

భాస్కరరామాయణమునఁ బాఠభేదములు విశేషముగాఁ గన్పట్టుచున్నవి. ఈభాస్కరద్వయవివాదమును బరిష్కరించుట కవి తోడుపడు ననితోఁచుటచే వానినిగూర్చి యిట చర్చించు టావశ్యకమగుచున్నది. ఆవిషయమును రోచించుటకు ముందుగఁ గొన్నివిష

యముల నిటఁ జెప్పవలసియున్నది. ఇప్పుడు మనకు లభించుచున్న భాస్కరరామాయణముద్రితప్రతి వావిళ్ల వారు క్రీ. శ. ౧౯౪౧ లో ముద్రించినది. ఈ ప్రతికి శ్రీమేడేపల్లి వెంకటరమణాచార్యులుగారు విపులమైనపీఠికను వ్రాసియున్నారు. వావిళ్లవారే భాస్కరరామాయణమును ౧౯౧౩ సంవత్సరములో నొకసారి ముద్రించి యాప్రతులన్నియు విక్రయమై పోఁగా ౧౯౪౧ లో మరల ముద్రింపించినారు. ప్రథమముద్రణప్రతికిఁ దరువాత ననేక తాళపత్త్రప్రతులను బరిశీలించి అవసరము లగుమార్పులను జేసి రెండవముద్రణప్రతిని ముద్రింపించినట్లు పీఠికలోఁ దెలిపియున్నారు. పీఠికాకారులవాక్యము లివి:

“౧౯౧౩ వ సంవత్సరములో మొదటితేప వీరు భాస్కరరామాయణమును ముద్రింపించినపుడు దానికొకపీఠిక వ్రాయు మని నా కాజ్ఞాపించిరి. అపుడు నానేర్చినకొలఁది నొకపీఠికను వ్రాసి పంపితిని. ఆప్రతులన్నియుఁ జెల్లిపోఁగా నిపుడు మరల నాగ్రంథమును ముద్రించిరి. మునుపటిప్రతిలో లేనివిశేషములు కొన్ని దీనిలోఁ జేర్పఁబడినవి. ఎట్లంటే, వాల్మీకరామాయణమునకు మొదట సంగ్రహరామాయణ మున్నట్లు దీనిలోఁగూడ నొకసంగ్రహరామాయణము చేర్పఁబడినది. ఇంతియకాక ప్రాచీనతాళపత్రకోశములనుండి కొన్ని పద్యములను దీసి సందర్భానుసారముగా నాయాకాండలయందుఁ గూర్పఁబడినవి. బాలకాండలో నిరువదియెనిమిదిపద్యములును, అయోధ్యాకాండలో నూటయిరువదియెనిమిదిపద్యములును, అరణ్యకాండము ప్రథమాశ్వాసమందు రెండుపద్యములు, ద్వితీయాశ్వాసమం దొక పద్యము, కిష్కింధకాండలో నేడుపద్యములు, సుందరకాండలో రెండు పద్యములు నీప్రతిలో హెచ్చు.”

ఈ ప్రతిలోఁ గ్రొత్తగాఁ జేర్చిన సంగ్రహరామాయణకర్త యెవ్వరో పీఠికాకారులు చెప్పలేదు. బహుశః శ్రీవెంకటరమణాచార్యులుగారే యైయుండుదురు. కాని రామాయణకవులు వ్రాసినది కాదు. తాళపత్త్రప్రతులలో హెచ్చుగానున్నపద్యముల నన్నిటిని వీరిందు జేర్చలేదు. అందుఁ గొన్నిటిని మాత్రమే యిందుఁ జేర్చియున్నారు.

వ్రాతప్రతిలోనుండి గ్రహించినగద్యపద్యములకు [ ] గుర్తులనుంచి యా పాఠాంతరముల నాయాపుటలయందుగున జూపియున్నారు.

ఇఁక నారణ్యకాండమునందలి పాఠాంతరములను గూర్చి యోచింపవలసియున్నది. ఇతరకాండములయందలి పాఠాంతరములకును ఆరణ్యకాండమునందలి పాఠాంతరములకును విశేషభేద మున్నది. ఇతర కాండములయందు పద్యములందలి కొన్నిశబ్దములో, పద్యభాగములో పాఠాంతరములుగ నుండుచువచ్చినవి. ఆరణ్యకాండమున నట్లుగాదు. పద్యములకుఁ బద్యములే పాఠాంతరములు. కొన్నితావులలో కథాభాగములలోనే పాఠాంతరము లున్నవి. ఈ భేదముల నందలిపద్యముల నుదాహరించుచు నిటఁ జూపవలయుననినచో నారణ్యపర్వ మంతయు నిట వ్రాయవలసివచ్చును. కావున నీభాగము జదువునప్పుడు వావిళ్లవారు ౧౯౩౧లో ముద్రింపించిన భాస్కరరామాయణప్రతిని దగ్గర నుంచుకొని చూడవలసియున్నది. అందలి పద్యసంఖ్యమాత్రమే యిట నుదాహరించెదను. ఈసందర్భమున నేను కొన్నిభాస్కరరామాయణతాళపత్రప్రతులను బరిశీలించితిని. అందుఁ గనిపెట్టినమార్పులనుగూడ సందర్భానుసారముగా నీక్రింద నుదాహరించుచున్నాఁడను. సత్యము నెఱుంగ నుత్సహించుచున్నవారము కావున నేనీక్రింద నీయఁబోవువివరములను జదువుటయందు విసువుఁ జెందవలదని పాఠకమహాశయులకు గోరుచున్నాఁడను.

ఆరణ్యకాండప్రథమాశ్వాసమున ౯ వ పద్యమును దాని పాఠాంతరపద్యమును నీక్రింద నిచ్చుచున్నాఁడను.

క. నృపచూడామణి రాఘవుఁ
డపరిమితక్రోడమహిషహారిభల్లూక
ద్వీపశరభచండగండక
విపులమహావిపినములఁ బ్రవేశించి తగన్.                    ముద్రితప్రతి.

క. కాకోలవ్యాకులమును
ఘూకాకులభీకరంబు ఘోరమృగవ్యా
ళాకరమును ఝిల్లీనిన
దాకర్ణనదుస్సహంబు నగుకేరడవిన్.                    పాఠాంతరము.

పైపద్యమున కిది పాఠాంతరము కాదు. ఇందులో నేపద్యము న్నను తరువాయిపద్యముతో నన్వయించును. రెండు నుండుట సమంజ సము కాదు. ఒకేవిషయమును వేఱువేఱుకవులు రచించినట్లు కనఁ బడుచున్నది. "శ్రీరాముఁడు విరాధునిజంపుట" యనుకథలో ౧౮వ సీసపద్యములో తుదనున్న "యార్చుచుఁజీయు" నను మాటలకుఁ బదు లుగా నేనుచూచిన తాళపత్త్రప్రతిలో "యార్చుటయును" అనియున్నది. పిమ్మట ౧౯వ మొదలు ౨౭వఱకునున్న గద్యపద్యములు తాళపత్త్ర ప్రతిలో లేవు. ఈభాగము విరాధసంభాషణమును, లక్ష్మణుఁడు రాము నితోఁ ననినమాటలు నై యున్నవి. ఇవి మొదటరచింపఁ బడలే దనియు దరువాత నెవ్వరో రచియించి యుందుఁ జేర్చి రనియు నెంచఁ దగియున్నది. ఈ భాగమునుఁ దీసివేసినను, కథ సరిగా నడచుచున్నది గాని లోపమున్నట్లు గాన్పించుట లేదు.

ముద్రితప్రతిలోని "జానకిడించి" యను ౨౮వ వచనమునకు మారుగా నేను చూచిన తాళపత్త్రప్రతిలో నీక్రిందిపద్య మున్నది.

ఉ. జానకిడించి భీమరభసంబున శూలము గొంచు నార్పుతో
పై నిగుడింపఁ ద్రుంచెఁ బటుభల్లముచన్ గరశూల ముద్ధతిన్
తోన గణంగి లక్ష్మణుఁడు తూపు......భుజాంతర
స్థానము గాఢ నేసిన పదంపడి వాఁ డతిరోషదీప్తుఁడై.

ముద్రిత ప్రతిలోని 33 వ వచనమునందలి నాల్గవపంక్తిలో "బ్రాహ్మణవ్యయసమయంబున వాఁడు" అనుమాటలకుఁ దరువాత ౭౧వ గద్యమువఱకును గలభాగము మాయూరనున్న ప్రతిలో లేదు. దానికి బదులుగా "బ్రాహ్మణవ్యయసమయంబున వాఁడు" "రాఘవులం బ్రస్తు తించి యేను తుంబురుం డనగంధర్వుండ కుబేరుశాపంబున నిట్టి రూపంబుఁ దాల్చి యిట నీచేత శాపవిముక్తిం గంటి ననిఁ జెప్పి యా యెడకు రెండవయోజనంబున శరభంగుం డనుమునీంద్రు నాశ్రమంబు గల దచటికేఁ జనుఁడు మే లగు నని చెప్పి నిశితాశనుండు రోజుచు ప్రాణంబులు విడిచె తదనంతరంబ" అనియున్నది. ఈ మార్పువలన కథాసందర్భమున కేమియు లోటు వాటిల్ల లేదు.

12

ముద్రితప్రతిలోని ౬౫ మొదలు ౭౧ వఱకుగల గద్యపద్యములకుఁ బదులుగా వ్రాఁతప్రతిలో నైదుపద్యములు కలవని యాపద్యముల నాపుటల యడుగున నిచ్చియున్నారు చూరుఁడు. ఈ పద్యములు వేఱువేఱుకవులు రచించినవని తలంప వలసి యున్నది. ఒక్కరు రెండు విధము లగుపద్యములను వ్రాయవలసినపని యుండదు.

ముద్రితప్రతిలోని ౬౭వ పద్యమునకుఁ దరువాత ౯౭వ పద్యము వఱకు గలభాగము మాయూరనున్న ప్రతిలో లేదు. అందులకు బదులుగా నీ క్రిందిమూఁడు పద్యము లున్నవి.

చ. అనఘుఁ డగస్త్యుతమ్మునిని మహామునిఁ గాంచి తదీయ మైనయ
వ్వనమున నాఁడు నిల్చి జనవల్లభుఁ డమ్మునిముఖ్యు భక్తి వీ
డ్కొని చని గాంచె కుంభజుప్రఘూర్ణ మహార్ణవివ స్త్యాతాంతకాం
బునివహాపూరచారు పరిపూరితనిస్తుల హస్తపంకజున్.

చ. కని కడుభక్తి మ్రొక్కుటయు, గారవ మొప్పఁగఁ గౌఁగిలించి త
మ్మును మనఁ గోల్చియున్న మునిముఖ్యుల కెల్లను రామచంద్రు
వినుతగుణావళుల్ ప్రకటవిస్తరభంగిఁగఁ జెప్పుచున్ ప్రియం
బునఁ గొనియాడుచున్ వివిధపూజలఁ దృప్తులఁ జేసి నెమ్మికోన్.

క. జనవరునకు లక్ష్మణునకు
జనకసుతకు కందమూలఫలాకాదికమై
మునిమానసీయ మగుభో
జనమునఁ బరితుష్టిఁ జేసె సముచితభంగిన్.

ముద్రితప్రతిలోని ౧౦౭ మొదలు ౧౧౧ తుదవఱకు గలభాగము మాయూరనున్న ప్రతిలో లేదు. ఇది లేకపోయినను కథాసూత్రము తెగిపోలేదు. మఱియు ముద్రితప్రతిలో నున్న ౧౧౭ మొదలు ౧౩౨ వఱకుఁ గల గద్యపద్యములు నేనుఁజూచిన ప్రతిలో లేవు. ఈ భాగమున జంబుకుమారనివధయు, నావధావృత్తాంతము నాతనితల్లియగు శూర్ప ణఖతో మహర్షులు చెప్పఁగా విని యామె వనమునఁ దిరుగుచుండుటయు నున్నది. ఈ భాగము మొదట రచింపఁబడలేదు. తరువాత రచింపం బడియుండును. ఈ మాఱుడు పోయె నన్నవిచారముతో నున్న శూ

ణము ౧౩౩ వ పద్యములోఁ జెప్పినట్లు "పత్రిన వేడ్క నచ్చటికి నేఁగి" యుండదు. ఈ నూతన రచయిత యీసందర్భమును బాగుగా కలుప లేదు. ఈకథ వాల్మీకరామాయణమున లేదని టీకాకారులు వ్రాసి యున్నారు.

ముద్రితప్రతిలోని ౧౭౩ పద్యమునందున్న "వెండియున్" అను మాటకుఁ బదులుగా "చెప్పినన్" అని యున్నది. ౧౭౭-౧౭౮ పద్య గద్యములు నేను చూచినప్రతిలో లేవు. ౧౯౧ మొదలు ౧౯౯ వఱకు గల పద్యములకు బదులుగా నేను చూచినప్రతిలో నీక్రిందిపద్య మున్నది.

చ. అవని చలింప నైజవికృతాకృతిఁ గైకొని పేర్చి సీతపైఁ
  గవిసిన చేయి మాటికుచుఁ గ్రమ్మను లక్ష్మణ! దీనిఁ బట్టి యం
  గవికలఁ జేయు మన్న నురుగాఢరయంబునఁ గోసె ముక్కునుం
  జెవులును గ్రూరధారఁ లుసిల్లు కఠారమునన్ గనోగ్రతన్.

ముద్రితప్రతిలోని ౧౬౦-౧౬౧ పద్యములకుఁ బదులు యీక్రింది పద్యము తాళపత్రప్రతిలోనున్నది

క. మదనాగాయతసత్త్వుల
  పదునలువుర దనుజభటులఁ బనిచె ఖరుండ
  మ్మదిత వెసఁ జెరువు వెట్టఁగ
  సదయులు జని రనుయు లుగ్ర మగుగహనమునన్.

ముద్రితప్రతిలో ౬౫-౧౫౦ వఱకుఁగల పద్యములకు మాఱుగా వ్రాతప్రతియందు ౧౦ పద్యములు మాత్ర మున్నవి. అవి ముద్రితప్రతిలో నడుగునఁ జూపఁ బడినవి. ౧౫౨-౧౫౫ వఱకుగల పద్యములకు మాఱుగా వ్రాతప్రతిలో ౭ పద్యములు వేఱుగా నున్నవని యాపద్యము లాపుటలలో నడుగున జూపఁబడినవి. ఈ యడుగున చూపఁబడినపద్యములలో "కాంచనరత్నదీప" యను పద్యము నకుఁ దరువాత నేనుచూచిన తాళపత్రప్రతిలో నీక్రిందిపద్య మొకటి యధికముగా నున్నది.

ఉ. నిర్మలహేమబంధుకమనీయము గాఢము నైననిస్ఫుర
  ద్ధర్మము దాల్చి దీప్తపరిదారితనహిన్నయుఁ బోలె దివ్యఁడై

కార్ముక మెక్కువెట్టి గుణకర్క...కృతుల్ సమస్తది
జ్మర్మములం బగుల్చుచు సమగ్రుఁడు రాముఁడు విల్చె నయ్యెడన్.

ముద్రితప్రతిలోని ౨౧౪ మొదలు ౨౪౪ వఱకు గలగద్యపద్యములకు మాఱుగా వ్రాఁతప్రతిలో ౨౪గద్యపద్యములుగల వని యాపద్యముల నాపుటల నడుగునఁ జూపియున్నారు. ౨౬౧——౨౬౪ పద్యములకు మాఱుగా వ్రాఁతప్రతియందొక్కపద్యము కల దని దాని నడుగునఁ గనుపఱచియున్నారు. ౨౬౬——౨౭౯వఱకు గలపాఠమునకు మాఱుగ వ్రాఁతప్రతియందు ౮పద్యము లున్నవని వాని నాపుట యడుగునఁ జూపియున్నారు. ఈ యెనిమిదిపద్యములలోని "ఆనరనాథ ముఖ్యు" డనుపద్యమునకుఁ దరువాత నేనుచూచిన తాళపత్రప్రతిలో నీక్రిందిపద్య మున్నది.

ఉ. ఆ నరనాథు కేలు దొనక్రిఁ గుడించుట యెఱుఁగ్గ మార్గసం
ధానము నేత నాఁడు దెగఁ దార్కొని లక్ష్యము సేయు చేయుటల్
గాన నజస్రమున్ దళితకార్ముక మెక్కిటి గంటిఁ గంటి న
ద్దానవదీప్తదేహసముదాయనిరంతరపాత వేగముల్

మఱియు దాని క్రిందనే యున్న "అనిపలికి" యనుకందపద్యము తరువాతను ౨౮౦వపద్యమునకు ముందును నీక్రిందిరెండుపద్యములు నున్నవి.

స్రగ్ధర. కరణీయానంబు నవ్వున్ గతినవలతికాహార మంగంబు చంద్రుం
బురణించున్ ముద్దుమోమంబురుహదళములంబోలుకన్నుల్
విపంచీ స్వరసంకాశంబు పల్కుల్ చలదవివతలనీస్పర్థిమై
యిందువేణీ భర మాతన్వంగి కింద్రప్రముఖనిఖిలదిక్పాలకాభీల
శౌర్యా.

చ. అళినిభ వేణి, చంద్రసదృశానన; యుత్పలపత్రనేత్ర; కో
మలలతికాభిరామ భుజ; మంజులవక్త్రి; సమస్తవద్యాయీ
కవిత, సుమధ్య; హృద్యకటి; కామ్యతరోరువు; రమ్యజంఘ; యు
జ్జ్వలచరణాబ్జ; తద్వనితజానకి వాఁకిలసిల్లురావణా!

ముద్రితప్రతిలో ౨౮౦—౨౯౧వఱకుగల భాగమునకు మాఱుగా వ్రాతప్రతిలో ౬ పద్యములున్నవని వాని నాపుటల యందుగనే వ్రాసినాను. ఇంతవఱకు ప్రథమాశ్వాసమయినది. ద్వితీయాశ్వాసమునం గూడ నిట్టిభేదములే కలవు. గ్రంథవిస్తరభీతియు, నీవివరణములతోం బాఠకులు విసువుం జెందుదురేమోయను సంకోచముండినను సత్యాన్వేషణకు గడంగువారికిం దోడుపడు సనుద్దేశముతో నా భేదములను గూడ నిక్రింద నిచ్చుచున్నాఁడను.

ముద్రితప్రతిలోని ౬ మొదలు ౧౮వఱకు గలపద్యములకు మాఱుగా నేనుచూచినప్రతిలో నీక్రిందిరెండుపద్యము లున్నవి.

క. ఈ నవమ రామచంద్రుని
నేనుం దోరంబ ముపుర మ్ముగ్గమెసఁగఁ బులులమై
పూని వధింపఁగ నచ్చని
యీ నరపతి నంత నంత చేరుటయుక్తా

క. శరములు మూఁడొకముష్టిన్
దిరముగఁ దొడి గేయ వారు ద్రెళ్లిరి వెస నే
నరిగి యిట వచ్చి ఘనభయ
పరవశగతినున్నవాఁడ పటుశౌర్యనిధీ!

ముద్రితప్రతిలోని ౨౩వవచనంబున "జనియె" యనుమాటకుం బిదపనున్నవచనము నేనుచూచినప్రతిలో లేదు. మఱియు ౨౮వసీసపద్యమునకు మాఱుగా నీక్రిందిగీతపద్య మున్నది.

గీ. ఇవ్విధంబున నరిగి రాజేంద్రచంద్రుఁ
డున్నకదలీవనంబును నొయ్యఁ జేరి
యచట రావణు నిలిపి మాయాకురంగ
మగుచు మారీచుఁ డుండె దీప్తు లతిశయింప.

ముద్రితప్రతిలోని ౩౬—౩౭ పద్యములకు నడుమ నీక్రిందిపద్య మున్నది.

క. మృగము గొని వేగంబున
జగతీశ్వర నీవు వచ్చి సమ్మతిఁ జూడన్
దగ నాకిచ్చిన వేడుక
నెగడంగా వలదె నేను నీకరుణ మెయిన్.

ముద్రితప్రతిలోని ౩౯ — ౪౯ పద్యములకు మాఱుగా మాయూరనున్న తాళపత్రప్రతిలో నీక్రింది యైదుపద్యము లున్నవి. ౩౮ వ వచనములోని "నుండె వెండియు రఘువరుండు" అనుటకు మాఱుగా "నుండి వెండియు నిట్లనియె" అనియున్నది.

క. కనకపుమేనును రత్నపు
తనురుచులుం గలుగుమృగము ధరణిం గలదే
జనవర యిది మాయామృగ
మని దీని నెఱుంగరాదె యసురులమతముల్

చ. అన విని యల్లనవ్వుచు ధరాధిపుఁ డెంతయుఁ బ్రీతి తమ్మునిం
గనుఁగొని యీమృగంబుపైఁ గౌతుక మెక్కెడుఁ బట్టితేర నేఁ
జన కిటు లూరకున్న మది జానకి యెంతయుఁ జిన్నబోదె స
య్యన గొని యేగుదెంచెద గుణాకర! యేమరకుండు మియ్యెడన్.

క. ఇది దనుజమాయ యనినన్
మది సంశయ మేల మాయమాయించి శిత
ప్రదరంబునఁ దునిమెద నని
కదలెం బతి ఖడ్గతూణ కార్ముకధరుఁడై.

చ. కదలి రఘూద్వహుం డురుకఁగా నది ముందటఁ గొంతచేరుఁగన్
మెదలుచుడాసినన్ బెదరి మీఁదికి నట్టిటు దాటుచున్ మృగం
బదె యిదె నాఁగ పెంపొదల నవ్వల నివ్వలఁ దోఁచుచున్ రయం
బొదవఁగ దారి డాయఁ గొనిపోయె మహాగహనంబు లోనికిన్.

మ. పరచుం దవ్వుల జేయు ...... నిలుచుం బట్టీక యావాసగా
బిరువోవున్ బొద లందు డిందు నిలుచున్ బిట్టులిక్కి వే దాటి క్ర
మ్మరి చూచున్ వెలి దాల్చు నిల్చు మలయున్ మట్టాడు గోరామనే
మరి నట్లుండు తృణంబు లాను నలయుఁ మాయామృగం బిమ్ములన్.

ముద్రితప్రతిలోని ౫౨—౬౦ పద్యములకు మాఱుగా నేను చూచినప్రతిలో యీక్రింది మూఁడుపద్యము లున్నవి.

క. తిరిగి తిరిగి కడుదడవున
కరయఁగ నిది దనుజమాయ యగు నని కోపో
ద్ధరుఁడై యమోఘశరమున
ధరణీశ్వరుఁ డేసె శీఘ్రదారుణభంగిన్.

చ. అది మును మాయ క్రమింగి దనుజాంగము సొచ్చి పగిల్చె వాఁడు బె
ట్టిదముగ మీఁదికి న్నెగసి దెప్పర మై కడునొచ్చి తూలెఁ బొం
పొదలుచు క్రూకులుం జదియ భూమిచలింపఁగఁ గూలి వ్రాలె పె
ల్లదరుచు లక్ష్మణా! యనుచు హా! యని రాము నెలుంగు భంగిగన్.

క. అని ఘోరంబుగ నరచుచు
దనుజుం డవు డాత్మరూపధరుఁడై పడియెన్
పెనుమేనితోడ రాముఁడు
గనుఁగొని విభ్రాంతి చాల గదిరెడుమదితోన్.

ముద్రితప్రతిలోని ౬౪,౬౫,౬౬. కు మాఱుగా నీక్రిందిపద్య మొక్కటియు నున్నది.

ఉ. భూపతి యార్తిఁబొందె నని భూమిజ తల్లడ మంది లక్ష్మణా!
పాపము పొందె లెమ్ము వెనఁ బారుము రాక్షసబాధ నొందఁగా
నోపు రఘూద్వహుండు నిను నొత్తిలి జీరె నిశాటకోటిచే
నేపరబోలఁజాలు పలుకేది జవంబునఁ బొమ్ము గ్రన్ననన్.

మఱియు ౭౦—౭౨ పద్యములకు మాఱుగా నీక్రిందిపద్య మొకటియుఁ నున్నది.

క. అప్పుడు పేర్చిన శోకం
బునఁ బెల్లేడ్చుచు మహాత్ముఁ బుణ్యచరిత్రుఁడా
మనుజేంద్రుఁ గావఁ బోవం
జనదె రామునకుఁ దోడుచనవు రయమునన్.

ముద్రితప్రతిలోని ౭౭-౮౧ వఱకుగల పాఠమునకు మాఱుగా వ్రాఁతప్రతియందు ౯ పద్యము లున్న వనివాని నాపుటలయందుగున

నిచ్చియున్నారు. మఱియు ౯౯-౧౦౦ పద్యములకు మాఱుగా నీ క్రిందిపద్య మొకటియు నేనుచూచినప్రతిలో నున్నది.

గీ. ఏను మన్నించునుందరుల్ వేనవేలు
నిన్నుఁ గొలువంగ ధన్య నై నన్నుఁ జెందు
మనుదురా కింక పేదమనుజులతోడ
మనువు నీ కేల చనుదెమ్ము వనజవదన!

ముద్రితప్రతియందలి ౧౦౩-౧౦౯ పద్యములకు మాఱుగా మాయూరనున్న ప్రతిలో నీక్రింది మూఁడుపద్యము లున్నవి.

గీ. అనిన నన్నెమిగాఁ జూచి యాడె దనుచు
ననురువింశతి బాహువులు నతిశయోగ్ర
వదనదశకంబు మెఱయంగ నాముసయున
యెదుర నిలచినఁ గంపించి యుదిలగొనుచు

క. తిరుగుడు వడ వెనువెనుకకు
నరుగంగ వడిఁ బొదివి పట్టి యరదముపైఁ జె
చ్చెర నిడి యంబరపథమున
నరిగె దశాననుఁడు వికసితాననుఁ డగుచున్.

ఉ. అత్తరి సీత తల్లడిలి హా రఘునాయక! హా నరేంద్ర! న
న్నిత్తరి గావ ర మ్మనుచు నొత్తిలి యేడ్వఁగ పంక్తికంధరుం
డత్తరుణిన్ నయంబరి భయంపడునట్లుగఁ బెల్లదర్చుచున్
తత్తరపాటుతో నిజరథంబు నభంబునఁ దోలె నత్తరిన్.

౧౧౨,౧౧౩, ౧౨౭,౧౩౩ పద్యములు నేఁ జూచినప్రతిలో లేవు. ౧౪౮ మొదలు ౩౮౭ గద్యపద్యములవఱకు గల కథాభాగము వ్రాఁత ప్రతిలో ౬౬ గద్యపద్యములలోఁ జెప్పఁబడినది. ఇవి యాయాపుటల యం దడుగుభాగములయం దీయఁబడినవి. ఇట్లడుగునఁ జూపఁబడిన భాగములో ౨౦౨పేజీలోని "అల్లంత నెదురుగా" యను సీసపద్యము నకుఁ దరువాత నేను చూచిన తాళపత్రప్రతిలో నీక్రిందిరెండుపద్యము లున్నవి.

శా. లోనైనన్ వెలినైన సీతయెడ నాలోకింప లే దేమొకో
యా నా తిచ్చట లేదొ కాక యది మా యావాసముం గాదొకో
యే సింహంబుఁగ సీత గానఁబడదో యే నొండెనుం గానొ
యే నా రాముఁడ నైన సీత వెలి యై యిట్లుండఁగా నేర్తునే.

శా. ఏ నుండఁగ నిను డాపఁగా వెఱువఁ డేయీశానుఁడుం బూని నా
మానం బౌరయ వేఁడి డాగి తిరియున్ మానంబె ని న్బాసి నా
మనం బ్రాణము నిల్చునే యెఱుఁగవే మేలంబు నోనాడు దే
మో నాతీపొడచూపవే నిబిడరంభోరుద్వయాజానకీ.

ఉ. వ్యాళభుజంగ మోదరనివాసముఁ జొచ్చితె జృంభితోగ్రశా
ర్దూలముఖాగ్రకోటరము దూరితె మర్త్యపలాశనార్తిదై
త్యాళిని శాతదంష్ట్రికల నందితె యేకత మెందు వోయితే
లోలవిశాలసారసవిలోచన మత్ప్రియభార్య జానకీ!

ఉ. పాటితనంబునన్ గడచు బల్కితి లక్ష్మణు నంచు నీవు మా
మోటమి జేసి నా కెదుర నొల్లక దాఁగితొ దాన నీకు ము
మ్మాటికి సైచితిన్ మదనమార్గణభిన్నత నుండ నైతి నా
మాటకు వేగ వేగ మఱుమాట మృదుధ్వని పల్కు మైథిలీ!

శా. తన్నున్ దానెఱుఁగండె పోలె ధృతికిం దవ్వై విలాపించుచున్
కన్నుంగోనల బాష్పపూరము లొగిన్ గ్రమ్మంగ హా! సీత! హా!
యున్నిద్రాంబుజనేత్రి! హా! నిబిడరంభోరుద్వయా! జానకీ!
నన్నున్ బాయుట పాడియే యనుచు నానారోదనధ్యానుఁడై.

ముద్రితప్రతియందలి 3౯౬—3౯౭కు మాఱుగ నేనుచూచిన తాళపత్రప్రతిలో నీక్రింది రెండుపద్యము లున్నవి.

గీ. ఇట్లు కూలిన దైత్యుఁ డొక్కింత వడికి
తనువు తెలివొంది మీ రెవ్వ రలఘుశౌర్యు
లార యనుటయుఁ జెప్పి నింపారఁ దమ వి
ధము దెలియుకతయును సుమిత్రాసుతుండు.

క. విని రామలక్ష్మణులకే
జనవంద్యులు మీరు మీ ప్రసాదంబున ను
ద్ఘనదుఃఖ మెల్ల వోయెను
విను డస్మద్విధము మీకు వినుపింతుం దగన్.

ముద్రితప్రతియందలి ౪౦౬ మొదలు ౪౨౩వ పద్యమువఱకుం గల విషయమునకు మాఱుగా వ్రాఁతప్రతి లోనిపద్యములను ఆపుటల యడుగునఁ జూపియున్నారు. ౪౨౪ మొదలు ౪౩౭పద్యమువఱకును, మాయొద్దనున్న ప్రతిలో లేవు.

పాఠభేదముల ఫలితము

పాఠాంతరములనుగూర్చి పైన వ్రాసినవాక్యములను స్థూల దృష్టితోఁ జదివినవారికి, అరణ్యకాండమునఁ గవి రచించినవి కాక మఱికొన్ని పద్యములను మఱియెవ్వరో రచియించి యందుఁ జేర్చిరనియు, నది ప్రతివిలేఖకుల కృత్యమై యుండుననియుఁ దోఁచవచ్చును. కాని యిం దున్న దంతమాత్రమే యని తలంపరాదు. భాస్కరరామాయణ ముద్రితప్రతిని దగ్గర నుంచుకొని, పైన నేను వివరించినమార్పులను గమనించుచు, జాగ్రతగఁ బరీక్షించి చూచినయెడల, మొదట నొకకవి రచించినభాగముతోఁ దృప్తిఁజెందక వర్ణనాంశముల నధికముగఁ జేయ వలయు ననునుత్సాహముతో వేఱొకకవి మఱికొన్ని గద్యపద్యములను రచించి నడుమ నడుమఁ జేర్చుచువచ్చినట్లు స్పష్టమగును. ఈవిధముగ గ్రంథభాగమును బెంపొందించునప్పుడు, మొదటికవి రచించినపద్యము లందుల కభ్యంతరముగఁ గన్పించినచో నట్టివాని నీరెండవకవి తొలఁగించి యాపద్యములకు బదులుగఁ దాను క్రొత్తపద్యములను రచియించెను. ముద్రితప్రతిలోఁ బాఠాంతరము లని పుటలయడుగున నిచ్చినపద్యములను, మఱియు నేను జూచినతాళపత్రప్రతిలోని వని పైనఁ గనుపఱచిన గద్యపద్యములను గ్రంథభాగములోఁ జేర్చి, వానికిఁ బాఠాంతరముగా గ్రంథభాగములో నున్నగద్యపద్యములను దీసి వేఱుగా నుంచినచో నీరెండవకవి పెంచి రచించిన గ్రంథభాగ మేదియో స్పష్టముగాఁ గన్పట్టును. ఆ భాగమును మనము ప్రత్యేకముగాఁ జదివి

చూచితిమేని, జంబుకుమారవధ మొదలగు కొన్నికథలను జేర్చుటకును, మారీచరావణ సంభాషణమునందును, సీతాపహరణసందర్భముననుఁ, ద్వితీయాశ్వాసమునఁ దుదిభాగమునను గథలను బెంచి వ్రాయుటకును నీరెండవకవి ప్రయత్నించె నని బోధపడఁగలదు. ఆరణ్యకాండమున నిప్పటిముద్రితప్రతిలో ౭౩౬ గద్యపద్యము లున్నవి. ఇందులో దాదాపు ౩౯౦ గద్యపద్యములు మొదటికవి రచించినవి. వీనిలో నించుమించుగ ౨౧౦ గద్యపద్యముల నట్లేయుంచి మిగిలిన ౧౮౦ పద్యగద్యములను తీసివేసి వానికి బదులుగా ౫౨౬ గద్యపద్యములను క్రొత్తగా రచించి యందుఁ జేర్చెను. నేను వ్రాసిన యీ విషయము సులభముగా బోధపడుటకై యొక్క యుదాహరణ మిచ్చెదను. శూర్పణఖ సీతాదేవిని మ్రింగబోవుటయు శ్రీరామచంద్రుఁడు దానికిచేయి యడ్డవెట్టి శూర్పణఖముక్కుఁ జెవులుకోయు మని లక్ష్మణున కాజ్ఞయిచ్చుటయు నాతఁడట్లుచేయుటయు నొక్కపద్యములో నారణ్యకాండపు మొదటికవి చెప్పియున్నాఁడు. ఆపద్య మిది.

చ. అవని చలింప నైజవికృతాకృతిఁ గైకొని వచ్చి సీతపైఁ
గవిసిన చేయి వారి తిదుచుఁ గమ్మన లక్ష్మణ! దీనిఁ బట్టి యం
గవికలఁ జేయు మన్న నసుగాధరయంబునఁ గోసె ముక్కునుం
జెవులును క్రూరధారవిలసిల్లుకుఠారమునన్ గఠోరతన్.

ఈకథ నొక్కపద్యములోఁ జెప్పుట రెండవకవికిఁ దృప్తిఁ గల్గించ లేదు. ఈసందర్భమున మఱికొన్నిపద్యములను వ్రాయవలయునని సంకల్పించుకొనినాఁడు. కాని యీపద్యమును దీసివేసినఁగాని యాతని కోర్కె యీడేరదు. అందుకొఱకీపద్యమును గ్రంథమునుండితొలగించి దానికి బదులుగా నీక్రింది రెండువచనములను మూఁడుపద్యములను రచించి యందుఁ జేర్చెను.

"చ. కొఱవులభంగి మండుమిడిగ్రుడ్డుల నిప్పులు రాల దీప్తిఁ గ్రి
క్కిఱియ మహోల్క రోహిణి పయిం బఱతెంచినమాడ్కిఁ జూడ్కికిన్
వెఱపు జనింప సీతపయి వే పఱతేర నృపాలుఁ డొక్కచే
బిఱుసునఁ బట్టెఁ నయ్యబలఁ బెల్లుఱ రాక్షసిఁబట్టెనొక్కటన్ ౧౪౧
ఇట్లన్నిశాచరిం బట్టి లక్ష్మణుం గనుంగొని...... ౧౪౨

క. క్రూరులు దుష్టాత్ములు నగు
వారలతో నగవు లెప్పుడు వలవదు కంటే
నేరమి మనదెస( గల్గుట
నీరక్కసిజనకతనయ కిమ్మెయి( నోడరున్. ౧౫౩

వ. కావున దీని నింక విరూపిం జేయు మనుటయు నాసుమిత్రా
పుత్రుండు... ౧౫౪

క. ఘోరక్రోధంబున న
వ్వీరోత్తమునాజ్ఞ నొక్కవెస నసహ్యాస్త్రం
కారిణి నప్పుడ పట్టి కు
ఠారంబున ముక్కు చెవులు డగ్గఱ( గోయున్...... ౧౫౫

అరణ్యకాండ ప్రథమాశ్వాసము.

పై "అవనిచలింప" అనుపద్యమును రచించినకవియే యీ మూడు పద్యములను రచించియుండ( డనుట స్పష్టము. ఆపద్యమును దీసివేయుటయు దానికిబదులుగ నై దుపద్యములను దాము రచించి గాని, మఱియే రామాయణములోనివో తెచ్చి యిందు( జేర్చుట గాని విలేఖకులకు సాధ్యమునుగాదు. అవసరమునుగాదు. ఇది తప్పక ఎవరో మఱియొక కవి చేసినకార్యమని చెప్పక తప్పదు. పాఠభేదములవి నేను పైని( జెప్పినవానిలో( జాలభాగ మీయుదాహరణమును బోలియే యున్నవి. కొంచె మోర్పుతో( బరిచేసినచో మొదటికవి రచించినభాగమేదియో రెండవకవిచేసినమార్పు లేవియో మనము స్పష్టముగా( దెలిసికొనవచ్చును.

## అరణ్యకాండమున నీమార్పులకు( గారణములు

అరణ్యకాండమున నీమార్పు లెవరివలనవచ్చినవని యోచింతము. దీనికి మూ(డు మార్గములు స్ఫురించుచున్నవి. ౧. ఇరువురుకవులు రామాయణములను రచించియుండి రనియు, సందొకరు క్లుప్తముగను రెండవవారు విపులముగాను జేసియుందు రనియు, రెండు గ్రంథములను జూచినప్రతివిలేఖకులు అందలివి కొన్నిటిని, నిందలివి కొన్నిటిని ఏర్చి చేర్చి కథను గలుపవలసినతావులలో నొకవచనమునో పద్యమునో

తాము వ్రాసి వేఱొకస్వతంత్రగ్రంథముగా జేసియుందు రనియుం దలంచుట మొదటిమార్గము. ఈయూహాయందు బలము లేదు. విలేఖకుల కిది సాధ్యమైనదని కాదు. ఈమార్పును కవి చేయవలయును గాని విలేఖకుఁడు చేయఁజాలఁడు. విలేఖకులకిది యవసరమగు కార్యమును గాదు. దీనివలన వారి కయ్యెడు ప్రయోజనమును లేదు. గ్రంథము నంతను జేయక యరణ్యకాండమును మాత్రమే చేయుటవలన లాభమును లేదు. ఒకకవి రచించినయరణ్యకాండము మాత్రమే వారికి లభ్యమగుటచే నరణ్యకాండమునందుమాత్రమే యట్టిమార్పులను చేసియుందు రనితలంచినను అందలి ౨౦ పద్యములను తీసివేసి వానికి బదులుగా ౫౦౦ పద్యములను చేర్చి రనుట స్వభావవిరుద్ధమును ప్రయోజనవిరహితమును నగుటచే నీయూహాయందు సత్య ముండదని నిరాకరింపవలసియున్నది. ఒకవేళ నిందుసత్యమున్న దని యంగీకరించినను ప్రస్తుతారణ్యకాండమున నిరువురి కవిత్వ మున్నదనుట నిశ్చయము.

౨ మొదటికవి రచించినగ్రంథమునం గొంతశిథిల మైపోఁగా వెంటియోకఁడు దానిని పూరింపఁదలఁచి, శిథిలము కాకుండనున్నభాగము నట్లేయుంచి, శిథిల మగుచున్నభాగములను బూరించునప్పుడు తనయిష్టము ననుసరించి పెంచి రచించి పూరించె ననియు, నదియే యిప్పు డున్న ముద్రితప్రతియనియు, నటుపిమ్మట శిథిల మయిపోయినదన్నభాగము మరల లభించుటచేఁ గొన్నితాళపత్రప్రతులలో నాభాగమే యుండుచు వచ్చెఁ దనియు నదియే పాఠాంతరముగా ముద్రితప్రతిలో నడుగున నీయఁబడిన దనియుఁ జెప్పవచ్చును. ఇది రెండవమార్గము. ఇది కొంత సయుక్తికముగాఁ గన్పట్టుచున్నను నీయూహకుఁ గూడ బలము లేదు. మొదటికవి రచించినగ్రంథము శిథిల మైనదనుట కాధారములు లేవు. మాయూర నున్నప్రతిలో, మొదటికవి రచించిన ,పసిపైననిరూపించిన భాగము పూర్తిగ నున్నది. అందు కథాసూత్ర మెచ్చటను తెగిపోక సమగ్రముగా నున్నది. ఆప్రతియందలి గద్యపద్యములను ప్రస్తుతముద్రిత ప్రతిలో గుర్తుపెట్టి చూచినయెడల, నిరెండవకవి యెట్లు మార్చినదియు స్పష్ట మగును. మొదటికవిరచించిన గ్రంథము శిథిలము కాలే దని యిప్పటిముద్రితప్రతియే సాక్ష్య మిచ్చుచున్నది. శిథిలము సరిగా

వర్ణనలు గలపట్టుననే మైనదని తలంచుటకూడ సమంజసముగా నుండదు. కావున నీయుత్పన్నగాథ విశ్వసనీయము కాదు. విశ్వసనీయమే యని యంగీకరించినను, నారణ్యకాండమున నిరువురికవిత్వము లున్నవనుట నిశ్చయము.

3. దాదాపు ౮౦౦ పద్యములలో నొకకవి చెప్పియుండిన యరణ్యకాండమును, క్లుప్తముగా నున్నదను కారణమునఁ దాను విపులముగా వ్రాయఁదలఁచి కథను బెంచుట కవకాశ మీయని మొదటి రచనములోని ౧౮౦ పద్యములను వ్రాసివేసి తక్కిన ౨౧౦ పదములను దీసికొని తాను ౫౦౦పద్యములను రచించి యందుఁ జేర్చి మొత్తము కాండమును బూర్తిచేసియుండు నని చెప్పుట మూఁడవమార్గము. ఈ వాదమునందుఁగూడ దోషము లేకపోలేదు. ౫౦౦ పద్యములను రచింపఁగలిగినకవి ౨౦౦పద్యములనుగూడ దానే రచించి మొత్తము కాండమును బూర్తిచేయును గాని యిట్లు పులగ మేలచేయును? ఇట్లు చేయుట స్వభావవిరుద్ధముగఁ గాన్పించును. అయినను, పైన వ్రాసిన మూఁడుమార్గములలో నిదియే మేలయినదిగా గన్పించుటచేతను, నిందలిదోషమునకు సమాధానమిచ్చుట కవకాశ ముండుటవలనను నింతకంటె మార్గాంతరము స్ఫురింపకపోవుట మూలముననను, బలవత్తర మగుసాక్ష్యము లభించువఱకు నీయూహాయందే సత్యమున్న దని భావింతము. ఆరణ్యకాండద్వితీయకవి, యాకాండమును బెంచి వ్రాయ వలయుననియే యుద్దేశించెనుగాని యాకాండమును దాను బూర్తిగ వ్రాయఁదలపెట్టలేదు. అందుచే నైదువందలపద్యములను వ్రాసిన యాతఁడు ౨౦౦ పద్యముల నేల రచింపకుండు నని ప్రశ్నించుకొనిన లాభము లేదు. ఇదియే యిందలిదోషమునకు సమాధానము.

మొత్తముమీఁద నేపద్ధతిలోఁ జూచినను, నారణ్యకాండమున నిరువురికవిత్వ మున్నదని యొప్పుకొనక తప్పదు. ఈరెండుకవిత్వము లొక్కనివే యనియు, మొదట క్లుప్తముగా వ్రాసి, తరువాత నాతఁడే మఱికొన్నిపద్యములను రచించి యందుఁ జేర్చియుండవచ్చు ననియుఁ గొందఱనవచ్చును. ఇది సుసంగతము కాదు. తా నదివఱకు కష్టపడి రచించిన రెండువందలపద్యములను దీసివేయుట కెవ్వఁడు నంగీకరింపఁడు.

అతఁడే యట్లు చేసియుండినచో మొదటిగ్రంథము ప్రచారములోనికి వచ్చి యిప్పటివఱకు నిలిచియుండదు. మొదట నొకకవి, క్లుప్తముగా రచించిన మొదటిగ్రంథము ప్రచారములోనికి వచ్చినపిమ్మట నీరెండవ కవి యాగ్రంథమును బెంచి వ్రాసియుండును. అందుచే నీరెండు గ్రంథములకుఁ గూడఁ బ్రతికలు బయలువెడలి దేశములోఁ బ్రచారము సేయుచున్న వనితలంచుటయే సమంజసము. పరిశీలనాబుద్ధితోఁ జూచిన యెడల శైలినిబట్టికూడ నిం దిరువురికవిత్వ మున్నదని తోఁచును.

ఆరణ్యకాండకర్త లిరువురైనచో వారెవ్వరు ?

అరణ్యకాండమున నిరువురికవిత్వ ముండె నని పైననిశ్చయించితిమి. అయినచో నాయిరువు రెవ్వ రని యాలోచింపవలసియున్నది. వాఙ్మయప్రపంచమున రామాయణకర్తలుగాఁ బైనఁజెప్పిన యైదుగురు గాక ఎఱ్ఱాప్రగ్గడ సత్యనారనలనామములు వినవచ్చుచున్నవి. ఇంకఁ గొంద ఱుండిననుండవచ్చును. వారందఱును సంపూర్ణరామాయణకర్తలు. భాగరచయితలుగాని పూరయితలుగాని కారు. అందుచే నీ సందర్భమున వారినిగూర్చి యోచింప నవసరము లేదు. కొన్నిరామాయణతాళపత్రప్రతులలో నెఱ్ఱాప్రగడ రచించిన వని కొన్నిపద్యము లుదాహరింపఁ బడినట్లు శ్రీనేలటూరి వెంకటరమణయ్యగారు వ్రాసియున్నారు. కాని యవి స్వల్పసంఖ్యగలవి యగుటచే నీసందర్భమున నందునుగూర్చి కూడ యాలోచింపనక్కఱ లేదు. ఇఁక రామాయణ భాగకర్తలుగాఁ గనవచ్చుచున్నవారు. 1 మంత్రిభాస్కరుఁడు 2 హుళక్కిభాస్కరుఁడు 3 మల్లికార్జునభట్టు 4 కుమారరుద్రదేవుఁడు 5 అయ్యలార్యుఁడు వీరు గాక నింకఁ గొంద ఱున్నారని యెవ్వరైన నందురేని వారావిషయమును ససాక్ష్యముగాఁ దెలుపవలసియుందురు.

ముద్రితప్రతులయందును ససంఖ్యాకతాళపత్రప్రతులయందును నరణ్యకాండకర్త భాస్కరుఁ డని గద్యమూలమున స్పష్టమగుచుండుటచే నీకాండకర్తలలో నొకస్థానము భాస్కరున కీయకతప్పదు. రెండవవారినిగూర్చి మాత్రమే మన మాలోచింపవలసియుండును. రచయిత పూరయితలిరువురిలో పూరయితకంటె రచయిత పూర్వుఁ డగుట నిశ్చ

యము కదా! భాస్కరున కీయఁబడినస్థానము నధిష్ఠింపవలసినవాఁడు మంత్రిభాస్కరుఁడా? హుళక్కిభాస్కరుఁడా? యనునది తీర్మానింపవలసిన యోకనమస్యమైయున్నది. అరణ్యకాండాంతగద్యయందలి భాస్కరుఁడు హుళక్కిభాస్కరుఁడనియు నాతఁడే మొదటికవి యనియుఁ దలంచునెడల. నాకాండమును బెంచి వ్రాసినవాఁ డాతనికిఁదరువాతివాఁడై యుండవలయునుగదా! హుళక్కిభాస్కరునకుఁ దరువాత నయ్యలార్యుఁడు దక్క రామాయణరచయితలు గాన్పించుటలేదు. అతఁడు హుళక్కిభాస్కరుఁడు రచింపఁగా మిగిలిన యుద్ధకాండము తరువాయిని చెప్పితి ననియే చెప్పుకొనినాఁడుగాని యారణ్యకాండమునఁ దనకు సంబంధ మున్నట్లు చెప్పలేదు. కావున నం దాతనికి సంబంధమును గల్పింపరాదు. అందుచే హుళక్కిభాస్కరుఁ డారణ్యకాండమును రచించిన మొదటికవి కాఁ డనినిశ్చయింపఁదగియున్నది. ఇఁక నారణ్యకాండమును బెంపొందించి వ్రాసిన రెండవకవి హుళక్కిభాస్కరుఁడే యనియు, నాగద్య మాతనిదే యనియు, నొకవాదము రావచ్చును. ఈవాదము నిస్సారమైనది. ఆరణ్యకాండమునఁ దరువాతఁ జేర్చినభాగము లేకుండ మొదటికవి రచించిన ౪౦౦ పద్యములుగల తాళపత్రప్రతులలో, నిప్పటిముద్రితప్రతులలో నున్నట్లే, భాస్కరునిగద్య మున్నది. కావున నాగద్యము మొదటికవిది కాని రెండవకవిది కా దని స్పష్ట మగుచున్నది. ఇదియునుగాక హుళక్కిభాస్కరుఁ డారణ్యకాండద్వితీయకవి యనువాదము యుక్తియుక్తము కాదని యయోధ్యకాండమునుగూర్చి వ్రాయునప్పుడుకూడఁ జూపెదను.

## మంత్రిభాస్కరుఁడే యారణ్యకాండప్రథమకవి

ఆరణ్యకాండగద్యయందు హుళక్కిభాస్కరునకు స్థానము లేనప్పుడు, దాని నధిష్ఠింపఁదగినవాఁడు మంత్రిభాస్కరుఁడు తప్ప వేఱొకఁడు లేఁడు. ఆస్థానము నెక్కిన హుళక్కిభాస్కరునకే యివ్వఁదలఁచి యెవ్వరైనయందులకై పట్టుపట్టి పోరాడినచో గద్యకై నేను వారితోఁ గయ్యమునకు దిగను. కాని, హుళక్కిభాస్కరుఁడుగాక మిగిలిన రెండవకవి యెవ్వ రని వారిని బ్రశ్నింపక మానను. గద్యయం దున్నను లేక

పోయినను కవిత్వమునందు మంత్రిభాస్కరుని స్థానమును నిలువఁబెట్టి యాతనికి న్యాయ్యము గలుగుటకై ప్రయత్నింపక మానను. ఆతని పక్షమున న్యాయము లేదనితోఁచినచో నాతనికై పెనఁగులాడను. మంత్రిభాస్కరునకుఁ గవిత్వమునఁ జోటులభించె నేని గద్య యాతనిదే కాఁగలదు.

### మఱియొకభాస్కరుఁ డేలకాకూడదు?

అరణ్యకాండగద్యయందలిభాస్కరుఁడు, హుళక్కిభాస్కరుఁడు గాక పోయినచో, మంత్రిభాస్కరుఁడే యేలకావలయును? మఱియొక భాస్కరుఁడు కాఁగూడదా? యని యెవ్వనైన ప్రశ్నింపవచ్చును. ఆగద్యము మంత్రిభాస్కరునకుఁ జెందినదా? లేక హుళక్కిభాస్కరునిదియా? యనియే యిదివఱకున్న ప్రశ్న! మఱియొకభాస్కరునిగూర్చి యోచింపవలసిన ప్రసక్తి లేదు. భాస్కరనామధారులు పెక్కు రుండవచ్చును. ఆకాలమున నట్టికావ్యము నాంధ్రభాషలో రచియింపఁదగిన సమర్థత గలభాస్కరుఁడే మనకుఁ గావలయును. అట్టివారెవ్వరును నాకుఁ గన్పడ లేదు.

ముద్రితభాస్కరరామాయణమునకుఁ బీఠిక వ్రాసిన శ్రీమేడేపల్లి వేంకటరమణాచార్యపండితులు పీఠికలో "దశగతులను గ్రంథమును భాషాంతరీకరించి, సాహిణిమారుని కంకితము చేయుటచేత భాస్కరుఁడను మహాకవియొకఁడు సాహిణిమారుని కాలమున నున్నవాఁ డనుట నిశ్చయము." అని వ్రాసియున్నారు. వారే మఱియొకచోట "దీనిని బట్టి (సోమదేవరాజీయము) చూచిన హుళక్కిభాస్కరుఁడును సాహిణి మారుఁడును సమకాలికు లని తెలియుటయే కాక యొకచోట నున్నవారనిగూడ స్పష్టమగుచున్నది" అని వ్రాసియున్నారు. దశగతు లను గ్రంథము నాకు లభింపలేదు. దశగతులకర్తయును, హుళక్కిభాస్కరుఁడును, ఒక్కరో భిన్నులో ఆచార్యులవారి వాక్యమువలనఁ దెలియుటలేదు. ఆగ్రంథ మాంధ్రభాషలోనే రచియింపఁబడియుండవలయును. సాహిణిమారననుగూర్చియు, భాస్కరునిగూర్చియు ననేకవిషయములను జర్చించియు, దశగతులలోనుండి యొకవాక్యమునైనను ద్ధా

హరింపక పోవుటచే శ్రీయాచార్యుల వారికిని, ఆగ్రంథము లభింపలే దని యనుకొనుచున్నాఁడను. ఇంతకును శ్రీవారు తమపీఠికలో నారణ్యకాండ కర్తృత్వమును హుళక్కిభాస్కరుని యందే యుంచిరి. కాని దశగతుల గ్రంథకర్తపైఁ బెట్టలేదు. రామాయణగ్రంథకర్తృత్వవిషయమున నీవఱ కెన్నఁడును దశగతిగ్రంథకర్తనామమును విని యెఱుంగము. కావున నీ సందర్భమున నాతనినిగూర్చి యాలోచింపనక్కఱ లేదు. (దశగతులను దెనిఁగించినయాతఁడు హుళక్కిభాస్కరుఁ డని శ్రీచిలుకూరి వీరభద్రరావుగారాంధ్రులచరిత్రమునను, శ్రీమానవల్లి రామకృష్ణకవి గారు క్రీడాభిరామపీఠికయందును వ్రాసియున్నారు. కాని వీరెవరు నాగ్రంథమును జూచియున్నట్లు కనఁబడదు.)

రామాయణభాగరచయితలలో నొకఁడైన మల్లికార్జునభట్టునకుఁ దండ్రి యగు భాస్కరసత్కవి యొకఁడున్నాఁడు. ఆతఁడు హుళక్కిభాస్కరుఁడే యని యొకవాద మున్నది. అది సత్యమగునేని, యాతనికరణ్యకాండమున స్థానము లే దని పైనఁ జెప్పియుంటిమి. అది సత్యముకాక, యాభాస్కరుఁడు వే ఱని యందురేని యావాదమునందు సారము లేదు. మల్లికార్జునభట్టు తనతండ్రి రామాయణమును రచియించె నని చెప్పలేక చెప్పకపోయినఁ బోవుఁగాక తండ్రి యారణ్యకాండమును గుమారుఁడు బాలకాండమును రచించి రని చెప్పినచో వీరిరువురు సమకాలికు లని తెలియును కదా! అప్పుడు హుళక్కిభాస్కరున కన్వయించినపాత్రమే యాతనికి నన్వయించును. ఈతనిని మొదటికవి యనుచుమా, తరువాతికవి లభింపఁడు. రెండవ కవియందుమా మొదటిస్థానము మాత్రము భాస్కరునిదే.

హుళక్కిభాస్కరుఁడుగాని, దశగతులభాస్కరుఁడుగాని, సత్కవి భాస్కరుఁడుగాని యరణ్యకాండరచయితలలో బ్రథముఁ డని యెంచితిమేని, రెండవస్థానము మల్లికార్జునభట్టునకో, కుమారరుద్రదేవునకో యివ్వవలసియుండును. వారిరువురు నరణ్యకాండమున కిరుప్రక్కలనున్న గ్రంథమును రచించినవారు. వారిని మించి మఱియొక రారణ్యకాండమును వ్రాసి రని చెప్పవలసివచ్చును. వీరిరువురిలో నెవరో యొక రరణ్యకాండ

మును బెంచి వ్రాసిరని నిశ్చయించితిమేని, పైనఁ జెప్పినముప్వురకు నారణ్యకాండమున స్థాన ముండదు. వారు ముప్వురును వీరిరువురును సమకాలికులు. సమకాలికులలో నొకరు స్వల్పమైగ వ్రాయుటయు నింకొకరు పెంచి వ్రాయుటయు సంభవింపదు. మల్లికార్జునభట్ట కుమారరుద్రదేవులలో నెవ్వరును, పైనఁజెప్పిన ముప్వురుభాస్కరులతో నారణ్యకాండకర్తృత్వమున భాగమును పంచుకొననేరరు. వారి కీకాండమున భాగ మీయఁదలఁచినచో, మంత్రిభాస్కరునితోడనే పంచి యీవలసియున్నది. ఎట్లయిన మంత్రిభాస్కరునిఁ దొలగింపవలయు ననునుద్దేశముతోఁ బైనఁ జెప్పిన ముప్వురునుగాక మఱియొకభాస్కరుఁడో, మఱియొకరామాయణభాగరచయితయో యున్నాఁ డనికాని, అయ్యలార్యునితరువాత మఱియెవ్వరో యీభాగమును బెంచి వ్రాసి యుందు రనికాని వాదింపవచ్చును. అట్టియూహ లాధారరహితము లును నసంగతములు నగును. ఎవ్వరైన ససాక్ష్యముగాఁ దమవాద మును బలపరచి చూపునంతవఱకు, నారణ్యకాండమున నిరువురికవిత్వ మున్నదనియు, నం దొకటి మంత్రిభాస్కరరచిత మనియు, నిస్సందేహ ముగా నిశ్చయింపవచ్చును. రెండవకవిత్వ మెవ్వరి దనువిషయమునుఁ గూర్చి తరువాత వ్రాసెదను.

మంత్రిభాస్కరుఁ డయోధ్యాకాండమునుగూడ రచియించెనా ?

మంత్రిభాస్కరుఁ డరణ్యకాండమును మాత్రమే రచియించెనా? మఱియేభాగము నైనరచియించెనా ? యని యాలోచింపవలసియున్నది. కొందఱుపండితు లరణ్యకాండమునమాత్రమే మంత్రిభాస్కరునకు సంబంధ ముండెనని నుడివియున్నారు. కావున నీవిషయవిచారణ మావశ్యక మైనది. ఏకవియును గ్రంథమధ్యభాగమును విశేషించి యారణ్యకాండమును రచింప నారంభించియుండఁడు. బాలకాండమును నయోధ్యాకాండమును నదివఱ కెవ్వరైన రచియించియున్నచో నీతఁ డరణ్యకాండమును రచియించె నని చెప్పవచ్చును. కాని యట్టిది లేనప్పు డీతఁ డొక్కఁ డరణ్యకాండమునే రచియించియుండె నని చెప్ప రాదు. ఈతఁడు మొదటినుండియు, రామాయణమును రచియించెననియో

చెప్పవలసి యుండును. ఈ సందర్భమున నయోధ్యా కాండమును బరిశీలింతము.

ప్రస్తుతముద్రితప్రతిలో నయోధ్యాకాండమున గద్యపద్యములు ౭౯౦ యున్నవి. ఇందు ౧౪౭ గద్యపద్యములు వెనుకటిముద్రితప్రతి కంటె హెచ్చుగా నున్న వనిపీఠికాకారులే వ్రాసియున్నారు. వెనుకటి ముద్రితప్రతిలోఁగూడఁ గొన్ని యధికముగాఁ జేరియుండవచ్చును. మాయూర నున్నతాళపత్రప్రతిలో ౯౬౭ గద్యపద్యము లున్నవి. వీనిని జదివి చూచితిని. కథాసూత్ర మెచ్చటను దెగిపోవక చక్కని శైలిలో ప్రౌఢముగానున్నది. తాళపత్రప్రతికంటె నధికముగా నున్న పద్యములసంఖ్య నిందిచ్చి పాఠకులకు విసువు జనింపఁజేయ నక్కర లేకుండ ముద్రాపకులే సౌకర్య మొసఁగియున్నారు. తాము క్రొత్తగాఁ జేర్చిన ౧౪౭ పద్యములను ముద్రితప్రతిలో [·] నీవిధముగఁ గుండలీక రించి యున్నారు. ఇట్లు మార్పుచేయుటలో ముద్రాపకులు కొన్ని తావులయందిచ్చటివచ్చట నచ్చటివిచ్చటఁ జేర్చియున్నారు. అట్టి మార్పులు మనచర్చకు బాధకములుకావు. తాళపత్రప్రతికంటె ముద్రిత ప్రతిలో నధిక మనిచెప్పిన ౧౪౭ పోను మిగతా ౯౭ పద్యములును అయోధ్యాకాండాంతమున ౭౦౧ మొదలు ౭౯౭ వఱకు నై యున్నవి. ఈ పద్యములకు మాఱుగా నేనుజూచిన తాళపత్రప్రతిలో నొక్కసీసపద్యము మాత్రమే కలదు. అది యిది.

సీ. అంత నక్కడ రాముఁ డచటికి భరతుండు
క్రమ్మఱ వచ్చి సామ్రాజ్యమునకు
తన్ను రమ్మనుచుఁ బ్రార్థన సేయునో యని
చింతించి యాత్మలోఁ జిత్రకూట
మునఁగలమునిజనంబుల వీడుకొని మార్గ
తరువీక్షణంబునఁ గరము వేడ్కఁ
దనరి సీతాసుమిత్రపుత్రసమేతుఁడై దం
డకావనమహీస్థలికి నరిగె

నన(గ నయోధ్యాకాండ దా నఖిమతముగ
వినినఁ జదివిన వ్రాసిన విస్తరించి
చెప్పినను వారలకును సంసిద్ధి యొసఁగు
సంపదాయురారోగ్యముల్ సంభవించు.

(అరణ్యకాండాదిపద్యములపై వ్రాత "అవధరింపుము" అని చేర్చి పిమ్మట కావ పద్యముతోఁ గలిపి చదువవచ్చును. ముద్రితప్రతిలోని యారణ్యకాండము ప్రథమాశ్వాసము 3వ పద్యమునకు ౧౧వ పద్యమును, ౨వ నచనములో ౧౨వ పద్యమును పునరుక్తిదోషమును గల్గించుచున్నవి చూడుఁడు. ఇట్టి వింకను గలవు.)

అయోధ్యాకాండమున మొదటికవి ౨౬౭ పద్యగద్యములను మాత్రమే రచించె ననియుఁ బిమ్మట నెవ్వరో శక్తిహీనగ్రంథమును జేర్చి పెంపొందించి రనియుఁ బైన వ్రాసిన వాక్యములవలన స్పష్టమగుచున్నది. అరణ్యకాండమువలెనే యీ పెంపొందించినభాగము రెండవకవికృతమని నిశ్చయించుటకు సంశయింపనక్కరలేదు. అత్రిమహర్షి యాశ్రమంబున నడచినకథను జేర్చుటయు నచ్చటచ్చట మఱికొన్నికథలను జేర్చి పెంచి వ్రాయుటయు నీరెండవకవి యుద్దేశము. ఈభాగమును దీసివేసినను గథకు భంగము కలుగకుండ నడచుచున్న దని పాఠకులు గ్రహింపగలరు. ముద్రితప్రతిలోఁ గుండలీకరించినభాగములోఁ బద్యభాగముకంటె గద్యభాగ మధికముగ నున్నది. మఱియు, నయోధ్యాకాండమును రెండుఖండములుగ విభజించితి మేని, పూర్వఖండమునఁ దాళపత్రప్రతిలో లేనిభాగ మధికముగను, నుత్తరఖండమునఁ నల్పముగను నున్నట్లు గన్పట్టును.

అయోధ్యాకాండాంతపద్యములు ముద్రితప్రతిలో నొకవిధముగను, గొన్ని తాళపత్రప్రతులలో వేఱొకవిధముగను నున్నవి. వాని నీక్రిందఁ జూపుచున్నాను.

ముద్రితప్రతి :

ఉ. రాజకిరీటకీలిత విరాజితనూతనరత్న ... నీ
రాజన సంగతాబ్జ గగనాంజిత పాదసరోరుహద్వయా

రాజయలభ్యమానరుచిరద్యుతి మన్మణిశాతకుంభవి
భ్రాజితసద్వితీర్ణ రిపుపార్థివఖండన కీర్తిమండనా ?

క. భూరిభుజార్గళలసదసి
ధారాచలితప్రతాపదహన మహోదు
ర్వారశిఖాంతరనిపత
ద్వీరారిక మారశరభ విక్రమసులభా !

మా. వినయగుణ విశాలా! విప్రసంతానపాలా!
వినుతశుభచరిత్రా! విద్వదంభోజమిత్రా!
ఘనవిజయధురీణా! కామినీపంచబాణా!
కనకకుధరధీరా! కాచమాంబాకుమారా!

తాళపత్రప్రతి :

శా. మందారద్రుమ సామ్యదానఖని యున్మాదాంధవిద్వేషి రా
ట్సందోహప్రకటోగ్ర శౌర్యహరణోత్సాహ స్ఫురద్బాహుఁ డా
నందాపాదిత భూసురప్రకరనానా స్తోత్రపాత్రుండు కుం
దేందుప్రఖ్యయశుండు భారవిసముండు గుణాన్వితుండు ధీరుం డనిన్.

క. బాలాలాలి తనవహం
చాలుఁడు సుకవినికరసంతతమృదువా
చాలుఁడు విపులాభరితయ
శోలలితుఁడు వైరిహృదయశూలుఁడు పేర్మిన్.

మా. భువనభరిత కీర్తిస్ఫూర్తిదారోరుగాత్రుం
డసహితసుమహోచ్చైశ్చర్య స్ఫురదచ్ఛత్రుజైత్రుం
డు వితరణరణోగ్ర వ్యాప సప్తాశ్వపుత్రుం
డు విబుధజనరక్ష ణాడ్యుండు సన్మిత్రుఁ డుర్విన్.

పైపద్యములకును క్రిందిపద్యములకును పోలిక లేదు. పై పద్యములు సంబోధనావిభక్తిలో నున్నవి. తాళపత్రప్రతిలోని పద్యములు ఆరణ్యకాండపద్యములవలెను, నిర్వచనోత్తర రామాయణ మందలి యాశ్వాసాంతపద్యముల పోలికను ప్రథమావిభక్తిలో నున్నవి.

ఆరణ్యకాండాంతపద్యములో "వితరణఖని" యనియు నీపద్యములలో "దానఖని" యనియు నుండుటనుబట్టికూడ నారణ్యకాండరచయితయు నయోధ్యాకాండరచయితయు నొక్కఁడే యని యూహింపనగును.

పైనవ్రాసినవానిలో "మందారద్రుమ" ఇత్యాదిమూఁడుపద్యములు గల తాళపత్రప్రతియందలిగద్య ఆరణ్యకాండగద్యవలెనే "సకలసుకవిజనవినుత" ఇత్యాది భాస్కరకవిగద్యయే యున్నది. దీనినిబట్టి యయోధ్యాకాండము భాస్కరవిరచిత మని స్పష్టమగుచున్నది. కేవలము గద్యయొక్కటియే యైనచో నది భాస్కరవిరచిత మని నిశ్చయింపలేము కాని, యాశ్వాసాంతపద్యములు వేఱుగానుండుటను బట్టియు, గ్రంథము ౨౬౭ పద్యములుగలిగి వేఱుగా నుండుటమూలమునను, ఆరణ్యకాండరచయితలలోని మొదటికవియు నయోధ్యాకాండరచయితలలోని మొదటికవియు నేకవ్యక్తి యని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. అయోధ్యాకాండకర్తలను నిర్ణయించుట కరణ్యాకాండమునకుఁ బడినంతశ్రమ యక్కరలేదు. అయోధ్యాకాండముద్రితప్రతిలోనిగద్య ననుసరించి, యాకృతిగౌరవమును కుమారరుద్రదేవునకును, తాళపత్రప్రతిగద్యనుబట్టి యొక్కస్థానము భాస్కరునకును నీయవచ్చును. కుమారరుద్రదేవుఁడు, హుళక్కిభాస్కర, దశగతిభాస్కర, సత్కవిభాస్కరులతో సమకాలికుఁడు కావునను, సమకాలికులలో నొకఁడు క్లుప్తముగవ్రాసినదానిని మఱియొకఁడు పెంచివ్రాయుట సంభవింపదు. కావునను, అయోధ్యాకాండకర్తృత్వము నిస్సంశయముగా మంత్రిభాస్కరునకు సంక్రమింపకతప్పదు. అయోధ్యారణ్యకాండకర్త యొక్కఁడే కావున, ఆరణ్యకాండకర్త, హుళక్కిభాస్కరుఁ డనువాదము యుక్తియుక్తము కానేరదు.

## కుమారరుద్రదేవుఁడు గ్రంథచౌర్య మొనర్చెనా?

పైవిమర్శనమునుబట్టి యయోధ్యాకాండమును మొదట ౨౬౭ గద్యపద్యములతో మంత్రిభాస్కరుఁడు రచియించె ననియుఁ, బిమ్మట దానిపై ౨౦౦ గద్యపద్యములను కుమారరుద్రదేవుఁడు రచియించి,

యుందుఁ జేర్చి మొత్తమునకుఁ దనగద్య వేసికొనెననియుఁ దేలుచున్నది. ఇందువలనఁ గుమారరుద్రదేవునిపై గ్రంథచౌర్య మారోపించినవార మగుచున్నాము. ఇది న్యాయమా యని కొంద అడుగవచ్చును. ఎవరిపైనను గ్రంథచౌర్య మాపాదించు నుద్దేశము మాకు లేదు. తాము కనిపెట్టిన విషయములను సత్యాన్వేషణబుద్ధితో విమర్శింపుచు లోకము నెదుట నుంచుట చరిత్రకారులధర్మము. ఆధర్మమునే మే మవలంబించితిమి. కుమారరుద్రదేవుఁడు, భాస్కరవిరచితము లగుగద్య పద్యములను గ్రహించి, మఱిరెండువందలగద్యపద్యములను రచించి చేర్చి, తానురచించినభాగమును సాహిణిమారన కంకితముచేసి, తాను వ్రాసికొనినప్రతియందు, రెండుగద్యములును, రెండువిధములగు కాండాద్యంతపద్యములును వేసియుండును. తత్ప్రతికాపి లేఖకులు కొంద ఱీరెండువిధము లగువ్రాతలలో నొకదానిని విడచివేసి తమయిష్టము వచ్చిన యొకగద్యను, ఒకవిధ మగునాద్యంతపద్యములను వ్రాసికొని యుందురు. అందుచేతనే కొన్నిప్రతులలో భాస్కరవిరచితకాండాంత పద్యములును గుమారరుద్రదేవునిగద్యయు నుండుట సంభవించినది. ఇట్టితబ్బిబ్బులు కొన్నికొన్ని తాళపత్రప్రతులలో యుద్ధకాండమునందుఁ దక్కఁ దక్కినకాండములయందుఁ గన్పట్టుచున్నవి. ఈయూహయందు సత్యముండెనేని, కుమారరుద్రదేవునియందు గ్రంథచౌర్యదోషముండదు.

### అరణ్యకాండద్వితీయకవి యెవ్వరు?

అయోధ్యాకాండద్వితీయకవి కుమారరుద్రదేవుఁ డని యను కొన్నారము. అరణ్యకాండమును బెంచివ్రాసినకవి యెవ్వ రని యోచింపవలసియున్నది. ఇదికూడఁ గుమారరుద్రదేవుఁడుగాని మల్లికార్జున భట్టుగాని యైయుండు రనినాయూహ. వీరిరువురుతప్ప మఱెవ్వరును గా రని నా నమ్మకము. వీరిరువురిలో నెవ్వరో నిశ్చయించుటకు నాకాధారములు లభింపలేదు. కాని కుమారరుద్రదేవుఁ డై యుండునని నా తలంపు. కుమారరుద్రదేవుఁ డయోధ్యాకాండగద్యను మార్చి నట్లరణ్యకాండగద్య నేల మార్పలే దని కొంద అడుగవచ్చును. ఆరణ్యకాండాంతగద్యలోఁగూడ భాస్కరునిదిగాక మఱియొకరిదికూడ

నుండియుండు ననియు, దానిని విలేఖకుఁడు దీసికొనియుండఁ డనియుఁ దాళపత్రప్రతు లింకను బరిశోధించినచో నది బయటపడుననియు నా నమ్మకము. లేదా ఆరణ్యకాండమునుఁ దాను రచించినట్లు వేసికొనినచో నేదైనఁ గీడు మూడునేమో యనుభయముచేతను నా కాండమునఁ దాను కొంతభాగమును మాత్రమే వ్రాసి యుండియు మొత్తమంతయుఁ దాను రచించినట్లు ప్రకటించుకొని యా కీడునంతను దన నెత్తిపై వేసికొనుట కిష్టములేకయు భాస్కరునిగద్యము నీరెండవకవి మార్చుకపోయియుండును. భారతారణ్యపర్వశేషమును రచించిన యెఱ్ఱాప్రగ్గడ తనపేరున గద్యమును వ్రాసికొనక నన్నయపేరుననే గ్రంథము నుంచుటకుఁగూడ నదియే కారణమైయుండును. అంతటి మహాకవుల కిట్టిమూఢనమ్మకము లుండునా యని తలంపరాదు. గొప్పనాగరికులమని చెప్పుకొనెడివారిలో నిప్పుడుకూడ నిట్టినమ్మకము లున్నవారు కలరు. ఆ వివరముల నిటఁ దెలుపుట యప్రస్తుతప్రశంసయగును. మంత్రిభాస్కరుఁడు ప్రతికాండాంతమునను ఫలశ్రుతిపద్యము వ్రాసినట్లు కన్పట్టుచున్నది.

అయోధ్యాకాండఫలశ్రుతిని పైని వ్రాసియున్నాఁడను. ఆరణ్యకాండ ఫలశ్రుతి పద్యమిది:

సీ. ఆ సరోవరమునయందు నృపాత్మజు
లతి శయుస్నానపానాదివిధులు
ప్రియమునఁ జల్పి సంప్రీతాంతరంగులై
తత్సమీపోన్నతతరుచయంబు
శీతలచ్ఛాయ నాసీనులై విశ్రమం బంది
కొండొకతడ వచట నిలిచి
సౌఖ్యంబు నొంది సత్సేవ్యమైన యీ
యారణ్యకాండంబు నర్థితోడ

గీ. వినినఁ జదివిన వ్రాసిన విస్తరించి
చెప్పినను వారలకు సౌఖ్యసిద్ధి యగుచు
సంపదాయురారోగ్యముల్ సంభవించు
నతులపుణ్యంబు లెప్పుడు ననుభవింత్రు.

బాలకాండఫలశ్రుతిపద్యము నాకు లభింపలేదు.

## బాలకాండమున మంత్రిభాస్కరుని కవిత్వ ముండెనా?

అయోధ్యారణ్యకాండములయందు మంత్రిభాస్కరుని కవిత్వ మున్నదని నిర్ణయించినప్పుడు బాలకాండలో నాతనిరచన మున్న దని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు. కాని యీరెండుకాండములలోను స్పష్టముగాఁ దెలిసినట్లు బాలకాండమున నావిభేదమును దెలుపు తాళ పత్రప్రతులు నాకు లభింపలేదు. నేను జూచిన తాళపత్రప్రతులలోఁ జాలభాగము ముద్రితప్రతితో సమానముగనే యున్నవి. కాని యొక ప్రతిలో కొన్నిభేదములు గానవచ్చినవి. అందు మచ్చునకు మూఁడు పద్యముల నుదాహరించెదను. ఇట్టి వింకను గలవు.

ముద్రితప్రతి : (ఇవికూడ వ్రాఁతప్రతిలో నివనియే ముద్రాపకులు వ్రాసి యున్నారు.)

చ ధర విలసిల్లు తొమ్మిదినిధానములున్ దనయింట నుండఁగా
నరుఁ డట యెక్కుడింత పరిణామము చూపొకటే విరోధియై
తరమియు తేరు దీసికొని తమ్ముఁ డటంచును గిన్నరేశునిన్
తిరిపెముతోడిచుట్ట మని తిట్టుదు రప్పురి వైశ్యపుంగవుల్. 32

మ. బలవంతంబున లావునన్ విపులశుంభద్దేహముల్ దాల్చి తా
మిల యెల్లన్ వడి దన్ని సస్యములచే నింపారఁ బూరించి రా
సులుగాఁ జేతురు ధాన్యముల్ సుగుణులై పెంపొంది యప్పోటిలోఁ
పల నెల్లప్పుడు నుండ శూద్రులు ధరన్ బ్రాహ్మణ్యసేవాఢ్యులై. 33

23కి యిదియొకవచనము.

గ్రంథవిస్తరభీతిచే నీయలేదు. ముద్రితప్రతిని జూడుఁడు. వీనికి మారుగాఁ దాళపత్రప్రతిలో నీ క్రిందిపద్యములున్నవి.

గీ శరధికైనను రత్నముల్ చాల నొసఁగ
నలవు బేరుని కర్థంబు లంది యివ్వఁ
జాలియున్నట్టివైశ్య సంఘములుగను
మెసఁగియుందురు తత్పురవరమునను.

క. వర్ణత్రయసంసేవ్యో
దీర్ణమహత్త్వంబు గలిగి ధృతిచే హీనవ
త్స్వర్ణధరంబులొ యనఁగాఁ
బూర్ణులు నై యుండు రెవ్వ రుర్విఁ గలశూద్రుల్.

౭౩వ వచనమునకు బదులుగా నీ క్రింది పద్యగద్యములున్నవి.

క. ధాత్రీసుత రామునకుఁ బౌ
మిత్రికి నూర్మిళను బ్రియము మెయి నై కేయీ
పుత్రునకు మాండవి మఱి
శత్రుఘ్నునకు శ్రుతకీర్తి సమ్మతి నిచ్చెన్.

వ. అప్పు డారాఘవుం డగ్నిసన్నిధి నగమోక్తక్రమంబులఁ బాణిగ్రహణంబులు చేసి యగ్నిదేవునకు మునులకు దశరథజనకులకు నమస్కరించి బహువిధాశీర్వాదంబుల విలసిల్లె నాసమయంబున.

ఈ యుదాహరణములనుబట్టి బాలకాండమునఁగూడ నిరువురి కవిత్వ మున్నదనియు నందొకఁడు మంత్రిభాస్కరుఁడనియు రెండవ యాతఁడు మల్లికార్జున భట్టనియు నిశ్చయింపవచ్చును. బాలకాండ ముద్రితప్రతిలో ౭౮౩ గద్యపద్యము లున్నవి. ఇందు ౪౦౦ గద్య పద్యములు మంత్రిభాస్కరునివనియుఁ దక్కినవి మల్లికార్జునుని వనియు ననుకొనవచ్చును. అయోధ్యారణ్యకాండములయందలి మంత్రిభాస్కరుని కవిత్వరీతినిబట్టి చూచినచో నాతఁడు కథపట్టులను గలుపుటకై స్వల్పవాక్యములతోఁ గూడిన వచనరచనమును దప్ప గద్యరచనమునందు విశేషాభిరుచికలవాఁడు కాఁడనియు, కథాంశమును ప్రౌఢమైన శైలిలో రచించుటయం దెక్కువ యిష్టము కలవాఁడుకాని, వర్ణనాంశములయం దభిలాషకలవాఁడు కాఁడనియుఁ, దోఁచగలదు. బాలకాండమున ౧౬ పెద్దవచనములును దాదాపు ౧౨౦ సామాన్య వచనములును, ౫౦ వఱకు కథపట్టులను గలుపుచిన్నవచనములును గలవు. ఈ గద్యభాగమున, నే స్వల్పసంఖ్యగలచిన్నగద్యములో దక్క దక్కినవన్నియు మల్లికార్జునునిరచన మని చెప్పనొప్పును. మొదటి ౨౫ పద్యములలో ౩వ పద్యము మాత్రమే భాస్కరుని దై యుండును.

భాస్కరుఁడు విశ్వామిత్రచరిత్రము నంతవిస్తరించి చెప్పియుండఁ డని నాయూహ. వాల్మీకిరామాయణములో లేనికొన్నివిషయములను మల్లికార్జునభట్టు, అధ్యాత్మరామాయణాదులనుండి యాంధ్రీకరించె నని పీఠికాకారులు వ్రాసియున్నారు. వాల్మీకిరామాయణమునే సంక్షేపముగా నాంధ్రీకరింపఁదలఁచినవాఁడు మంత్రిభాస్కరుఁడు. అట్టి యాతఁడు డీవనికిఁ బూనుకొనఁడు కదా! బాలకాండమున మంత్రిభాస్కరుని పద్యము లేవో నిశ్చయముగాఁ జెప్పఁజాలము. కాని దిఙ్మాత్ర సూచకముగాఁ దెలిసికొనుటకై పై వాక్యములను వ్రాసితిని.

## భాస్కరరామాయణమున నవతారిక లేదేమి?

ప్రస్తుతము మనకు దొరకుచున్నముద్రితప్రతులలోఁగాని, తాళపత్త్ర ప్రతులలోఁగాని భాస్కరరామాయణమున కవతారిక లేదు. ఇందులకుఁ గారణ మేమై యుండునని యాలోచింపవలసియున్నది. "ఏకవియును దనయిష్టదైవమును బ్రార్థింపకుండ గ్రంథారంభమును జేయఁడు. మంత్రిభాస్కరుఁడు కృత్యాదిని రచియించియే యుండును. అది యాతనిగ్రంథముతోఁ బాటుగనశించియుండును." అని కొంద అనుచున్నారు. కాని యీయూహ కొక బాధకము గన్పట్టుచున్నది. మంత్రిభాస్కరరామాయణ ముత్పన్నము కాలేదు. అయోధ్యారణ్య కాండములు యథామాత్రకములుగా నున్నతాళపత్త్రప్రతు లచ్చటచ్చటఁ గన్పట్టుచున్నవి. అట్లే బాలకాండముగూడ యథామాత్రకగా నున్నప్రతి యొన్నటికైన లభింపకమాన దని నా యాశ. అదిలభించె నేని యవతారిక యుండెనో లేదో నిశ్చయము కాఁగలదు. అంత వఱకు నీ విషయము నిదమిత్థ మని నిశ్చయముగాఁ జెప్పఁజాలము. భాస్కరుఁడు కృత్యాదిని రచియింపలే దనియనకొటకుగూడ నవకాశము కలదు. గ్రంథమంతయు రచించినపిదపఁ గృత్యాదిని రచించు నాచార మిప్పుడును మనలోఁ గలదు. భాస్కరుఁడుకూడ నట్లే తలంచి యుండెనేమో! గ్రంథము పూర్తము కాకపోవుటచేఁ గృత్యాది వ్రాయ బడకపోయి యుండవచ్చును. పూర్వకవిప్రణీతము లగుగ్రంథములలో నవతారికలు లేనివి కొన్ని కలవు. కృత్యాదిని వ్రాయకుండఁ గవులు

చనిపోవుటచే నాతనితనయుఁడో శిష్యుఁడో దానిని వ్రాసి పూర్తిచేసిన గ్రంథములును గలవు.

భాస్కరునికృత్యాది లేకపోయినమాని మల్లికార్జునభట్టైనను నవతారిక వ్రాయులేదేమనుప్రశ్న రాకమానదు. దీనికిఁ దృప్తికర మైనసమాధానము గానరాలేదు. గ్రంథమంతయుఁ బూర్తియైనపిదప నవతారికను వ్రాయవచ్చునని తలంచినాఁ డనుసమాధాన మీతనివిషయ వర్తింపదు. ఈతఁడు వ్రాయఁదలఁచినది సుందరకాండాంతమువఱకు మాత్రమే. అదిపూర్తి యైనది. అవతారిక వ్రాయఁదలఁచినచో వ్రాయుట కాతని కవకాశ మున్నది. కాని యాతఁడు వ్రాయలేదు. మంత్రిభాస్కరవిరచితబాలకాండమునందుఁ దానుఁ గొంతగ్రంథము నధికముగఁ జేర్చుటమాత్రమే చేసియుండుటచే వేఱుగ నవతారిక వ్రాయునిష్టము లేక మానివేసెనేమో చెప్పఁజాలము. కాండాంత పద్యములను వేఱుగ శివపరముగ వ్రాసి వేఱుగఁ దనగద్యను వ్రాసి కొనినయాతఁడు కృత్యాది నేల వ్రాయకుండు నని కొంద ఱడుగ వచ్చును. అవతారిక వ్రాయఁదలపెట్టెనేని బాలకాండమునఁ దన కెంత ప్రసక్తి యున్నదియు స్పష్టముగాఁ జెప్పవలసివచ్చును. అందుచే నాతఁడు దానిని వ్రాయక యుండవచ్చును. మల్లికార్జునభట్టుపైనిగూడ గ్రంథచౌర్య మారోపింపలేము. అయోధ్యాకాండరచనా విచారణ సందర్భమునఁ గుమారరుద్రదేవునిఁగూర్చి వ్రాసినవాక్యములు మల్లి కార్జున భట్టునకుఁ గూడ ననువర్తింపఁ జేయవలసియుండును.

### కిష్కింధసుందరకాండములలో మంత్రిభాస్కరునికవిత్వ మున్నదా?

మంత్రిభాస్కరునికవిత్వ మారణ్యకాండముతో నాగిపోయె నని నిశ్చయింపఁజాలము. కాని మొదటి మూఁడు కాండములలోవలె నీ రెండుకాండములయందును నాతనికవిత్వ మున్నదని, నిరూపించుటకుఁ దగినసాధనములు లభ్యములు కాలేదు. కొన్నితాళపత్రప్రతులయం దీరెండుకాండములకుతుదిగద్యలు. "ఇది సకలసుకవిజనుత" మొదలుగా భాస్కరునిపేర నుండుటచేత, సుందరకాండాంతమువఱకును భాస్కరుఁడు

రచించియుండుననియు, యుద్ధకాండమునఁగూడఁగణింపఁదగని యేయ త్యల్పభాగమో రచియించియుండుననియుఁ దోఁచుచున్నది. కొన్ని తాళపత్రప్రతులలోని గద్యములనుబట్టి యిట్లూహించుట న్యాయముగా దనికొంద ఱందురేమో! ఆ వాదమునందుఁగూడ సత్యముండ వచ్చును. ఎట్లయిన నీ విషయమున నింకను బరిశోధన మావశ్యకమయి యున్నది. ఈ కాండములలో నేను చూచిన తాళపత్రప్రతులకును ముద్రితప్రతికిని విశేషభేదము గన్పట్టలేదు.

కిష్కింధకాండాంతపద్యములలో ముద్రితప్రతియం దీక్రింది పద్యము గన్పట్టుచున్నది.

శా. లాటీచందనచర్చ చోళమహిళాలావణ్యసామగ్రి క
ర్ణాటీగీతకలాసరస్వతి కళింగాంతఃపురీమల్లికా
వాటీమంజరి గౌడవామనయనావక్షోజహారావళి యె
పాటింపందగు నీదుకీర్తి రథినీపాలాగ్రణీ సాహిణీ.

ఈ పద్యము సాహిణిమారయను సంబోధించుచున్నది. కాండాదిపద్యములును గాండాంతమందలి విభిన్నవృత్తములును శివపరములుగా నున్నవి. మల్లికార్జునభట్టు తనకవిత్వము నీశ్వరునకుఁ గృతి యిచ్చెననుట స్పష్టము. కావునఁ బైనఁజూపిన శార్దూలవృత్త మిట నుండఁదగినదని కాదనియుఁ బ్రక్షిప్తమనియు నిశ్చయింపవలసి యున్నది. ఇంతేకాదు, సాహిణిమారయ కంకిత మైనయేయితర గ్రంథమునుండియో కొన్నిపద్యములను దెచ్చి భాస్కరరామాయణమున నెవ్వరో చేర్చియుందు రను నూహ కలుగుచున్నది. హుళక్కి భాస్కరుఁ డాంధ్రీకరించి సాహిణిమారని కంకిత మొసంగె ననిచెప్పెడు దశగతులలోని పద్యములను విలేఖకు లిందుఁ జేర్చిరేమో! ప్రస్తుత ముద్రితప్రతినిబట్టి కిష్కింధసుందరకాండములు మల్లికార్జునభట్టరచితము లనియు నీశ్వరాంకితము లనియు స్పష్టముగాఁ దెలియుచున్నది. "ఇవి నిజముగా మంత్రిభాస్కరకృతము లైనచోఁ గాండాంతపద్యము లీశ్వర సంబోధకములుగాక యొకప్రభువును సంబోధించునవిగా నుండవలసి యున్నది. అయోధ్యారణ్యకాండముల కట్టిపద్యములు మనకు లభించి

సవి. మల్లికార్జునభట్టుపేర నున్నమూఁడుకాండములకు నట్టిపద్యములు మనకు దొరకలేదు. దీని కేదేని ప్రత్యేకకారణ మొండియుండవలయును. అయోధ్యారణ్యకాండములను మంత్రిభాస్కరుఁడు రచియించెనని మన మంగీకరించితిమేని, యాతఁడు బాలకాండమును రచింపకుండ నయోధ్యారణ్యకాండములనుమాత్రమే రచియించియుండఁడు. కావున బాలకాండమున నాతనిరచన మున్నదనునుపసిద్ధాంతము నంగీకరింపక తప్పదు. బాలకాండాంతమున మంత్రిభాస్కరుఁడు రచించినప్రభుస్తుతి పద్యములు మనకు లభించి, కిష్కింధసుందరకాండాంతపద్యములు లభింపకపోయినచో నీ రెండుకాండములయందు నీతని కవిత్వము లేదనియనుకొనవచ్చును. కాని బాలకాండాంతపద్యములు లభింపక పోవుటచేఁ గిష్కింధసుందరకాండాంతపద్యములు భాస్కరరచితములు నట్లే లభింపలేదనియు, నవి లభింపనంతమాత్రమున నాకాండములలో భాస్కరునికవిత్వము లేదని నిశ్చయింపఁగూడ దనియుఁ జెప్పవలసి యున్నది. మల్లికార్జునుని పేరనున్న మూఁడుకాండములులోను భాస్కరుని గద్యయుండి యాతనికాండాంతపద్యములు లేకపోవుటకుఁ గారణము విలేఖకులై యుండవచ్చును.

అయోధ్యారణ్యకాండముల కవిత్వధోరణిఁబట్టి చూచినచో, మంత్రిభాస్కరుఁడు వాల్మీకిరామాయణమును సాధ్యమైనంతవఱకు స్వీకరించి యాంధ్రరామాయణమును రచింపఁదలపెట్టెననియు, మిక్కిలిపొడవుగల వచనములను రచియింప నాతఁడిష్టములేనివాఁ డనియు వర్ణనాంశములతో గ్రంథమునుఁ బెంచునభిలాషకలవాఁడు కాఁడనియుఁదోఁచును. ఈ లక్షణములనుఁ గిష్కింధసుందరకాండముల కన్వయింపఁజేసిచూచినచో, బాలకాండమువలెనే యీ రెండుకాండ ములయందునుఁ గొంత మంత్రిభాస్కరునికవిత్వ మున్నదనియు, మల్లికార్జున భట్టీకాండములనుఁగూడఁ వర్ణనాంశములనుఁ బెంచియు, వాల్మీకరామాయణమందు లేని "తారశ్రీరాముని శపించుట, లంక కేగి సీతా వృత్తాంతమును గనుగొని రమ్మనిసంపాతి తనకుమారున కాజ్ఞాపించుట, హనుమంతుఁడు తన జననవృత్తాంతమున గజద్వయవధను

జెప్పుట" మొదలగుకథలఁ జేర్చియుఁ బెద్దవిగాఁ జేసె ననియుఁ దలంప నవకాశము గలుగుచున్నది. వాల్మీకిరామాయణమునఁ జెప్పినకథలనే సంగ్రహపరచి వ్రాయుఁదలఁచినభాస్కరుఁ డందు లేనికథలనుఁ దెచ్చి పెట్టినాఁ డనితలంపరాదు. కిష్కింధకాండమున దాదాపుగ నిరువదియుఁ సుందరకాండమున నిరువదియుఁ బెద్దవచనము లున్నవి. ఇవియన్నియు మల్లికార్జునభట్టు పెంచి వ్రాసినవని నాయభిప్రాయము. కిష్కింధ కాండమున ౬౪౯వ సంఖ్యగల వచనమిందుల కుదాహరణము. ఈ వచనమునుఁ దీసివేసినను గథాసూత్రము తెగిపోలేదు. ఈ పెద్ద వచనము లున్నతావులలో భాస్కరుఁడు స్వల్పసంఖ్యగలపద్యములనో చిన్నవచనములనో వ్రాసియుండు నని నాయుద్దేశము. కిష్కింధా కాండమున నిపుడు ౭౩౦ గద్యపద్యములున్నవి. ఇందులోఁ బద్య మధ్యమునఁ గథపట్టులను గలుపుటకై వ్రాయఁబడిన చిన్న గద్యములు దాదాపు ౧౦౦ కలవు. మిగిలిన ౬౩౦ పద్యము లలోఁ గండములు ౩౯౦. సుందరకాండమున నున్నగద్యపద్యములు ౯౨౦లోను, పైనఁజెప్పినరీతి గలచిన్నవచనములు ౧౧౦పోను మిగిలిన ౮౧౦ పద్యములలోను గందములు ౨౬౦. యుద్ధకాండమున నున్న గద్యపద్యములు ౨౭౦౦లోను వచనములు ౪౨౯ పద్యములు ౨౨౭౧ లోనుఁ గందములు ౭౦౦. కిష్కింధసుందరకాండములయందు మంత్రి భాస్కరుని కవిత యుండెనా లేదా యనివిమర్శించునప్పుడీయంకెలు గమనింపఁదగినవి. ఈ సందర్భమునఁ బైనఁ జెప్పినయుక్తులలోఁ గొన్ని నిశితవిమర్శనమునకు నిలువలేక పోవచ్చును. కాని మొత్తముమీఁద యోచించిచూడఁగాఁ గిష్కింధసుందరకాండములలో మంత్రి భాస్కరుని కవిత యున్నదనియు, బాలకాండమువలెనే యీ కాండములను గూడ మల్లికార్జునభట్టు పెంచి వ్రాసెననియుఁ దోఁపకమానదు. విశేషపరిశ్రమచేసి, పరిశోధన మొనర్చినచో నయోధ్యారణ్యకాండముల వలెనే, తక్కిన మూఁడుకాండములయందును భాస్కరునికవిత యెంత యున్నదియుఁ దెలియఁగల దనినానమ్మకము.

## బాల, కిష్కింధ సుందరకాండములయందు భాస్కరునికవిత్వ మున్నచో నది యేల బయటపడలేదు?

ఈ ప్రశ్న కింకను దాళపత్రప్రతులపరిశోధన మావశ్యక మని చెప్పుటతక్క వేఱుతృప్తికరమగు ప్రత్యుత్తరము లేదు. ఈ తాళపత్రప్రతులు లభించుటలోఁ గూడ నొకకష్ట మున్నది. మల్లికార్జునభట్టుచేఁ బెంచి వ్రాయఁబడిన రామాయణప్రతులు ప్రచారములోనికి వచ్చినది మొదలు భాస్కరరామాయణప్రతులు మూలఁ బడిపోయియుండును. దీనికిఁ గారణము, మల్లికార్జునరామాయణమున గ్రంథ మెక్కువగా నుండుట. యుద్ధకాండముగూడ మల్లికార్జునభట్టుకాలముననే రచియింపఁబడి యుండుటచే, దానితోఁగూడ గలసినప్రతులను విలేఖకులు వ్రాసికొనుచువచ్చిరి. అయ్యలార్యునికిఁ దరువాత సమగ్రరామాయణమును విడచి, యసమగ్రముగ నున్న భాస్కరునిప్రతుల నేవిలేఖకులును వ్రాసికొనియుండరు కదా! మల్లికార్జునభట్టునకుఁ బూర్వము వ్రాసికొనిన మంత్రిభాస్కరునిరామాయణప్రతులో లేకవానిపుత్రికలో పుత్రికాపుత్రికలో మనకు లభింపవలసియున్నది. అట్టివి లభించుట చాలదుర్ఘటము. అదృష్టవశమున నయోధ్యారణ్యకాండప్రతులు దొరకినవి. ఇట్లే తక్కినమూఁడుకాండములునుగూడ లభించుననియే నాయాశ. ఇప్పుడు ముద్రితప్రతులు విశేషప్రచారములో నుండుటచేఁ దాళపత్రప్రతులను జూచువా రరుదుగా నున్నారు. అందులో మంత్రిభాస్కరుఁడు రామాయణకర్తకాఁడని యిదివఱకు పండితులు సిద్ధాంతీకరించి యుండుటచే, నీ విషయమునఁ బరిశోధన మవసరములేదని భావించువార లనేకు లున్నారు. అందుచే సామాన్యముగా నీ విషయమునుగూర్చి పరిశోధనము జరుగుట లేదు. నేను పైనవ్రాసిన యంశములను మనసు నందిడుకొని తాళపత్రపరిశోధనము గావింపవలసియున్నది.

## భాస్కరరామాయణ పీఠికాకారుల యభిప్రాయము

భాస్కరరామాయణముద్రితప్రతికిఁ బీఠిక వ్రాసిన శ్రీమేడేపల్లి వెంకటరమణాచార్యపండితులు భాస్కరరామాయణముతో మంత్రి భాస్కరునకు సంబంధము లేదనియు, హుళక్కిభాస్కరుఁడే రామాయణకర్త యనియు నిశ్చయించియున్నారు. అందు వారు చూపిన యుక్తులకుఁ గొన్నిటికి (వారివాక్యముల నుదాహరింపకపోయినను) సమాధానములను పైన వ్రాసితిని. కొన్నిటికి మల్లికార్జునాది రామాయణకవుల చారిత్రములలో సమాధానములను వ్రాయఁబ్రయత్నించెదను. ఈ సందర్భమునఁ బీఠికలో శ్రీయాచార్యులవారీక్రిందివాక్యములను వ్రాసియున్నారు.

"ఈ రామాయణమునకు భాస్కరరామాయణ మని కవి పేరుతోఁగూడిన నామముతో వ్యవహారముండుటలో నొకవిశేష మున్నది. అది యేదియన నదివఱ కొకరామాయణ మున్నట్లు సూచించుట. భారతముండఁగాఁ దరువాత జైమినిరచించినభారతమునకు జైమినిభారత మని పేరబ్బినట్లొకగ్రంథముండఁగా మఱల రెండవది పుట్టిన దానిసంజ్ఞకుఁ గవిపేరుచేర్చుట లోకములో వాడుక యయియున్నది. దీనివలన నీ రామాయణమునకు మఱియొక రామాయణము ముం దుండవలసియున్నది. అది యెఱ్ఱనకృతరామాయణ మని యూహింపవచ్చును. పింగళిసూరనార్యుఁడు భారతరామాయణకథను జోడించి వ్రాసినరాఘవపాండవీయములో:-

ఉ. ఏయెడ నర్థగౌరవసమృద్ధియు శబ్దవిశుద్ధియుం దిరం
బై యనవద్యతం బరఁగ నంధ్రవచస్స్థితి భారతంబు రా
మాయణము రచించినమహాత్ముల నాత్మఁ దలంచెదన్ జగ
ద్గేయుల నన్నపార్యుని దిక్కసుధీమణి నెఱ్ఱసత్కవిన్

అని రామాయణమును భారతమును రచించినపూర్వకవులు వీరు ముగ్గురే యని తెలిపియున్నాఁడు. ఈ పద్యము తిక్కనకుఁ బూర్వము మంత్రిభాస్కరునిచే రామాయణము రచింపఁబడియుండలే దనిఁ దెలియుచేయుటయేకాక భాస్కరరామాయణముకూడ మొదటిది

కాదని సూచించుచున్నది. కాని ప్రతాపరుద్రుని కాలమం దున్న భాస్కరుఁడు ప్రతాపరుద్రునితరువాత రాజ్య మాక్రమించుకొన్నయన వేమారెడ్డి కాలములో నిమెట్లాగ్గడకుఁ దరువాత నుండుట యెట్లు సందర్భించునను నంశ మాలోచింపవలసియున్నది. ప్రతాపరుద్రుని కాలములో భాస్కరుఁడున్నను నపుడు రామాయణమును రచించి యుండ లేదు. ప్రతాపరుద్రునితరువాత సాహిణిమారన రాజుకాఁగా నపుడు రచించెను. ప్రతాపరుద్రుఁడు కారాగారబద్ధుఁ డైనతరువాతఁ దన్సేనానాయకులు స్వతంత్రరాజులయిరి. వినుకొండకుఁ బోలయ వేమారెడ్డియునుఁ గొండవీడునకు సాహిణిమారనయు రాజులైరి. మొదటఁ బోలయ వేమారెడ్డి స్వల్పకాలము రాజ్యముచేసి మృతుఁ డయిన తరువాత నన వేమారెడ్డి రాజయ్యెఁ గావున కొండవీడును సాహిణి మారుఁడు వినుకొండను వేమారెడ్డియుఁ బాలించుచుండఁగా భాస్కరరామాయణము పుట్టినది. ఇది పుట్టినప్పటికి భాస్కరపుత్రుఁడు గూడ గొప్పకవియై యున్నందునను భాస్కరుఁడు కొంతభాగమునే రచించియుండుటనుబట్టి, నీ గ్రంథము భాస్కరునిముసలితనమందు రచింపఁబడెనని యూహింపవలసియున్నది. ఇఁక నన వేమారెడ్డికడ నున్నయెఱ్ఱన రామాయణ మాతనియౌవనకాలమున నిర్మింపఁబడినది. అనవేమారెడ్డి కంకితము చేయఁబడినహరివంశమునకుఁ బూర్వమే రామాయణము రచింపఁబడినట్లు హరివంశమువలనఁ దెలియవచ్చు చున్నది.

శా. "నాతమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁ జేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటం
జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింకనుం దనియ, నేకావ్యామృతస్వాదనన్"

ఇతనిగ్రంథములలో నిదియే మొదటిదని తోఁచుచున్నది. కావున నీ రెండురామాయణములలో నెఱ్ఱనది ముందుఁ బుట్టియుండవచ్చును.

కాఁబట్టి పైనవ్రాసినయుపపత్తులచే సర్వవిధముల నీ రామాయణమును రచించినవాఁడు హుళక్కిభాస్కరుఁడే కాని మంత్రిభాస్కరుఁడు కాఁడనిగ్రహింపవలయును.

శ్రీయాచార్యులవారి యీ వాక్యములయందలి యంశములు చరిత్రకు విరుద్ధములుగా నున్నవి.

పింగళిసూరనార్యునిపద్యములో శ్రీయాచార్యులువారు చెప్పి నంతయర్థము లేదు. కవిత్రయమును నుతించుటయే యాతనియుద్దేశము. కాని రామాయణకర్తలను జెప్పుట యాతనితలంపుకాదు. కవిత్రయము వారు భారతరామాయణములను రచించినవా రనిమాత్రమే సూర నార్యుఁడు చెప్పెనుకాని, మంత్రిభాస్కరుఁడు రామాయణమును రచింపలే దనికాని భాస్కరరామాయణము మొదటిది కాదనిగాని యాతఁడు చెప్ప నుద్దేశింపలేదు. నన్నయ రామాయణకర్త కాఁడు. రామాయణకర్త యైనభాస్కరుఁడు కనకుఁ బూర్వుఁడై నను నాతని నందు నుతింపలేదు. ఈ పద్యమునుబట్టి యెఱ్ఱనరామాయణము మొదటి దని నిర్ధారణచేయఁబూనుట వృథాయాసము. ప్రమాదభరితము.

ఎఱ్ఱాప్రగడ అనవేమారెడ్డికడ కవిగానుండి, రామాయణమును హరివంశము నతనికంకితము చేసె ననుటసరికాదు. హరివంశరచనము నాఁటి కనవేమారెడ్డి పుట్టెనో లేదో చెప్పలేము. పుట్టినను బదియేండ్ల లోపువయసుకలవాఁడుగా నుండును. హరివంశకృతిపతి ప్రోలయవేమారెడ్డి కాని యనవేమారెడ్డి కాఁడు. ప్రోలయవేముఁడు స్వల్పకాలముమాత్రమే రాజ్యముచేసినవాఁడును గాఁడు. క్రీ. శ. ౧౩౨౦ మొదలు ౧౩౪౯ వఱకు ముప్పదిసంవత్సరములు రాజ్యము చేసినప్రతిభా శాలి. ఆతనికిఁ దరువాత ననవేమారెడ్డి రాజ్యమునకు రాలేదు. ప్రోలయవేముని పెద్దకుమారుఁ డైన యనపోతారెడ్డి క్రీ. శ. ౧౩౪౦ మొదలు ౧౩౬౧ వఱకు రాజ్యముచేసెను. అటుపిమ్మట క్రీ. శ. ౧౩౬౨ మొదలు ౧౩౮౦ వఱకు ననవేమారెడ్డి రాజయ్యెను. ఈ కాలములో నెఱ్ఱాప్రగ్గడ లేఁడు. భాస్కరరామాయణ మింతకుపూర్వమే రచి యింపఁబడి యుండెను. వాస్తవముచేత నెఱ్ఱాప్రగ్గడ తనరామాయణ మును క్రీ. శ. ౧౩౨౫—౧౩౩౫ మధ్యకాలమున రచియించి యుండెను. (యెఱ్ఱాప్రగడచరిత్రమును జూడుఁడు.) భాస్కరరామాయణ మంతకుఁబూర్వమే రచితమైనది. ఎఱ్ఱనరామాయణము మొదటి దగుటచే రెండవదయిన యీ రామాయణమునకు భాస్కరరామాయణ

మని పేరువచ్చిన దని శ్రీయాచార్యులువారు సాధింపఁజూచిరి కాని, యందు సత్యము లేదు. అన వేమారెడ్డి కాలములో నెఱ్ఱనరామాయణము పుట్టిన దనువారివాదము నంగీకరించినచో, భాస్కరరామాయణమే తప్పక మొదటి దగును. భాస్కరరామాయణ మను పేరు కొంతకాలము గడచినపిమ్మట వచ్చియుండును. కవిపేరుతోఁ జేర్చి చెప్పినంతమాత్రమున నదివఱ కాపేరుగల గ్రంథ ముండితీరవలయునని నిశ్చయించుటయు, దానినిబట్టి వాని పౌర్వాపర్యములను నిర్ణయించుటయు న్యాయము కాదు. సులభముగా బోధపడుటకై కవిపేరుతోఁ జేర్చి లోకము వాడుచుండును. కొందఱు పండితులు భారతమును వ్యాసభారత మని వాడుటకలదు. ఎఱ్ఱాప్రగ్గడరామాయణ మిప్పుడు లభించెనేని లోకము దాని నెఱ్ఱాప్రగ్గడరామాయణ మనియే వాడఁగలదు.

సాహిణిమారఁడు కొండవీడునుఁ బరిపాలించె ననుటకుఁ జారిత్రకాధారములు లేవు. ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౩౨౩లో బందీకృతుఁడయ్యెను. అటుపిమ్మట సాహిణిమారయ రాజయ్యెననియు, నాతని కాలములో రామాయణము పుట్టినదనియు నాచార్యులువారి యభిప్రాయము. అట్లయినచో, ౧౧౨౪—౧౩౩౦ ప్రాంతమున భాస్కర రామాయణము పుట్టియుండవలయును అన వేమారెడ్డిరాజ్యకాలములో ఎఱ్ఱనరామాయణము పుట్టిన దన్నవాదముననుసరించినచో నది క్రీ. శ. ౧౩౮౦ ప్రాంత మగును. అది సత్యమునకు విరుద్ధము. ఎఱ్ఱనరామాయణము క్రీ. శ. ౧౩౨౪—౧౩౩౫నడుమ జన్మించినది. ఎఱ్ఱన రామాయణముకంటె భాస్కరరామాయణమే వయసునఁ గొంచెము పెద్దది. సాహిణిమారయ క్రీ. శ. ౧౩౧౧కు పూర్వమే చనిపోయినట్లు శాసనాధారము లున్నవి. ఈ విషయమునుగూర్చి హుళక్కిభాస్కరుని చారిత్రమున వ్రాసెదను. ఎఱ్ఱనరామాయణము మొదటిదని నిశ్చయించుటకై ప్రతాపరుద్రునికిఁ దరువాత హుళక్కిభాస్కరుఁడు ముసలివాఁడుగా నున్నప్పుడు యుద్ధకాండమును రచియించెనని శ్రీయాచార్యులువారు వ్రాసిరి గాని యవి యాధారరహితములైన యూహలు.

శ్రీ యాచార్యులు వారు, వెంకటేశ్వర వారు వ్రాసిన పుస్తకములో నున్నదను కారణమున నం దెంతసత్య మున్నదియు విమర్శింప కుండ "ఓరుగల్లునం దొక దేవాలయములోఁ గూర్చుండి యామహాకవి (తిక్కనసోమయాజి) యీ గ్రంథమును (మహాభారతమును) వ్రాసినట్లు" భారతములోని "అపవ్వాని యీ దృశంబులగు పుణ్యాబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్కయారాధనవిశేషం బగుటం జేసి" అనువచనమువలన స్పష్టమగుచున్నది. కావున మొదటి ప్రతాపరుద్రుని కాలమున భారతము తెనిగింపఁబడిన దనియుఁ దిక్కన పండ్రెండవశతాబ్దము వాఁ డనియుఁ దలంపవలసియున్నది. ఇఁకఁ దిక్కనతండ్రి పండ్రెండవశతాబ్దమధ్యమున నుండె ననియు నతనితండ్రి యగు మంత్రిభాస్కరుఁడు పండ్రెండవశతాబ్దారంభమును పదునొకండవ శతాబ్దాంతమునను జీవించెననియు నూహింపవలసియున్నది." అని వ్రాసి యీ వాక్యములపై నాధారము చేసికొని రామాయణకర్త హుళక్కిభాస్కరుఁ డని నిర్ణయించినారు. కాని యీ వాక్యములలోని యంశములు సత్యములని చరిత్రకారు లంగీకరింపరు. చరిత్రకు విరుద్ధములుగానున్న యీ యంశములనుగూర్చి విశేషచర్చ చేయుట, అనవసరము. ఇట్టి యంశములమీఁద నాధారపడిన శ్రీ యాచార్యులవారి యూహలును యుక్తులును వాస్తవమునుఁ దెలిసికొనుటకుఁ దోడుపడవు.

### భాస్కరోదంతము :

కవిజీవితకారులగు శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులు గారును, ఆంధ్రకవులచరిత్ర ప్రథమముద్రణమున శ్రీ వీరేశలింగము పంతులుగారును, మంత్రిభాస్కరుఁడు రామాయణమునఁ గొంత భాగమును రచియించియుండె నని యభిప్రాయపడియున్నారు. అందుపైని శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు భాస్కరోదంతమను ౭౮ పేజీలగ్రంథమున నీవిషయమును విమర్శించి భాస్కరరామాయణముతో మంత్రిభాస్కరునకు సంబంధము లేదనియు హుళక్కిభాస్కరుఁడే రామాయణగ్రంథకర్తయనియు నిరూపించియున్నారు. దానినిబట్టి

కాఁబోలు శ్రీ వీరేశలింగముపంతులుగారు తమ యభిప్రాయమును మార్చుకొని కవులచరిత్ర రెండవముద్రణమున రామాయణకర్త హుళక్కిభాస్కరుఁడని వ్రాసియున్నారు.

భాస్కరోదంతము క్రీ. శ. ౧౮౯౭వ సంవత్సరమున ననఁగా దాదాపు యేఁబదిసంవత్సరములక్రిందట ముద్రితమైనది. పంతులుగారి కవులచరిత్రము రెండవముద్రణమును, భాస్కరోదంతమును, జదివిన పిమ్మటఁగూడ నాయభిప్రాయము మారలేదు. మంత్రిభాస్కరుఁడు రామాయణములోఁ గొంతభాగమును రచించియుండెననియే నా నిశ్చితాభిప్రాయము. భాస్కరోదంతమునందలివిషయములు కొన్ని సత్యమునకు విరుద్ధముగా నున్నవి. ఎఱ్ఱాప్రగ్గడరచించిన రామాయణకృతిభర్త అనవేమారెడ్డియని భాస్కరోదంతము తెలుపుచున్నది. అది వాస్తవముకాదు. ఆ రామాయణకృతిభర్త ప్రోలయవేమారెడ్డి కాని యనవేమారెడ్డి కాఁడు. మంత్రిభాస్కరునియొక్కయుఁ దిక్కనసోమయాజి యొక్కయు కాలమును భాస్కరోదంతము సరిగా నిర్ణయింపలేదు. ఇట్టివాని కన్నిటికిని వివరముగాఁ బ్రత్యుత్తర మీయవలసి వచ్చినచో నది యొకపెద్దగ్రంథ మగునుగావున నాపనికిఁ బూనుకొనలేదు. శ్రీ పంతులుగారును, శాస్త్రులుగారును చెప్పినయుక్తులకుఁ బైనవ్రాసినపంక్తులలోఁ గొంతవఱకు సమాధానము లున్నవి. మిగిలిన వానికి సమాధానములు మల్లికార్జునభట్టు, కుమారరుద్రదేవుఁడు, హుళక్కిభాస్కరుఁడు, అయ్యలార్యుఁడు నను వారిచరిత్రములయందు వ్రాయఁబ్రయత్నించెదను. ఇంతకంటె భాస్కరోదంతము నందలి ప్రతియుక్తికిని వాదమునకును సమాధానమీయవలసిన యావశ్యకత నాకుఁ గన్పట్టలేదు.

## మంత్రిభాస్కరుని కాలము :

మంత్రిభాస్కరుఁడు పండ్రెండవశతాబ్ది నాల్గవపాదమునను, పదమూఁడవశతాబ్ది ప్రథమపాదమునందు నున్నాఁడని చెప్పవచ్చును. ఇతని నివాసము గుంటూరు అని తిక్కనయే చెప్పియున్నాఁడు. ఇతని వంశవృత్తమును దిక్కనసోమయాజిచారిత్రమున నిచ్చుచున్నాఁడను.

ఇతఁడు పం్రెండవశతాబ్దారంభమునను న్నవాఁడని భాస్కరరామా యణ తీకాకారులు వ్రాసిరి, కాని యది సరికాదు. ఇతఁడు గుంటూరు నకుఁ గరణ మని కొంద అనుచున్నారు. ఆకాలపు గ్రామకరణములు ప్రభువునకు మంత్రులుగను దండనాయకులుగను కూడ నుండెడివారని యనేకదృష్టాంతము లున్నవి. భాస్కరుఁడు మంత్రియుఁ గవియు దండనాయకుఁడునై యుండినట్లు నిశ్చయింపవలసియున్నది.

ఈ విషయముల నన్నిటిని బరికించి చూడఁగా మంత్రిభాస్క రుఁడు రచింపఁగా మిగిలినభాగమును రచియించియు, రచియించిన భాగమును విపులీకరించియు సంపూర్ణరామాయణమును లోకమున కీయవలయునని సంకల్పించుకొని హుళక్కిభాస్కరుఁడును మల్లికార్జున భట్టునుఁ గుమారరుద్రదేవుఁడును బనిచేసిరని యూహింపనగుచున్నది.

భాస్కరరామాయణ పరిశోధనము :

మొత్తముమీఁద భాస్కరరామాయణమునుగూర్చి పరిశోధన మింకను నెక్కువగా జరుగవలసియున్నది. భాస్కరరామాయణ తాళ పత్రప్రతులు గ్రామములలో విశేషముగాఁ గలవు. ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమునందే దాదాపుగ నేఁబదిప్రతులు లున్నవి. సాధ్యమయినన్నిప్రతులను సంపాదించి పరిశోధించినచోఁ బ్రస్తుతమునఁ జరిత్రకారులనుఁ బండితులనుఁ గలవరపెట్టుచున్నయనేకాంశములకు సమాధానములు లభింపఁగలవని నా యాశ. నే నారంభించిన గ్రంథ సమాప్తికై పాటుపడుచుండుటచే నేనాకార్యమునకిప్పుడు పూనుకొన లేక పోయితిని. ఆ కార్యభారమును వహింపవలసినవారు చారిత్రా సక్తులగు ధనాడికులునుఁ బండితులునై యున్నారు. భగవదనుగ్రహ ముండెనేని యా పరిశోధనాభాగ్యము నాకుఁగూడ లభింపవచ్చును. కాలక్రమమున నావరిశోధనము జరిగి సత్యము బయలుపడుననియు నందు మంత్రిభాస్కరునకు న్యాయము లభించుననియుఁ దలంచుచు నీతనిచారిత్రమును ముగించుచున్నాఁడను.

పైనఁ జేసినచర్చనుబట్టి అయోధ్యారణ్య కాండములయందు మంత్రిభాస్కరునికవిత్వ మేదియో తెలిసినది. కావున నాతనిశైలి

తెలియుటకై కాండమునకు నాల్గువంతున నెనిమిది పద్యముల నీ క్రింద నిచ్చుచున్నాఁడను.

అయోధ్యాకాండము :

ఉ. బంధులు మంత్రులున్ భరతుఁ బట్టరు రాముఁడు పెద్దవాఁడు స
ద్బంధురదోర్బలుండు గుణభాసియు నా సుతుఁ డుండ నాసుతున్
సింధుపరీతధాత్రి కభిషిక్తునిఁ జేయుదె భూవిభుం డసం
బంధము గానఁ దీనికి నుపాయ మెఱింగినఁ జెప్పుమంధరా! ౬౨

శా. స్వచ్ఛందస్థితిఁ గీర్తి దిక్తటములన్ వర్తింప నేకాతప ౨౩౪
త్రచ్ఛాయంబుగ భూమి యేల రఘురత్నం బున్నచో ధర్మముం
బ్రచ్ఛాదించి విభుండు గూర్చు నని నిర్బంధించి యిబ్బంగిఁ దు
చ్ఛేచ్ఛం గైక వరంబు వేఁడె విధితో నెవ్వాఁడు నేర్చుం గటా!

చ. తరణికులప్రధానబిరుదధ్వజపంక్తులఁ జూచి సేనతో
భరతుఁడు దాడివెట్టి తముఁ బట్టఁగ వచ్చుటఁ గాఁ దలంచి ని
ష్ఠురగతి లక్ష్మణుండు ఘనచుంబిమహీరుహశాఖనుండి యా
గ్గిరి యుగలంగ డిగ్గ నుఱికెం గులిశాతతపాతమో యనఁగా. ౩౭౧

శా. అస్మత్కార్ముకముక్తబాణవిసరం బాభీలదంభోళిసం
ఘస్మేరాగ్రము గాఁగ యుష్మదభిషేకప్రాతికూల్యంబు దా
నస్మార్యం బటుగాక తక్కిన నయోధ్యాపట్టణం బంతయున్
భస్మీభూతము సేసి పుచ్చెద మహీపాలాన్వయగ్రామణీ. ౧౪౧

ఆరణ్యకాండము :

మ. ధరణీపుత్రిఁ బ్రమోదపూరభరితాత్మం జేసి నానావిధా
ధ్వరసంగున్ శరభంగుఁ జూచుటకు జిత్తం బుత్సవం బొంద భా
స్కరవంశాగ్రణి యేఁగి కాంచె నచటన్ జంభారి రంభాది ని
ర్జరనారీకరచామరోద్భవమరుత్సంచారలోలాలకున్. ౧౪౨

మ. ఖరదైత్యాధిపుఁ డేయుబాణచయముల్ కాకుత్స్థబాణౌఘముల్
సరినాకాశము నిండి తాఁకుదలలం జండాగ్నికీలాసము
త్కర ముగ్రంబుగఁ జేయఁ దద్గతఘనధ్వానంబు బ్రహ్మాండక
ర్పరముం దాఁకి తెరల్చి రాల్చె నురుతారారాజికాశ్రేణులన్.

చ. అఱుగునె యుక్కుగుండు గడు నంగద మ్రింగిన నూఁచిచూచినన్
విఱుగునె మేరుభూధరము వెంగలివై రఘురాముభామినిం
జెఱగొని పోవఁ జూచెదవు చెచ్చెర నిప్పుడ యోరి నీచ నా
కఱపినబుద్ధిఁ గైకొనుము కాచెద జానకి డింపు మిమ్మహిన్. ౧-౨౧

మ. శిరముం గంఠము లేక వక్షమునఁ బ్రస్ఫీతాంబకంబున్ విశో
దర దేశంబున వక్త్రముం గలుగునద్దైత్యాఘమున్ శత్రుభీ
కర సారోగ్ర సదగ్రవిగ్రహరయుద్గర్వగ్రహగ్రస్తు ను
ద్ధురమోహాంధుని గ్రౌర్యబంధునిఁ గబంధుం గాంచిరా రాఘవుల్.

## 19. కేతన ప్రగ్గడ

పెదపాటిజగ్గన, తన ప్రబంధరత్నాకరమునందు భాస్కరుని కేతన కాదంబరిలోని వని యీ క్రింది రెండుపద్యముల నుదాహరించి యున్నాఁడు.

సీ. దీనిలోపలఁ గొన్ని దినము లుండిన నుష్ణ
కరుఁ డైన నట శీతకరుఁడు గాఁడె
దీనిపెంపెఱిగిన (లోతెఱిఁగిన) దాసంబురాశిలోఁ
గాదని జలశాయి కాఁపు రాఁడె
దీనితియ్యనినీరు దివిజులు ద్రాగి చూ
చినఁ దమయమృతంబు చేఁదు నారె
దీనితోయము తలపై నల్కినంతనె (తోయమ్ములఁ దీర్థమాడినంతె)
పాపాత్ములును మోక్షపరులు గారె (పదవిఁ గనరె)
యనుచుఁ గొలనినీటియతిశీలత్వంబు
బఱపుఁ బెంపుఁ దీపుఁ బావనతయుఁ
గడుముదంబుఁ బెంపఁగా నాజి బడివాగె
(మనుజనాయకుండు గొనియాడి పడివాగె)

త్రాటఁ దిగిచికొనుచుఁ దఱియఁ జొచ్చె.
(త్రాట హయముఁ దిగిచి తఱియఁజొచ్చె.)

శా. గంధర్వాత్మజ రాజుఁ జూచెఁ బతియుం గాదంబరిం జూచెఁ ద
ర్పాంధీభూతమనస్కుఁడై మరుఁడు విల్లందెక్కి బ్రసూనోల్లస
ద్గంధం బొప్పఁగ నెక్కువెట్టి గుణనాదం బాని పుష్పాస్త్రముల్
సంధించెన్ దెగఁబాపి యేయఁదొడఁగెన్ సవ్యాపసవ్యంబుగన్.

కస్తూరిరంగకవి తనరంగరాట్ఛందమునందుఁ గేతనకాదంబరిలోని వని ప్రాదియతికి లక్ష్యముగా నొకగీతపద్యమును, నభేదయతికి లక్ష్యముగా నొకశార్దూలవృత్తపాదము నిచ్చియున్నాఁడు. అవి యివి:

గీ. జనవరేణ్యుఁ గాంచి సాష్టాంగ మెఱఁగిన
నావిభుండు వాని లేవనెత్తి
కౌఁగిలించి వానిఁ గనుఁగొని కేయూర
కాభిధానమొనఁగెఁ గౌతుకమున.

శా. డా చే యంకతలంబుఁ జేర్చి వలచేతన్ మాలికన్ దాల్చి.

"బాణోచ్ఛిష్టంజగత్రయ"మ్మని కీర్తిఁ గాంచినబాణభట్టమహాకవి సంస్కృతమున "కాదంబరి"యనుమహాకావ్యమును రచియించి యుండెను. దాని నీతఁ డాంధ్రమునఁ బద్యకావ్యముగా రచియించె నని తలంపవలసియున్నది. కేతననామధారులు కవులు మూలఘటిక కేతన, నండూరికేతన మొదలుగాఁ గొంద ఱున్నారు. కాని వారెవ్వరును భాస్కరునితనయులు కారు.

తిక్కనసోమయాజివంశములోఁ దిక్కనకుఁబూర్వులు భాస్కరుని కేతన లిరువురున్నారు. వారిరువురును తాతయు మనుమఁడును. దశకుమారచరిత్రమున, వీరిరువురిలోఁ దాతయైన కేతనను గవి యని చెప్పియున్నాఁడు. కావున నా కేతనయే కాదంబరీకర్తయని నిశ్చయింప వలసి యున్నది. దశకుమారచరిత్రమున నీ కేతనను వర్ణించిన పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ఉ. దీపధి భాస్కరార్యునకు ధీరగుణాన్విత కొమ్మమాంబకున్
మానవకోటిలోపల సమస్తగుణంబుల వాఁడు పెద్ద నా
వానికి వాఁడు పెద్దయున వానికి వానికి వాఁడు పెద్ద నా
వానికి వారలిద్దఱకు వాఁ డధికుం డనఁ బుట్టి రాత్మజుల్.

సీ. వివిధవిద్యాకేళి భవనభావంబున
జలజజుముఖచతుష్టయముఁ బోలి
విబుధవిప్రతిపత్తివిదళనక్రీడనై
జలశాయిభుజచతుష్టయముఁ బోలి
ధర్మమార్గక్రియానిర్వర్తకత్వంబున
సన్నుతాగమచతుష్టయముఁ బోలి
పృథుతరప్రథితగాంభీర్యగుణంబున
శంబరాకరచతుష్టయముఁ బోలి
సుతచతుష్టయంబు నుతికెక్కె గుణనిధి
కేతనయును బారిజాతనిభుఁడు
మల్లనయును మంత్రిమణి సిద్ధనయు రూప
కుసుమమార్గణుండు కొమ్మనయును.

వ. అందగ్రనందనుండు.

చ. కవితకు ముఖ్యుఁ డీతఁ డనఁ గామితవస్తువు లిచ్చువాఁడు నా
నవరసభావకుం డితఁ డనన్ బురుషార్థపరాయణుండు నా
నవు నన రాజనీతివిషయజ్ఞుఁ డితం డనఁ గీర్తిచంద్రికా
ధవళితదిక్కుఁడై నెగడె ధన్యుఁడు కేతనమంత్రి యిమ్మహిన్.

ఇందు మొదటిపద్యములోఁ జెప్పఁబడినభాస్కరుఁడే భాస్కర రామాయణకర్త యని యూహింపఁబడినయాతఁడు. అతనిచారిత్రము నింతకుముందు వ్రాసియుంటిని. అతనికుమారులు నలువురిలో పెద్దవాఁడైన కేతనయే కాదంబరీకర్త యని చెప్పబడిన యా కవి మూఁడవ కుమారుఁడైన సిద్దన, చోడతిక్కరాజునకు మంత్రి. ఈతనినిగూర్చి

తిక్కనసోమయాజిచరిత్రమును వ్రాయుచున్నాఁడను. నాల్గవకుమారుఁడైన కొమ్మన తిక్కనసోమయాజితండ్రి.

కాదంబరీ కృతికర్తయైన కేతనకుమారుఁడు భాస్కరుఁడు. ఈభాస్కరున కిరువురు కుమారులు. అందు పెద్దవాఁడు కేతన. ఇతనినే మనుమఁడు కేతన యని పైన వ్రాసియుంటిని. ఇతఁడు కవి యైనట్లు దశకుమారచరిత్రకర్తయైన మూలఘటికకేతనకవి చెప్పియుండలేదు. ఈవిషయములను దెలుపుపద్యములను గూడ నీక్రింద వ్రాయుచున్నాఁడను.

ఉ. మానిని బ్రహ్మమాంబకు సమాత్యశిఖామణి కేతశౌరికిన్
భానుతకీర్తి భాస్కరుఁడు పుణ్యచరిత్రుఁడు మంత్రిగుండఁడున్
ధీనిధి నల్లసిద్ధియు నతిస్థిరచిత్తులు ధర్మతత్పరుల్
మానవనాథపూజ్యులు క్రమంబునఁ బుట్టిరి కీర్తనీయులై

వ. అందగ్రజుండు

క. నీతిసురాచార్యుం డన
దాతృతఁ గానీనుఁ డనఁ బ్రతాపంబునఁ బ్ర
ద్యోతనుఁ డన సచివాగ్రణి
కేతయభాస్కరుఁడు జగతిఁ గీర్తన కెక్కెన్

చ. గొనములప్రోఁక భాస్కరుసనకున్ బతిదేవత మారమాంబకున్
దినకరతేజులై తుహినదీధితిసన్నిభకాంతిమంతులై
వనధిగభీరులై సుజనవందితులై జనియించి రొప్పఁగా
మనుచరితుండు కేతనయు మారసమానుఁడు మారశౌరియున్

క. శౌచంబున గంగాత్మజుఁ
డాచారంబున మరీచి యర్థుల కీగిన్
ఖేచరవల్లభుఁ డనఁగాఁ
బాచయకేతుండు కీర్తిపాత్రం బయ్యెన్.

తాత యైనకేతనను కవి యని చెప్పియుండుటచేతను, మనుమని కవిగా వర్ణింపకపోవుట చేతను, తాతకేతనయే కాదంబరీకర్త యని

నిశ్చయింపఁ దగియున్నది. చోడతిక్కరాజు కాలము క్రీ. శ. ౧౧౧౦-౧౧౬౦ అయియున్నది. అతనియొద్ద మంత్రిగనున్న సిద్ధన, యీ కేతన ప్రెగ్గడకుఁ దమ్ముఁడు. కావున నీకేతన ప్రెగ్గడయు నా కాలమునం దున్నవాఁ డని నిశ్చయింపవచ్చును. అనఁగా క్రీస్తుశకము పదుమూఁడవ శతాబ్ది ప్రథమార్థమున నున్నవాఁ డనియర్థము.

ప్రబంధరత్నాకరమునందు కేతన కవి వలయాశ్వచరిత్రము లోని దని యీ క్రిందిపద్య ముదాహృతమయినది.

ఉ. కోట తనర్చు చూడ్కులకు గోచర మయ్యెనుఁ దేవుపాదముం బ
ల్లాటున నేఁగుచో నెటు దగులం బడెనిన్ రవిమండలంబు నీ
పాటిదయన్ తలంపునకుఁ బట్టుచున్నది గాక దీనికిం
బాటి యనంగ నుజ్జనఁగఁ బట్టెవె యయ్యెనయాస్త్రశైలముల్.

ఈ కేతన, యెవ్వరో తెలిసికొనుటకుఁ దగినయాధారములు దొరకలేదు. మూలఘటిక కేతన కాఁడు. నందూరి కేతన నైనను నై యుండవచ్చును. లేదా మఱియెవ్వరైనఁ గావచ్చును.

ఆంధ్రపద్యకాదంబరి యిప్పు డెచ్చటను గాన్పించుట లేదు. ఉదాహృతపద్యములనుబట్టి యీప్రబంధమందలి శైలి ప్రౌఢముగను, రసవంతముగను మనోహరముగను నుండునట్లు తోఁచుచున్నది. ఇట్టి యుత్తమప్రబంధము నామమాత్రావశేష మగుట యాంధ్రుల దురదృష్టము. ఆఱువందల సంవత్సరములకుఁ బూర్వము రచింపఁబడిన యీగ్రంథ మెంతయో యదృష్టముండినఁగాని బయటపడు ననునాశ లేదు.

# 20. తిక్కన సోమయాజి

ఈకవిబ్రహ్మ, ఈయుభయకవిమిత్రుఁడు, ఈపండితశిరోమణి, ఈకవిపండితపోషకుఁడు, ఈయుధరీకృతకల్పభూరుహుఁడు, ఈనిరతాగ్నిహోత్రి, ఈరాజనీతిచాణక్యుఁడు, ఈ మహాభారతనిర్మాత, ఈ మహాసౌందర్యరాశి ఆఱువేలనియోగిబ్రాహ్మణకుటుంబమునఁ గౌతమగోత్రమునఁ గొమ్మనదండనాథునకును, నన్నమాంబకును నొకశుభముహూర్తమున జనన మందెను. ఈతనికి మంత్రిభాస్కరుఁడు పితామహుఁడు; కొమ్మమాంబ పితామహి. ఈతని వంశవృక్షము నిందు నిచ్చుచున్నాఁడను.

ఇతని పూర్వుల ప్రశంస:

మూలఘటికకేతనకవికృతమగు దశకుమారచరిత్రమునందలి పద్యము లీవంశవృక్షమున కాధారములు. ఈ వంశమిప్పటికిని దామరతంపరలై యభివృద్ధి నందుచున్నదని తెలియుచున్నది.

ఒకానొకశాసనమున (A. R. నెం. 290 ఆ. 1932-33) మూవెన యను నాతఁడు వస్తువులపైఁ బన్నును రాబట్టెడియధికారిగా నుండి యాపన్నును గుంటూరుమండలమందలి సత్తెనపల్లితాలూకా మూవెందల (మాడాల)లో నున్నసకలేశ్వరదేవునకు దీపముకొఱకై శా. శ. ౧౦౫౧వ సంవత్సరమున ధారవోసినట్లు వ్రాసియున్నది. ఆమూవెన పై వంశవృక్షమందలి మూలపురుషుఁ డేమో పరిశోధింపవలసి యున్నది. కాల మందుల కడ్డమురాదు. తిక్కనవంశకర్తయైన మూవెనను మూలఘటికకేతనకవి తనదశకుమారచరిత్రమున నిట్లు వర్ణించి యున్నాఁడు.

క. ఆగౌతమగోత్రమునన్
   ద్యాగవ్రతశీలుఁ డమలినాచారుఁడు నా
   నాగుణమండితయశుఁ
   డాగమకోవిదుఁడు మూవెనార్యుఁడు పుట్టెన్.

పైనఁ జెప్పినశాసనమిది. "శకవర్షంబులు ౧౦౫౧గు ప్రశాహి సంక్రమణ వెగ్గడ మూవెన శ్రీ సకలేశ్వరదేవర కఖండవర్తి దీపంబునకు మూవుందల

తిక్కనసోమయాజివంశవృక్షము :









కోటిపీసా మాచంద్రార్కముగా నిచ్చె" (ఈ శాసనము ప్రతిని నేనడుగగనే వ్రాసిపంపినందులకు ఉదకమండలమునందున్న దొరతనము వారి యెపిగ్రాఫిస్టుగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను).

ఈ మావెనమనుమఁడైన కేతన కమ్మనాఁటిని బాలించిన త్రిభువనమల్లదేవచోడుని మంత్రియనియు నా కేతనమనుమలైన కేతన మల్లన లీ కమ్మనాఁటిచోడులకు మంత్రులుగా నుండిరనియుఁ దెలియుచున్నదని. బ్ర. శ్రీ. చిలుకూరి వీరభద్రరావుగారు (ఆంధ్రులచరిత్ర ౪౭–౭౪ పుటలు) వ్రాసియున్నారు. కాని యందు సత్యము లేదు. ఈ త్రిభువనమల్లదేవచోడుఁడు క్రీ. శ. ౧౧౧౫ ప్రాంతమువాఁడు. ఆతని పేరున శాసనము లనేకములున్నవి. ఆతనికడ మంత్రులుగానున్నవారు కాశ్యపగోత్రులు. అందు కేతన శివశర్మనికొడుకు. కేతన, మల్లనలు అమాత్యసిద్ధదోనమాంబల తనయులు (ద. హిం. శా. సం. ౭ సంఖ్య ౧౩౭; ౭౪౩) తిక్కనసోమయాజివంశీయులకును వారికిని నేమియు సంబంధము లేదు.

పైవంశవృక్షమునఁ దిక్కనసోమయాజికిఁ బితామహుఁడుగాఁ గన్పట్టుచున్న భాస్కరమంత్రియే భాస్కరరామాయణకర్త యని యూహింపఁబడుచున్నయాతఁడు. ఆతనిచారిత్రము నీ గ్రంథమున వేఱుగ వ్రాసియున్నాఁడను. ఆభాస్కరమంత్రి పెద్దకుమారుఁడును దిక్కనసోమయాజికిఁ బెదతండ్రియునగు కేతనప్రగ్గడయే ఆంధ్రపద్య కాదంబరీ కావ్యకర్త యని తలంచుచున్నారు. ఆ కవిచారిత్రమును గూడ నిందు వేఱుగ వ్రాసియుంటిని.

తిక్కనకు వేఱొక పెదతండ్రియగు సిద్ధనయు నాతనికుమారుఁడైన తిక్కన (ఖడ్గతిక్కన)యుఁ జోడతిక్కరాజుకడ మంత్రులై సేనాధిపతులై పరాక్రమవంతులై యనేక రణములలోఁ బాల్గొని శాశ్వతకీర్తిని గడించియున్నారు. చోడతిక్కరాజెవ్వరో తెలిసినఁగాని వారినిగూర్చి చెప్పిన ప్రయోజనము లేదు. కావున వారివృత్తాంతమును దరువాత వ్రాసెదను.

ఈ ఖడ్గతిక్కనకు సోదరులైన కేతన, మల్లన, భాస్కరులు పరాక్రమవంతులును శూరులు నైనట్లీ క్రిందిపద్యములలోఁ గేతనకవి దశకుమారచరిత్రమునఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఆతనినీతిసంపద విహంగమపుంగవకేతుఁ జెప్పుచోఁ
గేతనఁ జెప్పి యుద్ధవిజిగీషను వానరకేతుఁ జెప్పుచోఁ
గేతనఁ జెప్పి దిగ్విదితకీర్తిరతున్ వృషకేతుఁ జెప్పుచోఁ
గేతనఁ జెప్పి కాక ధరఁ గేవలమర్త్యులఁ జెప్పఁజాలునే.

శా. పారావారపరీతధాత్రి వినుతింపం బోలుమల్లాంకునిన్
సారోదారయశోభిరాము బహుశాస్త్రప్రౌఢు శస్త్రాస్త్రవి
ద్యారాజత్పటుబాహువిక్రము నుదాత్తస్వాంతు ధర్మక్రియా
పారాప్రాప్తసమస్తదోషవహునిన్ జౌహాత్తనారాయణున్.

చ. ఉరవడి నుగ్రసేవణపయోనిధి బాడబవహ్నిచాడ్పునన్
దరికొని కుంభజన్ముక్రియఁ ద్రాగి రఘుక్షితినాథుమాడ్కి న
చ్చెరువుగ నింకఁజేసె నని చెప్ప జనప్రకరంబు విక్రమా
చరణుని సిద్ధనార్యసుతు బాచని సన్నుతగంధవారణున్.

ఈ పద్యమునఁ జెప్పినసేవణరాజు లనఁగా దేవగిరి రాజధానిగా రాజ్యమేలిన యాదవరాజు లని చరిత్రకారులు నిర్ణయించియున్నారు. ఈ సేవణరాజులనుఁ జోడతిక్కరాజు జయించినట్లు దశకుమారచరిత్రము నందుఁ దిక్కరాజును వర్ణించుసందర్భమునఁ గేతనకవి రచించిన "సేవణ కటక సామంతులగర్వ మడఁచె" ననుపద్యపాదమువలనఁ దెలియు చున్నది. పైచంపకమాలలోని భాస్కరుఁడు మంత్రిభాస్కరునకుఁ బౌత్రుఁడు. తిక్కనసోమయాజికిఁ బెదతండ్రికుమారుఁడు. ఇతఁడుఁ కూడ తండ్రివలెను, సోదరుఁడగు ఖడ్గతిక్కనవలెనుఁ జోడతిక్కరాజుకడఁ సేనాధిపతిగా నుండి సేవణరాజులతోఁ నాతనికి జరిగినయుద్ధములలోఁ బాల్గొని జయముఁ గల్గించియుండును.

తిక్కనసోమయాజితండ్రియైన కొమ్మనామాత్యునిఁ దల్లియైన యన్నమాంబను, దశకుమారచరిత్రమునఁ గేతనకవి యీ క్రింది పద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. స్వారాజ్యపూజ్యుఁడో కౌరవాధీశుఁడో
నాఁగ భోగమున మానమున నెగడె
రతినాథుఁడో దినరాజతనూజుఁడో
నాఁగ రూపమున దానమున నెగడె
ధరణీధరేంద్రుఁడో ధర్మసంజాతుఁడో
యనఁగ ధైర్యమున సత్యమున నెగడె
గంగాత్మజన్ముఁడో గాండీవధన్వుఁడో
యనఁగ శౌచమున శౌర్యమున నెగడె
సూర్యవంశభూపాలనుచిర రాజ్య
వనవసంతుండు బుధలోకవత్సలుండు
గౌతమాన్వయాంభోనిధి శీతకరుఁడు
కులనిధానంబు కొట్టరు కొమ్మశౌరి.

సీ. పతిభక్తినల యరుంధతి పోలె నేనియు
సౌభాగ్యమహిమ నీ సతికి నెనయె
సౌభాగ్యమున రతి సరియయ్యె నేని
భాగ్యంబున నీయాంబుజాక్షి కెనయె

భాగ్యంబునందు శ్రీపతి యయ్యె నేని యుఁ
దాలిమి నీ లతాతన్వి కేనయె
తాలిమి భూదేవి తగసాటియగు నేని,
నేర్పున నీపద్మనేత్ర కేనయె
యని యనేకవిధంబుల నఖిలజనులు
పొగడ నెగడెఁ గృపాపరిపూరితాంత
రంగ కొమ్మనామాత్యు నర్థాంగలక్ష్మి
యఖిలగుణగణాలంకృతి యన్నమాంబ.

తిక్కనసోమయాజి తనతండ్రి యగుకొమ్మనామాత్యుఁడు, దండనాథుఁ డనియు, గుంటూరివిభుఁ డనియు భారతమునఁ జెప్పియున్నాఁడు. గుంటూరివిభుఁ డనఁగా గుంటూరునకుఁ గరణ మనియుఁ దిక్కనసోమయాజికుమారుఁడు కూడ గ్రామకరణముగా నుండెను. కావున వీరు మొదటినుండియు గ్రామకరణములుగా నుండిరనియుఁ గొందఱియభిప్రాయము. సుప్రసిద్ధచరిత్రకారు లగు శ్రీ చి. వీరభద్రరావుపంతులుగారీయభిప్రాయము సరికాదనిరి. కొమ్మన కరణ మైన నగుఁగాక. అయిన నాకాలమునాఁటికరణము లిప్పటివారివలె లెక్కలు వ్రాయువారుగా మాత్రమే యుండి పేరు ప్రతిష్ఠలు లేనివారుగా నుండెడివా రని తలంపరాదు. ఆకాలపుకరణములు, శాస్త్రజ్ఞానసంపన్నులై పరాక్రమవంతులై యాత్మగౌరవముకలవారై తమగ్రామసంరక్షణమునకుఁ గావలసినసైన్యము నుంచుకొని రాజునకు సర్వవిధముల సాహాయ్య మొనర్చుచు రాజుచే గౌరవము నందుచుండెడివారు. అందుచేతనే "విభు" "పరిపాలక" శబ్దములు, వారియందు వర్తించుచుండెను. తిక్కనసోమయాజితండ్రి గ్రామకరణ మని యంగీకరించినను, నంతమాత్రమున నాతనిని సామాన్యునిగాఁ దలంపరాదు. ఇతఁడు సాంగవేదవేది. దండాధిపతి. సూర్యవంశభూపాలసుచిరరాజ్యావనవనంతుఁడై గాండీవధన్వివలె శౌర్యమున నెగడియున్నాఁ డని కేతనకవి చెప్పియుండుటచే నితని కేవల మొక వ్రాయసగాఁడని తలంపరాదు. ఇతఁడుకూడ చోడరాజులకడ సేనాధిపతిగా నుండి నెల్లూరునందు జర

గినయొకమహారణములో వీరమరణము నందె ననియు, నావార్త గుంటూరునం దున్నయాతనిభార్య విని యించుకేనియు విచారము నందక తాను వీరపత్నియైనందులకు సంతసించిభర్తతో సహగమనము గావించెననియుఁ జెప్పుదురు. భర్తమరణవార్త చెప్పవచ్చినవారి తోడను, నాసమయమునఁ దనను జూడవచ్చినవారితోడను దేహ మశాశ్వత మనియు, జీవితమునఁ బరోపకారముగాఁ గడపుటయు, వీర మరణము నొందుటయు నుత్తమపురుషలక్షణము లనియు నట్టిభర్తతో సహగమన మొనరించుట నుత్తమసాధ్వీధర్మ మనియు హితోపదేశము గావించెనఁట. ఈ దంపతుల సుగుణములను దెలుపుకథలను బ్రజలు విశేషముగా నిప్పుడును జెప్పుకొనుచుందురఁట.

జగద్విఖ్యాతచారిత్రుఁడైన తిక్కనసోమయాజి కీపుణ్యదంపతులు తలిదండ్రులు. మొత్తముమీఁద నీకుటుంబమున మొదటినుండియుఁ బండితులును గవులును, శూరులును, దాతలు నుద్భవించి తమయశశ్చంద్రికల దిగంతముల వ్యాపింపఁ జేసియుండిరని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఈ కుటుంబమువారు, నెల్లూరు రాజధానిగా నాచుట్టు ప్రక్కల నున్న దేశమును బరిపాలించినచోడరాజులకడ మంత్రులుగను సేనాధిపతులుగ నుండి పేరు వడసి రనిచెప్పుట కీవంశమునందలి పేరులు సాక్ష్య మిచ్చుచున్నవి. ఆ కాలమున మంత్రులు, సేనాధిపతులు మొదలగురాజకీయోద్యోగులు తమసంతానమునకుఁ దమప్రభువుల నామములనుంచి తమకృతజ్ఞతను వెల్లడించు నాచారముండెడిది. తిక్కనరచించిన నిర్వచనోత్తరరామాయణమునుఁ గృతి నందిన ప్రభువు మనుమసిద్ధి. ఆతనితండ్రి తిక్కరాజు. ఆతనితండ్రి మనుమసిద్ధి. ఆతని పూర్వుఁడు నల్లసిద్ధి. ఈ పేరు లీ వంశవృక్షమునఁ గాన్పించుచున్నవి. మనచారిత్రకపురుషుఁడైన తిక్కనపేరు, మనుమసిద్ధితండ్రి యైనతిక్కరాజును బట్టియే వచ్చినదని తలంపవచ్చును. కాళహస్తియందున్న తిరుకాళత్తిదేవుఁడే యాంధ్రమునఁ దిక్కన యైనాఁడు. చోడతిక్కరాజును దిరుకాళత్తి దేవచోడుఁ డని కూడ పిలచెదరు.

ఇట్టి సుప్రసిద్ధవంశమునఁ దిక్కనసోమయాజి జననమొంది మహా కవి యగుటయేగాక గొప్పరాజకీయవేత్తయై మహామాత్యుడై వేద వేదాంగసంపన్నుఁడై కర్మిష్ఠియై కవిపండితపోషకుఁడై కృతిపతియై శాశ్వతకీర్తిని గడించియున్నాఁడు.

కొట్టరువు కొమ్మనప్రగ్గడ కొడుకు మల్లనప్రగ్గడ యనునాతఁడు విశ్వేశ్వరశివదేశికుని (కాకతీయగణపతిదేవునకు రాజగురువు)యొద్ద ధాన్యాధిపతిగా నుండి శా. శ. ౧౨౦౮ చిత్రభాను సం॥ర ఆశ్వయుజ బహుళతృతీయనాఁడు విశ్వనాథదేవునకు దీపమునకై యేఁబదిగొఱ్ఱెల నిచ్చినట్లు గుంటూరుమండలములోని మందరగ్రామమున నొకశాసన మున్నది. (A. R. నెం. 98 ఆ. 1917) పై వంశవృక్షములోఁ గొమ్మన కొడుకు మల్లన కనుపడుట లేదు. కాని దానిమది కొమ్మలయందిరు వురు కొమ్మనలున్నారు. వారిలో నెవరికైన మల్లన యుద్భవించినాఁ డేమో! లేక యాతఁడు మఱియొకవంశములోనివాఁడో! శాసనములో నాతఁడు భారద్వాజగోత్రుఁ డని యున్నది. తిక్కనసోమయాజి గౌతమ గోత్రుఁడు. శాసనములోని వ్రాఁత పొరబాటు కావలయును. లేదా కొట్టరువువారిలో రెండుగోత్రములవా రుండి యుండవలయును.

తిక్కనసోమయాజి తననుగూర్చి చెప్పినవిషయములు:

ఈ మహాకవి రచించినగ్రంథములయందుఁ దననుగూర్చి యేమి వ్రాసికొని యుండెనో చూతము.

ఇతడు నిర్వచనోత్తరరామాయణమును శ్రీమహాభారతమున విరాటపర్వ మాదిగాఁ బదునెనిమిదిపర్వములనుఁ నాంధ్రమునఁ బద్యకావ్యములుగా రచించి యుండెను. నిర్వచనోత్తరరామాయణమున నితఁడు తననుఁగూర్చి యీయొక్కపద్యమును మాత్రమే చెప్పికొని యున్నాఁడు.

మ. అమలోదాత్తమనీష నేనుభయకావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుడం గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మనమంత్రికిన్ సుతుఁడ దిక్కాంకుండ సన్మాన్యుఁడన్.

ఈపద్యమునందుఁ దాను శివభక్తుఁడనైనట్లు చెప్పియున్నను వైష్ణవద్వేషమున్నవాఁడు కాఁడని నిర్వచనోత్తరరామాయణరచనను వలనను నందలి ప్రథమపద్యముననే "హరిహరపద్మగర్భులను" అని చెప్పియుండుటచేతను స్పష్ట మగుచున్నది. మఱియు సంస్కృతాంధ్రకావ్యశిల్పమునందుఁ బారగుఁడ ననియుఁ గళావిదుఁడ ననియుఁ జెప్పుకొనియుండుటచే నదివఱ కేవియో కొన్ని సంస్కృతాంధ్రగ్రంథములను రచియించియున్నట్లు పొడగట్టుచున్నది. కాని యీ రామాయణభారతములు దక్క నిఁక నే గ్రంథములును నీతనిరచనములు మనకు లభ్యములగుట లేదు. తిక్కనసోమయాజికి దశకుమారచరిత్రమునుఁ గృతియిచ్చి కేతనకవి

క. అభినుతుఁడు మనుమభూపతి
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవిమిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్.

అని చెప్పియుండుటచే నితఁ డనేకసంస్కృతాంధ్రగ్రంథములను రచియించినట్లు తెలియుచున్నది. కేతనకవి చెప్పియుండకపోవుటచే నీ మహాకవిరచనముల పేరులనైనను తెలిసికొను నదృష్టము లేకపోయినది. ఆ కాలము వారికి, తాము మదివఱకు రచించిన గ్రంథముల పేరులను గాని తమపూర్వులు రచించిన కావ్యముల పేరులు గాని చెప్పుకొను నాచారము లేదు. తిక్కనసోమయాజికూడ తన తాతనుఁగూర్చి చెప్పునప్పుడు "సారకవితాభిరాము" అని చెప్పెనే గాని యాతఁడు రచించిన గ్రంథములను బేర్కొనలేదు.

సంగమవంశజుఁడైన కంపరాజుభార్య గంగాదేవి తనభర్తవిజయములను వర్ణించుచు వ్రాసిన మధురావిజయ మను సంస్కృతగ్రంథమునఁ దిక్కనసోమయాజిని సంస్కృతకవులలోఁ జేర్చి వర్ణించినది. కాని యందును నాతఁడు రచించిన గ్రంథనామముల నీయ లేదు.

ఈ మహాకవి, భారతములోఁ గూడఁ దనను గూర్చియుఁ దన పూర్వులను గూర్చియు నొక్కపద్యమే వ్రాసికొనినాఁడు.

సీ. మజ్జనకుండు సన్మాన్యగౌతమగోత్ర
మహితుండు భాస్కరమంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘులు కేతన
మల్లన సిద్ధనామాత్యవరుల
కూరిమితమ్ముండు గుంటూరివిభుఁడు కొ
మ్మనదండనాథుఁడు మధురకీర్తి
విస్తులస్ఫారుఁ డాపస్తంబసూత్రప
విత్రశీలుఁడు సాంగవేదవేది
తే. యర్థిఁ గలవచ్చి వాత్సల్య మతిశయిల్ల
నస్మదీయప్రణామంబు లాదరించి
తుష్టిఁ దీవించి కరుణార్ద్రదృష్టిఁ జూచి
యెలమి నిట్లని యానతి యిచ్చె నాకు.

తిక్కన, తననుఁగూర్చిగాని, తనపూర్వులనుఁగూర్చిగాని యీ గ్రంథములయందు విశేషముగాఁ జెప్పుకొనకుండుట కాత్మశ్లాఘనమునం దిష్టము లేకపోవుటయో, పూర్వగ్రంథములయందు వర్ణించి యుండి మరలమరలఁ జెప్పుకొనుట రుచింపకయో యైయుండును. ఇప్పటివారివలెఁగాక యానాటిమహాకవులకు, స్వవిషయకథనమునం దిష్ట ముండెడిదికాదు. నన్నయభట్టు తండ్రిపేరైనను గృహనామము నైనను జెప్పుకొనలేదు.

ఇతనిగృహనామము: నివాసము :

తిక్కన తనగృహనామము నెచ్చటనుఁ జెప్పుకొనియుండలేదు. కేతనకవి రచించిన దశకుమారచరిత్రమువలన వీరియింటిపేరు కొట్టరువువా రని యెఱుఁగనగుచున్నది. మొట్టమొదట వీరిగృహనామము గుంటూరు వారనియుఁ బిమ్మట కొట్టరువుగా మాఱె ననియు నందురు. తిక్కన పూర్వులనివాసము గుంటూరుమండలమందలి పసుగుపాడనియుఁ గొన్ని తరములయినపిమ్మట గుంటూరునకువచ్చి యచ్చటనివాసమేర్పరచు కొనిరనియుఁ దిక్కనపితామహుని జీవితకాలమునందో, కాకయామాత్యుని తండ్రులకాలముననో నెల్లూరునకు వచ్చి యచట నివాస మేర్పరచుకొని

రనియు జెప్పుచున్నారు. తిక్కన నెల్లూరునివాసి యనుటనిర్వివాద విషయము. తండ్రిని గుంటూరువిభుఁ డనుటచేత తండ్రినివాసము గుంటూరనియేచెప్పనొప్పును.

కొన్నిశాసనములలో కోష్ఠాధిపతి యనుసంస్కృతశబ్దమునకుఁ దెలుఁగున కొట్టారువు అని వ్రాసియున్నారు. ఇట్లేభాండాగారాధిపతు లకు భండారువు అనియుపయోగించియున్నారు. తిక్కనవంశీయులలోఁ బూర్వు లేమహారాజునొద్దనో కోష్ఠాధిపతులై యుండిరనియు నాకాలపు తెలుగుభాషనుఁబట్టి వారిని కొట్టారువు లనివాడియుండిరనియు దాని ననుసరించి యీవంశీయులకు "కొట్టరువు" అను నింటిపేరువచ్చియుండు ననియు నూహింపఁదగియున్నది. ఈపే రెప్పుడువచ్చెనో చెప్పుట కాధారములు లేవు.

కొట్టరువు అనునొకగ్రామ ముండెననియు దానినిబట్టి యీగృహ నామ మేర్పడెననియుఁ గొంద ఱనుచున్నారు. కాని యది సత్యము కాదు. కొట్టరువుగ్రామ మెచ్చట నుండెనో వారు చెప్పలేదు. గుంటూరు నెల్లూరు మండలములలో కొట్టరువు లేదు.

దశకుమారచరిత్రమందలి తిక్కనప్రశంస :

తిక్కనసోమయాజి, మూలఘటిక కేతనకవి రచించినదశకుమార చరిత్రమునుఁ గృతి నందెను. అందుఁ దిక్కనను గూర్చి యాకేతనకవి రచించినపద్యముల ని క్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁ డనిన
వీఁ డనునాలుకకుఁ దోడవైనవాఁడు
చిత్రనిత్యస్థితశివుఁ డెవ్వఁ డనిన
వీఁ డనుశబ్దమున కర్థమైనవాఁడు
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁ డనిన
వీఁ డనిచెప్పుటకుఁ బాత్రమైనవాఁడు
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁ డనిన
వీఁ డనిచూపుటకు గుఱియైనవాఁడు

మనుమసిద్ధిమహీశసమస్తరాజ్య
భారధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
కొట్టరువుకొమ్మనామాత్యు కూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి.

క. అగు ననఁ గొమ్మయతిక్కఁడు
జగతి నపూర్వార్థశబ్దచారుకవిత మై
నెగడిన బాణోచ్ఛిష్టం
జగత్త్రియం బనినపలుకు సఫలం బయ్యెన్.

క. కృతులు రచియింప సుకవుల
కృతులొప్పఁ గొనంగ నొరునికిం దీరునె వా
కృతివిభుఁడు వితరణశ్రీ
యుతుఁ డన్నమనుతుఁడు తిక్కఁ డొకనికిఁ దక్కన్.

సీ. సరసకవీంద్రులసత్ప్రబంధము లొప్పఁ
గొను ననుటధికకీర్తనకుఁ దెరువు
లలితనానాకావ్యములు చెప్ప నుభయభా
షలయందు ననుట ప్రశంసత్రోవ
యర్థి మైఁ బెక్కుశ్రోత్రాగ్రహారంబులఁ
గా నిచ్చు ననుట భాగ్యదపాలము
మహికదక్షిణ లైనబహువిధయాగంబు
లొనరించు ననుట వర్ణనము దారి
పరుని కొక్కఁడి కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజము లై పెంపు సొంపార నెగడె నట్టి
కొమ్మనామాత్యుతిక్కన కొలఁది సచివు
లింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు?

ఇతఁడు కేవలము మంత్రియేగాక దండాధీశుఁడుకూడ నైనట్లు కేతన రచించినయీక్రిందిపద్యముల వలన స్పష్టపడుచున్నది.

క. శ్రీకరవరవచనవిభా
రీకరణవినోదశుభచరిత్రుని సనుకం
పాకరహృదయుఁ గుణాబ్ధిను
ధాకలశుభమూర్తిఁ దిక్కదండాధీశున్.

క. శ్రీవిలసన రమణీయా
భావితభవపాదపద్మభావావధానా
భూవినుతశుభచరిత్రా
ధీవిభవాత్మస్వరూప! తిక్కచమూపా!

కేతనకవి రచించిన యీపద్యములందుం దతిశయోక్తి గాని యుత్ప్రేక్ష గాని లేదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఆధ్యాత్మిక జ్ఞానసంపన్నుఁడగు నీమహామహుఁడు తనవంశమున రాఁబోవువారల కైశ్వర్యమును సంపాదించి నిలువయుంచవలయు ననుకోరికకలవాఁడు కాఁడనుట కేతనికుమారుఁడొక చిన్నగ్రామమునకుఁ గరణమైనాఁ డనుటయే నిదర్శనము. ఇతఁడు తనశక్తినంతయును ప్రభుకార్యనిర్వాహణము నందు వినియోగించి చోడరాజ్యస్థాపనాచార్యుఁ డయ్యెను. తనపాండిత్యమును లోకశ్రేయమునకును, ఆంధ్రసాహిత్యాభివృద్ధికి నుపయోగపరచి, యుద్గ్రంథరచనమును గావించుటయేగాక యనేకకవులకుఁ బండితులకుఁ బ్రోత్సాహ మొసంగియున్నవాఁడు. మారనవంటిమహాకవి యీతనికి శిష్యుఁ డగుటయు, కేతనవంటి పండితకవి కృతిదాత గావుటయు, బయ్యనవంటివాఁ డీతనిచే బిరుదము గ్రహించుటయు నిందులకుఁ బ్రమాణములు.

## హరిహరనాథుని ప్రసంస:

ఇతఁడు పరమభక్తాగ్రేసరుఁడనుట కీతనిరచనములే దృష్టాంతములు. ఇతనికాలమున వీరశైవవీరవైష్ణవమతములు పరస్పరద్వేషముతో నుండి యన్యోన్యహింసకూడ గావించుకొనుస్వభావముతో మెలఁగుచు వచ్చినవి. అట్టిసమయమున నీమహామహుఁడు శివకేశవుల కభేదమును ప్రతిపాదించి, హరిహరనాథుఁ డనుదైవమునకు తనభారతమునుఁ గృతి యిచ్చెను. నెల్లూరునందు హరిహరనాథదేవాలయ ముండెడిదనియు,

దిక్కనసోమయాజి భారతము నాయాలయమునఁ బవిత్రహృదయమును తోఁ గూర్చుండి రచియించెననియుఁ జెప్పుదురు. భారత విరాటపర్వ కృత్యాది యందలి "అని పూని యాదృశ్యంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నాకయారాధనవిశేషం బగుటం జేసి" అను వాక్యము లీయంశమును ధ్రువపర్చుచున్నవి. ఈ కృతిరచన మొకవిధమగు దేవతారాధన మనియే తిక్కన మనసార విశ్వసించెను. ఈతనితరువాతికవులు కొందఱీతనిననుకరించి తమగ్రంథములను హరిహరనాథునకు గృతి నొసంగిరి. నెల్లూరునం దిప్పుడీయాలయము లేదు. పాండవులయాలయ మొకటికలదు. ఇప్పుడు రంగనాథస్వామియాలయ మున్నచోటనే పూర్వము హరిహరనాథునియాలయ ముండెడిదనియు నది శిథిలమైపోఁగా నాప్రదేశమున రంగనాథాలయమును నిర్మించి రనియుఁ జెప్పుదురు. నెల్లూరుకడ పెన్న రెండుపాయలైనదనియు, రెండవపాయ నెల్లూరునకు దక్షిణమునను౦డెడిదనియు, నదియిప్పుడు పూడిపోయినదనియు, నాపాయకు దక్షిణపుటొడ్డున హరిహరనాథ దేవాలయముండెడిదనియు దానిశిథిలచిహ్నము లిప్పుడును గన్పడు చున్నవనియు కొందఱనియెదరు. బైచరాజు వెంకటనాథకవి తనపంచ తంత్రము నీ హరిహరనాథునకుఁ గృతియిచ్చియుండుటచే నాతనికాలము వఱకును (పదునైదవశతాబ్ది) నీయాలయ ముండెనని విశ్వసింపవచ్చును. సప్తగోదావరీ సంగమమున నొక హరిహరదేవాలయ ముండెనిదని ద్రాక్షారామ మందలి యొక శాసనము (పదుకొండవశతాబ్దినాఁటిది. ద. హిం. శా. సం. ౪ సంఖ్య ౧౦౫౯)వలనఁ దెలియుచున్నది. హరి హరనామక పట్టణ మొండు కర్ణాటదేశమునఁ గలదు.

హరిహరనాథునిఁ బ్రశ్నించుచు తిక్కనరచించిన యీ క్రింది శ్లోక మా దేవునకుఁ బరమప్రీతినిఁ గల్గించె నఁట!

"కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిము వా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే."

"ప్రభో! నీవు అలంకరించుకొనుటలో అస్థిమాల నిచ్ఛయింతువా లేక కౌస్తుభము నభిలషింతువా? నీకు కాలకూటము రుచ్యముగా నుండునా? లేక యశోదాస్తన్యము రుచ్యముగా నుండునా నాకుఁ జెప్పుము." ఇది పైశ్లోకార్థము.

భగవంతుఁడు స్వప్నమునఁ బ్రత్యక్షమై శివకేశవులకభేదమునుఁ బ్రతిపాదించుచు గ్రంథమును రచించినందులకుఁ దనను గొనియాడుచున్నట్లీక్రిందిపద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.

ఉ. వైదికమార్గనిష్ఠ మగువర్తనముం దగ నిర్వహించుచు
నేదము లేనిభక్తి మతి నిర్మలవృత్తిఁగఁ జేయుచుండ నా
త్మాదనిరంతస్మరణతత్పరభావము కల్మి నాత్మ న
మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచునుండు నెప్పుడున్.

స్వప్నసాక్షాత్కారకథనుఁ జెప్పిన వారిలో మొదటివాఁడు తిక్కనసోమయాజి. తరువాత కవులు పెక్కురీతినినుకరించి తమ గ్రంథములలోఁ దమపూర్వులో, తమ రారాధించెడి దేవతలో స్వప్నమునఁ బ్రత్యక్షమైనట్లు వ్రాసికొనుచువచ్చిరి. కొందఱిదియొక యాచారముగాఁ బరిగణించి యట్లు చెప్పికొనియుందురని తలంచినను దిక్కనసోమయాజివంటి భక్తాగ్రగణ్యున కీశ్వరసాక్షాత్కారమయ్యెనని యూహించుటయే సముంజసము. పరమహంసరామకృష్ణునకుఁ గాళికాదేవి ప్రత్యక్షమగుచుండెడి దని చెప్పుటయు నది సత్యమనివిశ్వసించుటయు నీయిరువదియవశతాబ్దియందలి సంగతులు. మానవునకుఁ బరమేశ్వరసాక్షాత్కార మసంభవ మని యీ కాలమునఁ గొందఱి విశ్వాసము. కాని యది యాప్తవాక్యవిహితము కాఁజాలదు.

హరిహరనాథుఁడు తిక్కన హృదయమున నిర్మించుకొనిన దేవుఁడే కానియర్చాస్వరూపుఁడు కాఁ డని కొందరి మతము. అది సత్యము కాదు. హరిహరనాథాలయములు పూర్వకాలమున నచ్చటచ్చట నుండెడి వనుటకు శాసనదృష్టాంతములు కలవు. ఆయాలయమునందలియేకవిగ్రహమున హరిహరరూపములు రెంటును గనుపడునట్లు చెక్కఁబడియుండెడి వని చెప్పుదురు. తూర్పుగోదావరిమండలమున

రాజోలు తాలూకాలో కేశవస్వామి యాలయమున నెదుటిప్రక్క కేశవ రూపమును వెనుక ప్రక్క స్త్రీరూపమును గలిగియున్నవి. శ్రీమహా విష్ణువు మోహినీ రూపమున శివుని వంచించినకథను సూచించుటకై యీ విగ్రహమును నిర్మించిరని యచ్చటివారు చెప్పుచుందురు. కావున హరిహరనాథుఁడు కేవలమానసికారాధనకొఱకుఁ గల్పించుకొనిన వాఁడేకాక యర్చాస్వరూపుఁడుగాఁగూడ నున్నాఁడని విశ్వసింపవచ్చును.

తిక్కనసోమయాజి నిర్వచనోత్తర రామాయణమును రచియించు నాఁటికిఁ బూర్వమే తలిదండ్రులిరువురును స్వర్గము నలంకరించియుండి రనిచెప్పవచ్చును. దీనిఁబట్టి యాతని బాల్యవయసునందే పితృమాతృ విహీనుఁడయ్యెననియుఁ బెదతండ్రులచేఁ బెంపఁబడి విద్యల నభ్యసించి సర్వకళలఁ బరిపూర్ణుఁ డయ్యెననియు నెంచవలసియున్నది.

### తిక్కన యజ్ఞకథ:

తిక్కనామాత్యుఁడు రాజకార్యములలో నిమగ్నుఁడైయున్నను బ్రాహ్మణోచితము లగు వైదికకర్మల నుపేక్షింపలేదు, నిర్వచనోత్తర రామాయణగద్యయందు "బుధారాధనవిధేయ తిక్కననామధేయ" యనియు, భారతగద్యయందు "బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి" యనియుఁ జెప్పుకొనియుండుటచే నీతఁడు నిర్వచనోత్తరరామాయణ రచనమునకుఁ దరువాతను, భారతరచనాత్పూర్వమునను జన్నము చేసె ననుట స్పష్టము. కేతనకవి దశకుమారచరిత్రమునఁ దిక్కనను వర్ణించుచు "మహితదక్షిణలైనబహువిధయాగంబు లొనరించుననుట వర్ణనము దారి" యని చెప్పుటచే దశకుమారచరిత్రమును గృతినొందుటకుఁ బూర్వమే యాతఁడు యజ్ఞమునుఁ జేసియుండు నని కొంద ఱనుచున్నారు. అదిసత్యమైనచోఁ గేతనకవి యెచ్చటనైనను తిక్కననామాంతమున నాతఁడు యజ్ఞకర్త యనిసూచించుపదమును వేయకుండ నుండఁడు. అట్టిపద మేదియు దశకుమారచరిత్రమున లేదు. కావున నాయూహ యందు సత్యము లేదని తలంపవలసియున్నది. కేతనచెప్పినదానికి వైశ్వదేవాదియాగము లని యర్థము చెప్పవలసియుండును. మనుమసిద్ధి

చనిపోయినపిదప భారతము ప్రారంభింపనగుటకుఁ బూర్వమె తిక్కనయు జన్మ మొనర్చియుండు నని నా యభిప్రాయము.

నన్నయభట్టు రచింపక మిగిలినభాగమును పూర్తిచేయించుటకై తగినకవికొఱకు రాజరాజనరేంద్రుడు ప్రయత్నము సేయుచు, నన్నయరచనమునందలి యీపద్యము నొసఁగి :

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబులై"

యను పద్యము నొకతాళపత్రముపై వ్రాయించి యిట్లు వ్రాయఁగలిగిన కవు లెవరైననున్నచో నీభావమునుఁ దమశైలిలో రచించి పంపుఁడని రాజస్థానములకుఁ బంపెననియు, నది మనుమసిద్ధికడకు రాఁగాఁ దిక్కన సోమయాజి యాపద్యమునే వేఱొకపత్రముపై వ్రాసియిచ్చె ననియు, నన్నయతో సమానముగాఁ దాను వ్రాయఁగలనను తిక్కనభావమును గ్రహించి రాజరాజాతని దనకడకుఁ బంపు మని మనుమసిద్ధినిఁ గోరె ననియుఁ దిక్కన యందుల కంగీకరింపక పోఁగా మనుమసిద్ధికిఁ గోపము వచ్చి "పలువురిలో నీ బుజ్జగొట్టిగించి వీథులవెంటఁ ద్రిప్పి మాంసమును దినిపించెద"నని తూలనాడెననియుఁ దరువాత రాజు పశ్చాత్తప్తుఁడై తనమాట నిలుపుకొనుటకై తిక్కనామాత్యునిచే యజ్ఞము చేయించె ననియు నొకకథ చెప్పెదరు. కాని యింతలేశమాత్రమును సత్యము లేదు. (యజ్ఞము చేయువానికి క్షౌరమును, [illegible], సోమపానమును గర్తవ్యములు).

మనుమసిద్ధిమహారాజు రాజరాజునకుఁ దరువాత రెండువందల సంవత్సరములలోనున్నవాఁడు. భారతమును బూర్తిచేయించుటకై రాజరాజు ప్రయత్నించె ననుటకుఁ గూడ నాధారములు లేవు. భారతమును దనకుఁ గృతియిమ్మని మనుమసిద్ధి యడిగెననియుఁ దిక్కన యందుల కంగీకరింపకపోఁగాఁ బైనఁజెప్పినకథ నడచెననియుఁ గొందఱందురు. కాని యందును సత్యము లేదు. తిక్కనభారతమును రచించునాఁటికి,

మనుమసిద్ధి జీవించియుండెనో లేదో యని సంశయముగా నున్నది. భారతమును భగవంతునకుఁ గృతి యీయఁదలచినప్పు డందుల కభ్యంతరమునుఁ గలుగఁజేయు స్వభావముకలవాఁడు కాఁడు మనుమసిద్ధి. తిక్కనయెడల మనుమసిద్ధికి గౌరవము మెండు. శ్రీకృష్ణదేవరాయలు తనమంత్రియైన తిమ్మరసును "అప్పాజీ"యని పిలచినట్లే మనుమసిద్ధి తిక్కనను "మామా"యని పిలుచుచుండెడివాఁడు. మనుమసిద్ధి తిక్కనలకుఁ గల యన్యోన్యగౌరవము నిర్వచనోత్తరరామాయణమునందలి యీ క్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

చ. హరిహరపద్మగర్భులను నాదికవీంద్రుల నూత్నసత్కవీ
శ్వరులను భక్తిఁ గొల్చి తగ వారికృపం గవితావిలాసవి
స్తరమహనీయుఁ డైన నను సర్వగుణోత్తరమూర్తి మన్మభూ
వరుఁడు దగం గరం బనిచి వారనిమన్ననఁ నాదరించుచున్.

క. ఏ నిన్ను మామ యనియెడు
దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక నా
కీనర్హుఁడ వగు దనినను
భూనాయకువల్కు చిత్తమున కిం పగుడున్.

సీ. సకలలోకప్రదీపకుఁ డగుపద్మినీ
మిత్రవంశమున జన్మించె ననియుఁ
జూదిన మగలైనఁ జొక్కుచునట్టిసౌం
దర్యసంపద సొంపుఁ దాల్చె ననియు
జనహృదయానందజనకమై నెగడిన
చతురత కల్మి నృపతిమఁ డనియు
మెఱసి యొండొంటికి మిగులు శౌర్యత్యాగ
విఖ్యాతకీర్తుల వెలసె ననియు
వివిధవిద్యాపరిశ్రమవేది యనియు
సరసబహుమానవిరచనాశాలి యనియు
సత్కృతిశ్వరుఁ డగుచున్నమను నృపతి
సుభగుఁ గానించుటకు సముచితుఁడ నైన.

మనుమసిద్ధిమహారాజు తిక్కనకు రాజచిహ్నముల నిచ్చి గౌర వించిన ట్లీక్రిందిపద్యమునఁ గేతసకవి చెప్పియున్నాఁడు.

గీ. అంకలంబు గొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జమిలిశంఖములును
గంబగట్లు భూమి గానికగాఁ గొంచెం
పెనఁగు రాచపదవులెల్లఁ బడసె.

పైపద్యమునందు మనుమసిద్ధి వివిధవిద్యాపరిశ్రమ వేదియనియుఁ సరసబహుముఖానవిరచనాశాలి, యనియుఁ జెప్పియున్నాఁడు. అట్టివాఁడు తిక్కననుఁ బరుషోక్తు లాడెనని దలంచుటకు వీలులేదు. కావునఁ బై కథ యెంతమాత్రమును విశ్వసనీయము కాదు. కృతినిఁ గన్యకతోఁ బోల్చిన వారిలోఁ దిక్కనయె మొదటివాఁడు. రాజరాజు పరీక్షార్థమంపినపద్య ము పైనఁజెప్పినది కాదనియు "నిండుమనంబు" అనుపద్య మనియు. గొంద అందురు. మఱియొకటి యనియింకఁ గొంద అందురు.

### తిక్కనతరువాత నాతనివంశము :

తిక్కనసోమయాజికిఁ దరువాత నాతనికుమారుఁడు నెల్లూరునకుఁ పడమట రెండుమూఁడుక్రోసులదూరములో పినాకినీనదీతీరమందున్న పాటూరుగ్రామకరణీకమును సంపాదించి యక్కడ నివాసమేర్పరచు కొని రనియు నప్పటినుండియు వారు పాటూరివా రని పిలువఁబడుచుండి రనియుఁ జెప్పుచున్నారు. ఈవంశావళిని వర్ణించు రెండుసీసపద్యములను బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగా రాంధ్రకవులచరిత్రమున నుదాహ రించియున్నారు. ఆ పద్యము లివి:

సీ. భారత పర్వములుపదియేను వరుసగాఁ
దెనిఁగించె గుంటూరితిక్కయజ్వ
యామహాత్మునిపుత్రుఁ డౌ కొమ్మనఘనుండు
కల్పించెఁ బాటూరి కరణికంబు
నాకొమ్మనకుఁ గల్గె హరిహరామాత్యుండు
నమ్మతో నతనికిఁ గొమ్మఘనుఁడు

రహిఁ మీఱు నతనికి రామన తిప్పన
యారామనకు సోమ యాహ్వయుండు
ఆ ఘనునకు వీరనామాత్యుఁ డతనికి
సోమలింగమంత్రి యామహాత్ము
నకును సోమరాజనాముఁడుఁ జిటివీర
ఘనుఁ డనంగ సుతులు గలిగి రందు

సీ. సోమమంత్రికిఁ గల్గె సుతుఁడు పాపనమంత్రి
యతనికి వీరన యాఘనునకుఁ
గూరిమి తనయులు గోపాలభద్రార్య
నరసింహామంత్రు లనంగ ముగుర
వారిలో నరసింహవరునకు శరభార్యుఁ
డును భాస్కరామాత్యుఁడు నరసింహ
ఘనుఁ డనఁ బుత్రులు గలిగిరి మువ్వురు
వారిలో శరభార్యవర్యునకును
వీరఘనుఁడు గలిగె వేఁడ్క నామంత్రికి
శరభమంత్రివరుఁడు జననమొంది
ప్రబలియున్నవాఁడు పాటూరిలోఁ దన
కులము వర్ధిలంగఁ గొమరు మీఱి.

ఇందులో మొదటిపద్యము పూర్వరచిత మనియు, రెండవ పద్యము శరభరాజు గారిచ్చిన వంశానుక్రమణికనుబట్టి బ్రహ్మశ్రీ శతఘంటము వెంకటరంగనాథశాస్త్రిగారు రచియించి రనియుఁ జెప్పుచుఁ నీపద్యములను శరభరాజుగారు వీరేశలింగముపంతులుగారి కిచ్చి రఁట. పాటూరి కరణీకము నుబట్టి వీరు పాటూరి వారైనారఁట.

కొందఱు వీవంశావళిని గూర్చి సంశయమునుఁ దెలుపుచున్నారు. తిక్కనసోమయాజి యుపయోగించిన గంటపువర చాలకాలము వీరియింట నుండెననియు నందుపై నొకప్రక్క సరస్వతివిగ్రహమును నొకప్రక్క విఘ్నేశ్వరవిగ్రహమునుఁ జెక్కఁబడియున్నవనియుఁ బ్రతీతి కలదు. అది

యిప్పుడున్నదో లేదో తెలియదు. బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగారీ వంశావళినిబట్టి తిక్కనకాలమును నిర్ణయింపయత్నించిరి. ఇప్పుడు శాసనసాహాయ్యమున నీమహాకవికాలము స్పష్టముగాఁ దెలియుచున్నది. కావున నందుల కీవంశావళితోఁ బనిలేదు. మడికిసింగనకుఁ బితామహుఁడైన యల్లాడమంత్రి తిక్కనసోమయాజి పౌత్రినిఁ బరిణయమాడెనని సింగకవికృత వాసిష్ఠరామాయణములోఁ జెప్పఁబడియున్నది.

ఆంధ్రభాష కీతఁ డొనర్చినసేవ:

ఆంధ్రభాషాభివృద్ధికై పాటుపడినవారిలోఁ దిక్కన యగ్రేసరుఁడు. నన్నయాదు లాంధ్రభాషలోఁ గావ్యములను రచించినను, వారికావ్యములలో సంస్కృతపదము లధికమును, ఆంధ్రపదములు స్వల్పముగ నున్నవి. నన్నెచోడుఁడు, సోమనాథుఁడు మొదలగుశివకవులు తమగ్రంథములలో దేశీయపదముల నధికముగ నుపయోగించి యాంధ్రసాహిత్యాభివృద్ధికై యెక్కువగా పాటుపడియుండిరి. తిక్కనసోమయాజి రెండుగ్రంథములను రచియించుటే కాక, యాకావ్యములలో దేశీయపదములనుఁ జక్కగా సంస్కరించి యుపయోగించి, తన రచనముల నాంధ్రసాహిత్యగ్రంథములనుగా జేసెను. ఆంధ్రాభ్యుదయ రచయితలలోఁ దిక్కనయగ్రగణ్యుఁ డని చెప్పనొప్పును. ఆంధ్రసాహిత్య పోషణమున కీతఁడు పడినశ్రమ యపారము. ఈతనిరచనములు రెండును సంస్కృతమున కాంధ్రీకరణములైనను, ఇతఁడు గొప్పసంస్కృతపండితుఁడైనను, నీతనికవిత్వమునందుఁ "నన్నుపయోగింపుఁడు నన్ను గొనుఁ"డని సంస్కృతపదములు ముందునకువచ్చి యుఱ్ఱూత లూగించుచున్నను, నాంధ్రభాషాభివృద్ధియే మనమున నిడుకొని విశేషముగా జాతీయపదములనే యుపయోగించి, రసముప్పతిల్లునట్లు కావ్యరచనము సాగించినవాఁ డీమహాకవి. ఈతనికవిత్వమునందు సంస్కృతపదములున్నను నవి యతిమృదులములై సామాన్యమానవులు వాడుకొనుచుండునట్టివియుఁ "నివి సంస్కృతపదములా? జాతీయములా?" యనిసంశయము గల్గించునట్టివియునై యున్నవి. ఈతఁడు తనరచనావిధానమునుసూచించుచు నిర్వచనోత్తరరామాయణమున:

ఉ. జాత్యముగామి నొప్పయిననంస్కృత మెయ్యెడఁ జొప్పు; వాక్యసాం
గత్యము సేయుచోనయిన గద్యముతోడుగఁ జెప్పిపెట్ట; దా
గ్గత్యము దోఁపఁ బ్రాసము ప్రకారము వేఱగునక్షరంబులన్
శ్రుత్యముహాప మంచునిడ; సూరుల కివ్విధ మింపుఁ బెంపదే.

అనుపద్యమునుఁ జెప్పి యారీతిగనే తనకావ్యములను విరచించినాఁడు. ఈసందర్భమునఁ దిక్కనకవిత్వపుసొంపుసూపుటకై కొన్నిపద్యములనిట నుదాహరించుట యావశ్యకము కాకపోదు.

ఉ. నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సుఖోచితశయ్యను నిద్రసేయ నీ
కన్నెమొగుఱ్ఱునూఱటకుఁ గారణ మెయ్యది భీమసేన! దీ
యన్నపరాక్రమంబు వలనన్ననొకో నయమూలి తక్కటా' (వి.ప)

క. ఆపదఁ గడవంబెట్టఁగ
నోపి శుభంబైనదాని నొడఁగూర్పను మా
కీపుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా!

ఆ. కొడుకుఁగాంచు రాచకూఁతు రెద్దానికి
నట్టిపనికి నుచిత మైనసమయ
మొదవెఁ దడయ టెంకనొప్పదు జనములు
నట్లుగాని పురుషు లనరు మిమ్ము ఉ. ప.

తే. పట్టపగలింటిసూర్యునిపగిదిఁ గర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుఁగుచునున్నవాఁడు
మాధవా! మనరథంబును మరలనిమ్ము
బ్రదికియుండిన శుభములు బడయవచ్చు. క. ప.

చ. వెరవును లావుఁ జేవయును వీరల కారయ నొక్కరూప దు
స్తరభుజశక్తి ధర్మజుఁడు శల్యుని రూపడగించి యివ్వసుం
ధరఁ గొనునొక్కొ నేఁడితనిఁ దా నమయించి సమస్త మేదినీ
శ్వరుఁడుగఁ జేయనోపునొకొ శల్యుఁడు కౌరవరాజనందనున్. (శల)

ఉ. క్రూరుఁడు లోభియున్ శఠుఁడు గొండియుఁడున్ జడుఁడుం గృతఘ్నుఁ[డున్
నేరనివాఁడు బొంకరియు నిందకునోర్చునతండుఁ బందయున్
ధీరతలేమి దుర్ణయ మతివ్యసనత్వముఁ గల్గువారలుం
జేరువ నున్కి భూపతికిఁ జెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా! (శాం.ప)

సీ. దివియాలోఁ బశుఁబుర్వు దివియయెత్తినవానిఁ
బాపంబు వొందునే! యోపి దున్న
నాఁగేటి మొనఁ జచ్చు నానావిధప్రాణు
లన్నరుఁబొందునే యఘము? వారు
దమవను ల్సేయ విధాతృవశమున నా
యువు దెగినట్టిజంతువులు సచ్చు
నేను సంప్రీతి మనియించు కేనియు సహం
కారంబు వారికిఁ గలుగ దట్లు

ఆ. గాన చూవె వారిఁ గల్మష మొందదు
పుణ్యపాపములకు బుద్ధిమూల
మనిశివుండు మఱియు నను హింసవోలె నై
యధికధర్మ మైనవిధము వినుము. అ. ప.

ఉ. ఏను హితంబు సెప్ప నిటు లేదిదురాచరణంబు లిమ్మెయిన్
మానవు రోగి చేఁదయినమం దఱువుం డెవ్వు లంటఁదాఁకినం
గాని యొఱుంగఁ డప్పు ప్రతికారము గల్గునె యట్లపోలె నీ
వైన నికృష్టవృత్తిఫల మంది తలంచెదుగాక పిమ్మటన్. ని. రా.

స్థాలీపులాకన్యాయముగ నీ పద్యములఁ జూపితిని. గ్రంథమంతయు నిట్లే యుండును. ఈతనినిజూచి కేతనమారన నాదు లిట్లే తమగ్రంథముల యందు జాతీయపదముల నుంచి రచించుచువచ్చిరి. కాని శ్రీనాథాది మహాకవులు కొంద ఱీమార్గమును విడనాడి తమకావ్యములను సంస్కృత పదజాలముతో నింపివైచిరి. సాంస్కృతికదీర్ఘసమాసములతో గ్రంథము

లను రచించుటయే గొప్పతనమని తలంచినకవులుకూడఁ గొందఱు కలరు. ఆంధ్రభాషలోఁ గావ్యరచనముఁ జేయఁదలచికొనినప్పుడు దేశీయ పదములతోఁ బాఠకలోకమునకును విను వారికిని హృదయాహ్లాదమునుఁ గలుగఁ జేయునట్లు రచించుటయేగొప్పతనమగునుగాని సంఘంటుసాహాయ్య ముండినఁగాని యర్థముకాని గూఢసంస్కృతపదసమాసములతోఁ నాంధ్ర కావ్యమును రచించుట గొప్పతనముకాజాలదు. ఈ సందర్భమున మొల్ల తన రామాయణమునఁ జెప్పిన

క. మును సంస్కృతంబు తేటగఁ
దెనిగించెడిచోట నేమి తెలియకయుండన్
దనవిద్య మెఱయఁ గ్రమ్మఱ
ఘన మగుసంస్కృతముఁ జెప్పఁగా రుచి యగునే.

ఆ. తేనెసోక నోరు తియ్యన యగురీతిఁ
దోన యర్థ మెల్లఁదోఁపకున్న
గూఢశబ్దవితతిఁగొల్లాటపని మొల్ల
మూఁగ చెవుడు నాడుముచ్చ టగును

క. కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెనుఁగునకున్
బొందై రుచియై వీనుల
విందై మఱికానిపించు విబుధుల కెల్లన్.

అనుపద్యములు స్ఫురణకువచ్చుచున్నవి. తిక్కనసోమయాజి తన గ్రంథ ములయం దుపయోగించిన దేశీయపద్యములు వేలకొలఁదిగ నున్నవి. సంస్కృతపదములవిషయమున "బాణోచ్ఛిష్టంజగత్రయ"మ్మని యనెడు మాట దేశీయపదవిషయమున నీమహాకవికి వర్తించు ననుటకు సంశ యము లేదు. ఈ భావమును దశకుమారచరిత్రకృతికర్తయగు కేతన వి "అగునన(గొమ్మయతిక్క(డు" (ఈ పద్యమును పైనసుదహరించి ని.)అనుపద్యములో వ్యక్తీకరించియున్నాఁడు.

ఇతని కవిత్వగుణము :

అద్వితీయప్రతిభావంతుఁ డగు నీ మహామహుని కవిత్వగుణమును జూపనెంచుట సూర్యుని కాగడాతోఁ జూపనెంచుట వంటిది. ఆంధ్ర కవులలో నీతనితో సమానులింకొకరు లేరు. ఈతని కవిత్వ మింతగా సర్వజనాకర్షణీయ మగుటకుఁ గారణములు కొన్ని గలవు. అందు

మొదటిది:— ఈతఁడు చేపట్టిన కావ్యములయందలి యితివృత్తములు. ఆర్యులమగు మనకుఁ గల యితిహాసములలో శ్రేష్ఠము లయినవి రెండు. భారతము, రామాయణము. ఈ కావ్యములు రెండింటి నీతఁడు చేపట్టినాఁడు. "మణినావలయమ్ వలయేన మణిః" యనునట్లు కవితవలన కథయునుఁ గథచేఁ గవితయు శోభ కెక్కెను. వ్యాస వాల్మీకుల ప్రతిభ జగద్విదిత మగుటకుఁ గారణ మీ కావ్యముల యందలి యితివృత్తములే. తన కవితాశక్తిని బ్రదర్శించుటకుఁ దగినకథ లీతనికి లభించుట గొప్ప యదృష్టము.

రెండవది:— పదసౌష్ఠవము. ఈతని కవితయందు పెద్దపెద్ద సంస్కృత సమాసము లుండవు. చిన్నచిన్న దేశీయపదములనే విశేషముగా నీతఁ డుపయోగించును. ఏ తావున నే పద ముపయోగించిన రస ముప్పతిల్లునో యీ కవిచంద్రునకు బాగుగాఁ దెలియును. ఎచ్చట నైన సంస్కృతసమాసము లున్నను, అవి మృదుపదసంయుతములై మనోహరముగా నుండును. వాని యర్థమును గ్రహించుటకై నిఘంటుకారముల యక్కర యుండదు.

మూఁడవది:— అర్థగాంభీర్యము. ఎంత చిన్నపదముల నుపయోగించినను వానియం దెంతయో గాంభీర్య మగునర్థ మిమిడియుండును. పాఠకుని శక్తికొలఁది నందలి భావగాంభీర్యము విదితమగుచుండును.

నాల్గవది:— వ్యర్థపదరాహిత్యము. ఇతని కవిత్వమునందుఁ బాదపూరణమునకును యతిప్రాసల కొఱకును దెచ్చిపెట్టుకొనెడి పదము లుండవు. ఎచ్చటనేని స్వల్పముగా నట్టిపదము లున్నను నవి కేవ

లము పడికట్టురాళ్లుగా నుండక యవియుఁ గూడ నెంతయో కొంత తూకమునుఁ దెలుపునవిగానే యుండును.

ఐదవది:— పాత్రౌచిత్యము. కవిత్వ మెంతరసవంతముగ నున్నను, పాత్ర పోషణము యుక్తముగ లేకున్నచో సహృదయుల కానందము కలుగదు. భారతమున ప్రధానపాత్రములు రెండు. ధర్మరాజును, ద్రౌపదియు, తిక్కన నీ యిరువురను భారతమునఁ దుదకంటఁ జక్కఁగా పోషించినాఁడు. ఈ విషయమున వ్యాసుని కంటె నీతనిదే పైచెయ్యి యైనది. ధర్మరాజు రాజనీతిజ్ఞత, సమయోచిత జ్ఞానము, కార్యదీక్ష, ఇంద్రియనిగ్రహము, సత్యాగ్రహము, ఓర్పు మొదలగు గుణములనుఁ జూపుచుఁ దిక్కన వ్రాసిన భాగముల నొక్కచోఁ జేర్చి చూపినచో, లోకమున కెంతయో మేలుకలుగు నని నా యభిప్రాయము. భారతమందలి యితరపాత్రములనుఁగూడ నీతఁడు చక్కఁగా ప్రదర్శించినాఁడు.

ఆఱవది:— భావప్రకటనము. తాను చెప్పఁదలచుకొనినభావము పాఠకులకు స్పష్టముగాఁ దెలియునట్లు చిన్నచిన్నమాటలతో వ్రాయు నేర్పు కవిశేఖరున కలవడినట్లింకొకరి కలవడ లేదు. ఇరువురువ్యక్తులు మాటలాడునప్పుడది పద్యరూపమునను న్నను దృశ్యప్రబంధములో వలె నెదురుగా గూర్చుండి మాటలాడుకొనుచున్నట్లే యుండి పాఠకున కెంతయో యానందము కలిగించుచుండును. పౌరాణికున కట్టిసందర్భములలో నాభావమును దనమాటలతో శ్రోతలకు విప్పి చెప్పుట కవకాశము గలుగుచుండును. ఎంతటి కఠినవిషయము నైనను చిన్నమాటలతో సులభముగా బోధపడునట్లు చెప్పుటలో నీతఁడు మిగులనిపుణుఁడు.

ఏడవది:— రసపోషణము. సందర్భము ననుసరించి నవరసములును పాఠకుఁ డనుభవించుటకుఁ దగిన యితివృత్తమునుఁ గల్పించుట యందును, ఆరస ముప్పతిల్లుపదముల నుపయోగించుటయందును రసపోషణమునందును నీతనికిఁగలశక్తి యపారము.

ఎనిమిదవది:—లోకజ్ఞానప్రదర్శనము. ఈ మహానుభావుఁడు కేవలపండితుఁడును గవియునే గాక లోకజ్ఞానమెఱింగిన మహామేధావి. శాస్త్రములయందును గ్రంథములయందును జెప్పఁబడినదియే గాక నిత్యమును బ్రపంచమునఁ జరుగుచున్న విషయములను గ్రహించి యందలి మంచిచెడ్డల నెఱింగి లోకహితమును గాంక్షించి, తన యనుభవజ్ఞానమును దన గ్రంథములయందు బ్రకటించిన మహాపురుషుఁడీతఁడు.

ఈ కారణములచే నితని కవిత్వము పండితపామరజనానురంజకమై సర్వజనహృదయాకర్షణ మొనరించుచున్నది. వీని కుదాహరణములను జూప నెంచినచో నది యొక పెద్దగ్రంథ మగును.

ఈతని యాంధ్రీకరణవిధానము :

ఈ మహాకవి భారతాంధ్రీకరణమును యథేచ్ఛగా సాగించినాఁడు. కాని మక్కికిమక్కిగా చేయలేదు. ఇతఁడు విరాటోద్యోగపర్వములలో మూలమందలికథను మాత్రము గైకొని తనయిష్టము వచ్చినట్లు పెంచియుఁ గుదించియుఁ బాత్రౌచిత్యముకొఱకును రసపోషణము కొఱకును ననేకమార్పులను గావించి యాపర్వములను స్వతంత్ర గ్రంథ మనునట్లుగా రచించినాఁడు. భారతమునందు పాఠకులకును శ్రోతలకు నెక్కువయాహ్లాదమును గలిగించునవి, విరాటోద్యోగపర్వములు. తిక్కనసోమయాజి తన లోకజ్ఞానమును, పాత్రౌచిత్యమును గనుపరచి, యీ రెండు పర్వములను రచించియుండెను. ఈతని యాంధ్రీకరణవిధానమును జూపుటకై యీ పర్వములనుండియే దృష్టాంతమును గైకొనుట సమంజసమని యట్లుచేసితిని.

కౌరవసభకు శ్రీకృష్ణుఁడు రాయబారము పోవుచున్నప్పుడు ద్రౌపది శ్రీకృష్ణునితోఁ నుడివిన వాక్యములను, సంస్కృత భారతమునుండియు, తిక్కనభారతమునుండియు నెత్తి యీక్రింద వ్రాయుచున్నాఁడను.

"సుతా ద్రుపదరాజస్య అసితాయతమూర్ధజా
సంపూజ్యసహదేవంచ సాత్యకించ మహారథమ్"
"భీమసేనంచ సంశాంతం దృష్ట్వా పరమదుర్మనాః
అశ్రుపూర్ణేక్షణా వాక్య మువాచేదం మనస్వినీ".
"విదితం తే మహాబాహో ధర్మజ్ఞ మధుసూదన
యథా నికృతి మాస్థాయ భ్రంశితాః పాండవా స్సుఖాత్."
"ధృతరాష్ట్రస్యపుత్రేణ సామాత్యేన జనార్దన
యథాచ సంజయో రాజా మంత్రం రహసి శ్రావితః."
"యుధిష్ఠిరేణ దాశార్హ తచ్చాపి విదితం తవ
యథోక్తః సంజయ శ్చైవ తచ్చ సర్వం శ్రుతం త్వయా".
"పంచనస్తా తదీయం తాం గ్రామా యితి మహాద్యుతే
అవిస్థలం వృకస్థలం మాకందీం వారణావతమ్".
"అవసానం మహాబాహో కఞ్చి దేకంచ పంచమమ్
ఇతి దుర్యోధనో వాచ్య స్సుహృద శ్చాస్య కేశవ."
"నచాపి వ్యాకరో ద్వాక్యం శ్రుత్వా కృష్ణ సుయోధనః,
యుధిష్ఠిరస్య దాశార్హ హ్రీమత స్సంధి మిచ్ఛతః."
"అప్రదానేన రాజ్యస్య యది కృష్ణ సుయోధనః,
సంధి మిచ్ఛే న్నకర్తవ్య స్తత్ర గత్వా కథంచన."
"శక్ష్యంతి హి మహాబాహో పాండవా స్సృంజయై స్సహ
ధార్తరాష్ట్రబలం ఘోరం క్రుద్ధం ప్రతిసమాసితుమ్."
"నహి సామ్నా నదానేన శక్యోర్థ స్తేషు కశ్చన,
తస్మా త్తేషు నకర్తవ్యా కృపా తే మధుసూదన."
"సామ్నా దానేనవా కృష్ణ యేన శామ్యంతి శత్రవః
మోక్తవ్య స్తేషు దండ స్స్యాత్ జీవితం పరిరక్షతా".
"తస్మా త్తేషు మహాదండః క్షేప్తవ్యః క్షిప మచ్యుత,
త్వయాచైవ మహాబాహో పాండవైః సహసృంజయైః".

"ఏత త్సమం ధర్మం పార్థానాం తవచైవ యశస్కరమ్
క్రియమాణం భవేత్ కృష్ణ క్షత్రస్యచ సుఖావహామ్".

"క్షత్రియేణహి హంతవ్యః క్షత్రియో లోభమాస్థితః,
అక్షత్రియోవా దాశార్హ స్వధర్మ మనుతిష్ఠతా".

"అన్యత్ర బ్రాహ్మణా త్తాత సర్వపాపే ష్వవస్థితాత్,
గురుర్హి సర్వవర్ణానాం బ్రాహ్మణః ప్రసృతాగ్రభుక్".

"యథా వధ్యే భవే ద్దోషో వధ్యమానే జనార్దన,
సవధ్య స్యావధే దృష్ట ఇతి ధర్మవిదో విదుః".

"యథా త్వాం నస్పృశే దేష దోషః కృష్ణ తథా కురు,
పాండవై స్సహ దాశార్హ సృంజయైస్సహ సైనికైః".

"పునరుక్తంచ వక్ష్యామి విస్రమ్భేణ జనార్దన,
కానుసీమంతినీ మాదృక్ పృథివ్యా మస్తి కేశవ".

"సుతా ద్రుపదరాజస్య వేదీమధ్యా త్సముత్థితా,
దృష్టద్యుమ్నస్య భగినీ తవ కృష్ణప్రియాసఖీ".

"ఆజమీఢ కులంప్రాప్తా స్నుషా పాండో ర్మహాత్మనః,
మహిషీ పాండుపుత్రాణాం పంచేంద్ర సమవర్చసామ్".

"సుతా మే పంచభి ర్వీరైః పంచజాతా మహారథాః,
అభిమన్యు ర్యథా కృష్ణ తథా తే తవ ధర్మతః".

"సాహం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాం గతా,
పశ్యతాం పాండుపుత్రాణాం త్వయి జీవతి కేశవ".

"జీవత్సు పాండుపుత్రేషు పాంచాలే ష్వథ వృష్ణిషు,
దాసీభూతాస్మి పాపానాం సభామధ్యే వ్యవస్థితా".

"నిరమర్షే ష్వచేష్టేషు ప్రేక్షమాణేషు పాండుషు
పాహి మా మితి గోవింద మనసా చింతితో౽సిమే".

"యత్ర మాం భగవా న్రాజా, శ్వశురో వాక్య మబ్రవీత్,
వరం వృణీష్వ పాంచాలి వరార్హాసి మతాసిమే".

"అదాసాః పాండవా స్సంతు సరథా స్సాయుధా ఇతి
మయోక్తే యత్ర నిర్ముక్తా వనవాసాయ కేశవ".
"ఏవంవిధానాం దుఃఖానా మభిజ్ఞోఽసి జనార్దన
త్రాయస్వ పుండరీకాక్ష సభర్తృజ్ఞాతిబాంధవామ్".
"నన్వహం కృష్ణ భీష్మస్య ధృతరాష్ట్రస్య చోభయోః
స్నుషా భవామి ధర్మేణ సాహం దాసీకృతా బలాత్".
"ధి క్పార్థస్య ధనుష్మత్తాం భీమసేనస్య ధిగ్బలమ్
యత్ర దుర్యోధనః కృష్ణ ముహూర్త మపి జీవతి".
"యది తేఽహ మనుగ్రాహ్యా యది తేఽస్తి కృపామయి,
ధార్తరాష్ట్రేషు వైకోపః సర్వః కృష్ణ విధీయతామ్".

వైశంపాయనః,

"ఇత్యుక్త్వా మృదుసంహారం వృజినాగ్రం సుదర్శనమ్
సునీల మసితాపాంగీ సర్వగంధాధివాసితమ్".
"సర్వలక్షణసంపన్నం మహాభుజవర్చసమ్
కేశపక్షం వరారోహా గృహ్యా వామేన పాణినా".
"పద్మాక్షీ పుండరీకాక్ష ముపేత్య గజగామినీ,
అశ్రుపూర్ణేక్షణాదీనా కృష్ణం వచన మబ్రవీత్".
"అయం తే పుండరీకాక్ష దుశ్శాసనకరోద్ధృతః,
స్మర్తవ్య స్సర్వకార్యేషు పరేషాం సంధి మిచ్ఛతామ్".
"యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సంధికాముకౌ,
పితా మే యోత్స్యతేవృద్ధః సహపుత్రై ర్మహారథైః".
"పంచచైవ మహావీర్యాః పుత్రా మే మధుసూదన,
అభిమన్యుం పురస్కృత్య యోత్స్యంతే కురుభి స్సహ".
"దుశ్శాసనభుజం శ్యామం సంఛిన్నం పాంసుకుంఠితమ్,
యద్యహంతు నపశ్యామి కా శాంతిః హృదయస్య మే."

"త్రయోదశహి వర్షాణి ప్రతీక్షం త్యాగతానిమే,
నిధాయ హృదయే మన్యుం ప్రదీప్తమివ పావకమ్."

"విదీర్యతే మే హృదయం భీమవాక్ఛల్యపీడితమ్,
యోఽయ మద్య మహాబాహు ర్ధర్మమే నానుపశ్యతి."

"ఇత్యుక్త్వా బాష్పసంఘేన కంఠేనాయతలోచనా,
రురోద కృష్ణా సోత్కంపం సస్వనం బాష్పగద్గదమ్."

"స్తనౌ పీనాయతశ్రోణీ సహితా వభివర్షతీ,
ద్రవీభూత మివాత్యుష్ణం ముంచతీ వారినేత్రజమ్."

ఈ శ్లోకములయర్థము సులభగ్రాహ్యం బగుటను. గ్రంథవిస్తరభీతి చేతను వీనికిఁ దెలుఁగు వ్రాయులేదు.

గీ. ధర్మనందనుపలుకులు దనకు హృదయ
తాప మొనరింప మోహాన దైన్య మొంద
నున్న పాంచాలి యిట్లని యొయ్య బలికె
గనవె శౌరితో గద్గదకంఠి యగుచు.

ఉ. అంతలుచేసి పోనడచి యక్కట! సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె? ఇట్టియాఱట మదిం బ్రియమంది యుధిష్ఠిరుండు దా
నంతన యూళ్ళు లేవురకు నైదు సుయోధను డిచ్చునొక్కొ? ఈ
కంతకృపావిహీనమతి నాతఁడు నేచునె యన్నదమ్ములన్!

చ. తనమునువడ్డ బన్నములఁ దమ్మునిపైఁ గలకూర్మి పేర్మి నీ
జనపతి సైపకున్నె? యదిసక్కన! రాజ్యముపాలు లేక తీ
ఱున కొడబాటు గల్గిన, నెఱుంగమి వెట్టరె? చాలరైరి వీ
రనరొకో? నానలేమియని యాడరె లోకమువారు కేశవా?

శా. పెంపేదం దమకిట్టితక్కువలు రూపింపంగ నేలా? విచా
రింపన్ వారికి మేలు సంధి తముఁ బోరిం జూచినం దారు సా
ధింపంజాలరొ? కాక పోరఁ దగమర్థింపం దలంపేని శం
కింపం బట్టరొకో? వారు బ్రాహ్మణులె? యేకీడైన సైరింపఁగన్.

ఉ. ఓటు యొకింత యేనియు సుయోధనుచిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే దురభిమానము యెక్కుడుఁ పూను గాక, యా
చ్చోటున సంగరంబు లగుచోప్పులు పుట్టినవైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకొ? పోదురొ? కానల నుండ వచ్చుతా!

ఉ. ఏనిటులంటి నా వలవ దంకను నీవును రాజు దమ్ములుం
గానుచితంబు సూచి మన కార్యము, మీనుజనత్వముం జెడం
గా నొకభంగి సేయక తగం గురువర్గముతోడి సంధి మీ
కైన తెఱంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్.

ఉ. ఆఱడిబోకయున్, ఫలము నందుటయున్, గని పల్కనేరమిన్
మాఱిటనోరిదానవయి మాటలు చిత్రమునందు నిల్పకే
గాఱులు ప్రేలెదన్ వినుఁడు, కర్జము నెగ్గును గాన నల్కమై
వీఱిడియైనమానిసికి వెండి వివేకము గల్గనేర్చునే.

చ. వరమునఁ బుట్టితిన్, భరతవంశముఁ జొచ్చితి, నందుఁ బాండుభూ
వరునకుఁ గోడలైతి, జనవంద్యులఁ బొందితి, నీతివిక్రమ
స్థిరు లగుపుత్రులం బడసితిన్, సహజన్ములఁ ప్రాపుఁ గాంచితిన్
సరసిజనాభ! యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్.

వ. అట్లుంగాక.

ఉ. నీవు సుభద్రకంటె గడునెయ్యము గారవముం దలిర్ప నం
భావన సేయు; దిట్టినఁ బంకజనాభ, యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందినవేణి పట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చె! గులాంగన నిట్లొనర్తురే?

ఉ. ఆసభ కేకవస్త్ర యగునట్టి ననుం గొనివచ్చి నొంచు దు
శ్శాసనుజూచుచుం బతు లసంభ్రమలై తగుచేష్ట లేక నా
యాసలు మాని చిత్రముల యాకృతినున్నయెడన్, ముకుంద! వి
శ్వాసముతోడ నిన్ గొలువవచ్చె మనం బదియుం దలంపవే?

ఉ. అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె, నమ్మహా
పురుషునిపాలికిం బతులు పోవఁగ వీరలతోన యేనుఁ జె
చ్చెరఁజని కోటరంబు దగఁ జేయుదునో? అటుగాక పాడిమై
వరవుడ మోపి జేయుకున్నా వారికి? మాధవ! నిశ్చయింపుమా!

వ. అని యట్లుగ్గడించి,

ఉ. ద్రోవది బంధురం బయినక్రొమ్ముడిఁ గ్రమ్మన విచ్చి వెండ్రుకల్
దావలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి ప్రేల్చఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగలేక బాష్పములు గ్రమ్మఁగ డగ్గఱ లేచి యార్తయై.

క. ఇవి దుస్ససేనుఁ బ్రేళ్ళం
దవిలి సగము ద్రెవ్వి పోయి దక్కినయవి కౌ
రవులకడ దీనమాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత! వినినన్.

సీ. ఈ వెండ్రుకలు వట్టి యీడ్చిన యాచేయి
దొలుత గాఁ బోరిలో దుస్ససేను
తనుఁ వింతలింతలు తునియలై చెదరి రూ
పఱియున్నఁ గని యుడుకాఱుగాక
యలుపాలఁ బొనుపడునట్టి చిచ్చే యిది?
పెనుగద వట్టిన భీమసేను
బాహుబలంబునఁ బాటించి గాండీవ
మను నొక విల్లెవ్వఁడును వహించు

ఆ. క్షత్త్రవిక్రమంబుఁ గాల్పనే? యిట్లు
బన్నములు వడిన ధర్మనందనుండు
నేను రాజరాజుసీనుంగుఁ గన్నారఁ
గానఁబడయు మైతిమేనిఁ గృష్ణ?

ఉ. నెట్టన యిట్టియల్క మదినిల్చితి రక్కసతాల్మిజిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును గాలము దీనికి నాఱు వెన్నడున్
బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు గాచు నట్టితోఁ
బుట్టువు నీవు, తేజమునఁ బోల్చిన భర్తలు గల్గనచ్యుతా!

వ. అనుచు నెఱుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుం
డయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు
దుడువను, వెన్నెఱి వేణి ముడువనుం దగువారి నిరూపించి యమ్మా
నినితో నిట్లనియె."

పై శ్లోకములనుఁ బద్యములనుఁ జదివి చూచినచో సంస్కృత భారతమునకుఁ దిక్కనసోమయాజి రచనము వన్నె వెట్టిన దని తోఁపక మానదు. ఈ సందర్భమున శ్రీ కొ. లక్ష్మణరావుపంతులుగారు వ్రాసిన వాక్యముల నుదాహరించెదను. "తిక్కనకృతభారతము సంస్కృతమహాభారతమునకు భాషాంతరీకరణ మని మన వారంద అనుకొనుచున్నారు; కాని యది గొప్పపొరబాటు. ఇట్లనుకొనుట మనము తిక్కనయెడ నొక యపరాధము సేయుటయే. సంస్కృతభారతము బంగారపుముద్ద. ఆంధ్రభారత మా ముద్దలోనుండి కావలయునంత బంగారమును దీసికొని స్వర్ణకారుని బుద్ధివైభవముతోఁ జేయంబడిన చక్కని సువర్ణకమలము వంటిది. ఉభయభారతములలోని యీ భేదముఁ జూపి స్వర్ణకారుని బుద్ధివైభవము వెల్లడిచేయుటయే మా యుద్దేశము." విరాటోద్యోగ పర్వములందక్క తక్కినభాగమునుఁ దిక్కన క్లుప్తముచేసినాఁడు.

పూర్వకాలమున విశేష రాజకార్యములలో నవసరము వచ్చి నప్పుడు మహారాణులుఁ కూడ సభలోనుండి చర్చలలోఁ బాల్గొనుచుం డెడివారని యీ కథవలన మనకుఁ దెలియుచున్నది. ఇట్టి సాంప్రదాయము పురాణయుగములోనే కాదు. చారిత్రకయుగమునఁ గూడఁ గలదు. పదునొకొండవ శతాబ్దిప్రాంతమున మన దేశముపైకి దండెత్తి వచ్చిన మహమ్మదీయులకు సాహాయ్య మొనర్చుచున్న జయచంద్ర మహారాజుపై యుద్ధముచేయఁబోవుచు నాతనియల్లుఁ డగుపృథ్వీరాజు చిత్తూరురాణాయైన సమరసింహుఁడు మొదలగు మహారాజులతో నాలోచించుటకై యొకసభను సమకూర్చె ననియు, పృథ్వీరాజు నాజ్ఞానుసారముగ నాతనిరాణియుఁ జయచంద్రుని తనయయు నగుసంయుక్తాదేవి యీ సభకువచ్చి సమరతంత్రములలోఁ బాల్గొని దేశమతనఁరక్షణమున కై జయచంద్రునితోఁ బోరుసల్పుట యుచితమే యనియు నంచుఁ దండ్రి ప్రాణములు వోయిననుఁ దా నందులకుఁ జింతింపననియుఁ దెల్పి భర్త ప్రయత్నమునకుఁ దోడువడెననియు, నప్పు డాసభ యందున్న చాందూ భట్టు అను మహాకవి "పృథ్వీరాయరాసా" యను గ్రంథమున వ్రాసి యున్నాఁడు.

## తిక్కనమహాకవి రచించినకావ్యములు :

తిక్కనసోమయాజి సంస్కృతాంధ్రములయందుఁ బెక్కు గ్రంథములను రచించినట్లు చెప్పుదురు. కాని రెండుగ్రంథములు మాత్రమే మన కిప్పుడులభ్యము లగుచున్నవి. అందు మొదటిది నిర్వచనోత్తరరామాయణము. రెండవది శ్రీమహాభారతము.

## నిర్వచనోత్తర రామాయణము :

ఇది వాల్మీకిరామాయణములోని సప్తమకాండమున కాంధ్రీకరణము. రావణవధానంతరము శ్రీరామచంద్రుఁడయోధ్యయందు పట్టాభిషిక్తుఁ డగువఱకునుఁ జరిగినకథకుఁ బూర్వరామాయణ మని పేరు. ఇది యాఱుకాండలు కలది. ఈ యాఱుకాండములలోనుఁ జెప్పని రావణజననాది పూర్వవృత్తాంతమును శ్రీ రామపట్టాభిషేకానంతర సీతావనవాసకథయు కుశలవజననాదికథలను నేడవకాండమునను న్నవి. దీని కుత్తరరామాయణ మని పేరు. దీని నీ యుభయకవిమిత్రుఁడు రచించెను. గ్రంథమందెచ్చటను వచనము లేకుండ రచియించుటచే దీనికి నిర్వచనోత్తరరామాయణమని పేరువచ్చినది. కవులు సాధారణముగాఁ గథాసందర్భమునుఁ గలుపు పట్టులయందును, వర్ణనలనుఁ జేయుపట్టులను వచనములను రచియించుచుందురు. అట్టివి లేకుండనా భాగములనుగూడఁ బద్యములచేఁ బూరించిన సొంపుగ నుండునని తన యభిప్రాయమునుఁ దిక్కన యీ క్రిందిపద్యములలో వ్యక్తీకరించినాఁడు.

క. వచనము లేకయ వర్ణన
రచియింపగఁ గొంత వచ్చుఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయముఁ బద్యములన పొం
దుచితంబుగఁ జెప్పఁ గావ్య లొప్పిద మనరే

క. లలితపదహృద్యపద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలంతి తునియలుగ
హాల సంధించినవిధంబు నమరఁగవలయున్.

ఇతఁడు పూర్వరామాయణమును విడచి యుత్తరరామాయణమునఁ దెలిఁగించుటకుఁ గారణ మంతకుఁ బూర్వమే పూర్వరామాయణమును భాస్కరుఁడాంధ్రీకరించియుండుటయే యనియు భాస్కరరామాయణమును రచించిన దీనిని పితామహుఁడైన భాస్కరుఁడే యనియుఁ గొంద ఱనుచున్నారు. ఈ సందర్భమునఁ దిక్కన రచించిన రెండుపద్యముల నుదాహరించుచు వానినిగూర్చియు, భాస్కరరామాయణ కర్తృత్వమునుగూర్చియు మంత్రిభాస్కరునిచారిత్రమున విపులముగాఁ జర్చించియున్నాఁడను. ఆ విషయములను మరల నిట వ్రాయుట పునరుక్తి యని విడచితిని. తిక్కనసోమయాజి భారతాంధ్రీకరణమువలెనే నిర్వచనోత్తరరామాయణమును మక్కికి మక్కిగాఁ జేయక స్వేచ్ఛఁ గైకొనిరచించియున్నాఁడు. నిర్వచనోత్తరరామాయణమునుఁ బదియాశ్వాసములుగా రచియించి తనప్రభువగు మనుమసిద్ధి మహారాజున కంకితముచేసెను. ఇందు నన్నయవలెనే యితఁడును తన గ్రంథముమొదల నాంధ్రపద్యమును వ్రాయక యీ క్రింది సంస్కృత శ్లోకమును రచియించెను.

శ్లో. శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజాస్తమ్భే జగన్మణ్డల
ప్రాసాదస్థిరభారభాజి దధతీ సా సాలభఞ్జీశ్రియం
శుణ్డాలోత్తమగణ్డభిత్తిషు మదవ్యాసఙ్గవశ్యాత్మనాం
యా ముత్తేజ యతేతరాం మధువిహా మానన్దసాన్ద్రస్థితిః॥

## శ్రీ మహాభారతము

వ్యాసవిరచితమైన సంస్కృతభారతమునందలి పదునెనిమిది పర్వములలోను నన్నయభట్టు ఆదిపర్వమును, సభాపర్వమును, నరణ్యపర్వమునఁ గొంతభాగము నాంధ్రీకరించెను.

తిక్కనసోమయాజి యరణ్యపర్వమునందలి తక్కినభాగము నాంధ్రీకరింపవలసియుండఁగా దానిని విడచి విరాటపర్వాదిగాఁ బదునైదు పర్వముల నాంధ్రీకరించెను. తిక్కనరచించిన:

"ఉ. ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెనుపొందియుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుండు కూర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్."

మ. హృదయాహ్లాదిచతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగా
బదియేనింటిఁ దెనుంగు బాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టం రచియించు టొప్పు బుధసంతోషంబు నింపారఁగన్

అనుపద్యములనుబట్టి యరణ్యపర్వమును నన్నయభట్టు పూర్తిగ నే రచించినట్లు కన్పట్టుచున్నది. కాని సాక్ష్యమిందులకు వ్యతిరేకముగా నున్నది. ఈవిషయమునుగూర్చి యెఱ్ఱాప్రెగ్గడచరిత్రమునఁ జర్చింపఁ దలంచి యిట వదలివైచితిని.

ఆంధ్రలోకాభ్యుదయమునుఁ గాంక్షించి, యీమహాభారత నిర్మాణకార్యమునకుఁ దాను సంసిద్ధుఁడ నైతి నని యీకవిసార్వ భౌముఁ డీక్రిందపద్యములోఁ జెప్పియున్నాఁడు.

"ఉ. కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయసంస్మృతిం
శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్.

ప్రశాంతహృదయముతో భారతరచనమునకు దీక్షఁ గైకొనిన యీ పుణ్యపురుషుఁడు తెలుఁగుబాసలో భారతమును రచియించుట "పురుషార్థరుపక్వఫల" మనిహరిహరనాథుఁడే రచియించిన ట్లీకవి యీ క్రిందిపద్యములలోఁ దెలిపినాఁడు.

క. పారాశర్యునికృతి యయి
భారత మనుపేరఁ బరగుపంచమవేదం
బారాధ్యము జనులకు ద
ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్

తే. తెనుఁగుబాస వినిర్మింపఁ దివురు టరయు
భవ్యపురుషార్థతరుపక్వఫలము గాదె
దీని కెడనియ్యకొని వేడ్క నాకు కృతివ
తిశ్వ మర్థించివచ్చితిఁ దిక్కశర్మ!

ఆంధ్రభాషలో హృద్యము లగుకావ్యములను రచించినవారిలోఁ దిక్కనసోమయాజిని మొదటివానినిగా నెన్నవచ్చును. ఇంతే కాదు. పరిమాణమునందుఁగూడ నీతనితో సమానముగ గ్రంథరచనము గావించిన యాంధ్రకవు లింకొకరు లేరు. నిర్వచనోత్తరరామాయణమున దాదాపు ౧౩౦౦ పద్యములును, మహాభారతమునఁ బదునాఱువేలు గద్యపద్యములునుఁ గలవు. ఈతని రచనములయం దేభాగమునఁ దీసి చదివినను విసువు జనింపక యింకను జదువవలయుననియే యుత్సాహము కలుగుచుండును.

## తిక్కన పద్యరచనము:

కందపద్యరచనమునం దీతఁడు కడునేర్పరి. మనదేశమున "పందినిఁ బొడిచినవాఁడు బంటు. కందమునుఁ జేసినవాఁడు కవి" యనునొక నానుడి కలదు. కందపద్యములను రచించుట కష్టతర మని దీనియభిప్రాయము. కవిచౌడప్ప చెప్పిన:

"క. ముందుగఁ జను దినములలో
కందమునకు సోమయాజి ఘనుఁ డందురు నేఁ
డందఱు నను ఘనుఁ డందురు
కందమునకుఁ గుందవరపుకవిచౌడప్పా."

అను పద్యమునుబట్టి పూర్వకాలములోఁ దిక్కనసోమయాజి కందములు సుతిశక్కినవని తెలియుచున్నది. ఇతఁడు కందపద్యములను సరసముగా రచియించుటే కాక సంఖ్యయందుగూడ వాని నధికముగా వ్రాసియున్నాఁడుఁ దాదాపు ౧౩౦౦ పద్యములుగల నిర్వచనోత్తర రామాయణములో నైదువందల యిరువదియవఱకు గ్రంథము లున్నవి. భారతమునందలి మొత్తము గద్యపద్యములు పదునాఱువేలలోను మూఁడవభాగ

మయిదు వేల మూఁడునందలు కందపద్యములు. భాస్కరరామాయణమున మల్లికార్జునభట్టు రచించిన భాగములోఁ గూడ నూటికి నలువదికి మించి కందపద్యములు కలవు. మల్లికార్జునభట్టు పేరఁగల భాగములోఁ జాలభాగము మంత్రిభాస్కరుఁడు రచించె నని యొక వాదము కలదు. ఆవాదము సత్యమయ్యెనేని, తాతయు మనుమఁడును, కుమారులును మంత్రులు, నగుటయం దేకాక, కందపద్యరచనమునఁ గూడ నొకరి కొకరు దీసిపోక వంశమర్యాదను గాపాడిరని విదిత మగును. విరాటపర్వాదియందు దక్కఁ దక్కిన ప్రతియాశ్వాసాదియందునుఁ దిక్కన కందపద్యములనే వ్రాసియుండెను.

తిక్కనసోమయాజి సామాన్యముగా, శార్దూల మత్తేభాది పద్యములనే గాని, కవిరాజవిరాజితాదివృత్తములను రచియించుటలో నేర్పరి కాఁడని యెవ్వరో యాక్షేపింపగా స్త్రీపర్వమునఁ గష్టపడి యాతఁడు విశేషముగా వృత్తములను రచియించెనని కొందఱనుచున్నారు. స్త్రీపర్వమున నట్టివృత్తములు విశేషముగా నున్నమాట సత్యమే కాని, యెవరో యాక్షేపించిన మీఁదట వానిని రచించె ననుటలో సత్యముండదు. స్త్రీపర్వమందలి కథ దుఃఖకరమైనది. అందు స్త్రీపాత్రము లెక్కువగా పాల్గొని శోకపూరితము లగు వాక్యములఁ బల్కుచుండుట గాననగును. ఆకథ కనుకూలముగ నుండునని యావృత్తముల నాతఁడు రచియించి యుండును. చంపకోత్పలములుగాని, మత్తేభశార్దూలములుగాని, స్త్రీపర్వమున లేవు. దాదాపు నలువదివిధములగు నితరవృత్తము లిందుఁ గలవు.

ఈతఁడు రచియించిన రెండుకావ్యములలోను, నిర్వచనోత్తర రామాయణకవిత్వముకంటె మహాభారతకవిత్వము రసవత్తరమై యారితేరి హృదయంగమముగా నున్నది. నిర్వచనోత్తరరామాయణమునఁ గొన్నితావులలో నీతనికవిత్వము నారికేళపాకములో నున్నదని కొందఱందురు. కాని యది సత్యము కాదు.

ఈతనికవిత్వశైలి చూపుటకిదివఱకుదాహరింపఁబడినపద్యములే చాలియున్నవి. ఈతనిపద్యములన్నియు, రసవంతములై, రుచ్యములై, మనోహరములగు మామిడిపండ్లను బోలి యుండును. అట్టివానిలో

మంచివివి యనియేర్చుట యసంభవము. అయినను, రామాయణము నుండి యాశ్వాసమున కొక్కటివంతున పదిపద్యములను, భారతమునుండి పర్వమున కొక్కటిచొప్పున పదునెనిమిదిపద్యముల నీదిగువ నుదాహరించు చున్నాడను. మచ్చుచూపుటలో మంచిచెడ్డలు రెండిటిని గూడఁ జూపుట ధర్మము కదా!

## నిర్వచనోత్తరరామాయణము :

చ. జనకునియజ్ఞవేదికఁ బ్రశస్తముగా జనియించి యంగనా
జనతకు భూషణం బనఁగఁ జాలిన సీతకు రుద్రచాపభం
జన మనునుంకు విచ్చి నృపసత్తముసూతిఁ బరిగ్రహించి పే
ర్చినయుభయానురాగమునఁ జిత్తభవుం జరితార్థుఁ జేయుచున్. ఆ౧

చ. వరములు గాంచి బాహుబలవంతుఁ డనం దగుమాల్యవంతుఁ డ
చ్చెరు వగువిక్రమంబునఁ బ్రసిద్ధి వహించి నిజానుజన్ములం
గర మనరక్తి మన్ననఁ దగం గొనియాడుచు సర్వలోకభీ
కగుఁ డయి దేవతామునినికాయము దల్లడ మందుచుండఁగన్. ఆ౨

చ. తనయుఁడు తండ్రి యాగ్రజుఁడు తమ్ముఁ డనం జనుసయ్యు రాజ్యముల్
గొనునెడ శౌర్యలంపటులకున్ మఱి చుట్టఱికంబు గల్గునే
యను వగునంతకున్ రిపు నుదగ్రత సైఁచిన నింక నూరకుం
డ నగునె వేగ పోరికిఁ గడంగుము నీభుజదర్ప మేర్పడన్. ఆ 3

శా. కేలీకందుక మల్ల నెత్తుకొనుమాడ్కిం బట్టి నాయున్నయీ
కైలాసాచల మిట్లు నీవు నెరయంగా నెత్తినం జోద్యమై
నీలా వేఁగొనియాడు వెల్లరును వర్ణింపంగ నీకొక్క పే
రేలోకంబునఁ జెల్ల దైత్యులకుఁ బెంపెక్కంగ నే నిచ్చెదన్. ఆ ౪

చ. పరమపతివ్రతావిభవభాసురలీల వెలుంగుచున్న ని
ష్కరుణత నిమ్మెయిం బఱిచెఁ గావున నీదనుజాధముండు స
త్పురుషపరిగ్రహం బయినపుణ్యసతిం గలుషింపఁ జేసి త
ద్వరుని పరాక్రమంబున నవశ్యము మృత్యువుఁ బొందుఁ గావుతన్. ఆ౫

ఉ. వంచినకెంపుఁ బాసి దివిఁ బ్రాకి దిశల్ వెలిఁగించి చంద్రకాం
తంబుల నీరు సేసి కుముదంబులఁ బిండువు సేయఁ బంచి యు

జ్జంబుల నిద్ర వుచ్చి మకుసాయకముల్ గరసానఁబట్టి కో
కంబుల నేఁచి లోకము పొగడ్తలు సేకొని చంద్రుఁ డున్నెడన్. అ౬

శా. వాలిం గీలియు వాయుపుత్త్రు సరియే వాఁ డాత్మశక్తిజ్ఞుఁడై
యీలోకంబులు గెల్తు నే నసిన మా తెండుం గలండే మహీ
పాలాగ్రేసర వానివర్తనముఁ జెప్పం జిట్టలావిక్రమ
శ్రీలోలున్ భవదీయసన్నిధిఁ బ్రశసింప దగుం జెప్పెదన్. ఆ ౭

ఉ. రావణునింట నుండఁగ ధరాసుత నే మరలంగఁ దెచ్చి సం
భావన సేఁత కష్ట మనిపల్కిరి చూచితె లక్ష్మణా ! మహా
దేవుఁడు బ్రహ్మయున్ మునులు దేవగణాంబులు మెచ్చ నయ్యెడం
బావకుఁ డిచ్చె నాకు సతిఁ బాపపుమాటలు వుట్టె నియ్యెడన్. ఆ౮

మ. ఒకనారీతిలకంబు గాననములో నుద్దామశోకార్త్తయై
వికలాలోకన మశ్రుధారలును బృథ్వీరేణులిప్తాంగముం
బ్రకటాక్రందనమున్ వికీర్ణకబరీభారంబు వక్త్రాబ్జశో
షకనిశ్వాసగమోహమ్ముముం గలయవస్థం బొందఁగా నయ్యెడన్. ఆ౯

చ. జయజయశబ్దముల్ సెలఁగ సర్వజనంబు నెలర్ప వర్మిలిం
బ్రియసుత యుగ్మముం దిగిచి పెద్దయుఁ బ్రొద్దొగిఁ గౌగిలించి మో
దయుతమనస్కుఁడై నృపతి దస్సుల్మల సమ్మద మొందఁ జేసి య
స్వాయుపరివృద్ధి తల్లుల మనం బలరం బ్రకటించి వేడుకన్. ఆ ౧౦

మహాభారతము:

ఉ. ఈతఁ డజాతశత్రుఁడు మహిం దగ దిగ్విజయంబు సేసి వి
ద్యాతిశయర్ద్ధి వాసవుమహాసన మైనను నెక్క నర్హుఁ డు
ద్ద్యోతితమూర్తి కౌరవకులోద్వహుఁ డార్యనికాయసంతత
ఖ్యాతచరిత్రుఁ డీ చిఱుతగద్దియకుం దగఁడే నరేశ్వరా. వి. ప.

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం బేరు వంచించియున్
బదుమూఁడేఁడులు నీవునుం దిరిగి రా పాలీక పోవచ్చునే
యది గాదేఁ దెగి బంటవై యుఱుము మాయ వ్రేపన్ననే ద్రింక చె
ల్లదు నూనీకని యూనయోధనునియుల్లం బుచ్చినో నాడుబూ. ఉ ప.

ఉ. కోపము సంహరింపు యదుకుంజర! పాండవకోటి కెల్లనుం
దేవవు గావె నీవిటు లధీరతఁ బూనికి దప్పినం బ్రతి
జ్ఞావరుఁ డైనధర్మసుతుశౌర్యము ధైర్యము బాహువీర్యమున్
రూపటిపోక కాదె యనురూపమె నీ కిది లోకనాయకా. భీః ప.

చ. వినుము కిరీటి! దివ్యశరవేదివి నాఁజను దేను లేపచో
టను మును సెల్లె నీకు నిచటం జనసిత్తునె యిప్డు నీబలం
బును హరినేర్పుఁ జూచుటకుఁ బోరికి వచ్చితి నీవు పాండురా
జునకు జనించితేనిఁ దెగిచూపుము శౌర్యము నస్త్రవీర్యమున్. ద్రో. ప.

శా. క్రాంతిం బొందినవాఁడు పార్థుఁ డపరిక్రాంతుండు గణ్యుండు దు
ర్దాంతోదగ్రత నేఁడు గీటడఁచు నీతం డాతనిన్ వహ్నియ
త్యంతంబున్ శిశిరత్వ మొందినను గోత్రాళిలో వడంకాడినం
గుంతీసూనునిచేతఁ గర్ణున కసం గోల్పాటు వాటిల్లునే. క. ప.

చ. చదివితి నెల్లవేదములు జన్నము లొప్పఁగఁ జేసితిన్ రమా
స్పద మగువృత్తిఁ బొల్చి నరపాలకు లెల్లను గొల్వఁ గంటి దు
ర్మదరిపుగాఢగర్వపరిమర్దనకేళి యొనర్చితిం దగం
దుది నని మిత్రబాంధవులతోఁ ద్రిదివంబున కేఁగు టొప్పదే. శ. ప.

చ. దురమున నెంపుఁ జేవయును దుర్దమలీల వెలుంగుచుండ ను
స్థిరత శమంతపంచకవిశిష్టతలంబునఁ బోరి సద్గతిన్
బొరసెదు నీవునై వగపు పుట్టమ బంధులు రాజ దేవులున్
విరియుచు రింక వారి దగుదీనత కోర్వక యుమ్మలించెదన్. సౌ. ప.

మంగళమహాశ్రీ:

ఈతఁడు రణంబునకు నెత్తి చనుచుండియును
నెంతయును భక్తిఁ గని నాకుం
బ్రీతి యొసఁగం బలికె ప్రేమ మొలయం బొగడి
పెద్దయు వినీతినిరతుండై
చేతులు మొగిడ్చి జయసిద్ధియుఁగ దీవన వి
శిష్టదయ నిమ్మనిన ధర్మం
జేతల ననూన మగు సిద్ధజయ మగుమాతలకు
నెట్లయిన సిద్ధ మగు సంటిక్. స్త్రీ. ప.

మ. నిజదారైకపరత్వముం గరుణయున్ నిక్కంబునుం దాల్మియున్
సుజనాసంగము దేవపిత్రతిథిసంశుద్ధార్చనల్ హవ్యభు
గ్భుజనంబున్ సకలాశ్రమస్థులను శక్యప్రక్రియం బ్రోవుఁ బం
కజగర్భుండు గృహస్థధర్మములుగాఁ గల్పించె సర్వేశ్వరా. శాం.వ.

చ. అనశననిష్ఠఁ జేసి సుగలాదిమునుల్ మహితానుభావులై
రనఘ సహస్రవర్షసమనంతరకల్పితమైనయేకభు
క్తనియమతంత్రమున్ నడపి గాధితనూజుఁడు బ్రాహ్మణత్వమున్
గనియె మహోపవాసములఁ గాని ఫలంబులు లేవు భావరా.అ.వ.

ఉ. ఉత్తర బిడ్డ నెత్తికొని యొయ్యన మా మలరంగ వచ్చి యు
త్యుత్తమతేజుఁ డైనపురుషోత్తము నంఘ్రులపొంత భూస్థలిం
జెత్త మెలర్పఁగాఁ దనదుచెన్నగుఫాలము సేర్చినన్ ముదా
యుత్తమసన్నుఁ డై యతఁడు సాదరభాషల గారవించుచున్. అ.వ.

క. మాయయ్య కాననమునకుఁ
బోయెడు నేనితనితోడఁ బోయెద శుశ్రూ
షాయత్తుఁడనై యుండెద
నీయువిదలఁ గొనుచు మగిడి యేగుము తల్లీ. ఆ.వ.

చ. వలసిననట్టికార్యమును వావిరి నెట్టుగ నైనఁ జేయఁగా
వలఁతి మృతుం బరీక్షితుని వత్సలతం బ్రదికించె శౌరి మొ
క్కలమున యాదవుల్ పెనఁగఁగాఁ గని మాన్పఁ డుపేక్ష సేసె నీ
పొలియు టవశ్యభావ్య మని బుద్ధిఁ దలంచుట గాన నయ్యెడున్. మా.వ.

చ. తనువు దొఱంగ కిట్లు సుకృతంబులపెంపున వచ్చితి వ్పదం
బునకు మహాత్మ! యిచ్చటను బోవను నిముదిఁ బాసి మర్త్యతం
బనుపడియున్న నెయ్యము సభాసదులన్ శుభదృష్టిఁ జూడుమా
మునులను సిద్ధులం దగు నెముంగటిచంద మునొందియుండఁగన్.మ.ప్ర.

ఉ. భారత మర్థితో వినిన భక్తిఁ బఠించిన శ్రీయు నాయువున్
భూరియశంబునుం బ్రమదమున్ దృఢవిద్యయుఁ గల్గు నార్తికే
కోరిక లైనవేగ మొనఁగూడు సుపుత్త్రినిఁ గాంచు నద్వరున్
గారవ మొప్పఁగాఁ బడయు గర్భిణియున్ వయసం గుమారియున్.స్వా.వ.

## తిక్కన రచించిన యితర కావ్యములు :

### (౧) విజయసేనము.

తిక్కనామాత్యుఁడు విజయసేన మను ప్రబంధమును రచించె ననియొక ప్రతీతి కలదు. ఈక్రిందిపద్యములు విజయసేనములోనివని పెదపాటిజగ్గనకవి సంకలించిన ప్రబంధరత్నావళిలో నుదాహరించియున్నాఁడు. ఈరత్నావళిని శ్రీవేటూరిప్రభాకరశాస్త్రిలుగారు ప్రకటించియున్నారు. విజయసేన మిప్పు డెచ్చటను గనుపట్టుట లేదు. ఇది యొకప్రౌఢకావ్య మని చెప్పుచు శ్రీ చిలుకూరివీరభద్రరావుగా రాంధ్రులచరిత్రమున నీక్రిందిపద్యముల నుదాహరించియున్నారు. ఈ పద్యములు వారికెట్లులభించినవో తెలియదు.

"సీ. ఘనసారకస్తూరికాగంధముల నన్య
గంధబంధంబుఁ గలపి కలపి,
కుసుమితవల్లికాలసితవీథులఁ జొచ్చి
గని సరోగృహముల మునిఁగి మునిఁగి,
సమధికామోద్యాంగసంగీతములతోన
కన్నెతీఁగల కాట కలపి కలపి,
కుముదకుట్మలకుటీకోటకంబులు దూఱి
యవిదంపతులఁ బ్రదఁ దెలిపి తెలిపి,
గీ. యనుదినమ్మును నప్పురాంతికమ్మున గట్టు
వాలు వోలె విప్రవరుఁడు వోలె
నట్టువోలెఁ దాను నచ్చినచెలి వోలె
మలయుచుండు మందమారుతంబు.

ఉ. పల్లవపుష్పసంపదలఁ బూచి వసంతుఁడు కాపురాకకై
యెల్లవనంబు నంకటము లేదఁగఁ దా రోడికంబు మీఱ న
ట్లల్లన క్రోలి క్రోలి మలయానిలుఁ డందుఁ బురాణపత్త్రముల్
చల్లఁగఁ జేసె పత్త్రికయఁ బటుత్వము కాముఁడు విచ్చలింపఁగఁ."

విజయసేనము : (ప్రబంధరత్నావళిలోనివి).

ఉ. అల్లనఁ దొండ మెత్తి శివు నాదలయేటిజలంబు పుచ్చి సం
ఫుల్లతఁ బాదపీఠకము వొంతనయున్న సహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనాకమలసంహతిఁ బ్రోక్షణసేయు నట్లు శో
భిల్లుగజాననుండు మదభీప్సితసిద్ధికరుండు గావుతన్.

శా. గీర్వాణాచలసాను వాత్మ్మరదనక్రీడాహతంబైన న
య్యుర్వీరంధ్రము నంద నంత ఫణరత్నోద్యత్ప్రభ ల్పర్వి దృ
క్పర్వంబై పొడగట్టి పేర్చిన మదిం గంబంబ యంచున్ కన
ద్గర్వోన్మీలితనేత్రుఁడై మెఱయు వేదండాననుం గొల్చెదన్.

సీ. పద్మంబులును వజ్రపద్మరాగప్రతి
బింబములును తగ బెరసి మెఱయఁ
గల్లోలములును రంగన్మకరాయిత
తుండములును నటు తోట్రుపడఁగ,
బిసములు విహరణరసనమాగతరసా
తలనాగశిశువులు చెలిమి సేయఁ
జక్రయుగ్మంబులు జలకేళిలోలని
తంబినీస్తనములు తడఁబడంగ

గీ. సొంపుమీఱి నట్టిపెంపును గంభీర
తయును బరపు బోవు వేడ్కఁ దగిలి జనులు
సంస్తుతింప నఖిలసన్నివేశస్థితి
నప్పురంబు పరిఖ యతిశయిల్లు.

చ. తరుణుల వీఁగుఁజన్నుఁగవ తాఁకున మన్మథచక్రవాకబం
ధురగతి లీలఁ గామినుల తోరపుటూరులఘట్టనంబులన్
కరివరహస్తకాండపటుఘట్టనలన్ బరిఖాతరంగముల్
దిరుగుడు వడ్డతీరములఁ దెట్టువు గట్టు సరోజరేణువుల్.

చ. కొనియెద మన్నబండరులు కోటుల కమ్ముదు ; రమ్మఁ బూనితె
చ్చిన సర కెంత పెద్దవెల చెప్పినఁ గొంద్రు తగంగ నిచ్చి ; న
చ్చినవెల తీర్చి లక్ష్మి తమచెప్పినయట్టుల చేయు సొంపు పే
ర్కొన గణుతింప రాదు ; పురికోమటులం బ్రణుతింప నొప్పదే !

క. కిసలయకదళీబిసబిం
బసుధాంశుప్రాయవస్తుబహువిధరూపో
ల్లసము మద ముదువ నజుఁ డొక
యసమాకృతి దార్చ ననఁగ నంగన యొప్పెన్.

సీ. మదనవశీకార మంత్రదేవత దృష్టి
గోచరమూర్తిఁ గైకొనియె నొక్కొ?
సితకరబింబ నిస్సృతసుధాధార ని
తంబినీరూపంబుఁ దాల్చె నొక్కొ?
విధి కామినీసృష్టి విజ్ఞానపరసీమ
భాసురతను లీలఁ బడసె నొక్కొ?
శృంగారనవరస శ్రీవిలాసోన్నతి
సుందరాకారంబు నొందె నొక్కొ?
గీ. కాక యొకవధూటికడుపునఁ బుట్టిన
భామ కేల యిట్టిరామణీయ
కంబు గలుగుననుచుఁ గన్నియపై మహీ
పాలసుతుఁడు దృష్టిఁ బఱపె నర్థి.

సీ. అభిమానవమ్ములు దరికొనియేర్చు నె
వ్వని యుజ్జ్వలాకార వైభవంబు?
బంధులలజ్జానతిఁ బొందునట్లుగఁ జేయు
నెవ్వని పాండిత్య మెసకఁ మెసఁగ?
నెట్టిమాన్యుల నైన నెవ్వనివితరణం
బులు వందిజనుల చాపల మొనర్చు?
వనితాజనము మానధనముఁ గోల్పుచ్చు వి
చ్చలవిడి నెవ్వాని విలసనంబు
గీ. అట్టి విజయుసేను నభిరామమూర్తి వి
ద్యానిరూఢమతి వదాన్యవరుఁడు
మధురవిభ్రమైకనిధి యను జగమెల్ల
నతఁడు చిత్రగుణసముద్రుఁ డగుట.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తుల నజేయుండై పరీక్షించినన్
దిత్యావ్యగ్రుఁడు గాక విగ్రహముబో దేశంబుఁ గాలంబు సం
పత్సామగ్ర్యముఁ జూపి శక్యముదెసన్ బ్రారంభియై భూప్రజా
వాత్సల్యార్థమనస్కుఁడైనపతి శశ్వద్ధీనమేతుండగున్.

కం. పరధన పరాంగనాజన
పరిహారము ధర్మపథ మందురు స
త్పురుషులు మఱవక వీనిం
బరికింపుము వినకు మెపుడు పైశున్యంబుల్.

గీ. మహిమ చెడదు స్వామ్యమాత్య సుహృత్కోశ
రాష్ట్రదుర్గబల పరాయణులకు
నీవు నిదియు నెఱిఁగి కావింపు సప్తాంగ
సంగ్రహంబు నీతిశాస్త్రనిపుణ.

ఈక్రింది సీసపద్యము తిక్కనవిజయసేనము లోనిదని బ్ర. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు.

సీ. అమ్మెదననిఁ బద్మాక్షుకౌస్తుభ మైన
వెలవక కొనియెడి వెరవుగలిగి
విలువ యిచ్చెదమని వేఁడినఁ బులిజున్నుఁ
గమ్మపసిండియు నమ్మఁగలిగి
యేవస్తు వెంత ప్రొద్దెందఱు చనుదెంచి
యెంతటికడిగిన నెదురఁ గలిగి
తమ్మయింట లేనియర్థము లర్థపతియింట
నైన వెదకిన లేవనుట గలిగి

గీ. తమకులాచార వర్తన(?)ము కొఱకు
సంగడుల యొప్పనకును బేహారుమాట
గాని లాభమునకు గా దనంగ
నఱలుదురు పురవరమున వైశ్యవరులు.

ఈ పద్యమును బ్ర. శ్రీ. ప్రభాకరశాస్త్రులుగారు తమ ప్రబంధ రత్నావళి పీఠికలో నుదాహరించుచు, పైపద్యములలో నొకటి వైశ్య

వర్ణన మున్నది. ఇదియు వైశ్యవర్ణనమే. రెండు పద్యములును విజయ సేనమందలివే యగునా? యని శంకించినారు. పైపద్యములలో గణపతి స్తోత్రమును రెండు పద్యములలో నున్నది. పరిఖాపర్ణనమును రెండు పద్యములలోఁ గన్పట్టుచున్నది. జగ్గనకవి సమకూర్పుటలో నేదైన పొరపాటు జరిగెనో? లేక తిక్కనయే యట్లు రచించెనో? చెప్పఁ జాలము. చిమ్మపూడి అమరేశ్వరుఁడను మహాకవి విక్రమసేన మను నొక ప్రబంధమును రచియించియుండెను. అందలి నాయకుఁడు విక్రమ సేనుఁడు. నాయిక నిషధసుత. తిక్కన విజయసేనములోని నాయకుఁడు విజయసేనుఁడు. నాయిక పేరు లభింపలేదు. ఈ గ్రంథముల నామాక్షర ములలో రెండవ మూఁడవ యక్షరములుదక్కఁ దక్కినవి సమానము లగుటచే జగ్గకవి గ్రంథ నామముల నిచ్చుటలో పొరపాటు పడియె నేమో!

అప్పకవియును, కస్తూరి రంగకవియును, క్రింది పద్యము విజయసేనములోనిఁ దని సంశయప్లుత యతికి లక్ష్యముగా నిచ్చి యున్నారు.

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసం దగు లూది యిమ్మెయిన్
దల్లడ మందె దేల యుచితస్థితికి న్ననుఁ బాపఁ జూపినన్
దల్లియు బంధులోకమును దండ్రియు నే మనువా రెఱింగి రే
నుల్లమ యిట్లు నీకుఁ దగునో తగదో పరికించి చూడుమా!

కాని యీపద్యమునే చిమ్మపూడి యమరేశ్వరుని విక్రమసేన ములోనిదని కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమున నుదాహరించియున్నాఁడు. దీనిబట్టి విజయసేన విక్రమసేనములనుఁ జెప్పుటలో తారుమారు జరుగుచున్నదని నిశ్చయింపవచ్చును. అట్లై యినచోఁ బైనవ్రాసిన వానిలో నొకే విషయవర్ణనము గల రెండు పద్య ములలో నొకటి తిక్కన సోమయాజియు నొకటి యమరేశ్వరుఁడును రచియించియుండురు. గజాననస్తోత్ర పద్యములు రెంటింటిలో నుత్పల మాలనుఁ దిక్కనయు శార్దూలము నమరేశ్వరుఁడును రచియించి యుండురు. పరిఖావర్ణనమున సీసపద్యమును వైశ్యవర్ణనముగఁ జంపక

మూలయుఁ దిక్కన రచితములని నాయభిప్రాయము. తిక్కన విజయసేనమును రచియించి యుండుట సత్యమేని, యది నిర్వచనోత్తరరామాయణమునకుఁ బూర్వమై యుండును.

(2) కవిసార్వభౌమ చంధస్సు.

ఈ మహాకవి యాంధ్రమున నొక ఛందోగ్రంథమును వ్రాసి యుండెనని చెప్పుదురు. దాని పేరు కవివాగ్బంధన మని కొందఱును కవిసార్వభౌమ చంధస్సు అని కొందఱును జెప్పుచున్నారు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున 36 పంక్తులు గల యొక చిన్న పుస్తక మొకటి యున్నది. గ్రంథాత పద్య మిది:

క. తనరన్ గవివాగ్బంధం
బను ఛందం బవని వెలయ హర్షముతోఁ ది
క్కనసోమయాజి చెప్పెనుఁ
జనులెల్ల నుతింప బుధుల సమ్మతి గాఁగన్.

అందలి మఱి రెండుపద్యముల నీక్రింద నుదాహరించు చున్నాఁడను.

క. కులములు గుణములు వేళలు
నలలింగము లంగములును నాగ్రహవేధల్
తెలియఁగ వలయును గవి తలఁ
బలికెడువర్ణంబు లైదుపదులకు మొదలన్.

క. అకచటవర్గలు విప్రులు
ప్రకటిత తపమపలు నృపులు రయబహాశషసల్
వికసిల్లు వైశ్యకులమున
నుకవిస్తుత ళశలు రెండు శూద్రకులంబుల్.

తంజావూరు నందున్న పుస్తకభాండాగారము నందొక తాళపత్రప్రతి యున్నది. అందలి గ్రంథాంత పద్యమును పైపద్యమును నొక్కరీతిగనే యున్నవి. ఆప్రతియందలి మూఁడు పద్యము లివి:

క. విద్యలలోపల నుత్తమ
విద్య కవిత్వంబు మఱికవిత్వము ఛందో
వేద్యము గావునఁ జెప్పెద
హృద్యంబుగఁ గవితఛందమేర్పడఁ గృష్ణా.

ఈపద్యము సులక్షణసారమున నున్నట్లు వావిళ్ళవారి ముద్రిత ప్రతి వలనఁ దెలియుచున్నది. కాని సులక్షణసారగ్రంథకర్త వెల్లంకి తాతంబట్టని ప్రకటించిన వావిళ్ళవారి గ్రంథమునుఁబట్టి యీపద్యకర్తృత్వమును నిర్ణయింపఁజాలము.

ఆ. చాలు కాలు కూలు సంహారవచనంబు
లోలి కావ్యమందు నొనరె నేని
ఫాలలోచనుఁ డయినభస్మ మయిపోవును
బాలవార్ధిశయన బాలకృష్ణ!

మ. స్వరవర్గద్రుతముల్ శకంధుగుణముత్వప్రాద్యభేదద్వయ
స్వరభిన్నప్రభు కాకునిత్యములు దేశ్యజ్ఞోభయాఖండముల్
సరసాదేశవిభాగవృద్ధులును మానంయుక్త వైకల్యముల్
గరిమన్ బోలిక చక్కటొక్కటి యనంగా నిర్వ దేడాయతుల్.

తిక్కనసోమయాజి యీలక్షణగ్రంథమును రచించెనని నమ్ముట కవకాశము లేదు. ఈతనితో సమకాలికుఁడైన కేతనకవి యాంధ్రభాషాభూషణమున నదివఱ కెవ్వరునుఁ దెనుఁగునకు లక్షణము చెప్ప లేదని యీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

ఆ. కవితఁ జెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చ
బరఁగ దశకుమారచరితంబుఁ జెప్పిన
ప్రోడ నన్ను వేఱ పొగడ నేల

క. మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరునుఁ జెప్ప రేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయభట్టాదికవి జనంబుల కరుణన్.

తిక్కన తేనాగ్రంథమునుఁ వ్రాసియున్నచో నేతనకవి యిట్లు చెప్పియుండఁడు. తిక్కనయే యీగ్రంథమును వ్రాసియున్నచోఁ బై పద్యములో "పాలవార్థి" యని చెప్పియుండఁడు. "పాలకడలి" యని యుపయోగించియుండును.

అనంతామాత్యుఁ డిరువదినాల్గు యతులనుఁ జేసె ననియు నాతని తరువాతి వారిరువదియేడు యతుల నంగీకరించిరనియు నప్పకవి యీ క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

క. భీమన పదిచెప్పె ననం
తామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువదినా
ల్గామీఁదఁ గొందఱు కవి
గ్రామణు లిరువదియు నేడు గావించి రొగిన్.

పైనచెప్పినవాగ్బంధన మను గ్రంథములో 27యతులు చెప్పి యున్నాఁడు. కావున నాతఁ డనంతామాత్యునకుఁ దరువాతివాఁ డని యెంచఁ దగియున్నది అనంతామాత్యుఁడు క్రీ. శ. 1325-1430 ప్రాంతము వాఁడు. కవివాగ్బంధనకారుఁడు యతులనుఁబట్టి యాకాలము నకుఁ దరువాతివాఁ డగుచున్నాఁడు. తిక్కనసోమయాజి 1220-1300 ప్రాంతమువాఁడు. కావున ననంతామాత్యునకుఁ దరువాత నేకవియో యీకవివాగ్బంధనమును రచించి తిక్కనపేరు పెట్టియుండును.

## (3) కృష్ణశతకము

తిక్కనసోమయాజి కృష్ణశతకమును రచియించె ననియు నీక్రింది పద్య మాశతకము లోనిదనియుఁ గొందఱు చెప్పుచున్నారు.

మ. అరయన్ శంతనుపుత్త్రుపై విదురుపై నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపయి న్నందవ్రజస్త్రీలపైఁ
బరఁగం గల్గుభవత్కృపారసము నాపైఁ గొంత రానిమ్ము నీ
చరణాబ్జంబులు నమ్మినాఁడ జగదీశా! కృష్ణ భక్తప్రియా!

"కృష్ణ! భక్తప్రియా!" యనుమకుటముతో నున్నశతక మున్నట్లు గానరాదు. వెన్నెలకంటిజన్నయకృత మగు "కృష్ణా! దేవకీనందనా" యను మకుటముతో నున్న శతక మొకటియున్నది.

అదియు నిదియు నొకటి కాదు. భాషాపరిశోధనమున నేమైనసాక్ష్యము లభించిననే తప్ప నీశతక మొకటి యుండె ననికాని దానికర్త తిక్కన యనికాని భావించుటకు వీలు లేదు.

### తిక్కనను నుతించినకవులు :

ఆంధ్రభాషలోఁ బద్యకావ్యములను రచించినకవులలో నీతనిని నుతింపనివారుండరు. ఈతనికవిత్వగుణము నెఱింగినసుప్రసిద్ధకవు లీతనిని నుతించినపద్యములఁ గొన్నిటి నీక్రింద నుదాహరించెదను.

"మ. తనకావించినసృష్టి తక్కొరులచేతం గాదు నా నేముఖం
బునఁ దాఁ బల్కినపల్కు లాగమములై పొల్పొందునా వాణి న
త్తను నీశుం డొకరుండు నాఁ జనుమహత్త్వాప్తిం గవిబ్రహ్మనా
వినుతింతుం గవి తిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్."

—ఎఱ్ఱాప్రెగ్గడ.

"వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసాభ్యుచితప్రబంధముగ నొక్కొక్కమాట." —శ్రీనాథుఁడు.

"చ. ఉభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలు సంవిహితాధ్వరక్రియా
ప్రభు బుధబంధు భూరిగుణబంధురు భారతసంహితాకథా
విభుఁ బరతత్త్వబోధను నవీనపరాశరసూను సంతత
త్రిభువనకీర్తనీయయశుఁ దిక్కకవీంద్రునిఁ గొల్తు నర్థితోన్."

—మారన.

ఉ. పంచమవేదమై పరఁగుభారతసంహిత నాంధ్రభాషఁ గా
వించెఁ బదేనుపర్వములు విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁ డ
క్కాంచనగర్భతుల్యుని నఖండితభక్తి నమస్కరింతు ని
ర్వంచితకీర్తివైభవవిరాజికిఁ దిక్కనసోమయాజికిన్.

—శ్రీనాథుఁడు.

గీ. ఉభయకవిమిత్రు నత్యంతశుభచరిత్రు
భానుసమతేజుఁ గొమ్మయప్రభుతనూజు
సుకృతశ్రీభ్రాజిఁ దిక్కనసోమయాజిఁ
బ్రణుతబహుదేశకవిరాజుఁ బ్రస్తుతించి. —పి. పినవీరన్న.

చం. క్షితిఁ గ్రతుకర్త నా మహిమ చేకొని పంచమవేదమైన భా
రతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టి యు
న్నతచరితుండు తిక్కకవి నాయకుఁ డాదట......

—అనంతామాత్యుఁడు.

ఉ. ఆంధ్రకవిత్వతత్త్వసముదంచితకీర్తిని దిక్కయజ్వ నీ
రంధ్రతరప్రభావనిధిఁ బ్రస్తుతి సేయుదు... నుల్లస
ద్గ్రంథగభీరమంజులతరగర్జితవిభ్రమభవ్యభంగి సై
రంధ్రిక యైనచాటు మధుర స్ఫుట బంధురవాగ్విజృంభిగన్.

—గంగానరకవి.

ఉ. అంజలిఁ జేతుఁ బద్మజనిశాంతకరాంత నిరంతరోల్బణ
స్మంజులవల్లకీ మధురమంద్రవినాద సముల్లసధ్వని
వ్యంజక వాఙ్నిగుంభన సమంచిత నూతనసృష్టి చాతురీ
రంజిత సత్కవీంద్ర బుధరాజికిఁ దిక్కనసోమయాజికిన్.

—నృసింహాకవి.

చ. పరువడి భారతాఖ్య గలపంచమవేదము నాంధ్రభాషను
స్థిరతి రచించుచోఁ గృతిపతిత్వము గోరి ప్రసన్నుఁడైన యా
హరిహరనాథుచేఁబడసి నవ్యయసౌఖ్యపదంబు నెవ్వఁ డా
పురుషవరేణ్యుఁ దిక్కకవిఁ బూని నుతింతుఁ గృతాధ్వరోత్సవున్.

—జిక్కయ.

## భగవద్గీతలనుఁ దిక్కన యేల తెలుఁగు సేయలేదు?

భారతమునందలి భీష్మపర్వములోఁ జెప్పఁబడిన భగవద్గీతలనుఁ దిక్కన సోమయాజి యాంధ్రీకరింపలేదు. అందులకుఁ గారణ మాతని యసమర్థత యని తలంచువారు కొందఱున్నారు. భగవద్గీతలు లేకుండ వ్రాయఁబడిన తాళపత్రప్రతులు కొన్ని కలవనియు, నట్టిప్రతి యొకటి కుంభకోణమునం దిప్పుడునుఁ గలదనియు, నట్టిప్రతియె తిక్కనకు లభించి యుండునవనియు నందుచే నది యాతని యాంధ్రీకరణమునఁ జేరలేదనియుఁ గొంద ఱభిప్రాయపడుచున్నారు. వేదాంత ప్రతిపాదకములగు

ననేక కథలను శాంత్యనుశాసనికాది పర్వములలో సోమయాజి యాంధ్రీకరించి యుండెను. తర్కశాస్త్రవిజ్ఞాత యైన తిక్కన భగవద్గీతల నాంధ్రీకరింప శక్తి లేకపోయె ననుటకంటె వింతవిషయ మింక నొకటి యుండదు. భగవద్గీతలను దత్తోజీపండితుఁడు మొదలగువారు పద్యములుగా వ్రాసియుండిరి. ఆమాత్రపు విజ్ఞానము తిక్కనసోమయాజికి లేదని తలంచుట పొరబాటు. సనత్కుమారగీతలు, ఉత్తరహిందూదేశ ప్రతులయందేగాని, దక్షిణహిందూదేశ ప్రతులయందు లేవని పండితులు వ్రాసియున్నారు. అందుచేతనే తిక్కన భారతమునందవి లేవు. అట్లే భగవద్గీతా రహితమైన భారతమే తిక్కనకు లభించినదని తలంచుట కవకాశమున్నది. యుద్ధారంభదినమున నుభయసేనామధ్యమున రథముపై నిలువఁబడి చూచినప్పు డర్జునునకుఁ దాను చేయబోవు గురువృద్ధ బంధుజనవధాకార్యము హృదయమునకుఁ దట్టి విషాదము కలిగి యుద్ధవిముఖుఁ డగుటయుఁ గృష్ణుఁ డాతని శాసనమున జ్ఞానము నుపదేశించి రణోన్ముఖునిఁ జేయుటయు గీతయొక్క ప్రధానోద్దేశము. భారతమునం దిప్పుడున్న పదునెనిమిదియధ్యాయముల గ్రంథము నప్పుడు జరిగినదని తలంపరాదు. ఆగ్రంథమును జదువుట కథమము రెండుదినములు పట్టును. అంతకాలము యుద్ధము మాని వారు భగవద్గీతావిషయములనుఁ జర్చించుచుఁ గూర్చుండియుండ లేదు. శ్రీకృష్ణభగవానుఁడు, అర్జునుని మూఢత్వమునుఁ బోఁగొట్టుటకై తగిన మాటలనుఁ జెప్పి విశ్వరూపమునుఁ జూపి రెండుమూఁడు ముహూర్తముల కాలములో నాతనిని రణోన్ముఖునిఁ జేసియుండె నని తలంపవలసియుండును. భగవద్గీత ప్రక్షిప్తమని నే ననుట లేదు. తక్కినకథలన్నియు నెట్లువిస్తరింపఁబడియెనో, ఈభగవద్గీతయు భారతమునవట్లే చెప్పఁబడియుండును. కథపోకుండ నాసందర్భమునఁ గొన్నిశ్లోకములను మాత్ర ముంచితక్కినవానిని విలేఖకు లందుండి తొలఁగించిభగవద్గీతా గ్రంథమును వేఱుగ వ్రాసికొనిరేమో!

భగవద్గీతాసహిత మైనభారతము లభించియున్నను, వీరరసప్రధాన మైనయాఘట్టమున నీపదునెనిమిదియధ్యాయముల గ్రంథమును

రచించి, రసభంగము చేయుట కిష్టము లేక తిక్కన దానిని విడిచివేసి ననికూడ భావింపవచ్చును. భారతము నందనేకకథల నాతఁడు తెలిగింపక విడిచిపెట్టియుండెను. అట్లే దీనిని విడిచిపెట్టి యుండవచ్చును. భగవద్గీతను బూర్తిగ భాషాంతరీకరింపకపోయినను కథాసందర్భమునుఁ బూర్తిగా వదలివేయక కొన్నిపద్యములను వ్రాసియున్నాఁడు. భగవద్గీత పదునెనిమిదియధ్యాయములందును శ్రీకృష్ణుఁ డేసిద్ధాంతములనుఁ బ్రతిపాదించెనో వానిని చిన్నమాటలలో నీగద్యపద్యములలో సోమయాజి స్పష్టపరచియున్నాఁడు. వానిలోఁ గొన్నిటి నిట నుదాహరించెదను.

"చ. వగవగ నేమియుం దగనివారికినై హృదయంబు గుందఁగా
వగచెదు బుద్ధిమాటలను వావిరి నాడెదు నీవు పండితుల్
వగతురె యున్నవారికి నవశ్యవిధేయతఁ జన్నవారికిం
దెగు వగ లెల్లఁ జిత్తము ప్రదీప్తవివేకమయత్వ మొందినన్

వ. ఇద్దేహంబునందు బాల్యంబు, యౌవనంబు, వార్ధకంబు ననం గలుగు నవస్థలం బొందినట్లును, జీర్ణంబులైన వస్త్రంబులు విడిచి నూతనంబులైన వానిం గైకొనినచాడ్పునను గాని దేహాంతరగమనం బాత్మహానిం జేయదు. పుట్టువు జావు నను నివి లేమిం జేసి శరీరంబు వోలె శస్త్రచ్ఛేదనంబు మొదలైన వికృతికారణంబులకు నాత్మండు లోను గాఁడు. అప్పురుషుండు నొప్పించువాఁడును నొప్పింపఁబడియెడు వాఁడునుం గాఁడు. ఆత్మకు నభావంబును, శరీరంబునకు భావంబునుఁ గలుగదు.

ఆ. ఇట్టు లగుటఁ జేసి యెవ్వరిదెసకు శో
కంబుఁ బొందఁ గారణంబు లేదు
జీవుఁ డెల్ల భంగిఁ జెడియెడువాఁడు గాఁ
దలఁచితేని వగవవలవదు మున్న.

క. పురుషుండు సెడు ననువాఁడును
బురుషుఁడు సెఱుచు ననిపలుకుపురుషుండును న
య్యిరువురు నవివేకుల య
ప్పురుషుఁడు సెఱుపండు సెఱఁడు భుజవీర్యనిధీ!

క. పురుషుఁ డన వేఱొకండే
పురుషోత్తముఁ డైనయేని పురుషోత్తమతా
స్ఫురణకుఁ బురుషత్వం బను
మెరమెరగల దదియు కాదె మెయికొనుఁ గ్రియకున్.

క. సమరంబు రాజులకు ను
త్తమ కర్మం బది యుపాకృతస్వర్గద్వా
రము సుమ్ము లెమ్ము దగఁ గ
య్యము సేయుము దీని కేల యనుమానింపన్

క. ఫలములయెడ బ్రహ్మార్పణ
కలనపరుం డగుచుఁ గార్యకర్మము నడపన్
వలయుం దత్త్వజ్ఞానము
తలకొనినం గర్మశమము దానై కలుగున్

క. వైరము ననులిచి త్రెంపక
కారాకులు డుల్లినట్లు కర్మము లెల్లం
దార పెడఁబాయువలయుట
సారకృపం దెలియఁ జెప్పె శౌరియతనికిన్.

విశ్వరూప ప్రదర్శనానంతరమున:

"ఏను లోకక్షయకర్త యగు కాలుండ నిచ్చో జనసమాజసమా
హారణంబునకుఁ బ్రవృత్తుండ నైతి నీవు సంపవలయు నని లేదీగురు
భీష్మాదు లెట్లును లేకుండువార నాచేతం జచ్చినవారి నెల్లను జయిం
చినవాఁడ వగుటకు నిమిత్తమాత్రమ్ము గమ్ము లెమ్ము రాజ్యమ్ము
గైకొనుము"

ఈకథాసందర్భమున నడుమనడుమ రచింపఁబడిన "అనేకవాక్యంబుల నాత్మతత్త్వంబు శాశ్వతం బగుట యెఱింగించి" "వివిధవాక్యంబుల నాత్మునకు బాధ్యబాధకత్వంబులు లేకునికి వివరించి" "స్వకర్మానలంబనంబు వదలం దగమి దెలియుటకు వాక్యంబులు పెక్కు లుపన్యసించి" ఈదృశంబు లగు వాక్యంబు లనేకంబు లనుగ్రహించుచు వివిధ పరికారంబుల వికల్పించి విజయుం డడిగిన వాని కెల్ల సదుత్తరంబు లిచ్చి

"మత్కర్మపరుండును, మద్భక్తుండును నైనవానికి నన్నుఁ బడయవచ్చు నని యాశ్వాసించి"

తే. అతఁడు మఱియును బ్రహ్మవిద్యాన్వయమునఁ
దనకు సందిగ్ధ మైనట్టిదాని నెల్ల
నడుగఁగా నమ్మహాత్ముఁ డత్యంతకరుణఁ
దెలియఁ జెప్పుచు హృదయసంచలత మాన్చె

వ. ఇవ్విధంబున ఫాల్గున కుపనిషదర్థజాతం బవగతంబు సేసి"

అను వాక్యములఁబట్టి భగవద్గీత యంతయుఁ దిక్కనయొద్దఁ గల దనియు రసభంగ మగునని యో మఱియే కారణముననో దానిని బూర్తిగ నాంధ్రీకరింపనిష్టము లేక విడిచిపెట్టె ననియుఁ గోచరించుచున్నది. ఉత్తరగీతలనుఁగూడ నీతఁడు తెలుఁగు సేయక, వానిసారము నయిదారుపుటలలో నశ్వమేధ పర్వప్రథమాశ్వాసమునఁ జెప్పియున్నాఁడు. మొత్తముమీఁద వేదాంతచర్చలతో గ్రంథమును నింపి సామాన్యపాఠకులను విసువు జెందింపకుండ నందుముఖ్యము లగు విషయములను క్లుప్తముగను స్పష్టముగను వెల్లడించుటయే కవియుద్దేశ మయినట్లు స్పష్ట మగుచున్నది. ఆగీతలను తెలుఁగు సేయుట కాతనికి సమర్థత లే దని తలంచుట పొరబాటు.

భారత రచనాకాలము తిక్కన వయసు:

నిర్వచనోత్తర రామాయణమును మనుమసిద్ధిరాజున కంకితే మొసంగుటయు, శ్రీమహాభారతముఁ నాతని పేరైన నుదాహరింపక పోవుటయు జూడ మనుమసిద్ధి కాలధర్మము నొందిన పిదప నీతఁడు భారతరచనము నారంభించెనని తలంపవలసియున్నది. మనుమసిద్ధి క్రీ. శ. ౧౨౬౦ సంవత్సర ప్రాంతమున చనిపోయెనని తలంచుటకు వీలగుచున్నది. అటుపిమ్మటఁ దిక్కన రాజకార్యములయందు విరక్తుఁడై భారతరచనమున నిమగ్నుఁడై తనజీవితమును శాంతముగా గడపియుండును. ఇతఁడు డబ్బదియెనిమిది సంవత్సరములు జీవించెనని ప్రసిద్ధి గలదని శ్రీపిశేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు. నిర్వచ

నోత్తరరామాయణ కాలమునాటి కీతనికి దాదాపు నలువది సంవత్సరముల వయసుండెనని తలంచితిమేని యీతని జననము క్రీ. శ. ౧౨౨౦ ప్రాంతమై నిర్యాణము క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమగును. తిక్కనసోమయాజి మనుమసిద్ధితో సమవయస్కుఁడని నాయభిప్రాయము. కాదేని యేఁడెనిమిది సంవత్సరములు మనుమసిద్ధి పెద్దవాఁడైనఁ గావచ్చును. మనుమసిద్ధి తిక్కనను 'మామా' యని పిలుచువాఁ డనుటచేఁ దిక్కనయే కొంచెము పెద్దవాఁడేమో యని యనుకొనుటకుఁగూడ నవకాశము కలదు. కాని యెట్లయినను వీరిరువురినడుమ నంతరము విశేషముండదు. మహాభారతము నీతఁడు క్రీ. శ. ౧౨౭౦–౧౨౮౦ నడుమ రచియించియుండును అని నేననుకొనుచున్నాఁడను. మనుమసిద్ధి చనిపోయిననాఁటి కీతనికి ౪౦-౪౫ సంవత్సరముల వయసుండును. మనుమసిద్ధి మహారాజు చనిపోయిన తత్క్షణమే మహాభారత రచనమున కారంభించియుండఁడు. నాలుగైదేండ్లు గడచిన తరువాతఁ బ్రారంభించియుండుననియుఁ గొన్నిదినములు వ్రాయకున్నను సగటున దినమున కైదు పద్యములు చొప్పున వ్రాసియుండెనని తలంచినచోఁ బదేండ్లలో భారతము పూర్తియగును. కావున నాతని యేబది అరువదియేండ్ల వయసు మధ్య ననఁగా క్రీ. శ ౧౨౭౦-౧౨౮౦ నడుమ మహాభారత రచనము జరిగియుండు ననియు నాయభిప్రాయము.

తిక్కనసోమయాజి నిర్యాణము :

క. అంబర రస శశి శాకా
   బ్దంబులు చనఁ గాళయుక్తి భాద్రపదపుమా
   సంబున నంబరమణిబిం
   బం బనఁదగు తిక్కయజ్వ బ్రహ్మముఁ జేరెన్.

అనుపద్య మొకటి చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకాలయమున మెకాంజి యను నైరోపీయుఁడు సంపాదించియుంచిన వ్రాఁతప్రతిలోఁ గలదఁట. ఈపద్యమునుబట్టి శా. శ. ౧౧౨౦ (క్రీ. శ.) ౧౧౯౮ సంవత్సరమునఁ దిక్కన పరలోకముఁ నొందెనని తెలియుచున్నది. ఆసంవ

త్సరము కాళయుక్తి యైనమాట నిజము. కానిఅప్పటికి తిక్కన జన్మింప లేదు. శా. శ. ౧౧౮౦ (క్రీ. శ ౧౨౫౮) కాళయుక్తి ప్రాంతమున నాతఁడు నిర్వచనోత్తర రామాయణమును రచియించియున్నాఁడు. అప్పటికాతఁడు జీవించియుండుటచే నాకాళయుక్తి యాతని నిర్యాణ కాలము కాఁజాలదు. ఇఁక శా. శ. ౧౨౪౦ (క్రీ. శ. ౧౩౧౮) కాళయుక్తి నాఁటికి పైనవ్రాసిన లెక్కప్రకారము తిక్కన ౯౩ సంవత్సరముల వయసు వాఁడగును. పద్యములోని శకసంఖ్య మార్చవలసి యుండును. కావున నాతని మరణకాల మదియనుగానేరదు. అందుచే దిక్కన చనిపోయిన కాలమునుఁ దెలుపు నీపద్యము సత్యము జెప్పుచుండెనని తలంపవీలులేదు. పైపద్యమునందలి "శకశశి" యనుమాటలను "శశిరవి" యని మార్పవలయునని కొందఱనుచున్నారు. అట్లు మార్చినచో నది శా. శ. ౧౨౧౦ (క్రీ. శ. ౧౨౮౮) యగును. అప్పటి కాతనికి దాదాపు డెబ్బది యేండ్లుండును. కాని యది కాళయుక్తి కాక సర్వధారిసంవత్సర మగుచున్నది. కావున నీపద్యమునుబట్టి తిక్కన సోమయాజి నిర్యాణకాలమును నిర్ణయింపఁబూనుట వ్యర్థప్రయాసము.

### ఇతఁ డరణ్యపర్వము నేల పూర్తిచేయలేదు ?

భారతరచనము పూర్తియైన పిమ్మటఁగూడ నీసుహాకవి కొంత కాలము జీవించియున్నట్లు కన్పట్టుచున్నది. అయిన నీతఁడు భారతారణ్య పర్వశేషమునుఁ బూర్తిచేయు లేదు. దానిని రచించుట కాతని కిష్టము లేకయే విడిచిపెట్టి యుండును. ఆభాగమును రచించినచో నన్నయభట్టువలెనే తానుగూడ మరణింతునని భయపడి యాభాగమును రచింపలేదని కొందఱందురు. తత్త్వజ్ఞానసంపన్నుఁడగు తిక్కన యరణ్యపర్వభాగ రచనముచే మరణము సంభవించునని తలంచునంతటి యవివేకియని యనఁజాలము. కాని యేదియో యొకవిధమగు సంశయ మాతని హృదయమునం దుండుటచేతనే యాభాగము నాతఁడు పూరింపలేదని యూహింపఁ దగియున్నది. నిర్వచనోత్తర రామాయణమున శ్రీరామనిర్యాణ కథాభాగము నాతఁడు తెలుఁగు సేయక శ్రీరామచంద్రుఁడు కుమారులతోఁ గలసి సుఖముగా రాజ్యము సేయుచుండె

నని శుభాంతముగా గ్రంథమును ముగించినాఁడు. భారతాంతమున ధర్మరాజు స్వర్గమునకు స్వశరీరముతోఁ బోవుటయు నచ్చట భార్యను, సోదరులనుఁ గలసికొనుటయుఁ జెప్పి దానినిఁగూడ శుభాంతముగనే ముగించినాఁడు. మొత్తముమీఁద గ్రంథము ముగియునప్పటికి పాఠకుల హృదయములు దుఃఖపూరితములు గాకుండనుండవలయు నను కోర్కె యీకవి హృదయమునందుండి యుండును. భారతమును సంపూర్ణముగా రచించి సంతృప్త హృదయముతోనున్న యీమహామహుఁడు మరల నారణ్యపర్వభాగమును రచింపఁదలపెట్టుట కిష్టములేకుండుటయే యీభాగమును రచింపక పోవుటకుఁ గారణమైయుండును. భారతమధ్యమునఁ గొంతభాగము మిగిలియున్నదను విషయమాతఁడెఱుంగక పోలేదు. దానిని పూరింపకపోయిన నెట్లను విచారమాతనికి లేదు. తన వలెనే యీభాగమును పూరించుట కింకొక రుందురనియే యాతని యుద్దేశము. ఆయదృష్ట మెఱ్ఱాప్రగడకు లభించినది. ఉత్తరరామాయణమున రామనిర్యాణ కథాభాగము తెలుఁగు గాకుండ నిలిచి యున్నదను విచారమును నాతనికి లేదు. ఆభాగమును రచించు వారింకొకరుందురనియే యాతని యూహ. అట్లే యీభాగమును జయంతి రామభట్టు పూరించియుండెను.

### తిక్కన యశౌన్నత్యము:

తిక్కన సోమయాజి కవిత్వానైపుణినిగూర్చియు నాతని యుదారాశయాదర్శములనుఁ గూర్చియు నెంతవ్రాసినను దనివితీరదు. దిఙ్మాత్రప్రదర్శనముగఁ గొన్ని విషయములనుఁ దెలిపియుంటిని. తిక్కననుఁ గూర్చియు నాతని వంశములోని పూర్వులనుఁగూర్చియు ననేక కథలు నెల్లూరు, గుంటూరు మండలములలోఁ బ్రచారములోనున్నవని తెలియుచున్నవి. ఏవిధమునఁ జూచినను భావిపురాతనాద్యతనాంధ్రకవులలో నీతనితో సమానుని జూడఁజాలము. ఇంతటి యదృష్టవంతుఁ డింకొకఁడు లేఁడు. ఉండఁడు. ఇహపరములను రెండింటిని సాధించిన మహాపురుషుఁ డితఁడు. శూరులై, పండితులై, కవులై, వైదికమార్గానువర్తులై, రాజ్యాంగవేత్తలై పేరుగనినవారి కుటుంబమున నీతఁడు

జననమందెను. రూపమున శరీరధారియగు మన్మథుఁడు. ఇతని సౌంద ర్యాతిశయమునుఁ గూర్చి కేతనకవి దశకుమార చరిత్రమున వ్రాసిన వాక్యము లెన్నియో కలవు. వానినిఁ జదివినవారి కితఁడు గొప్పసౌం దర్యరాశి యని తోఁచును. ఇంతేకాదు. ఈపుణ్యరాశి మహామంత్రి శేఖరుఁడై, దండాధినాథుఁడై, తన ప్రభువు రాజ్యభ్రష్టుఁడు కాఁగా నారాజ్యమును మఱల సంపాదించి, ప్రభురాజ్యస్థాపనాచార్య బిరుద మును వహించి, రాజ్యతంత్రజ్ఞుఁడని పేరుగాంచెను. పండితుఁడై, యసం ఖ్యాక శిష్యబృందమునకు గురువై, పరమతఖండనమునఁ బ్రవీణుఁడై మహామేధావియను యశము నార్జించెను. కవియై, యుత్తమ కావ్య కర్తయై, కృతిభర్తయై, కృతివిధాతయై తనకీర్తిని, యితరుల యశమునుఁ గూడ శాశ్వతమొనర్చిన ప్రతిభాశాలియని పొగడొందెను. దైన్యమను నది యెఱుంగక యాగర్భశ్రీమంతుఁడై, మహాదాతయై, యగ్రహా రాదికము నొసంగి యాజన్మాంతము సుఖభోగముల ననుభవించిన మహాభోగి యనుకీర్తి వడసెను. పుత్రపౌత్రాది సంపదగలిగి బహు కుటుంబికుఁడై యెనలేని సంపదల ననుభవించిన యదృష్టవంతుఁ డితఁడను ఖ్యాతిని గడించెను. వేదవేదాంగ వేదియై, కర్మిష్ఠియై, యజ్ఞయాగాదు లొనర్చి కర్మవీరుఁడనియు, రాజయోగి యనియుఁ బ్రశస్తిని గాంచెను. అల్పాయువుగాక సహస్రమాస జీవియై, మాతృయౌవనవనకుఠారము గాఁగాక జీవితమునుఁ బురుషార్థసంపాదనా సాధనముగా వినియోగించిన కృతార్థజీవి యని ఖ్యాతిని గాంచెను. లోకశ్రేయోభిలాషియై, వైదిక మతాభిమానియై, సర్వమునుఁ ద్యజించి నిస్సంగియై పద్మపత్రజల బిందువువలె జీవితమునుఁ గడపిన మహాజ్ఞాని యని పేరొందెను. మానవ జన్మమున నింతకంటెఁ బడయఁదగిన దేమికలదు? ఇన్నివిధములఁ బ్రసిద్ధి నొందిన యదృష్టవంతుఁ డెవ్వఁడు? ఆంధ్రకవులలో నీతనితో సమానుఁ డెవ్వఁడు? ఈతని యశశ్చంద్రికలు భూమిపై నాచంద్రార్కము నుండఁ గలవు.

తిక్కన కాలము:

కవిజీవితములను రచించిన శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు, తిక్కన సోమయాజి, నన్నయభట్టుతో సమకాలికుఁడని వ్రాసిరి. కాని యది సత్యముకాదు. బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగా రాంధ్రకవుల చరిత్రమునఁ దిక్కనకాలమును సరిగానే నిర్ణయించిరి కాని, వారు గైకొనిన యాధారములు సంశయాస్పదములుగా నున్నవి. వారాధారముగాఁ గైకొనిన పెంట్రాలశాసనములు మన మనుమసిద్ధివి గావనియు, ముక్కంటికాడువెట్టి వంశీయుఁడైన భుజబలవీర మనుమసిద్ధివనియుఁ దోఁచుచున్నది. మనుమసిద్ధి నామధారులు పెక్కురున్నారు. కామయదేవుని కొడుకొకఁడు. రాజేంద్రచోడుని కొడుకొకఁడు. ఇట్లే పలువురున్నారు. తిక్కన యొనర్చినకృతిదానముచే ధన్యతం గాంచిన మనుమసిద్ధి యెవ్వరో తెలిపి యాతనిఁగూర్చియిటఁ గొంత వ్రాయుట యప్రస్తుతప్రశంస కానేరదు. అందువలనఁ దిక్కన కాలము సరిగా నిర్ణయమగుటయు, కృతిపతి విషయము దెలియుటయుఁ గూడ నగును.

నిర్వచనోత్తరరామాయణకృతిపతియైన మనుమసిద్ధి వంశావళినిఁ దిక్కనామాత్యుఁడు సంపూర్తిగాఁ జెప్పియుండలేదు. సూర్యవంశమునందలి యిక్ష్వాకును, రఘుమహారాజును, శ్రీరామచంద్రుని వర్ణించి పిమ్మట నావంశమునజన్మించిన కరికాలచోళునిఁ గొనియాడి యాతని కులమునఁ బుట్టినబిజ్జనను స్మరించి, పిమ్మట యావంగడమున జననమందినకృతిపతికిఁ బితామహుఁ డగు మనుమసిద్ధిని, తండ్రి యగు తిక్కమహీపాలుని నుతించెను. ఈ కరికాలచోడునినుండి యనేక చోడవంశము లుత్పన్నమయ్యెను. ఇతనినిగూర్చి నన్నిచోడకవి చారిత్రమున (ఆంధ్రకవితరంగిణి మొదటిసంపుటము పుట ౧౭౮) వ్రాసియున్నాఁడను. ఈకరికాలునకును, బిజ్జలునకును నడుమఁ జాల పురుషాంతరములు గడచినవి. వానివివరములు తెలియవు. నన్నిచోడుని చారిత్రమునఁ జోత్తపిచోడశాఖ లైదింటిని జూపియున్నాఁడను. అందు ౨-౩-౪ సంఖ్యలుగల శాఖలకును, మన యీమనుమసిద్ధి శాఖకును సన్నిహితసంబంధము లేదు. ఆశాఖలలో బిజ్జన లేఁడు. ఆతఁడా శాఖలకుఁ జెందినవాఁడు కాఁడు. కాని అందలి మొదటిసంఖ్యగల వంశ

వృత్తమును, మనుమసిద్ధివంశవృత్తమును బిజ్జననుండి యుత్పన్నమైనవి. ఆవంశవృత్తమునఁ గడపటిపురుషుఁడైన ఓపిలిసిద్ధియు, మనుమసిద్ధి తండ్రి యగుతిక్కరాజును సమకాలికులు, బిజ్జనకుఁదరువాత ౧-౨ పురుషాంతరములలోపల ఓపిలిసిద్ధి మనుమసిద్ధివంశములు విడిపోయి యుండును. ఓపిలిసిద్ధివంశీయులు కోణదేశములోను, మనుమసిద్ధివంశీయులు నెల్లూరుమండలమునను రాజ్యము చేసినట్లు కనుపట్టుచున్నది.

తిక్కనకావ్యమునకుఁ గృతిపతియైన మనుమసిద్ధి కోలూరను గ్రామమును బ్రాహ్మణుల కొసంగి వ్రాయించినశిలాశాసన మొకటి నందలూరు గ్రామమున సౌమ్యనాథేశ్వరుని యాలయమునఁ గలదు. (A. R. 580 of 07) అందు మనుమసిద్ధి వంశవృక్ష మున్నది. ఆశాసనమునందుఁ గొంతభాగము గోడలోపల కట్టఁబడియుండుటచేఁ బూర్తిగ లభింపలేదు. బ్రహ్మ, మరీచి, కాశ్యప, మను, ఇక్ష్వాకు, కకుత్స్థ, దశరథులకుఁ బిమ్మటఁ గరికాలుని నాపిమ్మట బిజ్జన నుదాహరించినాఁడు. తరువాతఁ గట్టడములో నుండిపోవుటచేఁ నాతనిసంతతిని గ్రమముగాఁ దెలిసికొనవీలు కలిగినదికాదు. అటుతరువాతివంశవృక్ష మీక్రిందివిధముగా నున్నది.




(ఇతఁడే తిక్కనచే నిర్వచనోత్తర రామాయణమును గృతినందినవాఁడు)

ఈవంశమునకు మూలపురుషుఁడైన బిజ్జఁను నిర్వచనోత్తర రామాయణమున నీట్లు వర్ణించినాఁడు.

చ. పరుషపరాక్రముం డగుచుఁ బల్లవుపీట మదగ్రుఁడైన ప
న్నిరువుర నాతనిం గలయ నెన్ని యనర్గళమత్సరంబుమై
మురరిపునన్నిభుండు పదుముర్వురగండఁ డనంగఁ బెట్టెఁ దా
బిరుదు వెలుంగ బిజ్జలుఁడు భీకరభూరిభుజాబలంబునన్.

ఈతఁ డేకాలమువాఁడో స్పష్టముగాఁ దెలియుట లేదు. ఉజ్జ్యపురియందు శిఖరమున గరుడ విగ్రహము గలిగిన విజయ స్తంభము నొకదానిని బిజ్జన నిర్మించెనని యొక శాసనమున గలదఁట. కర్నూలు మండలమునందలి నందికొత్తూరు తాలూకా కొత్తపల్లిలో బిజ్జనచోళ మహారాజు శాసన మొకటి కలదు. (ద. హిం. శా.సం. ౯ భా ౧ సంఖ్య ౨౨౨) ఇతఁడు కరికాలచోడుని వంశములోని వాఁడైనట్లు శాసన మందలి "స్వస్తి చరణసరోరుహవిహిత విలోచనత్రిలోచన ప్రముఖాఖిలపృథ్వీశ్వర కారితకావేరీతీర కరికాలకులరత్నప్రదీప" యను ప్రశస్తినిఁ బట్టి తెలియుచున్నది. ఈతని కాలము శాసనమున నీయలేదు. కాని యితఁడు త్రిభువన మల్లదేవుని సామంతుఁడైనట్లు శాసనమునందుండుటచేతను, పశ్చిమచాళుక్యుఁడగు మొదటి త్రిభువనమల్లుఁడు శా. శ. ౯౭౦-౧౦౦౦ వఱకు రాజ్యము చేసినవాఁడగుట చేతను చోళబిజ్జన యాకాలము వాఁడని నిశ్చయింపవచ్చును. ఓపిలిసిద్ధి, మనుమసిద్ధుల వంశవృత్తములనుబట్టి చూచినను బిజ్జనకాలము దీనితో సరిపోవుచున్నది. అందుచే నాబిజ్జనయు నీతఁను నొకఁడే యని నిర్ధారణము చేయవచ్చును. నిర్వచనోత్తరరామాయణమునఁ జెప్పిన పదుముర్వురు గండఁడను బిరుదము నీశాసనమున నుదాహరింపలేదు. ఈశాసనానంతరమున నీతఁడు పదుముర్వుర గండఁడయ్యెనేమో! ఈశాసనము సమగ్రముగాఁ గూడ లేదు. ఈతఁడే మనుమసిద్ధి వంశమునకు మూలపురుషుఁడయ్యెనేని, నితనికిని పైవంశవృత్తమందలిదాయ భీమునకు నడుమ కట్టడములో నున్న పురుషాంతరము లెన్నియో యుండవు. ఆబిజ్జనకు దాయభీముడు పుత్రుఁడో పౌత్రుఁడోయై యుండును.

పైన నుదాహరించిన శాసనములో మధురాంతకపొత్తపిచోళశబ్దము నీ మనుమసిద్ధికిఁ జేర్చియుండుటచే నీశాఖ చోళులలోని మధురాంతకపొత్తపిశాఖ యనుట స్పష్టము. అందులో వీరు నెల్లూరును రాజధానినిగా జేసికొనినవా రగుటచే వీరిని నెల్లూరు తెలుగుచోడు లని యందురు. పైనఁజూపినవంశములోని మొదటిమువ్వురనుగాని, యంతకు బూర్వులైన బిజ్జనతరువాత వారినిగాని తిక్కన తననిర్వచనోత్తరరామాయణమునఁ జేర్కొనలేదు. వారిశాసనములును గన్పట్టలేదు. వారు పొత్తపిచోళప్రభుశాఖకుఁ జెందియున్నను బరిపాలనములో సంబంధము లేదో, ఉన్నను, ఏదేని యొకస్వల్పప్రదేశముపై నధికారము వహించియుండిరో తెలియదు.

### తాతమనుమసిద్ధి :

మన మనుమసిద్ధికిఁ దాతామహుఁ డైన మనుమసిద్ధినిఁ దిక్కన యీ క్రింది రెండు పద్యములలో వర్ణించినాఁడు.

క. తద్వంశంబునఁ బోషిత
విద్వజ్జనుఁ డహితభుజగవిహగేంద్రుఁడు ధ
ర్మాద్వైతమూర్తి వరయో
పిద్వర్గస్మరుఁడు మనుమసిద్ధి జనించెన్.

సీ. భూరిప్రతాపంబు వైరిమదాంధకా
రమున కఖండదీపముగఁ జేసి
కరుణ దీనానాథకవిబంధుజనచకో
రములకుఁ జంద్రాతపముగఁ జేసి
చరితంబు నిఖిలభూజన నిత్యశోభన
లతకును నాలవాలముగఁ జేసి
కీర్తిజాలముఁ ద్రిలోకీశారికకు సభి
రామరాజిత పంజరముగఁ జేసి

ఆ. సుందరీజనంబు డెందంబునకుఁ దన
నిరుపమాన మైనసేగ్ను కలిమి

నతిప్రసిద్ధి చేసి యసదృశలీలమైఁ
బరగె మనుమసిద్ధి ధరణివిభుఁడు.

ఈపద్యములనుఁబట్టి యీతఁడు విశేషప్రఖ్యాతిగనిన వాఁడు కాక పోయినను, కొంతపరిపాలనాధికారమునుఁ గలిగియున్న వాఁడుగా గన్పడు చున్నాఁడు.

పైవంశవృక్షములోని శ్వేతభూపతిభార్య శ్రియాదేవి యనియు, నాతని కుమారుఁడైన బెజ్జసిద్ధికి నల్లసిద్ధి, తమ్మసిద్ధి యను కుమారు లున్నారనియు, శా. శ. ౧౧౭౯ సంవత్సరపు శాసనమువలనఁ దెలియుచున్నది. (నె. శా. సం. కావలి ౩౯) వీరు, రాజేంద్ర మనుమ సిద్ధికిఁదమ్ములై యుందురు.

తిక్కరాజు :

ఇతఁడు రాజేంద్ర మనుమసిద్ధి కుమారుఁడు. ఇతఁడు మిగులఁ బరాక్రమశాలి. కడప, చిత్తూరు, చెంగల్పట్టు, మండలములను జయించి కాంచీపురము వఱకునుఁ దన రాజ్యమునుఁ విస్తరింపఁజేసిన ప్రతిభా వంతుఁడు. ఈతని విజయగాథలనుఁ దిక్కన నిర్వచనోత్తరరామాయణ మున మూఁడు పద్యములలో వర్ణించియున్నాఁడు. దానినిబట్టి యితఁడు (౧) పృథ్వీశ్వరుని జంపెననియు, (౨) కర్ణాటసోమేశుని జయించి, చోళస్థాపనాచార్య బిరుదమును వహించెననియు (౩) కాడవపతిని జయించి, కప్పమునుఁ గొనెననియు, (౪) లకుమయను, శంభురాజును, దాయాదులను జయించెననియుఁ దెలియుచున్నది. ఈతిక్కరాజు జయించిన రాజులెవ్వరో క్రమముగా నీదిగువ వివరించెదను. దీనినిబట్టి ...రాజు కాలము తెలియును.

తిక్కరాజు చంపిన పృథ్వీశ్వరుఁ డెవ్వరు?

ఉ. కేశవసన్నిభుండు పరిగీతయశోనిధి చోళతిక్కభూ
 శ్రీశుఁడు కేవలుండె నృపు లెవ్వరి కాచరితంబు గల్గునే
 శైశవలీలనాఁడు పటుశౌర్యధురంధరబాహుఁడై నపృ
 థ్వీశనరేంద్రుమస్తకము నేడ్తెఱఁ గందుకకేళి సల్పడే.

-నిర్వచనోత్తరరామాయణము.

ఈపృథ్వీశ్వరుఁడు వెలనాటిచోడుఁడు, మూఁడవ గొంకరాజునకును జయాంబికకునుఁ గుమారుఁడు. ఈవెలనాటిచోడులనుఁ గూర్చిన కథలతో సంబంధము నుంచెనకవి చారిత్రమున కెక్కవ గాఁగలదు. కావున వీరి విషయమునందు వ్రాసెదను. పృథ్వీశ్వరుని శాసనములు శా. శ. ౧౧౦౮ మొదలు ౧౧౨౮ వఱకును గన్పట్టుచున్నవి. (ద.హిం. శా. సం. ౫ సంఖ్య ౧౩౩౮-౧౨౫౮.) ౧౧౨౮ తరువాత నీతనిశాసనములుఁ గన్పట్టుటలేదు. తిక్కరాజు తనశైశవమునందే యీతనిని జంపెనని వైపద్యమునందుఁ జెప్పియుండుటచే, ౧౧౨౮వ సంవత్సరమునకుఁ బిమ్మట కొలఁదికాలములోనే తన ౧౮ వ యేట నీతఁడు పృథ్వీశ్వరుని సంహరించెననియు, దానినిబట్టి తిక్కరాజుయొక్క జననము ౧౧౧౦ ప్రాంతమై యుండుననియు, నిశ్చయింపవచ్చును. ఈతని పినతండ్రియైన నల్లసిద్ధి శాసనమును బట్టియును, నీతని కుమారుఁడైన మనుమసిద్ధి శాసనమునుఁ బట్టియును, నీతిక్కరాజు కాలము సరియైనదనియే చెప్పవచ్చును.

## తిక్కరాజు జయించిన సోమేశ్వరుఁడెవఁడు ?

కర్ణాటప్రభువైన సోమేశ్వరుఁడు చోళరాజ్యము నపహరింపఁగా నీ తిక్కరాజాతనినిజయించి చోళసింహాసనమునఁ జోళుని నిలిపి చోళస్థాపనాచార్యబిరుదమును వహించె నని తిక్కనసోమయాజి యీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు

మ. కమలాప్తప్రతిమానమూర్తి యగు నాకర్ణాటసోమేశు దు
ర్దమదోర్గర్వము రూపు మాపి నిజదర్పంబుం బ్రతిష్ఠించి లీ
లమెయిన్ జోళుని భూమిపై నిలిపి చోళస్థాపనాచార్య నా
మము దక్కం గొని తిక్కభూవిభుఁడు సామర్థ్యంబు చెల్లింపఁడే.

ఈతిక్కరాజునుఁ గూర్చి మూలఘటికె కేతనకవి తన దశకుమారచరిత్రమున రచించినపద్యముల నిటనుదాహరించి యీకర్ణాట సోమేశ్వరుఁ డెవ్వఁడో వ్రాసెదను.

ఉ. శ్రీవిభుఁడైన యామనుమసిద్ధికిఁ బుణ్యచరిత్రయైనత
ద్దేవికిఁ బుట్టి దిక్కజగతీతలనాథుఁ డశేషలోకసం

భావితుఁ డై ధరాధరము వావఁగ నావసుదేవ దేవకీ
దేవుల కుద్భవించి వినుతిం జెలువొందిన కృష్ణుఁడో యనన్.

వ. ఇట్లుదయించి రాజ్యాభిషిక్తుం డైనయనంతరంబ.

సీ. బలిమిచేఁ బృథ్వీశవసుధేశు తలఁద్రుంచె
గటకసామంతుల గర్వ మడఁచె
గాళవవిభు నహంకారంబు మాన్పించెఁ
బాండ్యునిచేతఁ గప్పంబుఁ గొనియె
ద్రవిడమండలికు లందఱ దక్క గెలిచి చో
డని నిజరాజ్యపీఠమున నిలిపె
నెఱుకమన్నీల నివ్వెర పుట్టఁగా నేలె
వైరివీరుల నామ మలూరు నోర్చె
యోధహరిరాయ పెండరుఁ డుభయకటక
వీరుఁ డభినవభోజుఁ డాకారమదనుఁ
డవనిభారధౌరేయుఁ డు మహాత్మవిజిత
దిక్కరీంద్రుఁడు ఘనచోళతిక్కనృపతి.

ఈపద్యము శ్రీ వీరేశలింగము పంతులుగారు ముద్రింపించిన దశకుమారచరిత్రమునుండి గైకొంటిని. తాళపత్రప్రతిలో నున్న పాఠమును సరిగా నర్థము చేసికొనక పెక్కుతావుల శ్రీ పంతులుగారు తమయిష్టము వచ్చినట్లు దిద్దివేసి రని వ్రాయుచు శ్రీ మా. రామకృష్ణకవిగారు తాళపత్రప్రతిలో నిదని యీక్రిందిపద్యమును భారతిలో నిచ్చియున్నారు.

సీ. బలిమిచేఁ బృథ్వీశుతలఁ ద్రుంచి సేవణ
కటకసామంతుల గర్వ మడఁచి
ద్రవిడమండలికులందఱఁ దక్క నేలెఁ జో
డని నిజరాజ్యపీఠమున నిలిపెఁ
గర్ణాటవిభు నహంకారంబు మాన్పించెఁ
బాండ్యునిచేతఁ గప్పంబు గొనియె
నేఱువమన్నీల నెఱపుట్టఁగా నేలె
వైరివీరుల నామములూర నోర్చె

త్రిభువనరాయ పిండారుఁ డుభయకటక
పేరుఁ డభినవభోజుఁ డాకారమదనుఁ
డవనిభారధారేయ మహాత్మ్యవిజిత
దిక్కరీంద్రుండు చోళతిక్కనృపతి.

సేవణకటక మనఁగా యాదవులరాజధాని యగు దేవగిరి యనియు యాదవసామంతుల నీతఁడు జయించె ననియు ద్రవిడమండలికు లండఱుఁ దక్క నేలె యనుటలో పరాశ్రయము లేకుండఁ దానొక్కఁడే ద్రవిడమండలాధీశ్వరుల నందఱ నేలె ననియు నర్థమని శ్రీరామకృష్ణ కవిగారు వ్రాసియున్నారు. అది నిశ్చయము. కర్ణాటవిభుఁ డనఁగా హొయ్సలవంశజుఁ డగునాల్గవ సోమేశ్వరుఁ డని తలంపక పంతులుగారు కాడవపతి యని సవరించియుందురు. "ఈజయింపఁబడిన సోమేశుఁడు పశ్చిమచాళుక్యుఁ డయిననాలవసోమేశుఁ డయియుండును." అని బ్రం. వీరేశలింగముపంతులుగా రాంధ్రకవులచరిత్రలో వ్రాసియున్నారు. కాని యది సరియైనట్లు కన్పట్టదు. ఈ పశ్చిమచాళుక్యుఁడగు నాలవ సోమేశుఁడు, శా. శ. ౧౧౦౪-౧౧౧౧వఱకు రాజ్యము చేసినవాఁడు. ఈకాలములో తిక్కరాజు లేఁడు. ఉన్నను పదేండ్లలోపు వయసుకలవాఁడై యుండును. ఏమనిన వెలనాటిపృథ్వీశ్వరుని, ఈతిక్కరాజు తన శైశవముననే చంపియుండె ననియు, నది శా. శ. ౧౧౨౦కు తరువాతనై యుండుననియుఁ బైన వ్రాసియుంటిని. అప్పటికి తిక్కరాజునకు బదునెనిమిది సంవత్సరములవయసుండెనని తలంచితిమేని, ఆతనిజననము శా. శ. ౧౧౧౦ ప్రాంతమయి యుండును. అట్లయినచో చాళుక్య నాలవసోమేశుని రాజ్యాంతకాలమునకుఁ దిక్కరాజు పదిసంవత్సరముల వయసు కలవాఁడై యుండును. కావున నీతఁ డాసోమేశునిదోర్గర్వమును రూపుమాపుటకుఁ దగినవాఁడై యుండఁడు. ఇంతేకాదు. చాళుక్య నాలవసోమేశ్వరునికాలములో, చోళరాజ్యమును బరిపాలించుచున్న వాఁడు మూఁడవకులోత్తుంగచోళుఁడు. ఇతఁడు మిగులపరాక్రమశాలి. చోళదేశమే కాకుండ, ఆంధ్రదేశము కూఁడ నీతనియేలుబడిక్రింద నుండెను. అట్టివాని నీనాలవసోమేశుఁడు చోళసింహాసనమునుండి తఱిమివేయుట తటస్థింపదు. కావున పైపద్యమునఁ జెప్పఁబడిన —

శ్వరుఁడే నాలవసోమేశుఁడు కాఁ దగుట నిశ్చయము.

హొయ్సలులను నొకతెగవారు, ప్రస్తుతము సేలము, కోయంబుత్తూరు మండలములని పిలువఁబడుచున్న ప్రదేశమును మైసూరు రాష్ట్రములోని కొంతప్రదేశమును కొంతకాలము పరిపాలించుచు వచ్చిరి. వీరి పరిపాలనకు లోఁబడిన ప్రదేశములో విశేషభాగమున కర్ణాటభాషయే యుండుటచే వీరు కర్ణాటాధీశ్వరులనియు పిలువఁబడుచుండిరి. ఈహొయ్సలులు యాదవరాజుల సంతతి వారనియు వీరి వంశకర్త హొయ్సల నామధేయుఁడగుటచే, నాతని వంశీయులు హొయ్సలులైరనియు చరిత్రకారు లనుచున్నారు. వీరి వంశవృక్షము క్రింద నిచ్చుచున్నాఁడను. వీరి రాజధాని నగరము ద్వారసముద్రము.



వీరి పరిపాలనాకాలమును నిర్ణయించు శాసనములు కలవు కాని గ్రంథవిస్తరభీతిచే నిందుదాహరింపలేదు. ఇందు జూపఁబడిన సోమేశ్వరుఁడు కర్ణాటదేశమును శా. శ. ౧౧౫౬ మొదలు ౧౧౮౫ వఱకును పాలించినట్లు శాసనాధారములవలనఁ గన్పించుచున్నది. బెంగుళూరు, సిర్గుండశాసనములు (A. R. 366 of 1919) (చోళరాజుల పట్టికను నెల్లూరు చోడుని చారిత్రమున నిచ్చియున్నాఁడను.) ఈకాలములో చోళరాజ్యమునుఁ బరిపాలించుచున్నవాఁడు మూఁడవరాజేంద్ర చోళుఁడు. ఇతఁడు బలహీనుఁడై రాజ్యసంరక్షణము నందసమర్థుఁడై యుండెననియు, నీసమయమున నీవీరసోమేశ్వరుఁడు బలవంతుఁడై యాతనిని జయించి చోళ సింహాసనము నాక్రమింపగా, మనతిక్కరాజు వీరసోమేశ్వరు నెదుర్కొని పోరాడి చోళసింహాసనమున మూఁడవ రాజేంద్రుని నిలిపెననియుఁ జరిత్రకారులు తలంచుచున్నారు. ఇది సత్యమనుటకు సంశయింపనక్కరలేదు. ఈమూఁడవ రాజేంద్రచోళుఁడు శా. శ. ౧౧౬౮ మొదలు ౧౧౮౯ వఱకును చోళసింహాసనము నందున్నవాఁడు. కావున తిక్కరాజు శా. శ. ౧౧౬౮ సంవత్సరమునకుఁ బిమ్మట నవఁగా శా. శ. ౧౧౭౦ ప్రాంతమున సోమేశ్వరుని జయించి యుండవచ్చునని తలంపవలసియున్నది. ఈసోమేశ్వరునిచే జయింపఁబడినవాఁడు మూఁడవ రాజేంద్రచోళుఁడు గాక మూఁడవ రాజరాజని తలంచితిమేని యాతని పరిపాలనాకాలము శా. శ. ౧౧౩౮ మొదలు ౧౧౭౦ వఱకునునై యున్నది. కావున తిక్కరాజు సోమేశ్వరుని జయించినది శా.శ. ౧౧౬౦ ప్రాంతమై యుండును. ఇదయే సత్యమని నాయభిప్రాయము.

ఈతిక్కరాజును వర్ణించుచుఁ దిక్కన వ్రాసిన మూఁడవ పద్యమిది.

సీ. లకుమయ గురుములూరికి నెత్తివచ్చినఁ
గొనఁడె యాహవమున ఘోటకముల
దర్పదుర్జయు లగుదాయాదనృపతుల
ననిలోనఁ బఱవఁడే యాగ్రహమున

శ్వరుఁడే నాలవసోమేశుఁడు కాఁ దగుట నిశ్చయము.

హొయ్సలులను నొకతెగవారు, ప్రస్తుతము బేలము, కోయంబుత్తూరు మండలములని పిలువఁబడుచున్న ప్రదేశమును మైసూరు రాష్ట్రములోని కొంతప్రదేశమును కొంతకాలము పరిపాలించుచు వచ్చిరి. వీరి పరిపాలనకు లోఁబడిన ప్రదేశములో విశేషభాగమున కర్ణాటభాషయే యుండుటచే వీరు కర్ణాటాధీశ్వరులనియు పిలువఁబడు చుండిరి. ఈహొయ్సలులు యాదవరాజుల సంతతి వారనియు వీరి వంశకర్త హొయ్సల నామధేయుఁడగుటచే, నాతని వంశీయులు హొయ్సలులైరనియు చరిత్రకారు లనుచున్నారు. వీరి వంశవృక్షము క్రింద నిచ్చుచున్నాఁడను. వీరి రాజధానీ నగరము ద్వారసముద్రము.



వీరి పరిపాలనాకాలమును నిర్ణయించు శాసనములు గలవు కాని గ్రంథవిస్తరభీతిచే నిందుదాహరింపలేదు. ఇందు చూపఁబడిన సోమేశ్వరుఁడు కర్ణాటదేశమును శా. శ. ౧౧౫౬ మొదలు ౧౧౭౮ వఱకును పాలించినట్లు శాసనాధారములవలనఁ గన్పించుచున్నది. బెంగుళూరు, సిర్గుండశాసనములు (A. R. 366 of 1919) (చోళరాజుల పట్టిక నన్నెచోడుని చారిత్రమున నిచ్చియున్నాఁడను.) ఈకాలములో చోళరాజ్యమునుఁ బరిపాలించుచున్నవాఁడు మూఁడవరాజేంద్ర చోళుఁడు. ఇతఁడు బలహీనుఁడై రాజ్యసంరక్షణము నందసమర్థుఁడై యుండెననియు, నీసమయమున నీవీరసోమేశ్వరుఁడు బలవంతుఁడై యాతనిని జయించి చోళ సింహాసనము నాక్రమింపగా, మనతిక్కరాజు వీరసోమేశ్వరు నెదుర్కొని పోరాడి చోళసింహాసనమున మూఁడవ రాజేంద్రుని నిలిపెననియుఁ జరిత్రకారులు తలంచుచున్నారు. ఇది సత్యమనుటకు సంశయింపనక్కఱలేదు. ఈమూఁడవ రాజేంద్రచోళుఁడు శా. శ. ౧౧౬౮ మొదలు ౧౧౮౯ వఱకును చోళసింహాసనము నందున్నవాఁడు. కావున తిక్కరాజు శా. శ. ౧౧౬౮ సంవత్సరమునకుఁ బిమ్మట ననఁగా శా. శ. ౧౧౭౦ ప్రాంతమున సోమేశ్వరుని జయించి యుండవచ్చునని తలంపవలసియున్నది. ఈసోమేశ్వరునిచే జయింపఁబడినవాఁడు మూఁడవ రాజేంద్రచోళుఁడు గాక మూఁడవ రాజరాజని తలంచితిమేని యాతని పరిపాలనాకాలము శా. శ. ౧౧౩౮ మొదలు ౧౧౭౦ వఱకునునై యున్నది. కావున తిక్కరాజు సోమేశ్వరుని జయించినది శా.శ. ౧౧౬౦ ప్రాంతమై యుండును. ఇదయే సత్యమని నాయభిప్రాయము.

ఈతిక్కరాజును వర్ణించుచుఁ దిక్కన వ్రాసిన మూఁడవ పద్యమిది.

సీ. లకుమయ గురుములూరికి నెత్తివచ్చినఁ
    గొనఁడె యాహవమున ఘోటకముల
దర్పదుర్జయు లగుదాయాదనృపతుల
    ననిలోనఁ బఱవఁడే యాగ్రహమున

శంభురాజాది ప్రశస్తారిమండలి
క్రమముఁ జెర్చి యేలఁజేసె కంచిపురము
జేదిమండలమ్ముఁ గొనిగఁ జేసి కాడవ
పతి నియ్యకొలుపఁడే పలచమునకు
రాయగండగోపాలు నరాతిభయద
రాయపెండార బిరుదాభిరాము నభయ
రామగండాంకు

ఈపద్యమందలి దాయాది నృపతులీతని పినతండ్రులైన కల్లసిద్ధి, తమ్ముసిద్ధులో లేక వారి కుమారులో నైయుందురు.

తిక్కరాజు జయించిన కాడవపతి యెవరు?

పై సీసపద్యములోని నాల్గవ పాదమునఁ జెప్పిన కాడవపతి యెవ్వరో తెలిసికొనవలసియున్నది. ఉత్తరార్కాడు, దక్షిణార్కాడు మండలములలోని కొంతప్రదేశమునకా కాలమునఁ జేది దేశమని పేరు. ఇది యాకాలమునఁ బల్లవరాజుల పాలనములో నుండెడిది. పల్లవుల లోని యొక శాఖకు "కాడవు" లని పేరు. పల్లవరాజగు హిరణ్య వర్మ కాడవ కులమునకుఁ జెందినవాఁడని యొక శాసనమునఁ గలదు. (ద. హిం. శా. సం. ౨ సంఖ్య ౧౩౫.)

అప్పటినుండియు, నీ చేదిదేశమునుఁ బాలించుచున్నరాజులకు కాడవశబ్ద ముపయోగింపఁబడుచున్నది. మనతిక్కరాజుకాలములో నీ చేదిదేశమునుఁ బరిపాలించిన కాడవరాజు లిరువురు. వీరిరువురును తండ్రి కుమారులు. ఇరువురును "కొప్పెరున్‌జింగు" అనునామముతో పిలువఁ బడిరి. కొప్పెరున్‌జింగు అనఁగా మహారాజసింహ యనియర్థము. మొదటి కొప్పెరున్‌జింగదేవుఁడు, శా. శ. ౧౧౭౨ మొదలు ౧౧౬౫ వఱకును, రెండవకొప్పెరున్‌జింగు శా. శ. ౧౧౬౫ మొదలు ౧౨౦౧ వఱకును రాజ్యము చేసినట్లు కనుపట్టుచున్నది. చెంగల్పట్టు మండలము లోనిచెంగల్పట్టుతాలూకా యందలి అత్తూరు గ్రామమున ముక్తేశ్వ

కాలయమునియొక్క గోడపైఁ గల యొక శాసనము (ద. హిం. శా. సం.౧౩ సంఖ్య౧౩౦) నందీ మొదటి కొప్పెరుఞ్జింగని బిరుదము లిట్లున్నవి. "పల్లవకులపారిజాత - కాడవకులచూడామణి - అవనిపాలన జాత - గండపెండారలుంటాక - శ్రీరాపగాదక్షిణనాయక - కావేరీ కాముక - పెన్నానదీనాథఖడ్గమల్ల - భారతీమల్ల - మల్లాపురీవల్లభ - కాంచీపురకాంత - ఇత్యాది - ఈబిరుదావళిలోని 'గండపెండార లుంటాక' అను బిరుదముపలన నీతఁడు గండపెండార బిరుదమునుఁ గలవాని జయించి గండపెండారమునుఁ దోచుకొనినవాఁడని తెలియుచున్నది.

చోడతిక్కరాజును "రాయగండగోపాలు నరాతిభయదరాయ పెండార బిరుదాభిరాము నుభయరాయగండాంకు" అని పైనఁజూపిన సీసపద్యములోఁ దిక్కనసోమయాజి వర్ణించియున్నాఁడు. ఈ శాసనము నందు తిక్కరాజును కొప్పెరుఞ్జింగడు జయించినట్లున్నను, నింతకు పూర్వము ననో పరమందో తిక్కరా జాతనినిజయించి తన కాతఁడు కప్పముసంగుట కంగీకరింపఁజేసియుండును. ఈశాసనము శక. సం. ౧౧౭౦ సంవత్సరమునాటిది. తిక్కనసోమయాజి వ్రాసినకాడవపతి యీతఁడే యైయుండును. కాదేని యీతనికుమారుఁడైయుండును. కుమారుఁడే యైనచో కాడవపతినిజయించినకాలము శాలి. శకము ౧౧౬౫నకుఁ బిమ్మటను౧౧౭౮కు పూర్వమునయి యుండును. ఈకొప్పె రుఞ్జింగను పేరున గలశాసనములు చాలఁ గలవు. వాని నన్నిటిని సమన్వయింప వలసియున్నది.

తిక్కరాజు జయించిన యితరరాజులు:

గురుమలూరియొద్ద లకుమయను తిక్కరాజు జయించినట్లు పై పద్యములో నున్నది. ఈలకుమయ యెవ్వఁడో తెలియదు. లక్ష్మణ దండనాయకుఁడను నొకఁడున్నాఁడు. కానియాతఁడీతని కాలము వాఁడు కాఁడు. శంభువరాయవంశీయు లాకాలమునఁ గంచిలో రాజ్యము చేయుచుండిరి. వీరు తెలుఁగు పల్లవరాజులకు సామంతు లయినట్లుకన్పట్టు చున్నది. తిక్కరాజు కాలమున శామరాయ శరభురాయులు రాజ్యము

సేయుచుండెనని చరిత్రకారులు వ్రాసియున్నారు. బహుశః తిక్కరాజు జయించిన దీతనినే యైయుండును. ఈవిషయమునం దింకనుం బరిశోధన మావశ్యకము.

తిక్కరాజు శాసనములు:

చోడ తిక్కరాజు శాసనము లనేకములు చెంగల్పట్టు మండలములోను, నెల్లూరు మండలములోను గానంబడుచున్న వనియు రాపూరు కందుకూరు తాలూకాలలోం బెక్కులు గలవనియు నితఁడు శాసనములలో చోడతిక్కనృపతి యనియు, తిరుకాళత్తి, దేవచోడ మహారాజనియు, భుజబలవీరతిరుకాళదేవచోడ మహారాజనియు, వ్యవహరింపం బడుచు వచ్చెనసియుం జరిత్రకారులు వ్రాసియుండిరి. మనుమసిద్ధి మహారాజు వ్రాయించిన కోలూరు శాసనములో తనతండ్రి తిరుకాళత్తిదేవ మహారాజని యుదాహరించి యుండుటచే, నీచోడ తిక్కరాజునకు తిరుకాళత్తి దేవుఁడని పేరున్నమాట నిశ్చయము. నెల్లూరు శాసనములలోం దిరుకాళత్తి దేవుఁడనియు, నల్లుతిరుకాళత్తి దేవుఁడనియు నిరువురు కనంబడుచున్నారు. అల్లుతిరుకాళత్తి దేవుఁడు పల్లవుఁడనియు, నాతనికిని, చోడతిరుకాళత్తి దేవునకు నేమియు సంబంధము లేదనియు, శ్రీచిలుకూరి వీరభద్రరావుగా రాంధ్రుల చరిత్రమున వ్రాసియున్నారు. అల్లుతిరుకాళత్తిదేవుని యొక శాసనములో (నె. శా. సం) నీతఁడు తన మామయైన తిరుకాళత్తి దేవునకుం బుణ్యమునకు గాను ధర్మమిచ్చినట్లు చెప్పఁబడియున్నది. ఈమామ తిరుకాళత్తిదేవుఁడు చోడతిక్కరాజగునో లేక యాతఁడు మఱియొక తిరుకాళత్తి దేవుఁడో తెలిసికొనవలసియున్నది.

నెల్లూరుశాసనములనుం బరికించిచూచినచో తిరుకాళత్తిదేవ మహారాజులు పలువురు న్నారని స్పష్టమగును. ఒకనిపేరు భుజబల చోడతిరుకాళత్తిదేవచోడమహారాజు. ఇతనిప్రశస్తి "స్వస్తిచరణ సరోరుహ విహితవిలోచన త్రిలోచనప్రముఖాఖిలపృథ్వీశ్వర కారిత కావేరీతీర కరికాలకులరత్నప్రదీపక అపరిమితప్రతాప సతతమభ్యర్చిత లక్ష్మీశ్వర ఒరయూరిపురవరాధీశ్వర కాంచీపురవరాధీశ శ్రీమన్మహా

మండలేశ్వర భుజబలచోళతిరుకాళ్తి దేవమహారాజు" అని యున్నది. ఇతనిశాసనములలో కులోత్తుంగ చోడాది చోడచక్రవర్తులనామము లుదాహరింపఁబడలేదు. ఇతనిశాసనములు నెల్లూరుమండలము లోని ఉదయగిరితాలూకాలోనున్నవి (నె. శా. సంపుటము ౧౩౮౬-౧౪౯౦) ఇవి వరుసగా శా. శ. ౧౧౬౮-౧౧౭౭ సంవత్సరములలోనివి. ఇతఁడు గాక రాపూరుతాలూకాలో (పుట౧౪౬౮) భుజబలవీరతిక్కకాలతి దేవచోడమహారాజు శాసన మొకటి శా. శ. ౧౧౩౩లో నున్నది. ఇతనిప్రశస్తి పైనవ్రాసిన ప్రశస్తియేగాకుండ దానికితోడుగా "కామినీ జనజయంత తురగరేవంత, వితరణవినోదవిక్రమాదిత్య తెంజనాదిత్య రిపువిపులమార్తాండ జగనొబ్బగండ గర్వితారాతికుమారకులకుధరకు విశధర శరణాగత వజ్రపంజరకీర్తినారాయణేత్యాది" బిరుదములు కూడ నున్నవి. కావున నీతఁడు పైనఁజెప్పిన భుజబలచోళ తిరుకాళ్తిదేవుని కంటెఁ బూర్వుఁడును నామములో విరళత్వముండుటచే భిన్నవ్యక్తి యునై యున్నట్లు కన్పట్టుచున్నది. ఇట్లే అల్లుతిరుకాళత్తి దేవులలో కూడ నిరువురు కనఁబడుచున్నారు. ఒకఁడు అల్లుంతిక్క మహారాజు. ఇతని శాసనములు శా. శ. ౧౧౦౮ లో నెల్లూరు, సూళ్ళూరుపేట గూడూరు, తాలూకాలలో నున్నవి. (పుట ౭౭౫-౯౩౨. ౭౭౬-౧౩౦౭). రెండవవాఁడు అల్లుతిరుకాళత్తిదేవ చోడమహారాజు. ఇతని శాసనములు, ఆత్మకూరు, రాపూరు, కావలి తాలూకాలలో శా. శ. ౧౧౬౬-౧౧౭౬ సంవత్సరములలో (పుటలు ౨౦౭-౧౨౩౨, ౭౧౯) నున్నవి. ఇందు ౨౦౭వ పుటలోని శాసనములో తమ మామ తిరుకాళత్తి దేవునకు పుణ్యముగ కని యున్నది. ఇతఁడు పైన మొదట చెప్పిన భుజబలచోడ తిరుకాళత్తిచోడ మహారాజున కల్లుఁడై యుండు నని తోఁచుచున్నది. పైనఁజెప్పిన తిరుకాళత్తి దేవులలో నెవ్వఁడును మనచోడతిక్కరాజు కాఁడు.

వీరుగాక చోడతిక్కరాజు అని చెప్పఁదగినవాఁ డింకొకఁడు కలఁడు. ఇతనిపేరు శాసనములలో మధురాంతకపొత్తపిచోళుఁ డనియు గండగోపాలుఁడనియు బిరుదులు గలిగి తిరుకాలత్తిదేవచోడ మహా రాజనియు, మహామండలేశ్వర తిరుకాలత్తిదేవచోడమహారాజు అనియు

జెప్పఁబడినది. ఇతని శాసనము లు నెల్లూరు మండలములో రాపూరు, కందుకూరు, కావలి, నెల్లూరు, గూడూరు తాలూకాలలో నున్నవి. (నె. శా. సం. పుటలు ౧౨౯౦, ౧౨౧౬, ౪౮౧, ౭౮౮, ౮౩౧, ౬౬౮, ౧౨౯౨). ఇవి శా. శ. ౧౧౪౩, ౧౧౫౬, ౧౧౩౨, ౧౧౪౨ సంవత్సరములలో నున్నవి. కొన్నిటిలో శకకాల మీయలేదు. కొన్నిఁటిలో కులోత్తుంగచోళుని యొక్కయు గొన్నిటిలో రాజరాజదేవుని యొక్కయు రాజ్యసంవత్సరము లీయఁబడినవి. మూఁడవ కులోత్తుంగుఁడు శా. శ ౧౧౦౦ మొదలు ౧౧౩౮ వఱకును నాతని తరువాత మూఁడవ రాజరాజదేవుఁడు శా. శ. ౧౧౩౮ మొదలు ౧౧౭౦ వఱకును చోళరాజ్యమునుఁ బరిపాలించియుండిరి. మనచోడ తిక్కరాజు వారికి సామంతుఁడై యున్నవాఁడు. కనుకనే హొయిసలవంశీయుఁడగు సోమేశ్వరుఁడు చోళరాజును సింహాసన భ్రష్టుని చేసినప్పుడీ తిక్కరాజాతనిని జయించి మరల చోళరాజును సింహాసనముపై నిలిపి చోళసింహాసనాచార్య బిరుదమును గైకొనియుండెను. ఈచోడతిక్కరాజు శా. శ. ౧౧౧౦ ప్రాంతమున జన్మించి ౧౧౭౮ ప్రాంతమున వెలనాటి పృథ్వీశ్వరుని జంపి, శా. శ. ౧౧౭౪-౧౧౭౯ నడుమ చనిపోయి యుండును. పైనచూపిన శాసనము లన్నియు నీమధ్యకాలములో నున్నవి. కావున నీశాసనములలోఁ జెప్పినవాఁడే మన చోడతిక్కరాజనుటకు సందియములేదు. ఈశాసనములలోఁ గొన్నిఁటిని బట్టి, యీతఁడు వైష్ణవ భక్తుఁడని తెలియుచున్నది. అయినను నితఁడు పరఁమత ద్వేషము కలవాఁడు కాఁడు.

తిక్కరాజుమంత్రులు :

ఈతిక్కరాజునొద్ద తిక్కనసోమయాజికిఁ బెదతండ్రి యైనసిద్ధన మంత్రిగా నున్నట్లు కేతనకవి దశకుమారచరిత్రమున నీక్రిందిపద్యములో జెప్పియున్నాఁడు.

ఉ. స్థాపితసూర్యవంశ వసుధాపతి నాఁ బరతత్త్వధూతవా
ణీపతి నా నుదాత్తనృపనీతి బృహస్పతి నా గృహస్థ గౌ
రీపతి నాఁ గృపారసనిధిస్మృతి నాఁ బొగడొందె సిద్ధసే
నాపతి ప్రోడ తిక్కజననాథశిఖామణి కార్యమంత్రి రాగౌ

ఇతఁడా ప్రభువునకు మంత్రియే కాకుండ, సేనాపతిగా కూడ నున్నాఁడని పై పద్యములో నున్నది. తిక్కరాజునొద్ద సిద్ధయామాత్యుఁడే కాక యాతని కుమారుఁడైన తిక్కనకూడ మంత్రిగా నున్నట్లీక్రింది శాసనమువలనఁ దెలియుచున్నది. (నెల్లూరు శాసనములు ౧౩౬౮ పుట) ఈ శాసనములో నన్వయము సరిగా కుదురుట లేదు. కాని ముఖ్యవిషయములు స్పష్టముగానే యున్నవి.

"స్వస్తి సమస్తప్రశస్తిసహిత శ్రీమన్మహామండలేశ్వర (ప్రసాహిత?) తిక్కయదేవమహారాజులు సమస్తప్రశస్తిసహిత శ్రీమన్మహాప్రధానులైన సిద్దనప్రెగడ తిక్కయనాథ రిప్రెగడయుం దమతాండినంతోడు నింతవట్టునుం గూడియు వఱూన్నతప్రముఖులై యశవర్గంబుతో వదొల గట్టువం దిష్టకథవినోదంములంనున్న యవసరంబున ధర్మాధర్మం విచారించి తమతండ్రి తిరుకాళేశ్వర శ్రీమహాదేవరకు నంగభోగరంగభోగములకు స్వస్తి శ్రీ సకనరుషంబులు ౧౧౭౮ నేండు శ్రీవీరరాజేంద్ర చోడచక్రవర్తి ౯ శ్రా హి. పరీధావిసంవచ్చర ఫాల్గుబహుళ ౧౫ వడవారము నాంటిసూర్యగ్రహణమునాండు తిరుకాళేశ్వరదేవర దివ్యశ్రీపాదపద్మారాధకులైన త్రిపురాంతక దేవునికిన్ని అతనితమ్ముండు గేదారదేవనికిం చిలుకపాటికంపనలములో జోగడపాడ నున్నది. ఆచంద్రార్కముగా ధారాపూర్వము సేసి ఇచ్చినవాండు. దీనిం నెవ్వండు లేదన్నవానినోర లోంక ప్రువ్వులు దొలు దీనికి విక్రిశంచేస్తే వారు గంగ్గకఱుతం గపిలం పాడిచివారు తమపెదకొడుక్క కపాలానం స్వనరమాంసబతిణంబు సేసినవారు. స్వదత్తంపరదత్తం వ్వాయోహరేతి వసుంధరా షష్టివర్యసహస్రాణి విష్టాయాం జాయతే క్రిమి."

ఈ శాసనమునుబట్టి తిక్కరాయుడు క్రి. శ. ౧౨౫౬వ సంవత్సరమువఱకు జీవించియున్నాఁడనుట స్పష్టము. ఇతఁడు శా. శ. ౧౧౧౦ (అనఁగా క్రి. శ. ౧౧౮౮) ప్రాంతమున జన్మించియుండునని వ్రాసియుంటిమి. అది సత్యమయినచో నీశాసనకాలమునాటి కాతనికి ౬౮ సంవత్సరము లుండును. ఈతనికుమారుఁడైన మనుమసిద్ధి శాసనము శా. శ. ౧౧౭౯లో కనఁబడుచున్నది. శా. శ. ౧౧౭౮-౧౧౭౯ నడుమఁ దిక్కరాజు గాలధర్మము నొందియుండును.

### కృతిపతిమనుమసిద్ధి :

మనతిక్కనసోమయాజికిఁ బ్రభువును నిర్వచనోత్తరరామాయణ కృతిపతియు నగుమనుమసిద్ధి యీతిక్కరాజుకుమారుఁడే. ఇతనిగుణగణములను దిక్కనసోమయాజి పెక్కుపద్యములలో వర్ణించియున్నాఁడు. అందలి రెండుపద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

సీ. కొండలు నఱకు నాఖండలుకైవడి
యెనయు నేనుంగులఁ దునుమునపుడు
బెబ్బులి వడి వేళ్ళపింపు హత్తినయొప్పు
గలుగు రాహుత్తులఁ గడఁగునప్పు
డనుపులఁ గార్చిచ్చు లసరుచందము గాన
నగుఁ గాలుబలమున గలుగునపుడు
బలుగాలి మొగుళ్లపై వీచు క్రియఁ దోఁచుఁ
దఱి చైనగొడుగులు నఱకునపుడు
తే. కసిమసంగిన మృత్యువుకరణి యంత
కాలరుద్రుని కైవడి కాలదండ
ధరునిబలువిడి యలవడుదురములోన
నసమశౌర్యుఁడు మనుమధరాధిపునకు.

సీ. అనుపమబహురత్న హయవారణముల వి
ద్విషులు గప్పములు పుత్తెంచుచోట
నెల్లి కయ్యం బని యెద్దియేనియు నొక్క
కెలన శాత్రవదూత పలుకుచోటఁ
దలతల మని రెండుదడములవా రేటు
నకమానముగఁ జేరవడచుచోటఁ
బరసేన వచ్చియుం బాఱియుం బయ లైన
యనిలోన జయము సేకొనెడుచోట
ఆ. నొక్కరూప కాని యొక్కుడు డిగ్గును
గానరాదు ముఖవికాసమునకు
నన్యరాజు లీడె యరిరాయవేశ్యాభు
జంగుఁ డైన మనుమజనవిభునకు.

ఈపద్యములవలన నీమనుమసిద్ధి తండ్రివలెనే గొప్పపరాక్రమ వంతుఁడనియు శౌర్యధైర్యములుగలవాఁడనియుఁ దెలియుచున్నది. తండ్రివలె నీతఁడు విశేష దేశమును గలిగియుండకపోయినను, గణపతి దేవుని సాహాయ్యముతో నెల్లూరుమండలమున నొకప్రసిద్ధిగల మహారాజై యున్నాఁడనుటకు సంశయము లేదు.

మనుమసిద్ధి రాజ్యభ్రష్టుఁడగుట: తిక్కనరాజ్యమును తిరిగి సంపాదించుట:

ఈమనుమసిద్ధిని నతని దాయాదులైన అక్కన, బయ్యనలనువారు పదభ్రష్టునిఁ జేసి రాజ్యము నపహరించిరనియు, వారిని జయించుటకు సాధ్యము గాకపోఁగాఁ దిక్కనసోమయాజి కాకతీయ గణపతి దేవునొద్దకు, ఓరుగల్లునకుఁ బోయి యాతని సాహాయ్యమునుఁ గోరి తీసికొనివచ్చి మనుమసిద్ధికి రాజ్యమిప్పించెననియు నొక కథ కలదు. ఈ కథను గ్రంథస్థము చేసినవారు కాసె సర్వప్పయును, కూచిమంచి జగ్గకవియును. సర్వప్ప ౧౨౦౦ సంవత్సరప్రాంతము వాఁడు. జగ్గకవి ౧౭౩౦ సంవత్సర ప్రాంతమువాఁడు. సర్వప్ప తన సిద్ధేశ్వర చరిత్ర మను ద్విపదకావ్యమున నిట్లు చెప్పియున్నాఁడు.

(౧)సిద్ధేశ్వర చరిత్రమునందలి కథ :

సారెసారెకుఁ గేరి సన్నుతుల్ చేయు
సారపారావార సరసగంభీర
సారుఁడై కీర్తివిస్తారుఁడై యలరు
నారీతి గణపతి నటు చూచువేడ్కఁ
దిక్కనసోమయాజక్కడ కొకట.

\+ \+ \+

దిక్కుదిక్కులనుండి తెరలి విద్యార్థు
లక్కడక్కడను గావ్యముల శ్లోకార్థ
మొక్కొక్క విధమున నొగి వినిపింప
జక్కన వినుచును నొక్కయందలము
నెక్కి తిక్కనసోముఁ డక్క డేతెంచె

నాకీతిగా సోమయాజులరాక
వారక చని ఫణిహారులు దెల్ప

+ + +

అట్టిమహాత్ముని నాసోమయాజి
నెట్టన నెదు రేఁగి నేర్పుతో రాజు
తెచ్చి యుర్వ్యాసనస్థితునిగాఁ జేసి
మెచ్చి తాంబూలాదు లెచ్చుగా నిచ్చి

+ + +

అగుభారతాఖ్యాన మాకీరవరుఁబు
తగఁ జేసినట్టి యున్నత ప్రకారములు
వినియు సంతోషించెఁ గవినట్లు చెప్ప

+ + +

అంతఁ దిక్కనసోమయాజికి మెచ్చి
వింతవస్త్రంబులు వివిధభూషణము
లత్యంతభక్తితో నప్పు డిచ్చుచును
సత్యసంధుఁడును సభ్యావర్తనుఁడు
నగు సోమయాజి తానారాజు కనియెఁ
దగుమాట విను మొక్కధర్మకార్యంబు
సూర్యవంశంబున సొబగొందునట్టి
యార్యపూజితపద్యుఁ డామనుమసిద్ధి
రాజు దా నెల్లూరు రమణతో నేల

+ + +

అక్కనబయ్యన లధికబలిష్ఠు
లక్కట సిద్ధిరాయునిఁ బాఱఁదోలి
దక్కినరాజ్యంబు తామె యేలుచును
నొక్కకా సైనను జక్కఁగ నీరు
వారలదండించి వారి నెల్లూరు
వారి కిప్పింపు మవారణఁ బ్రీతి
ననిన గణపతిరా జటుకాక నుచు

వెడలి గణపతియు విజయంబునకును
గుడియెడమల సేన గొలిచి యేతేర
వెలనాఁడు చేరియు వీఁడెల్లఁ గాల్చి
వెలనాఁటిరాజును వెస గెల్చి వాని
యప్పనంబులు గొని యటఁ జని రాజు
గుప్పున నెల్లూరు కూడ నేతెంచి
యక్కనబయ్యన నచట సాధించి

\+ + +

నెల్లూరిప్రజలకు నేర్పు వాటిల్లఁ
జెల్లించె మన్మసిద్ధిరాజునకు
నెల్లూరు పట్టంబు నేర్పుతోఁ గట్టి
నల్లితాదృతి సమదుర్గములను
నఱువదెనిమిదియు నగపట్టణముల
నరుదొంద సాధించి యామన్మసిద్ధి
రాజు కిచ్చియు. దన తేజంబు దిశలఁ
బూజ లెక్కఁగ ఘన రాజితయశుఁడు
ఘనతటాకంబుఁ దాఁ గట్టించె నచటఁ
గొనకొని నెల్లూరఁ గొన్నిలలుండి
మనుమసిద్ధికి రాజ్యమహిమలు దెల్పె.

(౨) సోమదేవరాజీయ కథ :

కూచిమంచిజగ్గకవి తన సోమదేవరాజీయమునం దిట్లు చెప్పి యున్నాఁడు.

గీ. చేయఁ దక్కువ యైన దేవాయతనము
లపుడు పూర్తిగఁ గట్టించి యలరుచున్న
చోట నొకనాఁడు తిక్కనసోమయాజి
వచ్చె నెల్లూరినుండి భూవరునికడకు.

సీ. వచ్చిన యాయార్యవర్యు నెదుర్కొని
వినయసంభ్రమభక్తి వినుమడింప
నతిథిపూజ లొనర్చి యతనిచే భారతా
ర్థమును ద్వైతాద్వైత తత్త్వములును
విస్మృత చిదచిద్వివేక లక్షణములుఁ
బ్రకటధర్మాధర్మ పద్ధతులును
రాజనీతి ప్రకారంబును భారత
వీరుల మహిమంబు వినుచునుండి
యనుమకొండ నివాసులైనట్టి బౌద్ధ
జనుల రావించి వారిఁ దిక్కనమనీషి
తోడ వాదింపఁ జేసినఁ దొడరి వారిఁ
జులకఁగా సోమయాజులు గెలుచుటయును.

వ. అప్పుడు బౌద్ధదేవాలయంబులు నూలం ద్రోయించి గణపతిదేవ రాజు సోమయాజుల పటువాక్యశక్తికి మెచ్చి యతనిని బహుప్రకారంబులఁ బూజించి యెనిమిది గ్రామంబు లొసంగి యతఁడు వచ్చిన కార్యం బడిగిన నాభూవరునకుఁ గవివరుం డిట్లనియె

గీ. ఇనకులోద్భవుఁ డైనట్టి మనుమసిద్ధి
రాజు నెల్లూరు పాలించుచోఁ జెలంగి
యతని దాయాదు లతని నుక్కడఁగఁ బట్టి
యునిచి రాజ్యంబుఁ దమ రేలుచున్నవారు.

క. కావున మీరిపు డచటికి
వేవేగం దరలి వచ్చి విడకుండఁగ నా
భూవరుఁ బునరభిషిక్తునిఁ
గావింపఁగవలయు ననిన గణపతి విభుఁడున్.

గీ. అట్లకాక యనుచు నాపని కొడఁబడి
యత్యుదారగుణసమగ్రుఁ డగుచుఁ
దవిలి యప్పు తిక్కనకు లక్షధనమును
యజ్ఞకుండలములు నతని కిచ్చె

క. వసుచు నెడఁ దిక్కనమఖి యా
జనవరుసింహాసనమున సచివాగ్రణియై
తనరెడు శివదేవయ్యన్
గనుఁగొని యారాజుతోడఁ గడఁగం బలికెన్.

గీ. వసుమతీనాథ యీతఁడు శైవుఁడు గాని
మనుజమాత్రుండు గాఁడు పల్కులు సితని
యనుమతంబునఁ నీవు రాజ్యంబు నెమ్మ
నేలు మనిచెప్పి యాఘనుఁ డేఁగుటయును.

సీ. గణపతిదేవుఁ డాఘనునమమతిఁ గాంచి
యతిసత్వరమునఁ బ్రయాణభేరి
వేయించి చతురంగవృతనాసమేతుఁడై
తరలి ము న్వెలనాటిధరణీపతుల
గెలిచి వారలచేత నిలనప్పనముఁగొని
వారినందఱఁ దనవశము చేసి
కొని చని నెల్లూరుఁ గొబ్బునఁ జొచ్చి య
క్కనయు బయ్యనయు నన్ఖలులఁ దఱిమి
మనుమసిద్ధిరాజుఁ బునరభిషిక్తుఁగా
వించి మించి రెండువేలునైదు
నూఱుగ్రామములు మనోవృత్తి కతనికి
నిచ్చి కడమఁ దాను బుచ్చుకొనియె.

తిక్కన గణపతిదేవునికడ కేఁగునప్పటికి భారతమునే కాదు. రామాయణమునైనను రచింపలేదు. భారతమును గణపతికి జదివి వినిపించినాఁడని వ్రాసిన వ్రాఁతలనుబట్టి పైగ్రంథములను విశ్వసింపరాదని కొందఱనుచున్నారు. అప్పటికి భారతరచన మారంభింపలేదనుమాట నిశ్చయమే కాని యాతని కభిమానగ్రంథమైన భారతమును సంస్కృతభాషలో నున్న దానిని జదివి వినిపించెనని తలంపవలసియున్నది. ఈయూహకు సిద్ధేశ్వరచరిత్ర సోమదేవరాజీయములలోని వాక్యములు వ్యతిరేకముగా లేవు. సంస్కృతభారతమునుఁ జదివి వినిపించి దాయాదు

లపహరించినరాజ్యమును పాండవుల కిప్పించుటకై శ్రీకృష్ణుఁడు తోడు పడినట్లే మనుమసిద్ధికిఁ దోహదముగ సోమయాజి గణపతిదేవునిఁ గోరియుండును.

### గణపతిదేవుడు మనుమసిద్ధికి సాహాయ్యము సేయుట:

తిక్కనసోమయాజి గణపతిదేవునియొద్దకు వెళ్లియుండె నను సంగతి సంశయాస్పద మని శ్రీవీరభద్రరావుగా రాంధ్రులచరిత్రమున వ్రాసియున్నారు. కాని యది సంశయింపఁదగిన విషయము కా దని నాయభిప్రాయము. చోడతిక్కరాజునకు దాయాదులు శత్రువులుగా నున్నా రని తిక్కన నిర్వచనోత్తర రామాయణమునఁ జెప్పిన "దర్ప దుర్జయులగు దాయాదనృపతుల ననిలోనఁ బఱపఁడే యాగ్రహమున" యనుపద్యపాదమువలన స్పష్టమగుచున్నది. తిక్కరాజు తరువాత నాదాయాదులు మనుమసిద్ధిపై దాడివెడలి పగఁదీర్చుకొనఁ బ్రయ త్నించి రని నమ్ముట కవకాశ మున్నది. నిర్వచనోత్తర రామాయణము నం దీప్రసక్తి యేమియుఁ గాన్పింపదు. అక్కనబయ్యనలనామములు పైగ్రంథములలోఁ దక్క శాసనప్రపంచములోఁ గాని వాఙ్మయప్రపంచ ములోఁ గాని యెచ్చటను గన్పడవు. నెల్లూరు మండలములోని వంగవోలుతాలూకా త్రోవగుంట యందున్నశిలాశాసనమున బయ్యన దేవమహారాజులు, చినబయ్యనదేవమహారాజుల పేర్లు గనవచ్చుచున్నవి. (నె. శా. సం. పుట ౧౧ ౩౩) ఆశాసనమునిట్లు వ్రాయుచున్నాఁడను.

"శ్రీమన్మహామండలేశ్వర బయ్యనదేవ మహారాజులు చిన బయ్యనదేవ మహారాజులు త్రోగుంట మూలస్థాన శ్రీమన్మహాదేవ రకుం బెట్టినక్షేత్రంబు ౧౦౦౦ కన్నేశ్వర శ్రీమనమహాదేవరకు న ౧౦ పది. ఎఱ్ఱగుడిపాటి శ్రీమహాదేవరకు న ౧౦ పది వెట్టిపలిగణా జాపేశ్వర శ్రీమహాదేవరకు న ౧౦ పది పడూరి వీరేశ్వర శ్రీమహాదేవరకు న ౫ కొండూరి దేవరకు న ౧౦ పది ఇచ్చెను." ఈశాసనమునఁ గాలమీయఁ బడనందున, వీరెవ్వరో ఏకాలమువారో, మనుమసిద్ధికిని వీరికిని సంబంధమున్నదో లేదో చెప్పఁజాలము. వీరికి మహామండలేశ్వర బిరుద మున్నది పైనజెప్పిన రెండు గ్రంథములనుబట్టి గణపతిదేవుఁడు, వెలనాఁ

మును, నెల్లూరును ఒక్కసారియే కాల్చి జయించినట్లు కన్పట్టుచున్నది. గణపతిదేవుని కాలమున వెలనాఁడును బాలించుచున్న ప్రభువులెవ్వరో తెలిసికొనిన యెడల, ఏసమయమున గణపతిదేవుఁడు వెలనాఁడును జయించినదియుఁ దెలియుట కవకాశము గలుగవచ్చును. గణపతిదేవుని రాజ్యపరిపాలనాకాలము శా. శ. ౧౧౨౦ మొదలు ౧౧౮౨ వఱకునై యున్నది. (క్రీ. శ. ౧౧౯౮-౧౨౬౦) వెలనాఁటి పృథ్వీశ్వరుని శాసనములు శా.శ.౧౧౨౮ కి దరువాత గన్పించుట లేదు. ఈ వెలనాఁటి పృథ్వీశ్వరుని జంపినవాఁడు చోడతిక్కరాజు. పృథ్వీశ్వరుని యనంతరమున వెలనాఁడును బరిపాలించిన రాజెవ్వఁడో తెలిసికొనవలసియున్నది. పృథ్వీశ్వరుని సంహరించిన చోడతిక్కరాజు మూఁడవ కులోత్తుంగ చోడుని ద్రావిడచోడుఁడు సామంతుఁడని పైన వ్రాసియుంటిని. కావున ద్రావిడ మూఁడవ కులోత్తుంగుఁడు పృథ్వీశ్వరుని తరువాత వెలనాటిని స్వాధీనము చేసికొని పరిపాలనము చేసెనని యూహించుట సహజము. ఈ ద్రావిడ మూఁడవ కులోత్తుంగచోడుఁడు శా. శ. ౧౧౦౦ సంవత్సరమున చోళసింహాసనము నధిష్ఠించి ౧౧౪౦ వఱకును రాజ్యము చేసినవాఁడు. ఈకాలమున వెలనాఁడీచోడుని పరిపాలనమునకు లోఁబడి యుండును. కాకతి గణపతిదేవుని శాసనములు శా. శ. ౧౧౪౦ మొదలు వెలనాటియందుఁ గన్పించుచుండుటచే నీద్రావిడ మూఁడవ కులోత్తుంగచోడుని యనంతరమున వెలనాఁడు కాకతి గణపతిదేవుని స్వాధీనములోనికి వచ్చియుండెననియుఁ జోడతిక్కరాజు శా. శ. ౧౧౭౪ వఱకు జీవించియున్నను నాతని యధికారము నెల్లూరి ప్రాంతముననే గాని వెలనాటిపైఁ జెల్లుట లేదనియుఁ దలంపవలసియున్నది.

ఈసందర్భమున ౧౯౪౫ సం. ఫిబ్రవరినెల భారతి సంచికలో శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారిచేఁ ప్రకటింపఁబడిన గణపతిదేవుని శాసనమునుగూడ నిట నుదాహరించి, యది మన్మసిద్ధి రాజ్యభ్రష్టత్వకథ కేమయిన నుపయోగించునేమో చూడవలసియున్నది. ఆశాసనమిది. దీనిని నాయకపల్లి శాసనమందురు.

"శ్రీ స్వస్తి సమస్త ప్రశస్తి సహితం...... హోమండలేశ్వరు లైన కాకతిగణపతిదేవ మహారాజులు దిగ్విజయము నేసి పరమండలములు సాధించ్చి దక్షిణ దిగుభాగమున నెల్లూరు గాల్చి తద్విరోధులైనవడిహారిబయ్యనతిక్కనల వారసినశాత్రవశిరంబులం గందుకక్రీడ వినోదము సలిపి దవిళమండలమున కులోత్తుంగరాజేంద్రచోడ నిచ్చికొని నెల్లూరిరాజుచేత ఏనుగులం గనికగ గొనివచ్చి......"

గణపతిజయించిన మూఁడవకులోత్తుంగుఁడెవరు?

ఈశాసనములోని కథయును, కాసెసర్వప్ప రచించిన సిద్దేశ్వర చరిత్రలోనికథయును, ఒకటిగానే కన్పట్టుచున్నది. కాని యీశాసనమున సిద్దేశ్వరచరిత్రమునజెప్పిన "వెలనాఁడుచేరియు వీఁడెల్లఁ గాల్చి వెలనాటిరాజును వెస గెల్చి వానియుప్పనంబులుగొని" అను వెలనాటి కథ లేదు. అయినను "పరమండలములుసాధించి" యనువాక్యములోని కథ యిమిడియున్నదని భావింపవచ్చును. ఈశాసనమునఁ జెప్పిన కులోత్తుంగరాజేంద్రచోళునికథ సిద్దేశ్వరచరిత్రమున లేదు. నెల్లూరును గాల్చినకథ రెండింటియందును కలదు. గణపతిదేవుఁడు నెల్లూరును రెండుసారులు కాల్చియుండఁడు. కావున నీశాసనమునందును సిద్దేశ్వర చరిత్రమునందును జెప్పినకథ యొకటియే యనియు, నొకకాలమున జరిగినదే యనియు, నిశ్చయింపవలసియున్నది. శాసనమునఁ జెప్పఁబడిన కులోత్తుంగరాజేంద్రచోడుఁ డెవ్వఁడో తెలిసికొనఁ గలిగితి మేని మనమసిద్ధికాలనిర్ణయమునకు కొంత సాహాయ్యమగును. ఈశాసనమునఁ గాల మీయఁబడలేదో, కాలమున్నభాగము పోయినదో తెలియదు. కాలమును దెలిసియున్నచో నిందుఁ జెప్పబడినకులోత్తుంగరాజేంద్ర చోడు డెవ్వఁడో తెలిసికొనవీలు కలిగియుండును. ఇతఁడు మూఁడవ రాజేంద్ర (ద్రావిడ) చోడుఁడని శ్రీ డాక్టరు మారేమండరామా రావుగారు వ్రాసియున్నారు. అది సరికాదనియు, నీశాసనమునం దుదాహరింపఁబడినయాతఁడు వెలనాటి చోడవంశమునకుఁ జెందిన కులోత్తుంగరాజేంద్రచోడుఁడనియు శ్రీనేలటూరి వేంకటరమణయ్యగా రనుచున్నారు. పై శాసనములో "కులోత్తుంగరాజేంద్రచోడ" యని

యుండుటచే సితఁడు వెలనాఁటి వంశీయుఁడని వెంకటరమణయ్యగారి యభిప్రాయము.

ఇఁకను వెంకటరమణయ్యగారని నట్టితఁడు వెలనాటి వంశీయుఁడగునా యని చూడవలసియున్నది. వెలనాఁటి పృథ్వీశ్వరునకుఁ బురుష సంతతి యుండెనో లేదో తెలియఁదగిన యాధారములు లభింపలేదు. కాని వెంకటరమణయ్యగారు భారతి పత్రికలో మూఁడు శాసనముల నుదహరించియున్నారు. మొదటిది గణపతిదేవుని నాయకులలో నొకఁడైన మల్యాల హేమాద్రిరడ్డిది. (ద. హిం. శా. సం. ౪ సంఖ్య ౧౩౩౩) ఇందు దాను కులోత్తుంగ రాయరాజేంద్రచోడ గొంకద శాపట్టడనని చెప్పుకొనియున్నాఁడు. ఇది శా. శ. ౧౧౪౯ నాఁటిది. ద్రాక్షారామ భీమేశ్వరస్వామి యాలయమునం దున్నది. రెండవది శా. శ. ౧౧౭౧ నాటిది త్రిపురాంతకమునం దున్నది. చోడబోయఁడను నొకఁడు వెలనాఁటి రాజేంద్రచోడుని భృత్యుఁడని చెప్పఁబడియున్నది. (A. R. No 249 of 1905) ఇది యీతని భార్య జయసాని వ్రాయించినది. ఇందు

" రాజేంద్రచోడ నృపకార్యవిధానతంద్రః
శ్రీబోయచోడిరతి వైభవ నిర్జితేంద్రః"

అని యున్నది. మూఁడవది శా. శ. ౧౧౭౬ నాఁటిది. గుంటూరు మండలములోని యినుమెళ్ళలోనిది (ద. హిం. శా. సం ౬ సంఖ్య ౬౦౨) కాకతి గణపతిదేవుని యనుచరుఁడగు కాలపనాయఁకుడు తాను " వెలంది కులోత్తుంగరాజేంద్రచోడ నిస్తారకుఁడ నని చెప్పుకొనియున్నాఁడు. ఇందున్న ' వెలంది ' శబ్దము వెలనాఁటి అనుదానికి బదులుగా శాసన లేఖకుఁడు తప్పు చెక్కియున్నాఁడని వెంకటరమణయ్యగారి యభిప్రాయము. ఈకాలవనాయకునిదే (ద. హిం. శా. సం ౬ సంఖ్య ౬౦౩) సంఖ్య గలది యింక నొకటి కలదు. అందీ శబ్దము ' వెలాది ' అని యున్నది. అందు " రుద్రయదేవ అమ్మంగరికిపుణ్యము గాను " అని యున్నది. కాని అందు శాసన కాలము " ౧౦... " అని సగము మాత్రమే కన్పట్టుచున్నది. ఇందులోని ' సున్న ' ౧ కి బదు

లుగా పొరబాటు పడియుండవచ్చును. మొత్తముమీఁద నీశాసనము లన్నియు కాకతి గణపతిదేవుని కాలమునను, అతని కుమార్తె కాలము నందును పుట్టినవి. వారి పేరుల నుదాహరించి యుండుటచే, నిందున్న వెలనాఁటి రాజులు కాకతీయులకు సామంతులుగా నుండిరనియు, వారి క్రిందనుండు నాయకులు, తను సన్నిహిత ప్రభువులైన వెలనాఁటి వారి యొక్కయు, వారి యేలికలగు కాకతీయుల యొక్కయు నామములను తమ శాసనములలో నుదహరించియున్నారనియుఁ దలంపవలసియున్నది. ఈశాసనములలోఁ జెప్పఁబడిన వెలనాఁటి రాజేంద్ర చోడునకును వెలనాఁటి పృథ్వీశ్వరునకును ఏమయిన సంబంధమున్నదా ? యని యోచింతము. వెలనాటి పృథ్వీశ్వరునకు పురుషసంతాన మున్నట్లాధారములు దొరకలేదు. అతని యనంతరమున వెలనాఁడు, వేగినాఁడు దేశములలో సామంతులు పెక్కురు బయలుదేరి మహాపరాక్రమవంతుఁడైన చోడ ముమ్మడి కులోత్తుంగరాజు యొక్క యధికారమునకు లోఁబడి యా దేశములలోని భాగములనుఁ బరిపాలించినట్లును, కులోత్తుంగుని యనంతరమున నీసామంతులు ప్రభువులై స్వతంత్రముగా రాజ్యపరిపాలనము చేసియున్నట్లును గన్పట్టుచున్నది. అట్టివారిలోఁ బైశాసనములలో నుదాహృతులైన వెలనాటి రాజులుకూడఁ జేరియుందురు. పై శాసనములలోని రాజులకునుఁ బృథ్వీశ్వరునకును, ఎట్టి సంబంధమైన నున్నదియో లేదో స్పష్టముగాఁ జెప్పఁజాలము. కాని వెలనాఁటి పూర్వపురాజుల నామములును నీశాసనములలోని రాజుల నామములును నొక్కరీతిగా నుండుటచే వీ రాపృథ్వీశ్వరుని సంతతివారని యూహింపవలసియున్నది. పైనఁ జెప్పినవికాక శా. శ. ౧౧౫౧ లో నిఁక నొకశాసనము కన్పించుచున్నది. (A. R. 3౨౨ of 1936-37) ఈశాసనపు ప్రతికొఱకు విశేషప్రయత్న మొనర్చినను నాకు లభించినది కాదు.) ఇది వెలనాఁటి చోడునిది. ఇందు గొంతభాగము శిథిలమైపోయినదనియు, గాలము "సోమేశురుద్రగణితే" అని యుండుటచే శా. శ. ౧౧౫౧ అనియు పృథ్వీశ్వరునకును, నీశాసనకాలమునకును నడుమ దాదాపు 30 సంవత్సరములుండుటచే నీకాలమున శాసనకర్తయు నాతని తండ్రియు రాజ్యపాలనము జేసియుందురనియు, తండ్రిపేరున్న భాగము శిథిలమైనదనియు,

దొరతనమువారి శాసనపరిశోధక శాఖవారు పైశాసనముపై వ్యాఖ్యానము వ్రాసియున్నారు (A. R. 1936-37 Part II Para 15 Page 65) ఈశాసనము గుంటూరు మండలములోని రేపల్లె తాలూకా యందలి పెద్దపులివఱ్ఱు గ్రామమున నరేంద్రస్వామివారి యాలయమున నంది స్తంభముక్రింద నున్నది. అందు వెలనాటిచోడుఁడు యుద్ధములో శత్రువులనుండి గైకొనిన సంపదను ద్రాక్షారామ భీమేశ్వరునకిచ్చినట్లు దనతండ్రి యేబదిలక్షలుగల యాంధ్రదేశముకుఁ బరిపాలించినట్లును, వ్రాయఁబడియున్నదనియు శాసనము తుదిభాగమున "గణపతిక్షితీశం సంసేవ్య" యని యుండెననియు శాసన పరిశోధక శాఖవారు వ్రాసి యున్నారు.

శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు పంతులుగారు "పులివఱ్ఱు కైఫీయత్తు"ను భారతిలోఁ (వ్యయ-శ్రావణము. పుట ౧౮౭) లో బ్రకటించియున్నారు. దానిచివర నొకశాసనముకూడ (కైఫీయత్తు నందలి భాగమే) నున్నది. అదియును పైనచెప్పిన (A. R. 322 of 1936-37) శాసనము నొకటియే యైనట్లు కన్పట్టుచున్నది. అందుఁబైనఁ జెప్పిన యంశములన్నియు సంస్కృత భాషలో నున్నవి. అందున్న వెలనాటి చోడుని తండ్రి గొంకరాజని స్పష్టముగా నున్నది.

"తద్వంశజాతో గోంకీశ శ్శరణ్య స్సర్వభూభృతాం...... పంచాశత్ లక్షసంయుక్త మంధ్రదేశ మపాలయన్...... తత్పుత్రో వెలనాటిచోటి (చోడయైయుండును) నృపతిః......జిత్వా వైరి నృపాన్ తదశ్వగజగోగాణిక్యరత్నాదికం ద్రాక్షారామ పురీశ్వరాయ తుధరో శ్రీభీమనాథాయతై ......(శా)ఇత్యాదిశాన్వయవార్ధిచంద్ర ముపేతమూర్తిం గణపక్షితీశం సేవ్యతే శత్రుఘ్నశే ర్వాదిత్యరాజంతి..." (గ్రంథవిస్తరభీతిచే పుష్పులుపెట్టినభాగములను నేను విడచిపెట్టితిని) శాసనకాలమును "మేఘరుద్రగణితే" అనుమాటలలోఁ దెలిపియున్నాడు కాలమునుఁగూర్చి వ్రాయుచు శ్రీ వెంకటకృష్ణారావుగారు "అన్నిటితో పాటు మిక్కిలిచిత్రమైనవిషయము శకవర్షములు ౧౧౧౮ అనగా ౧౧౯౬ క్రీస్తుశకకాలమున(?) లిఖింపబడిన శిలాశాసనమునందు

వెలనాటిరాజేంద్రచోడుడు (మొదటివాడు) ౫౦లక్షలపరిమాణము గల ఆంధ్రదేశమునుఁ బరిపాలించె నని తెలుపబడియున్నది. ఈశాసన ప్రతిబింబమును - లభించినచో - పరిశీలింపవలసియున్నది. ఇట్టిచరిత్రాంశము లనేకములు - విమర్శింపదగినవి. ఈక్రైఫీయత్తునందు గలవు" అని వ్రాసియున్నాడు. శా. శ. ౧౧౧౪వ సంవత్సరమున చోడనామధారి యెవ్వఁడును వెలనాఁడునందు లేఁడు. అదిపృథ్వీశ్వరుని రాజ్యమధ్యకాలము. ఇందలి "మేఘు" శబ్దముపొరబాటు. కాలమునకు 'మేఘు' శబ్దమునిచ్చు సాంప్రదాయము బహుళముగా లేదు. "సోమేషుర్ద్ర" గణితే యను పాఠమే సరియైనది. ఇందలి ప్రథమాక్షరమగు 'సో' పొరబాటున విడిచిపెట్టఁబడినది. 'షు'ను'ఘు'గాఁ జదివినారు. ఈశాసనము మొదటి రాజేంద్రచోడునిది కాదు. పృథ్వీశ్వరునకుఁ దరువాతది. గణపతిదేవుని శాసనములు శా. శ. ౧౧౪౦ మొదలు వెలనాఁటియందుఁ గన్పించుచుండుటచే, నీశాసన మాకాలమునకుఁ గూడఁ దరువాతది. కావున నిందుదాహరింపఁబడిన వెలనాఁటిచోడుఁడు పృథ్వీశ్వరునకుఁ బూర్వుఁడు గాఁ డనియు, గణపతిదేవుని కాఁ ములోనివాఁ డనియు, గొంకరాజునకుఁ గుమారుఁ డనియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఈశాసనము పూర్తిగాఁ బ్రకటితమై యేవేని మార్పులు కలిగిననేతప్ప పృథివీశ్వరునితో నాతనివంశ మంతమై పోలేదనియు, నాతనికిఁ బిమ్మట నీక్రిందివిధముగా నభివృద్ధిఁ జెందిన దనియు నిశ్చయింపవచ్చును.

పృథివీశ్వరుఁడు శా. శ. ౧౧౨౭ రాజ్యాంతవత్సరము.

|

గొంకరాజు

|

రాజరాజేంద్రచోడుఁడు శా. శ. ౧౧౫౧ సంవత్సరము

|

గొంకరాజు హేమాద్రిరెడ్డి ౧౧౫౯ శాసనము

|

కులోత్తుంగరాజేంద్రచోడుఁడు (త్రిపురాంతక, ద్రాక్షారామశాసనములు శా. శ. ౧౧౭౧-౧౧౭౬)

పృథ్వీశ్వరుని మొదటిశాసనము శా. శ. ౧౧౦౮లో కలదు. అప్పటి కాతనికి నలువదిసంవత్సరముల వయసుండెనని తలంచితిమేని (ఈతనిపూర్వులకాలమును బరిశీలింపఁగా నిది సరియైనదిగాఁ గన్పట్టినది.) యీతనితుదిశాసనము ౧౧౨౮లో నున్నది. కావున నప్పటి కాతని కఱువదియేండ్లవయసును, ముప్పదియైదేండ్లకుమారుఁడును, పదేండ్లు వయసుగల మనుమఁడును గలరని యూహింపవచ్చును. ఈ కుమారుఁడే గొంకరాజు. ఈ మనుమఁడే రాజరాజేంద్రచోడుఁడు. ఇతఁడు తన ముప్పదిమూఁడవయేట శా. శ. ౧౧౪౧లో ముప్పదిరెండుపుట్లభూమిని నరేంద్రస్వామికి శాసనము వ్రాయించి దాన మిచ్చె ననుటలో విరుద్ధ ముండదు. అతని కిరువదియవయేట గొంకరాజు జన్మించె ననినచో, ౧౧౪౯నాటి కాతనికి ౨౦ సంవత్సరముల వయసుండెననియు గణపతి దేవుని సేనాధిపతి యగు హేమాద్రిరెడ్డి యాతనిని దిశలకుఁ బరువెత్తించి దిశాపట్టఁ డయ్యెననియుఁ దలంపవచ్చును. కాని కొంచెమైనం దస్వాభావికము లేక పోలేదు. కొన్నితావుల నట్లుండవచ్చునని యనుకొనినను నీ గొంకరాజునకుఁ గూడ నిరువదియవసంవత్సరముననే కులోత్తుంగ రాజేంద్రచోడుఁడు గలిగెనని తలంచినను, త్రిపురాంతక శాసనము నాఁటి కాతఁడు పండ్రెండేండ్లవాఁడును, ద్రాక్షారామశాసనము నాఁటికి పదునెనిమిదేండ్లవాఁడు నైనట్లు గన్పట్టుచున్నాఁడు. కావున నిది కేవల మస్వాభావిక మనియు, నందుచే నీవంశవృక్షమునం దేదియో యొక పొరబాటుఁ డి యుండవలయుననియు స్పష్టమగుచున్నది. కాని పులివర్రు కైఫీయత్తునందు "కుళోత్తుంగచోళమహారాజు శాలివాహనం ౧౦౩౦ శకమందు (ఈసంఖ్య తప్పు. సంఖ్యలలో నిట్టితప్పులు కైఫీయతులయందుఁ దఱచుగాఁ గానవచ్చుచుండును.) పదకొండోయేట పట్టాభిషిక్తుఁడై నిత్యశివలింగప్రతిష్ఠలు చేసి రాజ్యంచేస్తూవుండగా తూర్పుదేశమునుంచి గజపతిసింహాసనస్థుఁడై గణపతిమహారాజు సేనాసమేతముగా వచ్చి చోడరాజుతాలూకు అకాలానను పలాయనం చేయించి దేశము స్వాధీనముచేసికొనెను." అని వ్రాసియుండుటచేఁ బైన వ్రాసిన సంగతులు వాస్తవము లేయనియు వంశవృక్షము సరియైనదే యనియును దస్వాభావిక మున్నట్లుగన్పట్టినను నది సత్యమే యనియు ధ్రువపడుచున్నది.

పృథివీశ్వరుని యనంతరమాతని కుమారుఁడు, గోంకరాజు తన తండ్రి సింహాసనమున నధిష్ఠించి చోడకులోత్తుంగుని సామంతుఁడై కొంత దేశమునైనను బరిపాలించియుండును. ఈతని శాసనములు గన్పట్టలేదు. ఈతని యనంతరము రాయరాజేంద్రచోడుఁడు, కాకతీయగణపతి దేవునికి సామంతుఁడై వెలనాటిని బాలించినట్లు కనఁబడుచున్నది. అతని కుమారుఁడైన గోంకరాజెుమవలననో గణపతి కెదురు దిరిగినట్లును, నందుచే నాతని సేనాధిపతియైన హేమాద్రిరెడ్డి గోంకరాజు నడఁచివేసినట్లును ద్రాక్షారామ శాసనమువలనఁ దెలియుచున్నది. ఆతనికిఁ బిదపఁ గులోత్తుంగ రాజేంద్రచోడుఁడు చిన్నతనముననే తన ౧౧ వ యేటనే సింహాసనము నెక్కెను. ఈతఁడు పసివాఁడైనను, కాలపనాయకుఁడు మొదలగు సేనాధిపతులు బలవంతులై యాతని రాజ్యమును గాపాడుచు "కులోత్తుంగరాజేంద్ర చోడరాజ్య నిస్తారకులై" రని త్రిపురాంతక ద్రాక్షారామ శాసనములవలన నెఱుంగ నగుచున్నది. కులోత్తుంగుఁడు బదునెనిమిదవయేట నీ సేనాధిపతులతోఁగూడ మనుమసిద్ధి దాయాదులగు నక్కన బయ్యనలకు సాహాయ్యమొనర్చి యుండును. గణపతి దేవుఁడీ కులోత్తుంగునే పట్టుకొనె ననుట నిశ్చయము. నాయకపల్లి శాసనము నందలి "దవిళ మండలము" కేవలము ద్రావిడ మండలమని తలంప నక్కఱలేదు. ఈకులోత్తుంగుని శాసనము త్రిపురాంతకమునఁ గన్పట్టుచున్నది. అంతపఱకు నాతని రాజ్యము వ్యాపించెనేమో! దానిని శాసనకావ్యకర్త దవిళమండలముగా భావించెనేమో! నెల్లూరును "దక్షిణదిగుభాగ" మని యాశాసనమునఁ జేర్కొన్నాఁడు.

శ్రీ వెంకటరమణయ్యగారు పైనజెప్పిన మూఁడు శాసనములొక్కనివిగనే భావించి, యాతఁడు కులోత్తుంగ రాజేంద్రచోడుఁడని నిశ్చయించి యాతనికి వెలనాటి మూఁడవ కులోత్తుంగరాజేంద్ర చోడుఁడని పేరుపెట్టి యాతని పుట్టుపూర్వోత్తరము లెవ్వియో తెలియవనిచెప్పి, యాతనినే గణపతిదేవుఁడు ద్రవిడ మండలమునఁ బట్టుకొనెనని తెల్పియున్నారు. వెలనాఁటివాఁడు ద్రవిడ మండలమున కెట్లు పోయెను ? పృథ్వీశ్వరుని యనంతరమున విచ్ఛిన్నమై పోయిన వెలనాటి రాజ్యమునుండి ద్రవిడ మండలమునకుఁ బోయి యచ్చట రాజ్యమునుఁ

జరిపాలించుచుండ కేతనవిక్రోల్లు సమర్థత వచ్చినది? యను ప్రశ్నలకుఁగూడ వారే సమాధాన మిచ్చియున్నారు. వానినన్నిటిని నిటఁ జెప్పుటకుఁ దావు చాలదు. అవి యన్నియు సత్యములుగనే భావించి, ప్రస్తుతాంశమును గూర్చి యాలోచింతము. కాకతిగణపతిదేవుఁ డెప్పుడీ వెలనాఁడు, నెల్లూరు ద్రవిడమండలములపై దండయాత్ర సాగించెనను విషయము ముఖ్యమైనది. పైచర్చవలన నీవిషయము తేలలేదు. పైనవ్రాసిన విషయముల నన్నిటిని సమన్వయముచేసి యాకాలమును నిర్ధారణచేయ వలసియున్నది. చోడతిక్కరాజు శాసనములు శా. శ. ౧౧౭౮ వఱకును గనుపించినవి. ఆకాలములో నీదండయాత్ర జరిగెనని తలంపరాదు. ఆతని కాలములో నక్కన బయ్యనల కథ లేదు. ఆకథ మనుమసిద్ధి కాలములో జరిగినదని చెప్పుచున్నారు. శా. శ. ౧౧౮౫ లో తిక్కరాజు మరణించెనను కొందము. ఆసమయమును గనిపెట్టి మనుమసిద్ధి దాయాదులాతనిపై దండెత్తి పదభ్రష్టుని గావించి యుండవలయును. ఈయక్కన బయ్యనలకు, వెలనాటి వంశములోని వాఁడైన (పైవంశవృక్షములోని తుదిపురుషుఁడు) కులోత్తుంగ రాజేంద్ర చోడుఁడు సాహాయ్య మొసఁగియుండును. నెల్లూరు చోడులకును, వెలనాటి రాజులకును పూర్వవైర మున్నది. చోడతిక్కరాజు పృథ్వీశ్వరుని జంపి యుండెను కదా! ఆపగ తీర్చుకొనుటకై, పృథ్వీశ్వరుని సంతతిలోని వాఁడైన యీవెలనాటి కులోత్తుంగరాజేంద్ర చోడుఁడు అక్కన బయ్యనలకు సాహాయ్య మొసఁగియుండునని యూహించుటలో తప్పుండదు. ఈ విషయము లన్నిటిని దిక్కనసోమయాజి గణపతిదేవునకు నివేదించియుండును. గణపతిదేవుఁడు తిక్కనసోమయాజిమాటపై గౌరవముంచి వెలనాటి మూఁడవకులోత్తుంగుఁడు తనకు సామంతుఁడై యున్నను, నాతనిని జయించిన గాని మనుమసిద్ధికి నెల్లూరురాజ్యము దక్క దని నిశ్చయించుకొని ముందుగా వెలనాఁడును స్వాధీనము చేసికొని, పిమ్మట నెల్లూరును దహించి మనుమసిద్ధికి శత్రువులయిన తిక్కన బయ్యనల(శాసనములో తిక్కనబయ్యనలనియున్నది. సిద్ధేశ్వరచారిత్రమున అక్కనబయ్యన లనియున్నది. ఇందేదియో యొకటి పొరబాటు అయియుండును. తిక్కన యనుపాఠమే సరియైనదిగాఁ దోఁచుచున్నది.)

శిరస్సులను ఖండించి మూడవకులోత్తుంగ రాజేంద్రచోళుని జయించి పట్టుకొని యాతనిచే గప్పము గ్రహించి విడచిపెట్టి మనుమసిద్ధి జోలికిం బోవద్దని యాజ్ఞాపించి, మనుమసిద్ధియొద్ద యేనుగులను గానుకగాం గైకొని, నెల్లూరురాజ్యమునం గొంత యాతని కిచ్చి తన సామ్రాజ్యమునం గొంత కలుపుకొని (౬౮ గ్రామములైననేమి ౨౧౦౦ గ్రామములైననేమి) స్వదేశమున కేగియుండును. ఈదండయాత్ర శా. శ. ౧౧౭౫ (క్రీ. శ. ౧౨౫౩)లో జరిగియుండును. పెద్దపులివర్రు కైఫీయత్తులో "తిరిగి కులోత్తుంగ చోళరాజు యీ దేశానకు వచ్చి రాజ్యం ఆక్రమించి శా. ౧౧౯౩ (౧౧౯౯ కలియుయుండును) శకంవరకు ప్రభుత్వం చేసిరి. తదనంతరం కోటభీమరాజు యితని కొడుకు కేతమహారాజు భైరవభూపాలుడు పర్యంతరం శా ౧౨౨౦ శకంవరకు ప్రభుత్వములు జరిగినవి" అని వ్రాసియుండుటనుబట్టి వెలనాటి మూడవకులోత్తుంగచోడుండు మఱికొంత కాలము రాజ్యము చేసినట్లు తెల్పుచున్నది. ఈవిమర్శనముతో మనకుం బనిలేదు. గణపతిదేవుని సాహాయ్యమున మనుమసిద్ధికి శత్రుబాధపోయి బలవంతుండగు మిత్రుని ప్రాపకము లభించుటచే నాతని హృదయమునకు విశ్రాంతి కలిగినది. తిక్కనసోమయాజిపై గౌరవము హెచ్చినది. మనుమసిద్ధి సోమయాజిని "మామయ్యా!" యనిపిలిచెడివాండట! మహారాజులును మంత్రులను వావివరుసలతోం బ్రవర్తించుచుండెడివా రనుట కనేకనిదర్శనము లున్నవి. శ్రీకృష్ణదేవరాయలు తిమ్మరసును "అప్పాజీ" యని పిలుచుచుండెనట!

మనుమసిద్ధికి రాజ్య మిప్పించుటకొఱకయి తిక్కనసోమయాజి గణపతిదేవునియొద్దకు వెళ్లెనని యనుశ్రుతముగావచ్చెడి కథ సత్యమనియే నమ్మవచ్చును. ఈదండయాత్ర పూర్తియైనపిదపనే తిక్కన నిర్వచనోత్తర రామాయణమును రచించియుండును.

తిక్కన సోమయాజి గణపతిదేవుని యాస్థానమున కేగినప్పుడు జైన పండితులతో వాదించి జైనమతమును ఖండించు వేద మతమును నిలువంబెట్టె ననియు నందులకు గణపతిదేవుండు మెచ్చి కొన్ని గ్రామములను దిక్కనకిచ్చెననియు సోమదేవరాజీయము నందున్నది. ఆకాల

మున జైనమతము నిజాము రాష్ట్రమున వ్యాపించియున్నదను మాట వాస్తవము. కాని గణపతిదేవుఁడు జైనుఁడు కాఁడు. అదివఱకే విశ్వేశ్వర దేశికుని శిష్యుఁడై శైవమతమును స్వీకరించి పరమ మహేశ్వర బిరుదమును గైకొనియుండెను. అందుచేఁ దిక్కనామాత్యునిచే జైనమత ఖండనమును జేయించియుండును.

### రక్కసగంగన గంగయసాహిణులు భిన్నులా?

నిర్వచనోత్తరరామాయణమున మనుమసిద్ధి జయించిన శత్రురాజులను జెప్పు సందర్భమునఁ దిక్కనామాత్యుఁడు మూఁడు పద్యములను రచియించియున్నాఁడు. అందొక పద్య మిది.

చ. రంగదుదారకీర్తి యగురక్కసగంగనఁ బెంజలంబు మై
భంగ మొనర్చి మన్మజనపాలుఁడు బల్విడి నాఁచికొన్నరా
జ్యాంగము లెల్ల నిచ్చి తనయాశ్రితవత్సలవృత్తి యేర్పడన్
గంగయసాహిణిం బదముఁ గైకొనఁబంపెఁ బరాక్రమోన్నతిన్.

శ్రీచిలుకూరి వీరభద్రరావు పంతులుగారు తమ యాంధ్రుల చరిత్రము (మధ్యయుగము ౨౫౭-౨౫౮) నందును, కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము (పుట ౪౦౦-౪౦౧) నందును, పైపద్యములోఁ జెప్పఁబడిన రక్కసగంగనయు, గంగయసాహిణియు నొక్కవ్యక్తియే యనియు నితఁడు కాయస్థుఁడనియు, కాకతి గణపతిదేవుని సేనాధ్యక్షుఁడనియు వ్రాసియున్నారు. రక్కసగంగని గర్వమడంచి, ఆతని యొద్దనుండి నాఁచికొన్నరాజ్యమును, నతఁడు తన నాశ్రయింపఁగా మనుమసిద్ధిమహారాజు తిరిగి, యతనికే యిచ్చివేసెనని యీపద్యార్థ మని వారు భావించియున్నారు. మొట్టమొదట నీపద్యమును జదివినప్పుడు రక్కసగంగన వేఱనియు, గంగయసాహిణి వేఱనియు, రక్కసగంగనను జయించి గైకొనిన రాజ్యాంగములను తన కాశ్రితుఁడైన గంగయసాహిణికి, మనుమసిద్ధి యిచ్చెనని యీపద్యార్థమనియు నేనభిప్రాయ పడితిని. నాయభిప్రాయమునకు బల మొసంగెడిశాసన మొకటి లభించినది. (A. R. 231 of 1905. ఈశాసనము నకలును నేనడుగగనే పంపిన

ఇండియాగవర్నమెంటువారి ఎపిగ్రాఫిస్టు గారికిఁ (కృతజ్ఞుఁడను) ఈ శాసనము గంగయసాహిణిమంత్రి యైననామదేవపండితులు కర్నూలు మండలములోని మార్కాపురము తాలూకా త్రిపురాంతకమునందలి త్రిపురాంతకదేవునకు భూదానమొసంగి వ్రాయించినది. దీనివలన రక్కసగంగన, గంగయసాహిణులు భిన్నవ్యక్తులనియు, వారిరువురు శత్రువు లనియుఁ దెలియును. వివాదవిషయము కావున నాశాసనము నిట నిచ్చుచున్నాఁడను.

"స్వస్తి సమస్తప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వర కాకతియ్యగణపతిదేవమహారాజులు ఒరుగల్లు నిజరాజధానిగాను సుఖసంకథావినోదంబుల రాజ్యంబు సేయుచుండగాను తత్పాదపద్మారాధకుండైన స్వస్తి యనేకనామావళి విరాజమానమానోన్నత అతివిశమహాయారూఢ ప్రౌఢరేఖారేవంత విజయలక్ష్మీకాంత దశదిగుభరిత కీర్తికామినీవల్లభ భయలోభదుర్లభ పశ్చిమరాయదామోదర సైన్యదిశాపట్ట వైరిఘరట్ట రక్కసగంగరస దిశాపట్ట మూర్ఖరాయ జగద్దళ గణపతిదేవదివ్య శ్రీపాదపద్మారాధక పరబళసాధక నామాది సమస్తప్రశస్తిసహితం శ్రీమన్మహామండలిక అరివీరబ్రహ్మ రాతుసనాయక నారాయణ గండపెండారు గంగయ్యసాహిణి సమస్తరాజ్యసముద్ధరుండైన స్వస్తిసమస్తరాజ్యభారనిరూపిత మహామాత్య పదవీవిరాజమానమానోన్నత ప్రభుమంత్రోత్సాహశక్తిత్రయగుణసంపన్న ఆనయాసన ద్వైధీభావశాడ్గుణ్యగుణోపేత పరేంగితజ్ఞాన అష్టావధారణాధౌర్య చరిత ఉత్పన్నమతిసంపన్న సురగురుసమాన సకలశాస్త్రపారావారక మంత్రిమాణిక్య నీతిచాణక్య పతికార్యధురంధర పరిపాలకల్పలతావృత్యాజ్య దీనార్తిజనసువర్ణధారానటన గభీర...దీనాంధగాయక వైతాళిక వైభాసికదండిముండి శిఖండి నానాపేక్షకోడశ ఆచకధర్మిద్రఖండన నిత్యనేమానుష్ఠాన హాశిష్టపురోగమను లైననామదేవపండితులు స్వస్తిశ్రీసకవర్షంబులు ౧౧౭౬ ఎండి ఆనందసంవత్సరమున చైత్ర శు౧౫ శు. నాడు దేవపర్వనిమిత్యమున శ్రీత్రిపురాంతక శ్రీమనుమహాదేవరకు... దువ్వ...ంపనల'ని కొంకులకుంట చతుశ్సీమముూను ఆచంద్రార్కము నిచ్చె..." రక్కసగంగన, గంగయసాహిణులు భిన్నవ్యక్తులును వైరులునై

యున్నా రని తాళ్ళప్రొద్దుటూరు శాసనమువలనఁగూడ ధృవపడు చున్నది. దానిని శ్రీవెంకటరమణయ్యగారు భారతి (సం౧౧ భాగ౧పుట ౧౪౭)లో విమర్శనాపూర్వకముగఁ బ్రకటించియున్నారు. ఈశాసనము, జగదాపుగంగయదేవచోడ మహారాజు తనతండ్రి యైనఅల్లుగంగరాజునకును తల్లి యైనగంగాదేవికిని పుణ్యలోకావాప్తికొఱకు గంగసముద్ర మనుతటాకమును త్రవ్వించి శా. శ. ౧౨౪౪ దుందుభి సం॥ మాఘశు॥ ౧ శనివారమునాఁడు వ్రాయించెను. ఈశాసనములో సీగంగయదేవచోళ మహారాజుల ప్రశస్తిలో, ఒఱయూరి పురవరాధీశ్వర అజనయూర సింధురధ్వజ కాశ్యపగోత్ర దినకరకులతిలక నిరవిశాసన ప్రభాకర, గండపెండార గంగయసాహిణీ సర్వస్వబందికాఱ, ఇత్యాది బిరుదములున్నవి. ఈబిరుదమును బట్టి గంగయసాహిణియొక్క సర్వస్వమును, ఈజగతాపుగంగయదేవచోళ మహారాజు లపహరించినట్లు, గన్పట్టుచున్నది. ఇందువలన గంగయసాహిణి రాజ్యమును గైకొనినవాఁడింకొకఁడున్నాఁడని స్పష్టమగుచున్నది. కాని యాతఁడీ గంగయదేవచోళమహారాజుమాత్రము కాఁజాలఁడు. ఏమనిన నీగంగయదేవచోళుఁడు శా. శ. ౧౨౪౪ (క్రీ. శ. ౧౩౨౨) కాలమునందున్నవాఁడు. గంగయసాహిణియు మనుమసిద్ధియు క్రీ. శ. ౧౨౬౦ ప్రాంతమునందున్నవారు. కావున గంగయసాహిణిని జయించినవాఁడీ జగతాపు గంగయదేవచోళుఁడు కాక యాతని పూర్వుఁడై యుండుననియు, "గంగయసాహిణీ సర్వస్వబందికాఱ" యనునది వంశానుగతమైన బిరుదమనియు, శ్రీవెంకటరమణయ్యగారూహించినట్లు తలంచుటయే సమంజసము. కాని యాపూర్వుఁ డెవ్వఁడో తెలియదు. నిర్వచనోత్తర రామాయణ పద్యమునుబట్టి "గంగయసాహిణీ సర్వస్వబందికాఱ" బిరుదము వహింపఁ దగినవాఁడు "రక్కెసగంగన"యై యుండవలయును. అవశ్యములో, చిలుకూరి వీరభద్రరావుగా రనినట్లు, రక్కెసగంగనయు, గంగయసాహిణియు నొక్కరనుట పొసఁగదు. ఇద్దరు నొక్కరే యగుదు రేని, యీబిరుదము మనుమసిద్ధికిఁ జెందవలయును. పైనచెప్పిన శాసనకర్త యగు జగతాపుగంగయ దేవచోడుఁడు మనుమసిద్ధివంశీయుఁ డనుట కాధారములు లేవు. మనుమసిద్ధి ప్రశస్తిలో నట్టి బిరుదములు

లేవు. కావున నేవిధమునఁ జూచినను, రక్కసగంగనకే యాబిరుదము వర్తించుననుటయే సమంజసము.

రక్కసగంగనకును, ప్రస్తుతశాసనకర్త యగు జగతాపుగంగయ దేవచోళునకును గలసంబంధము తెలియుటలేదు. జగతాపుదండిచోళ మహాదేవరాజను నాతని శాసనమొకటి క్రీ. శ. ౧౨౧౫ నాటిది గన్పట్టుచున్నదనియు "జగతాపు" శబ్దమును బట్టి యాతఁడు గంగయ దేవచోళునిపూర్వుఁడై యుండుననియు శ్రీవెంకటరమణయ్యగారు వ్రాసియున్నారు. అది సత్యమనియే తలంపవలసియున్నది.

'రక్కసగంగ'నామములు పాశ్చాత్యగంగరాజులలోఁ దఱచుగాఁ గానవచ్చుచున్నవనియు, నందుచే గంగయసాహిణిని జయించినరక్కస గంగఁడు పాశ్చాత్యగాంగవంశములోనివాఁడై యుండుననియు పాశ్చాత్యగాంగవంశీయులు సింధురధ్వజము కలవారనియు, దాళ్ళప్రొద్దుటూరు శాసనకర్త యగు గంగయదేవచోళమహారాజు అజమయూరసింధుర ధ్వజుఁ డనుబిరుదువహించినవాఁ డనియు, రక్కసగంగన సింధురధ్వజ మీతనికి సంక్రమించిన దనియు, రక్కసగంగన యీగంగయదేవ చోళునకు మాతామహుఁడై యుండు ననియు, మాతామహుని సింధురధ్వజమును గంగయసాహిణిసర్వస్వబందికాఱ బిరుదమును గంగ యదేవచోళునకు వచ్చియుండుననియు శ్రీవెంకటరమణయ్యగారభి ప్రాయపడియున్నారు.

ఈరక్కసగంగన పాశ్చాత్యగాంగవంశములోనివాఁ డనుట కాధారములు నాకు లభింపలేదు. ఇతఁడుమిగులఁ బరాక్రమవంతుఁ డనియుఁ గీర్తివంతుఁ డనియు "రంగదుదారకీర్తియగు రక్కసగంగని" యనువాక్యమువలనఁ దెలియుచున్నది. పాశ్చాతగాంగవంశములోని యెవని నైనను జయించి యాతని సింధురధ్వజమును లాగికొని దాని నీరక్కసగంగన వహించెనేమో! శత్రుధ్వజమును ధరించుట సాంప్రదాయవిరుద్ధ మందు రేని, యీరక్కసగంగన పాశ్చాత్యగాంగుని దౌహిత్రుఁడై యుండవచ్చును. పశ్చిమగాంగులలో కాటపగంగని

శాసన మొకటి కనఁబడుచున్నది. కాని యది యీరక్కసగంగనిది కాదు. (A. R. 235 of 1931) ఇట్టి వింకను గలవు. క్రీ. శ. పదియవ శతాబ్దిలో నాగవర్మయనుకర్ణాటక కవినిబోషించిన రక్కసగంగన యొకఁడున్నాఁడు. నామసామ్యమునుబట్టి వీరందఱు పశ్చిమగాంగులన లేము. మనరక్కసగంగన క్రీ. శ. ౧౨౧౫సంవత్సరమునాఁటిశాసన కర్తయగు జగతాపుదండిదేవచోళరాజునకుఁ బుత్త్రుఁడై యుండు నని నాయూహ. రక్కసగంగనికి, అల్లుగంగరాజుపుత్త్రుఁడును గంగయదేవ చోళరాజు పౌత్త్రుఁడు నై యుందు రనితలంచుచున్నాఁడను. తాత పేరునందలిగంగశబ్దమును, ముత్తాత పేరునందలి "జగతాపు" 'దేవచోళ' శబ్దములను గైకొని యీతఁడు జగతాపుగంగయదేవచోళరా జయ్యెనని తోఁచుచున్నది. నాయూహ సత్యమయ్యెనేని వీరివంశవృక్ష మీ క్రిందివిధమున నుండును. ఇందలిసత్యాసత్యములను గూర్చి యింకను బరిశోధనము కావలసియున్నది. భావిపరిశోధనమువలన మార్పు వచ్చు నంతవఱకును దీని నంగీకరింతము.

మధురాంతకదేవచోళుఁడు.

|

జగతాపుదండిదేవచోళరాజు. (క్రీ. శ. ౧౨౧౫)

|

రక్కసగంగన. (క్రీ. శ. ౧౨౪౦)

|

అల్లుగంగరాజు=గంగాంబిక. (క్రీ. శ. ౧౨౭౫)

|

జగతాపుగంగయదేవచోళరాజు (క్రీ. శ. ౧౩౨౨.)

ఈవంశీయులు మధురాంతకపొత్తపిచోళులలోని యొకశాఖకుఁ జెందినవా రనిచెప్పవచ్చును. రక్కసగంగన కలుకడ పురాధీశ్వరుఁ డగురాయదేవమహారాజునకు సామంతుఁడుగనుండి సిద్ధవటప్రాంతమును బరిపాలింపుచుండె ననియు, సిద్ధవటసమీపముననున్న జోతిగ్రామమునఁ గన్పట్టినశాసన (A. R. ౫౭౩ of ౧౯౧౫) మీతనిదే యనియుఁ

గంగయసాహిణి కడప సమీపముననున్న వల్లూరు రాజధానిగా రాజ్యమేలినవాఁడనియు సరిహద్దురాష్ట్రాధిపతులగుటచే వీరిరువురును శత్రువులై యుండురనియు శ్రీవెంకటరమణయ్యగారు వ్రాసియున్నారు. ఈజ్యోతిశాసనము గంగయసాహిణి దని, వీరభద్రరావుగారు కాకతీయాంధ్రరాజయుగమున వ్రాసిరి. కాని నిజము కాదు. అది రక్కెసగంగనదే.

పైనవ్రాసిననామదేవపండితుని త్రిపురాంతకశాసనము (శా. శ. ౧౧౭౬)లో రక్కెసగంగనను, గంగయసాహిణిజయించినట్లున్నది. తాళ్లప్రొద్దుటూరుశాసనములో గంగయసాహిణిసర్వస్వమును, రక్కెసగంగన హరించినట్లున్నది. ఈసర్వస్వబందికాణికథ శా. శ. ౧౧౭౪లో జరిగియుండును.

గంగయసాహిణికాయస్థుఁడు. గణపతిదేవుని సేనాధ్యక్షుఁడు. ఈపదవి యాతనికి, మనుమసిద్ధిసాహాయ్య మొనర్చినయనంతరము వచ్చియుండును. కాకున్నచో రక్కెసగంగనిని జయించుటకై గణపతిదేవుని సైన్యములే యాతనికిఁ దోడుపడియుండును. లేదా, మనుమసిద్ధికి గణపతిదేవునితో మైత్రిసమకూర్చినపిమ్మట, గణపతికొలువునం దున్న గంగయసాహిణికి రక్కెసగంగనవలన నపజయము సంప్రాప్తము కాఁగాఁ డనన్నాశ్రయించినగంగయసాహిణికి మనుమసిద్ధిసాహాయ్యము చేసియుండును. ఈసందర్భమున చిలుకూరి వీరభద్రరావుగారు గంగన, గంగయ లేకవ్యక్తి యని భావించుటచే వారివ్రాఁతలు మనకేమియుఁ దోడుపడుటలేదు. గంగయసాహిణి, మనుమసిద్ధిమహారాజుతండ్రియైన తిక్కరాజునద్ద సేనాధిపతిగానుండె ననియు నాతనితరువాతఁ గొంత ప్రదేశమునకుఁ బ్రభువై మనుమసిద్ధితో స్నేహము గలిగియుండె ననియు నందుచేతనే మనుమసిద్ధి సాహాయ్య మొనర్చెననియుఁ గొంద అనుచున్నారు. అది సత్యమై యుండును. త్రిపురాంతకమున గంగయసాహిణిశాసనములు శా. శ. ౧౧౭౭—౧౧౭౬—౧౧౭౬ సంవత్సరములలోఁ గాన్పించుచున్నవి. అందుఁ గడపటిశాసనములో నీతఁడు రక్కెసగంగను జయించినట్లువాహరింపఁబడినది. (A. R. 176, 231, 283 of 1905)

పై వంశవృక్షమునందలి అల్లుగంగరాజును, యుద్ధములో నంబయ దేవమహారాజును నతఁడోడించెనని చరిత్రకారులు వ్రాసియున్నారు. ఈ యంబయదేవుఁడు గంగయసాహిణికిఁ గుమారుఁడో సోదరుఁడో అయియుండు నని చిలుకూరి వీరభద్రరావుగారాంధ్రుల చరిత్రమున వ్రాసియుండిరి. కాని యది నిజము కాదు. గంగయసాహిణికి 'చందలాంబ' యను సోదరి కలదు. అంబయదేవ మహారాజున కామె భార్య (A. R. 211 of 1936) యని శాసనము నందున్నది. ఇది శా.శ. ౧౨౧౨ నాటిది రక్కసగంగన స్థానీయులును గంగయసాహిణి స్థానీయులును గూడ పరస్పరము వైరముతో నుండుచువచ్చిరి. పైనఁజెప్పిన రక్కసగంగెన, గంగయసాహిణుల విజయపరాజయగాథ లొక్కమారుమాత్రమే గాక, రెండుమూఁడు మారులు జరిగినను జరిగియుండవచ్చును. ఆవిషయములను బూర్తిగఁ జర్చించి వ్రాయుట యప్రస్తుత ప్రశంసయగును. తిక్కనసోమయాజి పద్యార్థ విచారణమునకై యింతదూరము వ్రాయవలసివచ్చినది.

మనుమసిద్ధి జయించిన సారంగరాజు:

మనుమసిద్ధి మహారాజు విజయమును వర్ణించుచుఁ దిక్కకవిచంద్రుఁడు వ్రాసిన రెండవ పద్యమిది.

శా. శృంగారంబు నలంగ దేమియును బ్రస్వేదాంకురశ్రేణి లే
దంగంబుల్ మొఱఁగేద వించుకయు మాహారాష్ట్రసామంతు సా
రంగుం దోలి తురంగముం గొనినసంగ్రామంబునం దృప్తన
ప్తాంగస్ఫారయశుండు మన్మవిభుపైఁ జన్నసైన్యంబునన్.

ఇందలి "మాహారాష్ట్రసామంతు" అను వాక్యమునకు, మహారాష్ట్రరాజుల సామంతుఁడని చెప్పవీలు లేదు. ఆకాలమున నెల్లూరు ప్రాంతముపై నధికారమును గలిగియున్న మహారాష్ట్రరాజు లెవ్వరును లేరు. కాకతీయగణపతిదేవుని యధికారము క్రింద సారంగధరుఁ డను పేరుగల సామంతుఁ డొకఁడాకాలమున నెలూరి మండలమునందలి

'అద్దంకి' సీమను బరిపాలించుచున్న త్రిలాతఁడు వ్రాయించిన యొక తామ్రశాసనము (నె. శా. సం. పుట ౧౩౭౭) వలన దెలియుచున్నది. ఈసారంగధరుని తండ్రి మాధవుఁడు. తాత శౌరి. సాలంకాయన గోత్రుఁడు. ఇతఁడు మహారాష్ట్ర బ్రాహ్మణుఁడని నాయభిప్రాయము. తామ్రశాసనమునందలి గొంతవఱకు యీ క్రిందిశ్లోకములలోని ద్విజ రాజశబ్దము నాయూహను బలపఱచుచున్నది.

"నరపతిగణపాలన తోనూన మసౌ గణపతిః స్వయం దేవః
తచ్చరణకమలసేవాపరాగ పరితుష్టమానసభ్రమరః
శౌరిసూరనరతనూజః కరుణాధి నోస్తి మాధవోనృపతిః॥౮॥
అద్దంకిపురేశాత్ సత్తనయాహ్వ్యాజస్ప్రజే శానః
సాలంకాయనగోత్రా శ్శార్ఙధరః శత్రుశాసనః సుయశాః॥౯॥
అపి సర్వలోక పాలనప్రభావసంభావః ప్రజాస్సర్వాః
ఆనందయ న్నజస్రం ద్విజరాజః కీర్త్యతే సదా తాభిః॥౧౦॥

ఈతఁడు తనపేర సారంగపుర మనునగ్రహారమును బ్రాహ్మణుల కిచ్చెను. ఈసారంగధరునకు చక్రనారాయణుఁడను బిరుదమున్నది. ఇతనిని సారంగపాణిదేవమహారాజులని శాసనములలో వ్రాసిరి. ఈగ్రామ మిప్పుడు నెల్లూరుమండలమున వంగప్రోలుతాలూకాలో సారణపుర మనిపిలువఁబడుచున్నదఁట.

ఈశాసనము శా.శ. ౧౧౭౬.ఆనందసంవత్సర ఫాల్గుణశుక్లదశమీ సోమవాసరము నాటిది. గణపతిదేవునకుఁ బుణ్యలోకావాప్తికొఱ కీయగ్రహారమునిచ్చినట్లందుఁ జెప్పఁబడినది. చిలుకూరి వీరభద్రరావుగా రాంధ్రులచరిత్రములో నీసారంగధరుఁడే మన్మసిద్ధిచేఁ జయింపఁబడినవాఁ డనియు, గణపతిదేవునకు సామంతుఁడుగా నున్నవాఁడనియు నీతనితండ్రి మాధవనాయకుఁ డనియు, సింగళనాయకుఁ డీతనియన్నయనియు, వీరు మహారాష్ట్రదేశమునుండివచ్చిన సేవణరాజు లనియు, సేవణులు యాదవు లగుటచే వీరినిగూడ యాదవులనుగానే భావింపవలసియుండు ననియు వ్రాసియున్నారు. రామాయణములోని పైపద్యమును జదువగా మను మసిద్ధి సారంగునిమీఁదికి యుద్ధమునకుఁ బోలేదనియు, నాతఁడే మన్మ

సిద్ధిపైకి రాఁగా మనుమసిద్ధిసైన్య మాతనిని పాఱఁద్రోలి యాతనియశ్వము లను స్వాధీనపఱచుకొనె ననియు స్ఫురించుచున్నది.

ఈసారంగపాణిదేవమహారాజుతండ్రి మాధవనాయకుఁ డనియుఁ దల్లిచూడుబాయి యనియునొక శాసనము (నె. శా. సం. ౧౦౯౮పుట. శా. శ. ౧౧౭౫)లోనున్నది. ఇతనితండ్రియైన మాధవమహారాజునకు శాసనములలో శ్రీమన్మహామండలేశ్వర అతివిషమమహాహయారూఢ ప్రౌఢరేఖారేవంత, పరబలకృతాంత, శరణాగతవజ్రపంజర మండలీకర గండ్లోళ్ళిజీవరక్షచక్రనారాయణాది బిరుదములున్నవి. (నె. శా. సం. ౧౦౩౮-౧౦౫౬ పుటలు శా. శ. ౧౧౩౦-౧౧౯౧) సారంగపాణియన్న యైన సింగళదేవమహారాజు శాసనములు నెల్లూరుమండలమునందున్నవి. అవి శా. శ. ౧౧౭౦-౧౧౭౫ వఱకుఁగలవు. (నె శా. సం. ౧౧౮౬ ౧౦౮౬, ౯౯౧, ౯౩౬, ౯౦౦, ౯౮౦పుటలు). దొరతనమువారి శాసనపరిశోధకశాఖవారు శార్జ్ఞదేవమహారాజును సారంగపాణిదేవుఁడు నొక్కరే యని వ్రాసియున్నారు. (A. R.)కాని యది నిజముకాదు. వీరిరువురు భిన్ను లని తండ్రులపేరులనుబట్టి తెలియుచున్నది.

మనుమసిద్ధి జయించిన విజయక్ష్మాధీశుఁడు:

తిక్కనసోమయాజి, మనుమసిద్ధిమహారాజు విజయమును గొని యాడుచు వ్రాసిన మూఁడవ పద్యము క్రింద నిచ్చుచున్నాఁడను.

మ. ద్రవిడోర్వీపతిగర్వముం దునిమి శౌర్యం బొప్పఁ గర్ణాటద
ర్పవిఘాతంబునొనర్చి వైరిమనుజేంద్రశ్రేణికిన్ గొంగనా
నవనిం బేర్కొనియున్న యట్టి విజయక్ష్మాధీశ్వరుం గాసిగా
నెవిచెం జోళనమన్మసిద్ధి యని వ్రాయేటం బ్రగాఢోద్ధతిన్.

ఈవిజయక్ష్మాధీశుఁ డెవ్వఁడో తెలిసికొనవలసియున్నది. ఈపద్య మందలి "ద్రవిడోర్వీపతిగర్వముందునిమి" "కర్ణాటదర్ప విఘాతంబు నొనర్చి" యను విశేషణములు మన్మసిద్ధికిఁగాక విజయభూపతి కనియేయర్థము చెప్పవలయును. ఈవిజయభూపతిని మనుమసిద్ధి బాల్యముననే జయించినట్లు చెప్పియున్నాఁడు. ఈకాల మెప్పుడై

యుండును? ఇతని తండ్రియైన తిక్కరాజు జననము శా. శ. ౧౧౧౦ ప్రాంతమై యుండునని పైన వ్రాసియుంటిమి. అతని ముప్పదియేండ్ల వయసున మనుమసిద్ధి జనన మగు తలంచితిమేని, ఇతని జననము శా. శ. ౧౧౪౦ ప్రాంతమగును. ఇతని యిరువదియేండ్ల వయసునందు విజయ భూపతిని జయించెనన్నచో నాకాలము శా. శ. ౧౧౬౦ ప్రాంతమయి యుండును. అప్పటికి తిక్కరాజు జీవించియుండెను. అయిన నాతఁడు వయసు మీఱియుండుటచేత సీమనుమసిద్ధి యువరాజుగానుండి యుద్ధమును జేసి విజయరాజును గెలిచియుండ వచ్చును. ఆకాలమున, పైన జెప్పిన లక్షణములు గల విజయాధీశుఁ డెవ్వఁడని యాలోచింపవలసి యున్నది.

విజయాధీశుఁ డనఁగా విజయగండగోపాలుఁడనియుఁ బైనఁజెప్పిన లక్షణములన్నియు నాతని యందున్నవనియు నితఁడు క్రీ. శ. ౧౨౫౦ మొదలు ౧౨౮౬ వఱకును బరిపాలనము చేసినట్లుగఁ గానంబడుచున్న దనియు, నితని శాసనములు కాంచీపురమునందు మాత్రమేగాక నెల్లూరు మండలములోని గూడూరు, నెల్లూరు, సూళ్ళూరుపేట తాలూకాలలోఁ గానిపించు చున్నవనియు, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారాంధ్రుల చరిత్రము మధ్య యుగమున వ్రాసియున్నారు. నెల్లూరు శాసన సంపుటములను బరికించి చూడఁగా విజయగండ గోపాలుని శాసనములు పదుమూఁడు గాన్పించుచున్నవి (పుటలు 231, 430, 431/2, 43?/2, 445, 462, 841, 861, 1308, 2314, 1325) వీనిలో రెండిటిలో మాత్రమే శకకాల ముదాహరింపఁబడినది. తక్కిన వానిలో విజయగండ గోపాలునిరాజ్య సంవత్సరములే చెప్పియున్నవి. ౮౪౧ వ పేజీలోని శాసనమున నాతని రాజ్య సంవత్సరములు ఆఱనియు శక సంవత్సరములు ౧౨౧౭ యనియు వ్రాసియుండుటచే నీవిజయగండ గోపాలుని రాజ్యప్రారంభ సంవత్సరము శా. శ. ౧౨౧౨ (అనగా క్రీ. శ. ౧౨౯౦) అయినది. అప్పటికి మనుమసిద్ధిరాజు లేఁడు. కావున మనుమసిద్ధి జయించిన దీవిజయగండ గోపాలుఁడు కాఁడని తెలుచున్నది.

## మనుమసిద్ధి మహారాజుశాసనము :

ఇతఁడు కోలూరను గ్రామము నగ్రహారముగా నిచ్చె నని పైన వ్రాసియుంటిని. (A. R. 580-1907) ఈశాసనమున శకసంవత్సరములు లీయలేదు. కాని వీరరాజేంద్రచోడుని పదుమూఁడవరాజ్యవత్సరమనియు, పింగళసంవత్సరమనియుఁ జెప్పఁబడినది. చోళసింహాసనమునందు మూఁడవరాజేంద్రచోడుఁడు శా. శ. ౧౧౬౭ మొదలు ౧౧౮౯ వఱకునున్నాఁడు. ఆతనిపదుమూఁడవరాజ్యవత్సరము శా. శ. ౧౧౭౯ అయినది. అది పింగళయే. కావున నందుదాహరించిన వీరరాజేంద్ర చోడుఁడు మూఁడవరాజేంద్రచోడుఁడే యనుటకు సందియము లేదు. ఈశాసనమున "కోలూరు" గ్రామమును దనతండ్రియైనతిరుకాల దేవమహారాజునకుఁ బుణ్యము కొఱకిచ్చినట్లుండుటచేఁ దిక్కరాజునకుఁ దిరుకాలదేవుఁ డను నామాంతరమున్నట్లు స్పష్టమయినది.

ఈశాసనమునందుఁ గాకతీయగణపతియొక్క స్నేహమును సంపాదించుటకై యీమనుమసిద్ధిమహారాజు గోదావరీతీరప్రదేశమున విజయుఁడను రాజు నోడించె నని వ్రాసియున్నదందురు. ఆశాసనము నాకు లభింపకపోవుటచే నావివరముల నియ్యఁజాల నైతిని. పైపద్యములోని విజయక్ష్మాధీశుఁడు నీతఁడు నొక్కఁ డగునో కాదో చెప్పఁజాలము. ఈవిజయభూపతి నెల్లూరువాఁడో కాక దక్షిణమండలములవాఁడో యై యుండును. ఇతనిని మనుమసిద్ధి గోదావరీతీరమున జయించుటెట్లు సంభవమయ్యెనో యూహింప ననువుగాకున్నది.

మనుమసిద్ధికాలమున విజయాదిత్యదేవచోడమహారాజుశాసనములు కొన్ని కనఁబడుచున్నవి. (నె. శా. సం. పుట 599-1231) మనుమసిద్ధి జయించిన దీతనినేమో! తెలుఁగుపల్లవులలో క్రి. శ. ౧౨౫౦ ప్రాంతమున రాజ్యమునకు వచ్చినవిజయగండగోపాలుఁడొకఁడున్నాఁడు. (తి. దే. శా. సం. ౧ పుట ౮౨-౮౩ A. R. 272 of 1905) మనుమసిద్ధి జయించినదీతనినైనఁ గావచ్చును. నిజాము రాష్ట్రాంతర్గత గోదావరీతీరప్రదేశమున నీయుద్ధము జరిగియుండవచ్చును. ఎట్లయిన నీవిషయ

మున నింకను బరిశోధన మావశ్యకమై యున్నది. మరియు సీకాల మునఁ జాళుక్యవంశీయుఁ డగు విజయభక్ష్మాధీశుఁ డొకఁడున్నాఁడు. ఆతఁడు కళింగదేశమునందలి యొకప్రదేశమునకుఁ బ్రభువు. అతని శాసనము ద్రాక్షారామమునం దున్నది. మనుమసిద్ధి యీతనిని జయించియుండిన నుండవచ్చును.

మనుమసిద్ధి వ్రాయించిన యీశాసన విషయమునుగూర్చి కూడ కొంత యిట చెప్పవలసియున్నది. త్రిపురాంతక శివుని మూఁడవ నేత్రమునుండి జన్మించిన త్రిలోచనుని వంశములోని వాఁడైన ముక్కంటి కాడువెట్టియను పల్లవభూపతి శ్రీపర్వతమునకు తూర్పు భాగమున 700 అగ్రహారముల నిచ్చెనట. ఈవిషయము మరికొన్ని శాసనములలో గూడ నున్నది (నె. శా. సం పుటలు ౩౮౮-౬౭౦). అందులో పెరుం గండూరనునది యొక యగ్రహారము. అది రాజేంద్రచోళమండలము నందలి పశ్చిమపాకనాఁటిలోనిది. అది యేబదియిద్దఱు బ్రాహ్మణుల కీయఁబడినది. వారా యగ్రహారమును జిరకాల మనుభవించిరి. ఇంతలో పాకలికోడూరుగ్రామ వాస్తవ్యులు కొంద తేదియో కలహము కారణముగా నాగ్రామమును విడచి యీపెరుంగండూరునకు వచ్చి, యాయూరి చెఱువున కుత్తరభాగమున నిండ్లు కట్టుకొనిరి. మఱికొంత కాలమున కాగ్రామ సమీపమందున్న "ఇనుంబ్రోలు" నందలి వెలమలు కొందఱు వారిగ్రామమున మారిజ్వరము (Plague) రాఁగా నందుండ లేక పెరుంగండూరునకు వచ్చి పాకలను వేసికొని కాపురముండిరి. (ప్లేగువ్యాధి వచ్చినపుడు గ్రామమును విడచివేసి, దూరముగాఁ బోయి కాపురముండు నాచార మీకాలముననే కాదు. పదివందల సంవత్సర ముల క్రిందటఁ గూడ నుండియున్నట్లీ శాసనమువలనఁ దెలియుచున్నది.) కాని వారు తామాక్రమించుకొనిన భూమికి, బ్రాహ్మణులకు, ప్రతి ఫలమిచ్చెదమని వారితో నేర్పాటు గావించుకొని యట్లిచ్చుచు వచ్చిరి. కొంతకాలమునకు, శనిగ్రహము మీనరాశికి వచ్చుటచే నాగ్రామమున గఱవు సంభవించెను. అందుచే జీవనాధారము లభింపక యాబ్రాహ్మ ణులాగ్రామమును విడచి మఱియొకచోటకుఁ బోయిరి. దేశము సుభిక్ష ముగా నుండఁగనే యాబ్రాహ్మణులు మరల నాగ్రామమునకు వచ్చిరి.

ఈలోపుగా నావెలములు తమరాక్రమించుకొనిన ప్రదేశమునకుఁ గోడూరని పేరిడి వ్యవహరించుకొనుచు బ్రాహ్మణుల కిచ్చెడి ప్రతిఫలము నీయ నిరాకరించిరి. ముక్కంటికాడువెట్టి యిచ్చిన యగ్రహారము నందు బ్రాహ్మణులకు స్వత్వము లేదనియు, నాయగ్రహార మిప్పటిరాజునకుఁ జెందిపోయిన దనియు, వాదింప మొదలిడిరి. బ్రాహ్మణులు చేయునది లేక మధురాంతక పొత్తపిచోళుఁడగు మనుమసిద్ధిమహారాజు కడకేగి తమకు జరిగిన యపకృతినిగూర్చి విన్నవించుకొనిరి. మనుమసిద్ధిమహారాజు, ఇనుంబ్రోలున వ్యవసాయము చేయువారలను, పాకనాటిమండలి మఱికొందఱిని బిలిపించి విచారణచేసి నిజముఁ గనుఁగొని యాప్రదేశము బ్రాహ్మణులచే యనినిశ్చయించి, యాకోడూరు నా బ్రాహ్మణుల కగ్రహారముగా నిచ్చి యీశాసనము వ్రాయించెను. ఈకోడూరు కడపమండలమున పుల్లంపేట తాలూకాలో నున్నది. చోళులకు రాజధానియైన పొత్తపి కూడ నీపుల్లంపేట తాలూకాలోనిదే. కాలనిర్ణయమునకొఱకు, రాజేంద్ర చోళుని పదుమూఁడవసంవత్సర మని చెప్పినను శాసనాంతమున రాజేంద్రునిపేరు జాహరింపక పోవుటచే నీపొత్తపిచోళరాజులు స్వతంత్రులనియూహింపఁదగియున్నది.

## ఖడ్గతిక్కన వృత్తాంతము:

మనుమసిద్ధితండ్రి యైనతిక్కరాజునుగూర్చి వ్రాయుసందర్భమున శా. శ. ౧౧౭౮వ సంవత్సరపు శాసన మొకటి పైన నిచ్చియుంటిని. దానినిబట్టి సిద్ధయయు, నాతనికుమారుఁ డైనతిక్కనయుఁ దిక్కరాజుకడ మంత్రులుగా నున్నారని తెలియుచున్నది. ఈతిక్కన మనకవితిక్కన కాఁడు. మనతిక్కన కీతఁడు పెదతండ్రికుమారుఁడు. సిద్ధనకుమారుఁ డైనయీతిక్కన మిక్కిలిపరాక్రమవంతుఁడును, రణశూరుఁడునై ఖడ్గతిక్కన యనియు, రణతిక్కన యనియు, గంధవారణుఁ డనియు పేరు గాంచినవాఁడు. ఈతఁడు తిక్కరాజు దగ్గఱనే కాకుండ మనుమసిద్ధిమహారాజుకడ కూడ దండనాథుఁ డై యుండి పెక్కుయుద్ధములలోఁ బాల్గొని తుదకు రణరంగమున వీరమరణము నొందె శాశ్వతకీర్తి బడసియుండెను. తిక్కనసోమయాజికుటుంబము బోలినవాఁడై యఖండయశస్సు నార్జించిన

యీాతనిని గురించి కొంచె మేనియు వ్రాయుచున్నచోఁ దిక్కన సోమయాజిచరిత్రము లోపయుక్త మగు నను భయమున గ్రంథవిస్తార మైనను సరియే యని యాతనినిగూర్చి యెక్కించుక వ్రాయుచున్నాఁడను.

ఈఖడ్గతిక్కనను గేతనకవి దశకుమారచరిత్రమునం దిట్లు వర్ణించి యున్నాఁడు.

సీ. వేఁడిన నర్థార్థి వృథపుచ్చ నేరని
దానంబు తనకు బాంధవుఁడు గాఁగ
నెదిరిన జముసైన బ్రదికి పోవఁగనీని
శౌర్యంబు తనకిష్టసఖుఁడు గాఁగ
శరణుచొచ్చిన శత్రువరుసైన రక్షించు
కరుణయె తనకు నంగదము గాఁగఁ
బలికినఁ బాండవప్రభుసైన మెచ్చని
సత్యంబు తనకు రక్షకుఁడు గాఁగ
జగతి నుతి కెక్కె రాయవేశ్యాభుజంగ
రాజ్యరత్నాకరస్ఫూర్తి రాజమూర్తి
గంధవారణబిరుదవిఖ్యాతకీర్తి
దినపతేజుండు సిద్ధయతిక్కశౌరి.

ఈతిక్కన, మనుమసిద్ధికడ సేనానిగా నున్నకాలములో "పసుల మేపుబీళ్ళనిమిత్తమై కాటమరాజునకును మనుమసిద్ధిరాజునకును వివాదము పొసఁగి మహాయుద్ధము జరిగినటులఁ గాటమరాజుకథవలనఁ దెలియుచున్నది. ఈయుద్ధకథనము ద్విపదలో రామరావణయుద్ధముగ వర్ణింపఁబడినది. కాటమరాజుతండ్రి పెద్దిరాజు. పెద్దిరాజుతండ్రి వల్లురాజు. ఇతఁ డాత్రేయగోత్రోద్భవు లయినయాదవుల సంతతిలోనివాఁడుగఁ జెప్పఁబడియెను. ఇతఁడు కనిగిరి సీమలోని అలవలపాడున కధిపతిగ నుండెను. కాటమరాజు కనిగిరిసీమలోని యెఱ్ఱగడ్డపాడున కధిపతిగ నుండెను. దేశమున ననావృష్టి సంభవింప యాదవు లనంబడుగొల్లవాం డ్రెల్లను దమతమపశులమందలను దోలుకొని దక్షిణమునకు వచ్చి

మనుమసిద్ధిరాజుయొక్క పసులబీళ్ళను గొన్నిటిని పుల్లరికిఁ గైకొని పసులను మేపుకొని పుల్లరి చెల్లింపకయే వెడలిపోయెను. అందుపై సిద్ధిరాజునకుఁ గోపము వచ్చి అన్నంభట్టను బ్రాహ్మణుని రాయబారిగా గాటమరాజుకడకు పంపించెను. కాటమరాజు పుల్లరి చెల్లింపక తగవు పెట్టెను. అంతట మనుమసిద్ధిరాజు కాటమరాజును శిక్షించుటకై బహుసైన్యములం గూర్చుకొని దండెత్తి వచ్చెను. కాటమరాజుకూడ బంధుజనులనుమిత్రులను గూర్చుకొని యుద్ధసన్నద్ధుఁ డయ్యెను.

అప్పుడు తిరునామాలతిప్పరాజు, శ్రీకంఠరాజు, పెదవేఁగి చొక్కరాజు, పెదవరదరాజు, అర్లుకొండ అచ్చిరాజు, ఆదివన్నెమారిరాజు, గయికొండ గంగరాజు, ఉర్లకొండ సోమన్న, ఉదయాద్రి అమ్మయ్య, చెన్నపట్టణము చంద్రశేఖరుఁడు, దేవముని వెంగళయ్య, పట్టుకోట బసవరాజు, కాళహస్తి పాపతిమ్మరాజు, వెలకంచి వెంగళపతిరాజు, ప్రభగిరిపట్టణము పద్మశేఖరుఁడు మొదలగు యోధులు మనుమసిద్ధికి దోడ్పడవచ్చిరి. ఈయోధులకందఱకు నాయకుఁడై ఖడ్గతిక్కన సిద్ధిరాజు సేనల నడిపించుకొనివచ్చెను.

పల్నాటి ప్రభువయిన పద్మనాయఁడును, పల్లికొండ ప్రభువయిన చల్లపిన్నమ నాయఁడు, దొనకొండ అయితమరాజు, ఎఱ్ఱయ్య, భట్టాపులరాజు, కరియావులరాజు, వల్లభన్న, నాళకూళ్ళనాయఁడు, సేతిముద్దయ్యనాయఁడు, పాచయ్యనాయఁడు, ముమ్మయ్యనాయఁడు, పుత్తమరాజు మొదలగు యాదవవీరులును, కాటమరాజునకు, దోడ్పడవచ్చిరి. ఈసైన్యములకంతకుఁ చిన్నమనాయని మంత్రియు, నారాధ్య బ్రాహ్మణుఁడు నగు బ్రహ్మరుద్రయ్య నాయకుఁడై నడిపించెనఁట! ఉభయసైన్యములును పాలేటియొడ్డుననున్న పంచలింగాలకడ నెదుర్కొన్నవి.

అప్పు డుభయసైన్యములకును ఘోరమైన యుద్ధము జరిగెను. తుదకు తిక్కన సైన్యమంతయు హతమయ్యెను. తిక్కన యుద్ధభూమిని నొక్కఁడు మిగిలియుండుటను ప్రత్యక్షయోధుఁడైన పిన్నమనాయఁడు చూచి:

"పోరు నిలుపు మోయి భూసురోత్తముఁడ
సరిగాదు మాతోడ సమరంబుఁ జేయ
అగ్రజుల్ మీరు యాదవులము మేము
ఉగ్రము మామీఁద నుంపంగ రాదు"

అని పలికెనట. అందుపైని తిక్కన సైన్యమంతయు హతమగుటకుఁ జింతించి మఱల సైన్యమును గొనివచ్చి తలపడియెనం గాకయుని గుఱ్ఱమును ద్రిప్పుకొని తిరిగి వచ్చెనఁట !

అందుపై వృద్ధుఁడైన యాతని తండ్రి "యుద్ధమున నైనం జావక యిట్టులేల పాఱివచ్చితివి! కడుపు చెఱుపఁబుట్టితి వని నిందించెనఁట! ఈరణతిక్కన స్నానమునకు వచ్చినప్పుడు భార్య స్త్రీలకుంచినట్లుగా రహస్యస్థలంబున నీళ్ళబిందె నుంచి దానిమీఁద బసపుముద్ద యుంచి దానికి నులకమంచమును చాటు వెట్టెనఁట! అదిచూచి యాతఁడు సిగ్గుపడి ఖేదపడుచుండఁగా భార్య

క. పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపునాయకు లందున్
ముగురాడవార మైతిమి
వగ పేటికి జలక మాడవచ్చినచోటన్.

అని యెకసక్కె మాడెనఁట. అన్నములో పాలు విఱిగిపోఁగా తల్లి సైతము పరిహాసముగా

క. అసదృశముగ నరివీరులఁ
బస మీఱఁగ గెలువలేక పందక్రియ నీ
వసివైచి విఱిగివచ్చినఁ
బసులు న్విఱిగినవి తిక్క! పాలు న్విఱిగెన్.

అని పలికెనఁట! ఇఁకఁ జెప్పవలసినదేమున్నది! ఇట్టిపలుకు లెల్లనుశూలములై నాట మానాభిమానియైన యమ్మహాయోధుఁడు చేసినపనికిఁ బశ్చాత్తప్తుఁడై "ఈసారి మఱలఁ బోయి శాత్రవులను

మార్కొని జయంబు గొందు. అయ్యది సంప్రాప్తంబు గాదేని ప్రాణం బుండుదనుకఁ బోరాడి వీరస్వర్గంబు నైన జూఱఁ గొందు. మానాభిమానములు గలశూరుఁ డిట్టిరోఁత బ్రదుకు బ్రదుకఁడు" అని తలపోసి యెవ్వ రెన్నివిధముల వారించినను వినక, సిద్ధిరాజు నొడం బఱచి, మఱల సైన్యముం గొనిపోయి శత్రువులను మార్కొని భీమ సంగ్రామంబు గావించెను. చరిత్రకారుఁడు యుద్ధభూమిని నాతఁడు చేయుచున్న యుద్ధక్రమము నిట్లభివర్ణించుచున్నాఁడు.

చ. పదటున వాజి రాహుతులపై దుమికించుచుఁ దిక్కఁ డార్చినన్
బెదరి పరిభ్రమించి కడుఁ బిన్నలు వీరులు భీతచిత్తులై
యదె యదె వాలు వా ల్మెఱుఁగు లల్లవె యాతఁ డంచనన్
గొదుకక యాజిఁ జేసె రిపుకోటుల కందఱ కన్నిఱూపులై.

ఇట్లు ప్రచండవిక్రమార్కుఁడై ఘోరసంగ్రామంబున శత్రుసేనను మార్కొని పీనుంగుపెంటలు గావించుచు రణకేళి సల్పుచుండ యాదవవీరులును వెనుదీయక మహోద్రగులై తిక్కనసైన్యముపైఁ బడి కత్తులఁ గటారుల నీఁటెలం బొడిచి చిక్కాడుచుఁ బెద్దకాలంబు పోరాడ నుభయసైన్యంబులఁ బెక్కండ్రు వీరభటులు నేలం గూలిరి. అంతటఁ జిన్నమనాయఁడు ఖడ్గతిక్కనను సమీపించి విప్రోత్తమా! యుద్ధముచేయుట బ్రాహ్మణునకుఁ బాడిగాదు. మిమ్ముం జంపిన మాకు బ్రహ్మహత్యాదోషంబు వాటిల్లు నని మనంబు తల్లడిల్లుచున్నది. తొలంగుట నీకును మాకును గూడ శ్రేయస్కరం బని యూహింతునని గొంతెత్తి గంభీరవాక్యంబులు పలుకఁ దిక్కనయు "ఓనాయఁడా! రణశూరుఁడవై యుద్ధము సేయఁజాలక పందక్రియ ధర్మపన్నంబు లేల చదివెదవు? వానిం గొన్ని నేనెఱుంగుదును గాని వీరుండ వౌదువేని కదలక నిలుచుండి యుద్ధంబుచేసి చేత నయ్యేనేని నాప్రాణంబులు గొని విజయపతాక మెత్తుము కాదేని శరణుచొచ్చి మాపుల్లరి మాకుఁ బెట్టుము." అని హెచ్చరింపఁ జిన్నమనాయఁడు బ్రహ్మహత్యాదోషమునకు వెఱచి యేమిచేయుటకును జేతులాడక గాళ్ళునాడక నిశ్చేష్టితుఁడై చూచుచుండ, వానిమంత్రి బ్రహ్మరుద్రయ యచటికి

నే తెంచి "తిక్కన నేఁదలంపఁడి పోకార్చెద నీపటుండు" మని తన ప్రతివీరునిపై హయంబును బఱపి యుద్ధము చేయఁగా నిరువుర గుఱ్ఱంబులు నీలిపోటుల నేలంగూల నిరువురును గత్తులుదూసి "హర హరా" యని యభిమన్యు లక్ష్మణకుమారులవలె ద్వంద్వ యుద్ధంబునకుఁ గలియంబడి యుభయ సైన్యంబుల వారును నివ్వెఱపడి చూచుచుండఁ బెద్దయుం బ్రొద్దు పోరాడి యిరువురును నేల కొఱఁగిరి. ఆపాటుంగని తిక్కన సైనికులలో హతశేషు లయినవార లీక్రింది విధముగా జెప్పుకొని యాక్రందించిరని యొక కవి చెప్పియున్నాఁడు.

"నీ ధైర్యంబు నీమేనఁ దగిలియుండుటఁ జేసి
చలియించి మందరాచలము తిరిగె,
గాంభీర్య మెల్ల నీకడన యుండుటఁ జేసి
కాకుత్స్థువార్ధి కట్టువడియె,
జయలక్ష్మి నీయురఃస్థలినె యుండుటఁ జేసి
హరి పోయి బలిదాన మడుగుకొనియె,
నాకార మెల్ల నీయందె యుండుటఁ జేసి
మరుఁడు చిచ్చునఁ బడి మడిసి చనియె

గీ. దిక్కదండనాథ దేవేంద్రపురికి నీ
వరుగు పెట్టఁగి నగము తిరుగు టుడుగు
నబ్ధి కట్టు విడుచు నచ్యుతుకొద మాను
మరుఁడు మరలఁ గలుగు మగలరాజ.

అని తనసైనికులెల్ల హాహాకారంబులు సేయుచుండఁ బ్రాణంబులు దేహంబును విడిచినవిధం బాకవివర్యుఁడే మరల నిట్లు చెప్పి యున్నాఁడు.

సీ. నందిని బుత్తెంచె నిందుశేఖరుఁడు నీ
వన్న యేతెమ్ము తారాద్రికడకు,
గరుడుని బుత్తెంచె నరహరి రావయ్య
వడిసిద్ధతిక్క వైకల్యమునకు,

హంసను బుత్తెంచె నజుఁడు నీకడకు ను
భయకులమిత్త్రి రా బ్రహ్మసభకు
నైరావతముఁ బంపె నమరేంద్రుఁ డిప్పుడు
దివమున కేతెమ్ము తిక్కయోధ
గీ. యనుచు వేయివేల నర్థిఁ బిలువంగ
వారు వీరు గూడ వచ్చి వచ్చి
దివ్యయోగి యైన తిక్కనామాత్యుఁడు
సూర్యమండలంబు జొచ్చి పోయె"

—ఆంధ్రుల చరిత్రము మధ్యయుగము.

రణతిక్కనభార్య భర్తృమరణమును విని సహగమనము సేయుటకై పాలికలని కేతెంచెనఁట! కాని యాశవసమూహములో భర్తశిరము కనఁబడ లేదఁట. నేను పతివ్రత నైతినేని నాభర్తశిరము పైకెగిరి నాకగుపడుఁ గాక, యని యావీరపత్ని పలుక నాతనిశిర మట్లే యెగిరె నఁట. సమస్తబంధు జనసమక్షమున నాశిరముతోఁ గూడ నామె సహగమన మొనర్చె నఁట. ఈ యంశ మీక్రిందిచాటుధారలో సూచింపఁ బడినది.

ఉ. శ్రీలలరార శత్రువులఁ జెందితి వార్యులు మంత్రివర్యు లా
శ్లోలఘనుల్ నుతించి రల వేల్పుదొరల్ ముదమంది మెచ్చి రో
లాలితశౌర్య ధైర్యజయలక్ష్మిప్రియంబున నిన్వరించె నీ
లీలలు హెచ్చెఁ దిక్కనికళేబరమా! యిఁక నిల్పియాడుమా!

ఈరణతిక్కనపైని చాటుధార లనేకము లున్నవి. రెండు పద్యములను మాత్ర మీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను.

ఉ. ఏమి తపంబుచేసి పరమేశ్వరు నేమిటఁ బూజ చేసిరో
రామునితల్లియుం బరశురామునితల్లియు భీముతల్లియున్
గాముని కన్నతల్లియును గంజదళాక్షుననుంగుఁదల్లియున్
శ్రీమహితవ్రతాప్తుఁ డగుసిద్ధనతిక్కనకన్నతల్లియున్.

సీ. వీరవివాదంబు వేదవినాదంబు
పాయక యేప్రొద్దు మ్రోయుచుండు
భూసురప్రకరంబు సేసలుచల్లంగఁ
బాయ కెన్నిరొ కుటుంబములు బ్రదుకు
బ్రాహ్మణావళికి ధారలుపోసినజలంబు
సతతంబు ముంగిట జాలువాఱు
రిపుల కోసంగినపత్రికలపుత్త్రికలను
బాయక కరణముల్ వ్రాయుచుంద్రు

గీ. మానఘనుఁ డైనతిక్కనమంత్రి యింట
మదనసముఁ డైనతిక్కనమంత్రి యింట
మహితయశుఁ డైనతిక్కనమంత్రి యింట
మంత్రిమణి యైనతిక్కనమంత్రి యింట.

కాటంరాజు పశువులను మేపుకొని పుల్లరి యేల యివ్వననియెనో ఆంధ్రులచరిత్రముఁ జెప్పలేదు. ఆకారణమును గొంద ఱిట్లుచెప్పుచున్నారు. మనుమసిద్ధిమహారాజుయొక్క యుంపుడుకత్తె పెంచుచున్న చిలుక పంజరమునుండి తప్పించుకొని పోయి యాదవుల పశువులు మేయుచున్న యడవి కేగి మనుష్యభాషణములఁ బల్కుచుండ నాపశువులు చెదరిపోయి మేఁతను మానివేసిన వఁట. అందుపై నాపసుల కాపరులా చిలుకను జంపివేసిరఁట. అందుమీఁద సిద్ధిరాజుమనుష్యులాకాపరులను వారి పశువులను గొంత యల్లరి చేసిరఁట! అది కారణముగాఁ గాటంరాజు పుల్లరి నీయక రణమునకుఁ దిగెనని చెప్పుదురు.

మనుమసిద్ధి నిర్యాణము:

ఈయుద్ధము శా. శ. ౧౧౭౦ కాళయుక్తి సంవత్సర కార్తిక శుద్ధపంచమీ గురువారమునాఁడు జరిగినదని యొక శిలాశాసనమునందున్నది. (నె. శా. సం. ౬౩౭ పుట) కాని యది నమ్మదగినది కాదు. దీని నెవ్వరో కొండయ్య కొడుకు రామయ్య వ్రాయించినది. ఎప్పుడు వ్రాయించెనో తెలియదు. ఇందసందర్భములైన విషయములు

పెక్కులున్నవి. చోడతిక్కరాజు శాసనమునుబట్టి శా. శ. ౧౧౭౪ వఱకు సిద్ధయ తిక్కన జీవించియున్నట్లు కనబడుచున్నది. కావున నీశాసనము సరియైనదని తలంపరాదు. కాళయుక్తి శా. శ. ౧౧౭౦ కాదు ౧౧౮౦ అయినది. ఈయుద్ధము జరిగినకొలఁది దినములకే మనుమసిద్ధి చనిపోయె నందురు. శకసంవత్సరములు సరిగా లేకున్నను, ఈశాసనమును బట్టియు, తిక్కన నిర్యాణమును దెలుపు "అంబరశశిరవి" అను పద్యమును ననుసరించియుఁ గాళయుక్తికిని ఖడ్గతిక్కన మనుమసిద్ధుల నిర్యాణమునకును సంబంధ మున్నదని తోఁచుచున్నది ఆపద్యమందలి తిక్కయజ్వ "తిక్కయోధ" యేమో! కొల్లూరు శాసనమునకు (శా. శ. ౧౧౭౯) దరువాత మనుమసిద్ధి శాసనములు గనబట్టుట లేదు. ఇతఁడు కాళయుక్తి సంవత్సరముననే చనిపోయెనేమో! అట్లయినచోఁ దండ్రి చనిపోయిన యయిదారు సంవత్సరములలోనే యితఁడు కాలధర్మమును నొందెనని తలంపవలసియున్నది. ఆపత్తులలోఁ దిక్కనామాత్యుఁడు నిర్వచనోత్తరరామాయణమును, శా. శ. ౧౧౭౫-౧౧౮౦ నడుమ రచియించి యుండునని నిశ్చయింపవలసియున్నది.

మనుమసిద్ధికిఁ దరువాతి నాతనివంశమును దెలుపుశాసన మొకటి కలదు. (ఆం. సా. ప. సం. ౧౭ పుట ౨౨౩). ఆశాసన మిది.

"శుభమస్తు. శ్రీమద్గోస్తుభలాంఛనో విజయతే దేవః పురాణోహరి స్తన్నాభే స్సరసీరుహోదరజని ర్విశ్వం విధాతా సృజత్। తస్మిన్సూర్యసుధాంశువంశజననా భూపాశ్చ శాసు ర్భువం। తేషు ఖ్యాతికథావశేషమయతాం యాతేషు మన్వాదిషు॥౧॥జాతో విక్రమసింహపట్టణపతి స్సిక్కక్షితీశ స్తతో భాస్వద్వంశపయోధిశీతకిరణో విశ్వంభరామన్వభూత్। తత్పుత్రి స్తదనంతరం మనునిభో మన్మక్షమావల్లభః ప్రౌఢౌదార్యవిరాజితామర మహీజాతోసిప ద్భూతలం॥౨॥తస్యాస్తనయా స్త్రయః ప్రథమజ స్సిక్కక్షమానాయకః పశ్చాదావిరభూత్పురార్ధ్యజనన శ్శ్రీనల్లసిద్ధో నృపః। గోపీనాథ... పతి స్తదనుసంజాత స్తితిర్యాభభు... నిశ్శాతకృపాణఖండితరిపు ర్మా పాలదోర్మ స్తకః॥౩॥

"దర్పదుర్జయులగు దాయాదనృపతుల నఱలోనబఱపఁజే యాగ్రహమున"

—నిర్వచనోత్తరరామాయణము.

"బలిమిచేఁ బృథ్వీశుతలఁ ద్రుంచి సేవణ। కటకసామంతులగర్వ మడఁచి, ద్రవిడమండలికులం దఱిఁ దక్కనేల"

—దశకుమారచరిత్రము.

చోడతిక్కరాజును వర్ణించుసందర్భమున రచించిన యీపద్యములలోనిభావములనే యీశాసనమునందు "దాయాదమండలిక ... పరిఘకట్ట పృథ్వీశ్వరశిరః కందుకక్రీడావినోద, సేవణకటక వేణుక బళివ దావపావకోపమాన ద్రవిళబలవార్ధి పరిశోషణబడబానల రాయగండ గోపాల" అను వాక్యములలో నుదాహరించియున్నాఁడు. కావున యీశాసనములోని తిక్కరాజు, పైఁ జెప్పఁబడిన చోడతిక్కరాజనియు, నాతని తనయుఁడైన మనుమసిద్ధినిర్వచనోత్తర రామాయణ కృతిపతియనియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. మనుమసిద్ధికిఁ దిక్కరాజు, నల్లసిద్ధి, యింకనొకఁడు (పేరున్న భాగము శిథిలమైనది.) అను ముగ్గురు కుమారులు. ఈతిక్కరాజును ఇమ్మడి తిక్కరాజనియు, ఇమ్మడి తిరుకాలత్తి దేవుఁడనియు బిలచెదరు. ఈతని శాసనమొకటి శా. శ. ౧౨౦౧ (నె. శా. సం. పుట ౪౧౭) లోఁ గన్పడుచున్నది. మనుమసిద్ధి రెండవ కుమారుఁడైన నల్లసిద్ధికైదుగురు కుమారులు. ఇందుఁ బెద్దవాఁడైన మనుమగండగోపాలుఁడీ శాసనదానకర్త. మనుమగండ గోపాలనామధారులు పెక్కురున్నారు (నెల్లూరు శాసనసంపుటములను జూడుఁడు.) కాని వారికిని నీతనికిని సంబంధములేదు. ఈమనుమగండగోపాలుఁడు కాకతీయ ద్వితీయ ప్రతాపరుద్రునకు సామంతుఁడై కొట్యదొన (కొణిదెన) ప్రాంతమునకుఁ బరిపాలకుఁడైనట్లీ శాసనమువలనఁ దెలియుచున్నది. ఈశాసనమునందలి బిరుదములు వంశానుగతముగా వచ్చినవి.

భుజబల మనుమసిద్ధరసు పేరనఁ గొన్ని శాసనములు శా. శ. ౧౧౬౧-౧౧౭౧ సంవత్సరములలో నున్నవి. కాని యాతఁడు, తిక్క-

రాజు కొడుకగు మనుమసిద్ధి కాఁడు. మొత్తముమీఁద నీనెల్లూరు చోడుల చరిత్రమును, శాసనవాఙ్మయములను సమన్వయము చేయుచు వ్రాయవలసిన యావశ్యక మెంతేని కలదు. అందులకిది స్థానము కాదు. ఇదివఱకే ప్రసక్తానుప్రసక్తిగఁ గొంత గ్రంథమును వ్రాసి తిక్కన చారిత్రమును బెంచవలసివచ్చినది. ఇంతకంటె నధికముగ వ్రాయుట యప్రస్తుత మగునని యెంచి తిక్కనసోమయాజి చరిత్రమును ముగించుచున్నాఁడను.

పెక్కులున్నవి. చోడతిక్కరాజు శాసనమునుబట్టి శా. శ. ౧౧౭౪ వఱకు సిద్ధయ తిక్కన జీవించియున్నట్లు కనఁబడుచున్నది. కావున నీశాసనము సరియైనదని తలంపరాదు. కాళయుక్తి శా. శ. ౧౧౭౦ కాదు ౧౧౮౦ అయినది. ఈయుద్ధము జరిగినకొలఁది దినములకే మనుమసిద్ధి చనిపోయె నందురు. శకసంవత్సరములు సరిగా లేకున్నను, ఈశాసనమును బట్టియు, తిక్కన నిర్యాణమును దెలుపు "అంబరశశి రవి" అను పద్యమున ననుసరించియుఁ గాళయుక్తికిని ఖడ్గతిక్కన మనుమసిద్ధుల నిర్యాణమునకును సంబంధ మున్నదని తోఁచు చున్నది ఆపద్యమందలి తిక్కయజ్వ "తిక్కయోధ" యేమో! కొల్లూరు శాసనమునకు (శా. శ. ౧౧౭౯) దరువాత మనుమసిద్ధి శాసనములు గనబట్టుటలేదు. ఇతఁడు కాళయుక్తి సంవత్సరముననే చనిపోయెనేమో! అట్లయినచోఁ దండ్రి చనిపోయిన యయిదారు సంవత్సరములలోనే యితఁడు కాలధర్మము నొందెనని తలంపవలసి యున్నది. ఆపక్షములోఁ దిక్కనామాత్యుఁడు నిర్వచనోత్తరరామాయణమును, శా. శ. ౧౧౭౫-౧౧౮౦ నడుమ రచియించి యుండునని నిశ్చయింపవలసియున్నది.

మనుమసిద్ధికిఁ దరువాత నాతనివంశమును దెలుపుశాసన మొకటి కలదు. (ఆం. సా. ప. సం. ౧౭ పుట ౨౨౩). ఆశాసన మిది.

"శుభమస్తు. శ్రీమద్వ్యాఘ్రస్తంభలాంఛనో విజయతే దేవః పురాణో హరి స్తన్నాభే స్సరసీరుహోదరజని ర్విశ్వం విధాతా సృజత్ । తస్మి న్నాస్యసుధాంశువంశజననా భూపా శ్చశాసు ర్భువం । తేషు ఖ్యాతి కథాపశేషమయతాం యాతేషు మన్వాదిషు॥౧॥జాతో విక్రమసింహ పట్టణపతి స్తిక్కక్షితీశ స్తతో భాస్వద్వంశపయోధిపీతకిరణో విశ్వంభరా మస్వభూత్ । తత్పుత్రి స్తదనంతరం మునినిభో మన్మతిమాపల్లభః ప్రౌఢౌదార్యవిరాజితామర మహీజాతోనిష ద్భూతలం॥౨॥తస్యా స్తనయా స్త్రయః ప్రథమజ స్తిక్కక్షమానాయకః పశ్చా దావిరభూ త్పరార్ధ్యజనన శ్శ్రీసిల్లసిద్ధో నృపః । గోపీనాథ... పతి స్త దనుసంజాత స్తితిర్భాభు... నిశ్శాతకృపాణఖండితరిపు స్సా పాలవో ర్మ స్తకః॥౩॥

రాజు కొడుకగు మనుమసిద్ధి కాఁడు. మొత్తముమీఁద నీనెల్లూరు చోడుల చరిత్రమును, శాసనవాఙ్మయములను సమన్వయము చేయుచు వ్రాయవలసిన యావశ్యక మెంతేని కలదు. అందులకిది స్థానము కాదు. ఇదివఱకే ప్రసక్తానుప్రసక్తిగఁ గొంత గ్రంథము వ్రాసి తిక్కన చారిత్రమును బెంచవలసివచ్చినది. ఇంతకంటె నధికముగ వ్రాయుట యప్రస్తుత మగునని యెంచి తిక్కనసోమయాజి చరిత్రమును ముగించుచున్నాఁడను.